చరిత్ర శాస్త్రముల తెలుగు అకాడెమీ ప్రచురణ

# ఈజిప్టు దేశ చరిత్ర

## అరబు జాతీయత


ఆంధ్రప్రదేశ్ శాసనసభాపతి

అయ్యదేవర కాళేశ్వరరావు



ఆదర్శగ్రంథమండలి, విజయవాడ.

# ఉపోద్ఘాతము

'ఈజిప్టుదేశచరిత్ర - అరబు జాతీయత' అను గ్రంథమును వ్రాసి, శాస్త్రవిజ్ఞానము, చరిత్ర తెలుగు అకాడమీపక్షమున ఆంధ్రలోకమునకు సమర్పించుచున్నాను. షుమారు 15సం॥లక్రిందట 'ఈజిప్టు' కొంతవ్రాసి, యొక ప్రచురణకర్త కివ్వగా నా ఆఖరుఅనుమతి పొందకుండగానే దానిని ఆయన అచ్చువేసి అమ్ముకున్నాడు. నాకు దాని ప్రూఫులను చూపకపోబట్టి అందులో తప్పులు మెండుగా పడినవి. ఇపుడు సమగ్రమైన చరిత్రను మొదటినుండి నేటివరకును వ్రాసియున్నాను.

అన్నికాలములలోను ఈజిప్టు మానవచరిత్రలో ప్రముఖపాత్రను వహించుచున్నది. ప్రాచీనకాలములో క్రీ.పూ. ఏడువేల సంవత్సరముల క్రిందటినుండియు ఇండియా, చైనాలతోపాటు యుజ్వలమైన నాగరికతను నిర్మించుకున్నది. ఆ కాలములో ఫారో రాజులు నిర్మాణముగావించిన పిరమిడ్లు, దేవాలయములు, స్ఫిన్క్సు, లెబిరిన్తు, ఫయూం మొదలగునవి ప్రపంచములోకెల్ల ఇంజనీరింగుకు, శిల్పచాతురికి ప్రసిద్ధికెక్కినవై, వాటిలో కొన్ని నేటికిని నిలచియుండి ప్రపంచ యాత్రాస్థలములైనవి. క్రీస్తుశక ప్రారంభమున టాలమీరాజులు స్థాపించిన అలెగ్జాండ్రియా విశ్వవిద్యాలయములో గొప్ప వైజ్ఞానికపరిశోధనలు జరిగి, అన్నిశాస్త్రములలోను సుప్రసిద్ధ శాస్త్రజ్ఞులు గ్రంథరచన గావించినారు. మధ్యమయుగములో ఈజిప్టు అరబు విజ్ఞానమునకు, అరబు నాగరికతకు ప్రధానస్థానమైనది. రాజధానియగు కైరోనగరములోని అల్ అజరు విశ్వవిద్యాలయము సుప్రసిద్ధ విజ్ఞాన కేంద్రమైనది.

సయ్యాదు పాషా సూయజుకాలువను త్రవ్వించుటతో నవీన అంతర్జాతీయ సామ్రాజ్యరంగములోనికి ఈజిప్టు ఈడ్వబడినది. ఆంగ్లేయులు సూయజుకాలువ కంపెనీలో భాగములను కొనుట, ఈజిప్టునాక్రమించుట, ఈజిప్టుదేశీయుల స్వతంత్రపోరాటము, ప్రపంచ సామ్రాజ్యతత్వచరిత్రలో

ప్రధానఘట్టములైనవి. ప్రాచీనకాలమునుండియు, నేటివరకును ఈజిప్టు, ఇండియాలకు దృఢమైనమైత్రి కలదు. ఈ రెండుదేశములు ఇరువదవ శతాబ్దములో ఒకేపద్ధతులమీద ఆంగ్లేయసామ్రాజ్యముతో స్వతంత్రపోరాట మును జరిపి జయమును పొందినవి. ఈ రెండుదేశములును కలిసి ఆశియా, ఆఫ్రికాఖండదేశముల స్వాతంత్ర్యమునకును, పునర్వికాసమునకును తోడ్పడు చున్నవి. 1952 లో ఈజిప్టునాయకుడగు కల్నల్ నాసరు ఈజిప్టులో రక్త పాతములేని సైనికవిప్లవము జరిపి, రాజరికమును రద్దుపరచి ప్రజాస్వామ్య మును స్థాపించి ఈజిప్టునుండి ఆంగ్లేయులను పూర్తిగ వెళ్ళగొట్టినాడు. గొప్ప భూసంస్కరణలను గావించినాడు. సూయజుకాలవను జాతీయము గావించినాడు. అస్వాన్ ఆనకట్టను నిర్మాణముగావించుచున్నాడు. అరబుజాతు లలో ప్రబలిన అరబుజాతీయతకు నాయకత్వమువహించినాడు. అరబుజాతీ యతనుగూర్చి యొక ప్రత్యేక అధ్యాయమును వ్రాసినాను. మధ్యప్రాచ్యదేశ ములలోని పెట్రోలియంగనుల ప్రాముఖ్యము, అరబుదేశమును చిన్నచిన్న ముక్కలుగ గావించుట, చిన్నవైన అరబుజాతులు ఐక్యముగాకుండ విడ దీసి బాగ్దాదుపాక్టు, ఐసెన్‌హోవరుసిద్ధాంతములను వాటిమీద అంటకట్టుటకు పాశ్చాత్యరాజ్యములు చేసినప్రయత్నములు, వాటిమీద అరబుప్రజలతిరుగ బాట్లు క్లుప్తముగ తెలిపినాను.

అరబుఐకమత్యమునకు ప్రధానమెట్టుగ ఈజిప్టుఅధ్యక్షుడు కల్నల్ నాసరు, సిరియాఅధ్యక్షుడు షుక్రీ కువాట్లీ, యేమెను ఇమాంలు కలసి సంయుక్త అరబురిపబ్లికును స్థాపించుకున్నారు. దానియొక్కప్రాబల్యము వలన, పలుకుబడివలన అరబుదేశములనుండి బాగ్దాదుపాక్టు, ఐసెన్ హోవర్‌సిద్ధాంతము ఎగిరిపోయినవి. ఒక్క జోర్డానులోమాత్రము ఐసెన్ హోవరుసిద్ధాంతము కొనయూపిరితో నున్నది. ఇరాకులోకూడ రక్తపాతము లేని ప్రజాస్వామ్యవిప్లవముజరిగి పాశ్చాత్యులదాస్యములోనున్న రాజరికము కూలిపోయినది. చిన్నవైన అరబుజాతులలో జొరబడి అంతఃకల్లోలములను కలుగచేసి, జాతీయవాదులను కూలద్రోసి కమ్యూనిస్టుపాలనము స్థాపించుట కెటుల కమ్యూనిస్టులు ప్రయత్నించుచున్నారో, కమ్యూనిస్టు లెటుల అరబు జాతీయైక్యతకు శత్రువులుగనున్నారో చూపించినాను. బాగ్దాదుయొడంబడి కతోచేరి ఐసెన్‌హోవరుసిద్ధాంతమునంగీకరించి పాకిస్తానము, తురుష్కము,



అయ్యదేవర కాళేశ్వరరావు
(గ్రంథకర్త)

ఇరాను లెటుల అమెరికాకుదాసులుగనున్నవో తెలిపినాను. పాకిస్తానమునకు అమెరికా 175 కోట్లరూప్యములకిమ్మతుగల జెట్ ఫైటర్లు, టాంకులు, విమానములు, ఇతరఆయుధములు ఊరికే విచ్చియున్నది. వాటితో పాకిస్తానము కాశ్మీరువిషయములో ఇండియాను దినదినము బెదిరించుచున్నది. ఈ విషయములో అమెరికాయొక్క ప్రస్తుతవైఖరినిగూర్చి వివరించినాను. అరబు జాతులు తమ స్వతంత్రమును, ఆత్మగౌరవమును విలువబెట్టుటకై అటు పాశ్చాత్యరాజ్యములతోను. ఇటు కమ్యూనిస్టులతోను పోరాడవలసివచ్చుచున్నది. ఆశియా, ఆఫ్రికాఖండదేశముల పునర్వికాసమునకు, స్వతంత్రమునకు, ఐక్యతకును, అటు అమెరికాకూటములోను, ఇటురష్యాకూటములోను జేరకుండతటస్థవిధాన అవలంబనకును, పంచశీలసిద్ధాంతమునకునుబాండుంగు సమావేశ జయమునకును సోషలిస్టు సమాజస్థాపనమునకును నాయకత్వము వహించిన ఇండియా ప్రధానమంత్రి పండిత జవహరులాల్ నెహ్రూకు ఈజిప్టుఅధ్యక్షుడగు కల్నల్ నాసరు అనుంగుసోదరునివలెప్రతివిషయములోను అత్యంతముగ తోడ్పడుచున్నాడు. ఇదంతయు చూపినాను. సంయుక్త అరబురిపబ్లికుయొక్క జనసంఖ్య మన ఆంధ్రప్రదేశరాజ్యమంత యున్నది. ఈజిప్టుచరిత్రపఠనము భారతీయులకు చాల లాభదాయకము. ఆంధ్రభాషలో సమగ్రమైన ఈజిప్టుచరిత్ర లేనందున నే నీ గ్రంథరచనమును గావించినాను. నేటివరకును జరిగిన సంఘటనలను తెలిపినాను. తప్పులను మన్నించి, ఒప్పులను గ్రహించవలెనని ఆంధ్రమహాజనులను కోరుచున్నాను. నాకు దీనిని త్వరితముగ ముద్రించుటకు తోడ్పడిన ఆదర్శగ్రంథమండలి సంపాదకులైన గద్దె లింగయ్యగారికి నా కృతజ్ఞత తెలుపుచున్నాను.

నాగార్జునవిహార్,
హిమాయత్‌నగర్,
హైదరాబాదు,
1–7–1959.

అయ్యదేవర కాళేశ్వరరావు.

BIBLIOGRAPHY


Egypt — by Young.

Secret History of British Occupation of Egypt by Blunt.

Imperialism and World Politics by Doctor Moon.

Egypt between Two Revolutions with an introduction by Colonel Nasser.

Egypt - A Historical Synopsis.

The Splendour that was Egypt by Doctor Margaret Murry.

Ancient Egypt by Manchip Whete.

Ancient Egypt—Anicient Egyptians by Breasted.

Brief History of Ancient Egypt by Laky Iskandar and Alexander Badawy.

The Pyramids of Egypt by I. E. S. Edwards.

Arab Dawn by R. K. Karanjia.

Turkey by Mears, etc.

Keesings Contemporary Archives.

International Relations Since 1919. Part II by M. G. Gupta.

Middle East — 1958.

# విషయసూచిక

# చిత్రపటములు

# ఈజిప్టుదేశ చరిత్ర

## ప్రథమాధ్యాయము

### ఫారో రాజులు

క్రీ. పూ. 4777—క్రీ. పూ. 341

(1)

### చారిత్రక పరిశోధనలు

భరతవర్షము, చైనా, ఈజిప్టుదేశములలో క్రీస్తుకు పూర్వము ఏడువేల సంవత్సరముల క్రిందటనే సుస్థిరమైన, అభివృద్ధికరమైన నాగరికత స్థాపింపబడి యుండెనని సుప్రసిద్ధ ప్రపంచచరిత్రకారుడు హెచ్. జి. వెల్సు వ్రాసియున్నాడు. ఆకాలముననే పశ్చిమ ఆశియాలోని మెసొపొటేమియాలో కూడ గొప్ప నాగరికత వర్ధిల్లినది. ఈ ప్రాచీన నాగరికత లన్నియు గొప్ప నదులయొడ్డున నుద్భవించి ప్రజ్వరిల్లినవి. భారతీయనాగరికత సింధు, గంగ, యమున, నర్మద, గోదావరి, కృష్ణ, కావేరీనదీప్రాంతములలోను, చైనా నాగరికత యాంగ్సీ, హోయాంగుహో నదులలోయలలోను, మెసొపొటేమియా నాగరికత యూఫ్రిటీసు, టైగ్రీస్ నదులయొడ్డునను ప్రభవించి పెంపొందినవి. అటులనే ఈజిప్టు ప్రాచీన నాగరికతకూడ నైలు

నది కిరు పార్శ్వములలోను ప్రబలినది. తక్కిన దేశముల ప్రాచీనచరిత్రలకంటె ఈజిప్టుదేశపు ప్రాచీనచరిత్ర తెలుసుకొనుటకు నెక్కుడుగ అవకాశములు కలిగి పురాతత్వ శాస్త్రజ్ఞులచే క్రీస్తుకుపూర్వము షుమారు ఐదు వేలసంవత్సరముల నుండి వరుస తప్పని చరిత్ర వ్రాయబడి యున్నది. కొన్నివేల సంవత్సరముల క్రిందట నిర్మింపబడి నేటికిని మంచిస్థితిలో నున్న పిరమిడ్లమీదను దేవాలయములమీదను గోరీలమీదను చెక్కబడిన వ్రాతలు, ట్యూరిన్ పెపీరసులోను, పాలెర్మో శిలాశాసనము మీదను వ్రాయబడిన రాజవంశముల చరిత్రలు ఈ దేశపు ప్రాచీనచరిత్రను తెలుసుకొనుటకు గొప్ప ఆధారములై యున్నవి. మెనెథో అను చరిత్రకారుడు క్రీస్తుకు పూర్వము మూడవ శతాబ్దములో టాలమీరాజు యొక్క ఆజ్ఞానుసారముగ ఈ దేశపు ప్రాచీనచరిత్రను వ్రాసి యున్నాడు. క్రీస్తుశకము మూడవ శతాబ్దములో జూలియస్ ఆఫ్రికానసు అను లిబియా దేశపు చరిత్రకారుడుకూడా ఫారో రాజుల చరిత్రను వ్రాసియున్నాడు. అన్నిటికన్న ముఖ్యముగ 19 వ శతాబ్దమునుంచి ఈదేశములో త్రవ్వబడిన శిథిలములనుండి పురాతత్వశాస్త్రజ్ఞులు గావించిన పరిశోధనలవల్ల ఈ దేశపుప్రాచీనచరిత్ర చాలగ తెలిసినది. ఈదేశపు భూమిలో చాల భాగము వర్షము బొత్తుగా కురియక సూర్యరశ్మికి ఎండిన ఎడారి యైనందున, భూగర్భములో పాతిపెట్టబడిన వస్తువులన్నియు వేలకొలది సంవత్సరములనుండి తేమవలన క్రుళ్ళిపోక ఉప్పులవలన తినిపోక చెక్కుచెదరకుండ యథాతథముగ ఈ శాస్త్రజ్ఞులకు దొరికినవి. ఈ అన్ని పరిశోధనలవలనను

ఫారోరాజుల వంశావళివారి చరిత్ర సక్రమముగ తెలుప బడినవి. ఈజిప్టు పురాతత్వ శాస్త్రజ్ఞులలో మిక్కిలి ప్రసిద్ధి చెందిన ఫ్లిండర్స్ పెట్రీయొక్క వ్రాతలప్రకారము ఉత్తర దక్షిణ భాగములను కలిపి యావత్తు ఈజిప్టును పరిపాలించిన మొదటి ఫారో రాజైన నార్మర్ - మేనెసు (**Menes**) క్రీస్తుకు పూర్వము 4,777 వ సంవత్సరమునుంచి 62 సంవత్సరములు పరిపాలనము కావించెననియు, అప్పటినుంచి క్రీస్తుకు పూర్వము 341 వ సంవత్సరమువరకు, ఆ మధ్యన మూడువందల సంవత్స రములు మినహాగ, ఇరువదిఎనిమిది ఫారోరాజవంశములు ఈ దేశమును పరిపాలించి గొప్ప నాగరికతను వృద్ధిచేసి యున్నారనియు స్పష్టముగ తెలియుచున్నది. మొదటి ఫారో రాజుయొక్క పాలనమునకు ఎనిమిదివందల సంవత్సరములకు పూర్వమే ఈ దేశములోని గణితశాస్త్రజ్ఞు లొక పంచాంగ మును ప్రచురించిరి. దానిలో సూర్యుని గతుల ననుసరించి సంవత్సరమునకు పన్నెండు నెలలు, నెలకు ముప్పదిరోజులు, పైన ఐదురోజులు, కలసి సంవత్సరమునకు 365 రోజు లుండునట్లు కాలమును విభజించిరి. వారమునకు పదిరోజుల చొప్పున నెలకు మూడువారములు నిర్ధారణచేసిరి. మరియు నాలుగు సంవత్సరముల కొకసారి యొక దినము ఆ సంవత్స రమునకు అధికముగ చేర్చబడినది. ఈ కాలపు పాశ్చాత్య జాతుల పంచాంగము ఇదేమాదిరిన నున్నది. నాలుగు సం వత్సరముల కొకసారి ఫిబ్రవరినెలలో నొకరోజు కలపబడు చున్నది. ఇందువలన అప్పటికే జ్యోతిషశాస్త్ర విజ్ఞాన మెంత ఎక్కువగ ఈజిప్టుదేశములో వృద్ధిచెందినదో కన

పడుచున్నది. ఈ పంచాంగమే ప్రాచీన ఈజిప్టుయొక్క రైతాంగమునకు ప్రాణప్రదమైనది. ఆ దేశముయొక్క యావత్తు జీవితము నైలునదిమీద ఆధారపడి యున్నందున, నైలునది వరదల ప్రారంభముతో (మన జూలై నెల 19వ తేదీనాడు) వారి సంవత్సరాది ప్రారంభమగుచున్నది. సంవత్సరమును మూడు కాలములుగ అనగ వరదలకాలము, విత్తునాటుకాలము, వేసవికాలము అని విభజించి యున్నారు. అంతకు పూర్వము చాలకాలము క్రిందటనే బొమ్మలతో వ్రాత, పిమ్మట అక్షరామ్నాయముతో వ్రాత, సిరా, కలము, చెట్టుబెరడుతో చేయబడిన పెపైరసు కాగితములు కనుగొనబడి వాడుకలోకి వచ్చినవి. పెపైరసు కాగితమును బట్టియే ఆంగ్లములో కాగితమును పేపరు అని పిలచుచున్నారు. వైద్య, ఇంజనీయరింగు విజ్ఞానములు కూడ బాగుగ వృద్ధిచెందినవి. నైలునదినీటిని కాలువల మూలమునను రిజర్వాయరుల (తటాకముల) మూలమునను భూములకు పారంచుకొనుటలోను వరదనివారణకార్యములలోను నిపుణత పొందబడెను. ప్రతి గ్రామములోను నొక గ్రామసంఘ మేర్పడి గ్రామస్తులందరి సహకారముతో నీపనులు నిర్వర్తించబడెను. ఈ దేశమునకు నైలునది తప్ప వేరు జలాధారము లేదు. ప్రజలు నైలునదిని ఒసిరిస్ దేవతగ ఆరాధించిరి. నైలునదిపండుగ అతిముఖ్యమైన పండుగ. ఫారోరాజులకు పూర్వము ప్రప్రథమమున ఈజిప్టు నాలుగు రాజ్యములుగ నుండెననియు, పిమ్మట నవి దక్షిణ ఈజిప్టు, ఉత్తర ఈజిప్టు అను రెండురాజ్యములుగ నయ్యెననియు

తెలియుచున్నది. దక్షిణ ఈజిప్టుకు రాజైన నార్మర్-మేనెసు ఉత్తర ఈజిప్టును జయించి యావత్తు ఈజిప్టును ఐక్యముగ తన క్రిందకు తెచ్చుకొని ఫారో రాజవంశ స్థాపకుడుగ పాలించినాడు. ఈ రాజునకు పూర్వము 5212 సంవత్సరముల చరిత్రను మానిథో స్థూలముగ తెలియచేసియున్నాడు. ఆకాలమున నేలిన రాజులందరును దైవాంశసంభూతులని చెప్పియున్నాడు. అది మన పురాణకథల వైఖరిన నున్నది. కొందరు చరిత్రకారులు ఆకాలములోకూడ 2500 సంవత్సరములను చరిత్రకాలములో చేర్చినారు.

(2)

## నైలునది

ఈజిప్టుకు నైలునదియే ప్రాణము నైలునదియే ఈజిప్టు. ఈ దేశముయొక్క వైశాల్యము 3,86,200 చదరపుమైళ్ళు. అయినను పదిహేను వేల చదరపుమైళ్ల పరిదేశము మాత్రమే ప్రజలచే ఆక్రమింపబడి వ్యవసాయముక్రిందికి తేబడియున్నది. ఇందులో నుత్తరఈజిప్టులో 8,000 చదరపుమైళ్లు, దక్షిణ ఈజిప్టులో 7000 చదరపుమైళ్లు వైశాల్యము గలవు. మిగిలిన ప్రదేశమంతయు విశేషముగ ఎడారులతోను కొంతభాగము నీళ్లునిలిచెడి పల్లపుప్రాంతములతోను నిండియున్నది. అక్కడక్కడ చిన్న కొండలు గుట్టలు గలవు. ఇవన్నియు ఈ దేశమునకు ప్రక్కనవ్యాపించియున్న సహారాఎడారియొక్క విస్తరణములై నిర్జనప్రాంతములుగ నున్నవి. తూర్పు ఎడారులలో మాత్రము

కొన్నిచోట్ల మంచినీరు దొరకుచున్న చెట్టుచేమ లున్నందున అచట దేశదిమ్మరులగు జాతులు తాత్కాలిక నివాసముల నేర్పరచుకొనుచున్నారు ఈ దేశముయొక్క సస్యశ్యామలము లైన వ్యవసాయికభూములు, ఫలవృక్షములతోను, కూరగాయ లతోను కళకళలాడెడు తోటలు, జనసమ్మర్దములైన పల్లెలు, బస్తీలు యావత్తు, నైలునది కిరుప్రక్కలను ఆ నది పొడుగునను కొద్దిమైళ్ళ వెడల్పున మాత్రమే వ్యాపించియున్నవి. నైలునదికి ప్రక్కనున్న ప్రజలు కాపురమున్న దేశముయొక్క వెడల్పు పన్నెండుమైళ్ళ మొదలు ముప్పదియొక్క మైళ్ళవర కున్నది. నైలునది ఆఫ్రికాఖండముయొక్క మధ్యభాగములోని ఆల్బర్టు నయాంజా, విక్టోరియా నయాంజా యను గొప్ప సరస్సులలో పుట్టి, ఉత్తరముగా సుడాను, ఈజిప్టుదేశములలోగుండ పారి, మొత్తము నాలుగువేలమైళ్ళ పొడుగున ప్రవహించి, ఈజిప్టు కుత్తరముననున్న మధ్యధరా సముద్రములో కలియు చున్నది. ఈ నది ఆస్వాన్‌వద్ద ఈజిప్టులో ప్రవేశించి ఉత్తర ముగా ఒకే పాయగా (శాఖలుగ చీలకుండగ) ఆరువందల మైళ్ళు నవీన కైరో నగరసమీపమున నున్న హెలియొ పోలిసు వరకు పారుచున్నది. ఆస్వాన్‌నుండి హెలియొ పోలిసు వరకు దక్షిణ ఈజిప్టు లేక ఎగువ ఈజిప్టు అని పిలువబడు చున్నది. హెలియొ పోలిసువద్ద ఈ నది ఏడు పాయలుగా (శాఖలుగా) చీలి ఉత్తరమున నూరుమైళ్ళు ప్రవహించి ఈ పాయలన్నియు మధ్యధరా సముద్రములో విడి విడిగా కలియు చుండెను. ఈ పాయలలో నైదింటిని ఈ దేశీయులు కాల క్రమేణ పూడ్చివేసినందున రెండు పెద్దపాయలు మాత్రము

నిలచియుండి అవి విడివిడిగ సముద్రములో కలియుచున్నవి. ఇటుల నివి సముద్రములో కలియుచున్న చోటులకు మధ్య రెండువందల ఏబదిమైళ్ళ వెడల్పుగల దేశమున్నది. దీని నంతను దిగువ ఈజిప్టు లేక యుత్తర ఈజిప్టుదేశ మని, డెల్టా అని పిలచుచున్నారు. ఇందులో తూర్పుపాయ డామియట్టె శాఖ అను పేరున, పశ్చిమపాయ రోజెటాశాఖ అను పేరున పిలవబడుచున్నవి. ఈ డెల్టాలో కొన్ని సరస్సులుకూడ నున్నవి. ఇందులో గల భూములన్నియు మిక్కిలి ఫలవంత ములై యున్నవి.

ఎగువ ఈజిప్టులోను, డెల్టాలోనుకూడ జనసంఖ్య ఒత్తిడి ప్రపంచములో మరి యేదేశములోను లేనంత ఎక్కువగ నున్నది. ప్రాచీనకాలములో ఈ దేశపు మొత్తపు జన సంఖ్య ఏబదిలక్షలుండవచ్చును. ఇపుడు రెండుకోట్ల ముప్పది లక్షలవరకు పెరిగినది. కొన్నిజిల్లాలలో చదరపుమైలుకు ఆరు వేల వరకు జనసంఖ్య కలదు. ఈ దేశములో వర్షము బొత్తుగా పడని భాగము ఎక్కువగ నున్నది. కొద్దిచోట్ల మాత్రము సంవత్సరమునకు మూడు అంగుళముల వర్షము కురియు చున్నది. సంవత్సరము పొడుగునను ఎండ ఎక్కువగ కాయు చుండును. ప్రక్కనున్న ఎడారులను బాగుచేసి నీటి పారుద లను కలుగచేసి వ్యవసాయములోనికి తెచ్చి అత్యంతముగ వృద్ధియైన ప్రజలకు జీవనోపాధి కలుగచేయుటయే ఈజిప్టు ప్రభుత్వముయొక్క నేటికిని ముఖ్యమైన సమస్యయై యున్నది.

## నైలునది వరదలు

సుడాను రాజధానియైన కార్టూమ్ పట్టణమువద్ద 'నీల నైలు' యను ఉపనది వచ్చి పెద్ద నైలులో కలియుచున్నది. ఈ 'నీలనైలు' అబిసీనియాలోని ఎత్తయిన కొండలలోనుంచి వచ్చి ఇచ్చట నైలునదిలో కలిసినది. నైలునది మధ్యధరా సముద్రములో కలియుచోటు ఇక్కడికి 1350 మైళ్ళ దూరమున నున్నది. దీనికి ఉత్తరమున 140 మైళ్ళ దూరమున అట్బారా యను మరియొక యుపనది వచ్చి సుడాను దేశములోనే నైలునదిలో కలియుచున్నది. ఇటుల నీలనైలు (Blue Nile) వచ్చి కలియుటవల్ల, పెద్ద నైలునదిని తెల్ల నైలు (White Nile)అని పిలచుచున్నారు. పెద్దనైలులో ప్రవహించెడు నీరు సాధారణముగ తెల్లగనే యుండును. ప్రతి సంవత్సరము జూన్ నెలనుంచి అబిసీనియా కొండలలోని లోహములను, త్రోవ పొడుగునగల ఒండుమట్టిని తీసుకొని నీలనైలునదియొక్కయు అట్బారానదియొక్కయు ప్రవాహములు పెద్ద నైలునదిలో ప్రవేశించి, జులైనుంచి గొప్ప వరదలై అక్టోబరు నెలవరకు పదునైదు అడుగుల ఎత్తున వృద్ధియై ఈజిప్టుదేశములోని వ్యవసాయభూమినంతను ప్రతి సంవత్సరమును ముంచివేయుచున్నవి. ఈ వరదలు అక్టోబరు నెలనుంచి క్రమముగ తగ్గి నవంబరు నెలాఖరు వరకు సాంతముగ లేకుండపోవును. ఇటుల ఏటేట వచ్చు నైలునది వరదలు దక్షిణ ఉత్తర ఈజిప్టులలోని భూముల నన్నిటిని మిగుల యుపయోగకరమైన ఒండుమట్టితోను లోహములతోను

నింపి మిక్కిలి ఫలవంతముగ చేయుచున్నవి. ఇటుల వేల సంవత్సరములనుంచి నేటివరకును జరుగుచున్నది. వరదలు ఎప్పుడు వచ్చేది, ఎప్పుడు తగ్గేది, ఎప్పుడు వరదలు లేకుండ పోయి భూములు ఎండేది, ఈజిప్టు రైతులకు బాగుగ తెలియును. వారి పంచాంగప్రకారమే అది నేటికిని జరుగుచున్నది. ఈ వరదలు తగ్గగనే భూమిలో తడి యారినకొద్ది రైతులు విత్తనములు నాటి మిగిలిన సంవత్సరములో రెండు గాని, మూడుగాని పంటలు పండించుచున్నారు. పశువులు, గొర్రెలు, మేకలు, పందులు వ్యవసాయమున కుపయోగించుచున్నారు. ఇంత ఫలవంతమైన భూమి మరి యే దేశములోను లేదనియే చెప్పవచ్చును. అనాదికాలమునుంచి ఇటుల జరుగుచున్నందున వరదలవల్ల భూమి నష్టముగాకుండ నీటికాలువల, తటాకముల ఏర్పాట్లు చేసుకొని వాటివలన కలుగు లాభములను మాత్రము సంపూర్ణముగ పొందు పద్ధతులను ఈజిప్టుదేశీయులు అవలంబించి నీటిపారుదలవిజ్ఞానమునందును, వ్యవసాయమునందును మిగుల నిపుణులైనారు. ఈజిప్టుదేశములో వ్యవసాయభూమి తక్కువగ నున్నది. కాని ఉన్న భూమి యంతయు ఫలవంతమైనదే యైయున్నది. ఈజిప్టులో ఆహారపంటలకు, ఫలములకు, కూరగాయలకు, పశువులపాడికి ఎప్పుడును లోపము లేకుండెను. ఇటీవలి కాలములో ప్రత్తిని కూడ ఎక్కువగపండించి విదేశముల కెగుమతిచేసి ద్రవ్యమును సంపాదించుచున్నారు.

## ప్రాచీన భరతవర్షముతో సంబంధము

ఇంతేగాక నైలునది ఈజిప్టులో దక్షిణమున ప్రవేశించుచోటనుండి ఉత్తరమున సముద్రములో కలియువరకును యావత్తు నైలునదిలోను ఎట్టి ఆటంకములు లేకుండ అనాది కాలమునుంచి ఈజిప్టుదేశీయులు పడవలమీద రాకపోకలు చేయుచున్నారు. పడవల నిర్మాణమునందు ఈ దేశీయులు ప్రవీణులై యుండిరి. ఈజిప్టుకు ఆనుకొని దక్షిణముననే నైలు నదిలో కొన్ని చిన్నచిన్న గుట్టలు కలవు. వాటినిదాటి దక్షిణముగ పడవలు పోవుట చాల కష్టతరమై యున్నది. అంత వరకును పడవలలో పోయి అక్కడినుంచి కొంతవరకు మెట్టత్రోవలలో పోయి, మెట్టత్రోవలను నైలునదిలోకూడ సరకులను తీసుకొనిపోవుచు ఈజిప్టుదేశీయులు దక్షిణమున నున్న సూడానుతోను, న్యూబియాతోను, మధ్య ఆఫ్రికాతోను వర్తకము చేయుచుండిరి. ఈజిప్టుకు దక్షిణమునుంచి నైలునది పుట్టిన సరస్సుల వరకును నైలునదిలో నౌకలు పోవుటకు ధారాళముగ వీలుండెను. కాని నాలుగుచోట్ల మాత్రము నైలునదిమధ్యలో కొండలుండి నౌకాప్రయాణమును ఆటంకపరచుచున్నవి. ఈ ఆటంకము లేవియు ఈజిప్టుదేశములో నైలునదిలో లేకుండుట ఆ దేశీయుల అదృష్టము. ఈజిప్టుదేశమునకు తూర్పున ఆనుకొని ఎర్ర సముద్రము, ఉత్తరమున ఆనుకొని మధ్యధరా సముద్రము గలవు. ఈ రెండు సముద్రములగుండా కూడా ఈజిప్టుదేశీయులు అనాదికాలమునుంచియు నౌకలమీద

ప్రయాణముచేసి దూరదేశములతో వర్తక, వైజ్ఞానిక సంబంధములను పెట్టుకొనియున్నారు. చరిత్ర తెలియని కాలములో తూర్పుననున్న ఎర్రసముద్రమునుండి పడవలు వచ్చుటకొరకు కాలువను నైలునదిలోనికి త్రవ్వించినారు. అది కొంత పూడిపోగా పన్నెండవ రాజవంశమువారు క్రీ. పూ. 2700 సంవత్సరములో దానిని బాగుచేయించి మంచిస్థితిలోనికి తెచ్చినారు. అనేక శతాబ్దములు ఎర్రసముద్రములోనుంచి నౌకలు ఆ కాలువగుండ ప్రయాణముచేసి నైలునదిలోనికి వచ్చి ఆ నదిలోనుంచి ఉత్తరముగ మధ్యధరాసముద్రములోనికి పోవుటకూడ సక్రమముగ జరుగుచుండెను. మధ్యధరాసముద్రములో ఉత్తరముగనున్న గ్రీసు, క్రీటు, సైప్రసు దేశములతోను, తూర్పుగనున్న పాలస్తీను లెబనాన్ దేశములతోను ఈజిప్టుదేశీయులు వర్తక వ్యాపారములను చేసిరి. లెబనాన్ దేశమునుండి మంచి కలపను తమ దేశమునకు తెచ్చుకొనిరి. అపుడు యూరపుఖండము మిక్కిలి అనాగరికమగు స్థితిలో నుండెను. ఈజిప్టుదేశములో ఈశాన్యభాగమైన సినాయ్ రాష్ట్రములో దొరకుచున్న రాగి మొదలైన లోహములను ఈజిప్టులోని పట్టణములకు తెచ్చుకొనుటయేగాక ఆ రాష్ట్రమునకు తూర్పున అంటియున్న అరేబియా, పాలస్తీను, లెబనాన్, సిరియా, మెసొపొటేమియా దేశములకు ఈజిప్టుదేశీయులు మెట్టత్రోవల పోయి వర్తక వ్యాపారములను చేసిరి. ఈజిప్టుదేశమునకు దక్షిణమునను పడమరను గొప్ప ఎడారి యున్నందున ఆఫ్రికా ఖండములోని నీగ్రోజాతులకంటె ఆసియాఖండములోని

జాతులతోనే ఈజిప్టుదేశవాసులు అనాదినుండి ఎక్కువ సంబంధమును కలిగియుండిరి. ఆసియాఖండ నాగరికతయే ఈజిప్టుప్రజలమీద ఎక్కువ ప్రభావమును కలిగియుండెను. ఈజిప్టుపడవలు ఎర్రసముద్రములోగుండ దానికి పడమరనున్న ఆఫ్రికాఖండమునకు చేరిన సొమాలీల్యాండునకును, తూర్పున నున్న అరేబియా దేశమునకును పోవుటయేగాక, ఎర్రసము ద్రములోనుంచి అరేబియాసముద్రములోనికిని, ఇంకను దక్షిణముగ హిందూమహాసముద్రములోనికిని పోయి ఇండియా దేశములోని రేవుపట్టణములతో వర్తకసంబంధములు అనాదికాలమునుంచి పెట్టుకొనినటుల రూఢిగ తెలియు చున్నది. ఇండియాకును, ఈజిప్టుకును మధ్య ఈ రెండు దేశములపడవలును రాకపోకలుచేయుచుండెను. భారతీయులు ఈజిప్టుదేశమును, నైలునదిని, అది పుట్టిన ప్రాంతములను, ఆ చుట్టుపట్టు ప్రదేశములను అనాదికాలమునుంచి బాగుగ ఎరిగియుండిరనియు, భారతీయభూగోళములో నైలునదిని నీలనదియని పిలచిరనియు, అది పుట్టిన ఆల్‌బర్ట్ విక్టోరియా నయాంజా సరస్సును 'అమరసరస్సని' పిలచిరనియు, ఫ్రాన్సిస్ విల్‌ఫర్డు (Francis wilford) తన "Asiatic Researches" ఏశియాటిక్ రిసర్చెసు మూడవ సంపుటములో వ్రాసియున్నాడు. సోమగిరి పర్వతములకు సమీపముననున్న చంద్రస్థానములోని అమరసరస్సులో నుండి నైలునది పుట్టినదని భారతీయులు వ్రాసినారు. అచటి పూర్వ కాపురస్తులు ఆ సరస్సును అమరసరస్సనియు, ఆ చుట్టునున్న ప్రాంతమును చంద్రునిదేశమనియు, అచటి

కొండలను చంద్రునికొండలనియు అనగ, సోమగిరిపర్వతము లనియు తమభాషలో నేటికిని పిలచుచున్నారు. ప్రాచీన భారతీయులు తమ భూగోళములో మధ్యధరాసముద్రము నుండి భరతవర్షమువరకుగల దేశమునంతను కుశద్వీపమని, ఈ కుశద్వీపములో చేరిన ఈజిప్టుదేశమును మిశ్రస్థానమని, అటులనే చేరిన అరేబియాదేశమును అర్యస్థానమని, దానికి సమీపప్రాంతమును బర్బరుదేశమని పిలచినట్లు ఫ్రాన్సిస్ విల్ ఫర్డు వర్ణించియున్నాడు. అబిసీనియాకు భారత భూగోళశాస్త్రజ్ఞులు కుశదేశమని నామ మిచ్చియున్నారని కూడ వ్రాసియున్నాడు. సూర్యుని ఆరాధనమును ఈజిప్టు దేశీయులు భరతవర్షమునుండియే నేర్చుకొనిరని కొందరు విద్వాంసులు వ్రాసియున్నారు.

ఈజిప్టుదేశమునకు పడవలమీద భరతవర్షమునుండి బంగారము, రత్నములు, సుగంధ ద్రవ్యములు, సున్నితమైన కొయ్య దిగుమతి యయ్యెను. అశోక చక్రవర్తి టాలమీల కాలములో ఈజిప్టుదేశమునకు బౌద్ధమతబోధకులను పంపు టయు, భరతవర్షములోని తక్షశిల విశ్వవిద్యాలయమునుండి యొక సుప్రసిద్ధ ఆయుర్వేద వైద్యుని టాలమీలు పిలిపించు కొని ఈజిప్టులోని అలెగ్జాండ్రియా విశ్వవిద్యాలయములో ఆయుర్వేదపీఠమును స్థాపించుకొనుటయు, ఫారో రాజులకు పిమ్మట జరిగిన విషయములు.

## (3)

## ఫారో రాజు

ఈజిప్టుయొక్క మొదటి ఫారోరాజైన నార్మర్ - మేనెసుయొక్క రాజధాని ఎగువ ఈజిప్టులోని థైనిసు పట్టణమై యుండెను. అది అబిడాసుదగ్గర నున్నది. ఈయన నైలునదీ ప్రవాహమార్గమును మార్పించి దానిని కొండలలోగుండ పోవునట్లు త్రిప్పించి పాత ప్రవాహముండిన ప్రదేశమునంతను పూడ్పించి ఆ పూడ్చినచోట మెంఫిసు నగరమును నిర్మింపజేసి దానినికూడ తనరాజధానిగ గావించెను. ఇటుల నైలునదీప్రవాహమును మరల్చుటవలన ఆయన విశేషమైన ఇంజనీరింగుప్రజ్ఞ గలవాడని యెంచబడుచున్నది. అప్పటికి ఇంజనీరింగువిజ్ఞానము ఈజిప్టులో చాలగ పెంపొందెననుట నిర్వివాదాంశము. ఆయన ఉత్తర ఈజిప్టుయొక్క ఎర్రకిరీటమును, దక్షిణ ఈజిప్టుయొక్క తెల్లకిరీటమునుకూడ ధరించెను. ఉత్తర ఈజిప్టుయొక్క ఎర్ర కిరీటముచుట్టు నాగుపాముయొక్క విగ్రహము చిత్రించబడినది. దక్షిణ ఈజిప్టుయొక్క తెల్లకిరీటముమీద గరుత్మంతుడు చిత్రించబడినది. ఈ రెండు దేవతలు-నాగుపాము, గరుత్మంతుడు-ఫారోరాజును కాపాడుచున్నవి. ఈజిప్టుదేశమునకు 'రా-ఆటము' అనగ సూర్యుడు రాజై యుండెను. సూర్యునకు వాయుదేవుడగు 'షూ' అను కుమారుడు, ఉదకదేవతయగు 'టెఫ్‌నటు' అను కుమార్తె కలిగిరి. వారిరువురు వివాహమాడగ 'గెబ్' అను భూదేవుడు 'నట్' అను ఆకాశదేవత పుట్టిరి. వారిరువురు

వివాహమాడిరి. వారికి 'ఒసిరిసు', 'సెత్' అను ఇద్దరు కుమాళ్ళు, 'ఐసిసు', 'నెఫితిస్' అను ఇద్దరు కుమార్తెలును పుట్టిరి. వీరిలో 'సెత్' దేవత తన చెల్లెలగు నెఫితిస్‌ను, ఒసిరిసు దేవత తన చెల్లెలగు ఐసిసును వివాహమాడిరి. ఒసిరిసు ఈజిప్టుదేశముపై రాజ్యముచేయసాగెను. ఆ దేశమునకు గొప్ప నాగరికత నిచ్చి దానిని అన్నిదేశములలోకి మేటిగ గావించెను. ఆయన ఈజిప్టును వదలి ప్రక్క దేశములలో ప్రయాణము చేయుచుండగ ఆయన తమ్ముడగు 'సెత్' రాజ కార్యములు నిర్వర్తించుచుండెను. అన్నను చంపి ఈజిప్టు రాజ్యమును, ఆయనభార్య అయిన ఐసిసును అపహరించవలెనని 'సెత్' యోచించెను. ఎథియోపియా రాణితో కుట్ర సలిపెను. 'ఒసిరిసు' దేశములోకి రాగానే ఆయనకు గొప్ప విందుచేసినట్లు నటించి ఆయనను హత్య గావించెను. ఒసిరిస్‌కును ఐసిసుకును జన్మించిన కుమారుడగు 'హోరసు' తన తండ్రిని చంపిన 'సెత్'తో కొంతకాలము యుద్ధముచేసి తుద కాతనిని హత్యగావించి పగ తీర్చుకొనెను. అంతటితో 'ఒసిరిస్' మరల బ్రతికి దేవత అయ్యెను. ఈజిప్టులో చాల చోటుల 'హోరసు' పండగను వరుసగ కొన్నిరోజులు సలిపెదరు. అపు డీ కథను ఎనిమిదంకముల నాటకముగ ప్రదర్శింతురు. ప్రప్రథమమున నీ పండగ యుత్సవములు, అబిడాసులో జరిగెను. అచటనే ఒసిరిస్‌యొక్క శిరమును సెత్ పాతిపెట్టించెను. అచటనుంచియే ఒసిరిస్ మరల బ్రతికి దేవత అయ్యెను. అందువలన అబిడాసు గొప్ప పుణ్యక్షేత్రమయ్యెను. అక్కడనుంచియే ఈ పండగ దేశములోని అనేక

పట్టణములలోకి వ్యాపించెను. హోరసు ఈజిప్టు దేశమునకు రాజయ్యెను. ఆయన ఈ రాజ్యమును ఫారోరాజులకు వప్పగింతచేసి నడుపుచున్నాడు. ఫారోరాజులు సూర్యవంశజులని, హోరసుయొక్క అవతారమని ప్రజలచే అత్యంతముగ గౌరవించబడిరి. ఫారోరాజుకు సూర్యునిపుత్రుడను బిరుదముండెను. ప్రతి ఫారోరాజులోను హోరసు ప్రవేశించియున్నాడు. ఫారోరాజుయొక్క కిరీటధారణమహోత్సవము దేశములో మిగుల ప్రాముఖ్యమైన పండగ. ఆయన ఆ దినమున హోరసు అగుచున్నాడు. 'హోరసు', 'థోతు' దేవతలవేషములు ధరించిన ఇద్దరు మతగురువులచేత దీర్ఘముగ మతకర్మలు చేయబడి ఫారోరాజు ప్రజలకు పాలకుడుగ వప్పగింత చేయబడుచున్నాడు. ఆయనయొక్క రాజబిరుదములన్నియు ప్రకటించబడును. దక్షిణ ఈజిప్టు పాలకుడుగ నొకసారి, ఆ వెంటనే ఉత్తర ఈజిప్టు పాలకుడుగ నొకసారి, కిరీట ధారణ శుభకార్యము జరుపబడుచున్నది. కిరీట ధారణము పూర్తికాగనే ఆయన ఒసిరిస్ విజయస్తంభమును ప్రతిష్ఠించుచున్నాడు. ఫారోరాజు బ్రతికియుండగ హోరసు అయినటులనే మరణించగనే ఒసిరిస్ అగుచున్నాడు. ఫారోరాజు ప్రజలకు తండ్రి, గురువు, న్యాయవిచారణకర్త, సైన్యాధిపతి, రక్షకుడు. ఆయన నైలునదియొక్క నీటిని ప్రవహింపచేసి యావత్తుభూమిని సస్యశ్యామలము గావించుచున్నాడు. ఆయన ప్రతిసంవత్సరము ప్రథమముగా స్వయముగ దున్నుచున్నాడు. ప్రథమమున పైరును స్వయముగ కోయుచున్నాడు. వీటిలో ప్రజలకు మార్గదర్శి. క్రొత్తకాలవ త్రవ్వినపుడు మొదటి త్రవ్వకమును

ఆయన తనచేతులతో గావించును. నైలునదిలో సరిగ నీరు రానిచో దేశమునకు క్షామమే కలుగును. అట్టి విపత్తు రాకుండ కాపాడుటకై ఫారోరాజు రా-ఆటమును ఆరాధించుచున్నాడు.

## (4)

## ఉజ్వల నాగరికత

ఈజిప్టుయొక్క అయిదువేల సంవత్సరముల యుజ్వలమైన ప్రాచీనచరిత్రను గూర్చి ఈ చిన్నపుస్తకములో నెక్కువగ చెప్పుటకు స్థలము చాలదు. ఈ ప్రాచీన నాగరికతను గూర్చి అనేకమంది పాశ్చాత్యచరిత్రకారులు గ్రంథములను వ్రాసియున్నారు. డాక్టరు మార్గరటు ముర్రే యను ఆంగ్ల గ్రంథకర్త్రి, తన ఈజిప్టుప్రాచీనచరిత్రకు **The Splendour That was Egypt,** "అప్పుడున్న మహోజ్వలత ఈజిప్టు" అని పేరిడినది. ఆకాలమున ఆ దేశము. సిరిసంపదలకు ప్రసిద్ధికెక్కియుండెను. ఆహారధాన్యములు, పండ్లు, కూరగాయలు, రొట్టె, మాంసాహారము, ద్రాక్షసారాయము, ప్రజలకు సమృద్ధముగ లభించెను. పందిమాంసము నిషేధించబడెను. ఫారోరాజుల రాచనగరుల దర్బారులదంభము, వైభవము, ఐశ్వర్యము గొప్పగనుండెను. వారు రత్నములచే తళతళలాడుచున్న బంగారు కిరీటములను ధరించిరి. దేశము బంగారముతోను, రత్నములతోను వెల్లివిరిసియుండెను. "అనాదికాలమునుండియు బంగారము అతి ఎక్కువగ లభించెను. **In prodigious quantities'.** అది

ముఖ్యముగ న్యూబియాలోను, తూర్పు ఎడారులలోను నున్న గనులలో తీయబడెను. బంగారము కావలెనను కోరిక ఈజిప్టులో అత్యంతముగ నుండెను. సంవత్సరము పొడుగున గనులు త్రవ్వబడి బంగారము తీయబడుచుండెను. జయించబడిన దేశములనుండికూడ బంగారముతీసుకొనబడుచుండెను. మిట్టానీదేశపు తుస్రాటా రాజు "మా తండ్రిగారికి పంపినదానికంటె నెక్కువగ బంగారమును నాకు బంపుము. సోదరుడా! నీ రాజ్యములో బంగారము మట్టివలె బహు తేలికగ లభించుచున్నది" అని ఫారోరాజుకు లేఖను వ్రాసెను." అని మాన్ చెపుమైటు అను గ్రంథకర్త తన ప్రాచీన ఈజిప్టు అను గ్రంథములో వ్రాసియున్నాడు. "ఈజిప్టులో మిక్కిలి అందమైన లోహపు పనితనము బంగారములో నుండెను. ఆ చేతిపని యొక్క నాజూకుతనముతో మరి ఏదేశముకూడ — ప్రాచీన, లేక నవీన దేశము — సాటిరాదు. ముఖ్యముగా దాషూరులోను, లాహోనులోను తయారుచేయబడిన స్వర్ణాభరణముల సొగసు మరి యెచటను గాన్పింపదు. 18వ రాజవంశపువాడైన టుటాంకు ఆమోన్ ఫారోయొక్క గోరీలో దొరకిన బంగారు నగల పనితనము అద్భుతమైనది. ఆయనయొక్క శవము దాచిపెట్టబడిన బంగారుపెట్టె రత్నాభరణములు చెక్కబడినది. అట్టిది ప్రపంచములో మరి యెచ్చోటను లేదు. రోమనుల కాలములో ఈజిప్టునుండి బంగారము రోముకు ప్రవహించి ఈజిప్టు పేదరికములో క్రుంగినది. అప్పటినుంచి బంగారుకుబదులు వెండినగలు ఈజిప్టుదేశీయులు వాడసాగిరి." అని

చరిత్రకారురాలగు డాక్టరు మార్గరటు మర్రే తన 'అప్పటి ఉజ్వలత ఈజిప్టు' అను గ్రంథములో వ్రాసినది. ప్రతి గోరీలో బంగారువస్తువులను శవముతో కూడ పాతిపెట్టిరి. రాణీల స్వర్ణాభరణములు వారి శవములతో కూడ పిరమిడ్లలోను, గోరీల లోను నుంచిరి. ఒకపుడు వారి శరీరముమీదనే యుంచుటకు మారుగ వేరు గదులలో పాతిపెట్టిరి. ఇటీవలికాలములో గోరీలు పగులగొట్టి శవములకున్న బంగారమును నగలను దొంగలు అపహరించసాగిరి. వీరికి ప్రత్యేక శిక్షలివ్వబడెను. దాషూరు మొదలగు స్థలములలోని పిరమిడ్లలో దాచిపెట్ట బడిన అత్యంతవిలువగల బంగారునగలు శిథిలములు త్రవ్వబడి నపుడు విశేషముగ దొరికినవి. ఈజిప్టులో వజ్రములు తప్ప మిగిలిన రత్నములన్నియు చాలగ లభించెను. ఇండియా నుండి బంగారమును, రత్నములను, పరిమళద్రవ్యములను దిగుమతిచేసికొనిరి. సినాయ్‌నుండి రాగి మొదలైన లోహ ములను తెచ్చిరి. ఈ దేశములో కూడ ఇనుము తప్ప మిగిలిన లోహములు సమృద్ధిగ దొరకెను. ఇనుము, కర్ర మాత్రము విదేశములనుండి తెప్పించవలసివచ్చినది. కర్రను లెబనాన్ నుండి, ఇండియానుండి తెప్పించుకొనిరి. ఇనుమును హెలైల్లా దేశమునుండి తెప్పించుకొనిరి. పండ్లతోటలు, ఉద్యాన వనములు, పుష్పవాటికలు విశేషముగ వేయబడెను. రాణి వాసపు స్త్రీలే గాక మధ్యమ తరగతి స్త్రీలందరు మిగుల నాజూకైన వలువలను ధరించిరి. రత్నములుపొదిగిన బంగారు నగలను పెట్టుకొనిరి. సుగంధ నూనెలతో తలలు దువ్వుకొనిరి. కొప్పులమీద పుష్పముల నలంకరించుకొనిరి. చీరెలకు అత్తె

రును అలదికొని మొగముమీద పౌడర్లను వేసుకొని, పెదవులకు ఎర్రరంగు వేసుకొని అందగత్తెలై విలాసవతులైయుండిరి. ఈజిప్టువనివాండ్లు బంగారుతోను, రత్నములతోను నగలు తయారుచేయుటలో నిపుణులైయుండిరి. ఈ నిపుణత పన్నెండవ రాజవంశమునాటికి ఉచ్ఛస్థితి నొందెను. పురుషులుకూడ మంచి దుస్తులను ధరించిరి. పురుషులు, స్త్రీలుకూడ భోగపరాయణులుగ నుండిరి.

దేశములో విద్య బాగుగా వ్యాపించియుండెను. దేవాలయములన్నిటిలోను పాఠశాలలను స్థాపించిరి. అనేకచోట్ల మఠములు ప్రబలెను. మతగురువులు ధర్మబోధకొరకు మఠములలో తరిబీయతు కావలెనను నిబంధనను చేసిరి. మఠములుకూడ విజ్ఞాన కేంద్రములయ్యెను. స్త్రీలుకూడ విద్యనభ్యసించిరి. కొందరు పండితురాండ్రయిరి. సంగీతము, చిత్రలేఖనము వృద్ధిచెందెను. ఈజిప్టు భాష, వాఙ్మయము వృద్ధిచెంది గొప్పస్థితికివచ్చెను. ప్రథమమునుండియు ఫారో రాజులు విజ్ఞానాభివృద్ధికి విశేషముగ తోడ్పడిరి. పండితులను, శాస్త్రజ్ఞులను, కవీశ్వరులను గొప్పగ ఆదరించి పోషించిరి. ప్రకృతిశాస్త్రములు, గణిత వైద్యశాస్త్రములు, ఇంజనీరింగు మొదలగువాటిమీదకూడ గ్రంథములు వ్రాయుటకు ప్రోత్సహించిరి. ప్రతికాలములోను గొప్ప గొప్ప విద్వాంసులు, కవీశ్వరులు ప్రబలిరి. గొప్పగొప్ప గ్రంథాలయములుకూడ ననేకచోట్ల విలసిల్లెను. నాలుగవ రాజవంశస్థాపకుడగు స్నెఫ్రూ ఫారో క్రీ. పూ. 3,998 సంవత్సరమున బహు గొప్ప గ్రంథాలయమును నెలకొల్పెను. చట్టములన్నిటిని

క్రోడీకరించి ప్రచురించెను. సంగీతమును ప్రోత్సహించెను. కవీశ్వరులను సత్కరించెను. దేశచరిత్రలు, ప్రకృతిశాస్త్రములు, నైతిక గ్రంథములు, నవలలు, ప్రార్థనలు, మంత్ర తంత్ర గ్రంథములు, గణిత జ్యోతిష శాస్త్రములు, జ్యామెట్రీ [రేఖాగణితము], వైద్యశాస్త్రము మొదలగునవి వ్రాయబడి ఆ మహా గ్రంథాలయమునం దుంచబడెను. హెలియొపోలిసు నగరములో నొక విశ్వవిద్యాలయము వేల సంవత్సరములు వర్ధిల్లెను. అది ప్రస్తుత కైరోనగరమున కారుమైళ్ళదూరమున నుండెను. ఆ నగరము తొమ్మిది చదరపుమైళ్ళ వైశాల్యము కలిగియుండెను. అచట మతగురువుల తరిబీయతేగాక ప్రకృతి శాస్త్రములు మొదలైనశాస్త్రములు నేర్పబడెను. అచట నుంచియే రా-ఆటము సూర్యారాధనము వ్యాపించినది. 19వ రాజవంశకాలములో క్రీ. పూ. 1400 సంవత్సరప్రాంతములో బైబిలులో పాత నిబంధనలో చెప్పబడిన యూదుల ఈజిప్టు యాత్ర (exodus)జరిగినది. యూదులు క్షామమువలన తమ దేశమునువదలి ఈజిప్టుకు వచ్చిరి. ఇచటకూడ కష్టములనే అనుభవించిరి. జీవనోపాధికొరకు మండుచున్న యెండలో పిరమిడ్ల నిర్మాణమునకు రాళ్ళు కొట్టవలసివచ్చినది. ఇది యహోవాయొక్క శాపఫలమని వారు నమ్మిరి. ఆ కాలము ననే యూదుల ప్రధాన ధర్మశాస్త్రకారుడగు మోసెసు ఈజిప్టులోనే జన్మించెను. ఒక రెల్లుగడ్డిలో దొరకిన ఆ శిశు వును ఫారోరాజకుమార్తె పెంచి పెద్దవానినిచేసెను. విద్యా బుద్ధులను గరపించెను. అతడీ విశ్వవిద్యాలయములో విద్యా పారంగతుడయ్యెను. మరల యూదులతోగూడ పాలెస్తైనుకు

పోయెను. అచట వారికి ప్రధాన మతాచార్యుడయ్యెను. బైబిలులో చెప్పబడిన యహోవాయొక్క సుప్రసిద్ధమైన పది ఆజ్ఞలను (Ten Commandments) ఆయన యూదులకిచ్చెను. అవియే యూదుల ధర్మశాస్త్రము, యావత్తు నీతిబోధకు పునాదులైనవి. ఏసుక్రీస్తు ప్రభువుకూడా వాటిని అంగీకరించి వాటికి పైన తన మహోన్నత నీతిబోధను అభివృద్ధిపరచెను. పాశ్చాత్యప్రపంచమున విజ్ఞానకేంద్రముగా ప్రబలిన మొదటి విశ్వవిద్యాలయ మిదియే.

పడవల నిర్మాణము, నౌకాదళము, విదేశములతో వర్తక వ్యాపారములు విలసిల్లెను. వర్తకమంతయు వస్తు మార్పిడిమూలమున జరుగుచుండెను. క్రీ. పూ. పదునాల్గవ శతాబ్దములో రెండవ రామ్సెసు ఫారో బంగారు వెండి నాణెములను ప్రవేశపెట్టెను. గుర్రములకు కట్టి రథములుపయోగించబడెను. పరిపాలనావిధానము సౌష్టవముగ నుండెను. రాజ్యాంగవిధాన మేర్పడెను. వజీరు (ప్రధానమంత్రి)గాక అష్ట మంత్రు లుండిరి. ప్రథమమునుండియు ఉత్తరదక్షిణ ఈజిప్టులు కొన్ని నోములు (nomes)అనగ జిల్లాలుగ విభజింపబడియుండెను. ప్రతి జిల్లామీద నొక గవర్నరు నియమింపబడెను. కొంతకాలమునకువీరువంశపారంపర్యాయుద్యోగస్తులైరి. కొన్ని శతాబ్దములలో సిరియా పాలెస్తైన్ దేశములమీద సామ్రాజ్యము స్థాపింపబడెను. సమస్త వృత్తులు, చేతిపనులు, కళలు, చిత్తరువులు విశేషముగ ప్రబలియుండెను. ఈజిప్టు పనివాండ్రు ప్రతి వస్తువులోను నాజూకుతనమును అందమును చూపించిరి. లోహములతోను, మట్టితోను చిత్రవిచిత్రమైన రంగుల

పాత్రలు చేయబడుచుండెను. అందమైన వస్తువులకు ఈజిప్టు అప్పటికిని, ఇప్పటికిని ప్రసిద్ధి. అన్నిటికన్న ఈజిప్టు కగ్రస్థానమును కలుగచేసినది. వారి మహోన్నతమైన శిల్పచాతురి అయ్యున్నది. వారు నిర్మించిన గొప్ప పిరమిడ్లను, దేవాలయములను, సౌధములను, మమ్మీలనుగూర్చి ముందు ముందు వివరించెదను. ఇవి నేటికిని చాలభాగము చెక్కు చెదరక నిలచి యుండి లోకములోని యాత్రికుల కచ్చెరువును కలుగచేయుచున్నవి. వివిధ రాజవంశములనుగూర్చి అతి క్లుప్తముగ తెలుపకముందు ఆ దేశీయుల మత విశ్వాసములను గూర్చియు వివాహ పద్ధతులను గూర్చియు కొంచెముగ చెప్పెదను.

## (5)

## మతము — దేవతలు

ఈజిప్టులో వ్యవసాయము, ఇంజనీరింగుపరిశ్రమలు, వృత్తులు, ప్రకృతిశాస్త్రములు, గణిత జ్యోతిష శాస్త్రములు, వైద్యము, కళలు, శిల్పము మొదలైన ఐహిక నాగరికత గొప్ప స్థితిని పొందెనేగాని, హిందూదేశములోవలె ఆధ్యాత్మిక నాగరికత వృద్ధిచెందలేదు. యావత్తు సృష్టిని చేసిన అద్వితీయుడగు పరమాత్మకు, మానవునిలో నున్న జీవాత్మకు, మనకు గోచరించుచున్న ఐహికప్రపంచమునకు గల సంబంధములను గూర్చియు, జీవాత్మయొక్క పరమావధినిగూర్చియు హేతువాదము మీదను ప్రకృతిశాస్త్రజ్ఞానమున కనుకూలముగను సత్యాన్వేషణ మచట జరుగలేదు. ఉపనిషత్తులు,

బ్రహ్మసూత్రములు, భగవద్గీతవంటి గొప్ప ఆధ్యాత్మికగ్రంథము లచట వ్రాయబడలేదు. రాజులను శాసించి నడిపిన ఋషి సత్తములు తపోధనులు అచట జన్మించలేదు. శంకరాచార్యులు, రామానుజాచార్యులవంటి వ్యాఖ్యానకర్త లచట పుట్టలేదు. రాజుకంటె ఋషి యెక్కువ అను భావ మచటలేదు. ఆ దేశములో మతమునకు కూడ, అధికారములోను భోగపరాయణత్వములోను నోలలాడుచున్న ఫారోరాజే అధిపతి, నియంత. మతగురువు లాయనకులోబడి నడచుచుండిరి. ఏ ఫారోరాజు ఏకాలమున ఎచ్చోట ఎట్టిదేవతను ఆరాధించవలెనని ఆజ్ఞ యిచ్చెనో ఆ దేవతయొక్క ఆరాధననే మతగురువులు సలిపి ప్రజలలో వ్యాపింపచేసిరి. మతగురువులు దేవాలయముల శాఖకు ఫారోరాజుల యుద్యోగస్తులైరి. పదునెనిమిదవ రాజవంశము వరకు మతగురువులజాతి ఆ దేశములో ప్రత్యేకముగ లేదు. గాని మతగురువులైనవారు వివాహమాడగూడదు. అటు పిమ్మట నొక మతగురువుల జాతి పుట్టి ప్రబలినది. వివాహమాడగూడదను నిషేధమును తొలగించి రాజవంశముతో వివాహమాడి బలవంతులై రాజ్యము నాక్రమించి 160 సంవత్సరములు రాజ్యపాలనము గావించిరి. మరల ఫారోరాజులు రాజ్యమును స్వాధీనపర్చుకున్నారు. అందువలన ఈజిప్టులోని వివిధ తెగలలో ననాది నుంచి వచ్చుచున్న దేవతల ఆరాధనముకన్న ఎక్కువైన మతము లేదు. ఈ వివిధదేవతలను వివిధ ఫారోరాజులు అభిమాన దేవతలుగ పోషించి వీరికి గొప్పదేవాలయములను కట్టించిరి. మాన్యములనిచ్చిరి. మతగురువులు వీరికి పూజ సలిపిరి.

విగ్రహములపైన ఉదకము అక్షతలు పుష్పములు చల్లిరి. హారతుల నిచ్చిరి. నైవేద్యములను, ధూపదీపములను సమర్పించిరి. మన దేశములోని భోగముజాతివంటి దేవదాసి కుల మచట కూడ నుండెను. వ్యభిచారమువల్ల వారు జీవించుచుండిరి. ఆ కన్యకలు వచ్చి ఆ దేవతలవద్ద సంగీతమును పాడి నృత్యములు సలిపిరి. మృదంగ తాళ తాంబూర ఫిడేలు మొదలగునవి వాయించబడెను. వివాహకాలమునను, మరణకాలమునను మతగురువులు మంత్రములు చదివి మతకర్మలను చేయించిరి.

ఈజిప్టు దేవతలు ప్రతివారు స్థలదేవతలే. ఇందులో చాలమందికి జంతువుల, పక్షులశిరములే యుండెను. ఆ యా స్థలములనుండి ఫారోరాజులు ఆరాధించగా ఆ దేవతలు అట్టి ఆరాధన జరిగినన్నాళ్ళు ప్రాముఖ్యతను వహించి జాతీయ దేవతలైరి ఫారోరాజుల రాజధానులు మారగనే పాత రాజధానులలోని దేవతల ప్రాముఖ్యము పోయి నూతన రాజధానులలో ఆరాధించబడిన దేవతలు జాతీయదేవతలైరి. మిగిలిన సన్నకారు దేవతలు స్థలదేవతలై అచటి సామాన్యజనులచే నారాధించబడిరి. ఫారోరాజులు ప్రథమమున థైనిసులో రాజధాని కలిగియున్నపుడు రా-ఆటము అనగ సూర్యుని ఆరాధనను నెలకొల్పిరి 'రా-ఆటము' ఆరాధన ప్రథమమున విశ్వవిద్యాలయనగరమగు 'హెలియొపోలిసు' నందలి పండితులచేత స్థాపించబడినది. అక్కడినుంచి దానిని ఫారోరాజులు గ్రహించిరి. సూర్యుడు ప్రతియుదయమున తూర్పున యుదయించును. పడవలోనెక్కి ఆకాశమార్గమున పడమరగా పోవును. సాయంత్ర మగుసరికి పడమరవైపుకు చేరి అక్కడ

నుంచి పాతాళములోకి దిగి రాత్రి అంతయు అచటి ఆకస ములో పడవలోనే సంచారముచేసి మరుసటి యుదయ మునకు మన ఆకసముమీద తూర్పున కనబడుచున్నాడు. హిందూ పురాణములలో సూర్యుడు ఏడు గుర్రములు కట్టబ డిన రథముమీద ఆకసములో ప్రయాణముచేయుచున్నాడని వ్రాయబడినది. పిమ్మట సూర్యుని వంశీకులైన ఒసిరిస్, ఐసిస్, హోరసులయొక్క ఆరాధనను వ్యాపింపచేసిరి. ఆ కథను పైన తెలిపియున్నాము. వారి రాజధాని మెంఫిసునగరము నకు మారినపుడు అచటి స్థానిక దేవతయగు (Ptah) 'టా' యొక్క ఆరాధనను ప్రోత్సహించిరి. 'టా' దేవత కచట గొప్ప దేవాలయము నిర్మింపబడెను. 'టా' దేవత సర్వసృష్టికి ఆదికారణము. ఆయనయే రా-ఆటము అనగ సూర్యుని కూడ సృష్టించినాడు. ఆయన స్వయంభువు అని అచటి మత గురువులు బోధించిరి. ఆయన భార్య శెఖిమెటు, వారి కుమా రుడు ఇంపెటోటెపు, గాని నాలుగవ ఫారోవంశరాజులు మెంఫిసునే రాజధానిగ కలిగి యున్నను, 'టా' యొక్క స్థానమును తగ్గించి మరల 'రా-ఆటము' యొక్క ఆధిక్యతనే పెంపొందింపచేసిరి. రా-ఆటము యొక్క దేవాలయము, ఆయన ఆరాధన మరల ముఖ్యమయ్యెను. తర్వాత అన్ని ఫారో రాజవంశముల కాలములోను తాము సూర్యవంశజుల మని, హోరసు తమలో ప్రవేశించి నడుపుచున్నాడనే నమ్మ కమే ప్రబలియుండెను. గాని 'రా-ఆటము' దేవత ఫారో రాజుల దేవతయేగాని సామాన్య ప్రజల దేవత కాదు. ఆయన ఫారో రాజులను ప్రత్యేకముగ సంరక్షించుచున్నాడు. ప్రతి

యుదయమున పూజారులు పోయి ఫారోరాజును నిద్రలేప వలెను. ఆయనకు ప్రాతఃకాలకృత్యములను తీర్పించి అభ్యంగన స్నానము గావింపజేసి రాజదుస్తులను తొడిగించి రెండు వైపుల మతగురువులు మంత్రములు చదువుచు చేతులు పట్టుకొని 'రా-ఆటము' దేవాలయమునకు నడిపించి తీసుకొని వచ్చిరి. ఆ దేవాలయపు తలుపులు సీళ్ళుతీసి మంత్ర పఠనముతో తలుపులను తెరచెదరు. ఫారోరాజు సాష్టాంగ నమస్కారము చేసి ఆ దేవతను నిద్రలేపును. పిమ్మట రాజు స్వయముగ ఆ దేవతయొక్క విగ్రహమును జలకమాడించి శుభ్రముచేసి, వస్త్రములు, ఆభరణములు ధరింపజేసి, పుష్పములతో, సుగంధద్రవ్యములతో పూజగావించి హారతినిచ్చి నైవేద్య మొసంగవలెను. అపుడే సంగీత నృత్యములు దేవదాసి కన్యలచేతను, సంగీత పాఠకులచేతను సలుపబడును. ఆరాధనము పూర్తికాగానే ప్రసాదముగైకొని ఫారోరాజు దేవాలయపు తలుపులను మూసివేయించి సీళ్ళువేసి మరల తన రాజనగరుకు అదేవిధమున మతగురువులచే నడవబడి వచ్చును. ఇది ప్రతి ప్రాతఃకాలమున జరుగును. ఎపుడైనను తాను స్వయముగ వెళ్ళి ఆరాధనచేయలేని సమయము తటస్థించినచో రాజు తన ప్రతినిధిని పంపుచుండెను.

ఫారోరాజుల రాజధాని థీబ్సునగరమునకు మారినపుడు థీబ్సుపట్టణములోని ఆమోన్ - రి అందరికన్న ముఖ్య దేవత అయ్యెను. థీబ్సు చిన్నగ్రామమైనపుడు ఆ దేవతకు ప్రాముఖ్యములేక ఒకబాతుగను పొట్టేలుగను చిత్రించబడెను. కాలక్రమేణ థీబ్సుగ్రామము పెరిగినకొలది బాతుయొక్క

ఆకారము తీసివేయబడి ఆ దేవతకు మానవాకారము నిచ్చిరి. బాతుయొక్క ఈకెలు మాత్ర ముంచిరి. పొట్టేలుయొక్క తలకాయ చాలకాలము వరకు నిలచియుండెను. ఆమోన్-రీ దేవత యొక్క అదృష్టము ఆ పట్టణముయొక్క అదృష్టముతో నైక్యమైయుండెను ఆమోన్-రీ అనగకూడ సూర్యుడనియే అర్థము. ఈయనకును రా-ఆటము దేవతకును మన దేశములో తిరుపతి వెంకటేశ్వర దేవాలయమునకు భద్రాచలములోని శ్రీరామచంద్రుని దేవాలయముకున్న భేదముకంటె ఎక్కువ లేదు. ఒక్క దేవునికే రెండు పేర్లు. పదకొండవ ఫారో రాజవంశ మువారు థీబ్సుపట్టణమును ఈజిప్టుకు రాజధానిగ గావించిరి. అచట మూడవ మెంటు హోటెపు ఫారో గొప్ప పిరమిడును, ఆమోన్ - రీ దేవతకు మిగుల సుందరమైన శిల్పచాతురిగల దేవాలయమును కట్టించెను. పన్నెండవ రాజవంశపు ఫారోలు తమ నామమునకు ఆమోన్ శబ్దమును తగిలించుకొనిరి. ఇంత టితో ఆమోన్-రీ దేవత ఈజిప్టుదేశములో కెల్ల ప్రధాన దేవత అయ్యెను. ఆమోన్-రీ దేవతయొక్క అత్యున్నత దేవాలయ ములు నైలునది యొక్క ఇరుప్రక్కలను మిగుల వైభవముతో విలసిల్లెను. మూడవ థోఫ్ మెస్ రాజు కాలమున ఆమోన్-రీ దేవత లోకరక్షకుడయ్యెను మరియు దేవతలయొక్క దేవుడు, రాజుల యొక్క రారాజు, భగవంతుడు నయ్యెను. ఫారో రాజు రా - ఆటము కుమారుడే గాక ఆమోన్-రీ దేవత యొక్క కుమారుడుకూడ నయ్యెను. ఎవరు ఫారోగ రావలసినది ఈ దేవతయొక్క పూజారి నిర్ణయించుచుండెను. అలెగ్జాండరు చక్రవర్తి ఈజిప్టుదేశమును జయించినపుడు ఈజిప్టుప్రజలను

సంతోషపరచుటకై ముందుగ ఆమోన్-రీ దేవతను దర్శించి ఆయనయొక్క కుమారుడనైతినని ప్రకటించి ఆయనయొక్క పొట్టేలుబొబతు వంకరకొమ్ములను ధరించెను. ఫారోరాజుల కాలములోనే వారు తమరాజధానిని యుత్తరమునకు మార్చి నపుడు థీబ్సునగరముయొక్క ప్రతిభ చాల తగ్గినదిగాని రాజ్యాటమువలె గాక ఆమోన్-రీ దేవత ఫారోరాజులను రక్షించినటులే పేదప్రజానీకమునంతను రక్షించు దేవతగ నెంచబడి ప్రజలందరిచేతను కొలువబడుచుండెను. ఆ దేవతయొక్క పూజారి భక్తులకు వరములిచ్చుచుండెను. ఆమోన్ - రీ దుష్టులను శిక్షించును. యోగ్యులను రక్షించును. ధర్మపక్షముగల పేదవానిని, దుర్బలుని బలవంతుడియొక్క దుష్టత్వమునుండి, యెత్తిడినుండి కాపాడును, అని ప్రజలనమ్మకము. అందువల్ల ఈ దేవతయొక్క ఆరాధన బాగుగనే సాగినది. ఫారోరాజులకు పిమ్మట ఈజిప్టునేలినకాలమిూ రాజులు కూడ ఆమోన్- రీ దేవతను ఆరాధించి వరములను పొందిరి. పదునెనిమిదవ వంశపు ఫారోలకాలములో ఆమోన్ - రీ దేవతకు 'మట్' అను ఆడదేవతనిచ్చి వివాహముచేసిరి. వారిద్దరికి ఖోన్సు అను కుమారుడు పుట్టెను. ఖోన్సు అనగ చంద్రుడు.

థోత్ అను మరియొక దేవతకూడ డెల్టాలోని హెర్మాపోలిసులో ప్రాముఖ్యతనొందెను. ఈ దేవత కుక్కతలగల మర్కటాకారము గలవాడు. ఈ దేవత విద్యాదేవత, భగవంతుని జ్ఞానదూత. విద్యావేత్తలందరును ఈయన నారాధించిరి, ఈయన తన స్వదస్తూరితో ప్రపంచముయొక్క ధర్మ

శాస్త్రమునంతను నలుబదిరెండు సంపుటములలో వ్రాసినాడు. ఆ సంపుటములను పదునెనిమిదవ రాజవంశపు ఫారోలు స్థాపించిన హైకోర్టులోని న్యాయాధిపతి సంప్రదించియే తీర్పు చెప్పుచుండెను. చంద్రుడు ఈ దేవతయొక్క స్వరూపమే. మంత్రములమూలమున ఈ దేవత రోగములను కుదుర్చునని భక్తులు ప్రార్థించిరి. మరణమునొందినవారికి శిక్ష చెప్పునపుడు ఈ దేవత దగ్గరయుండి వారు గావించిన పుణ్యాపాపములను వర్ణించును. వారి హృదయమును తూచును. ఈయన 'శేషటు' అను ఆడదేవతను పెండ్లియాడెను. ఈమెయే మన పురాణములలోని చిత్రగుప్తునివలె మానవుల దినచర్యలన్నియు వ్రాసియుంచుచున్నది.

మెంఫిస్ పట్టణములో నందీశ్వరుని ఆకారముగల 'ఏపిస్' దేవతయొక్క ఆరాధనముకూడ చిరకాలమునుండి కలదు. ఈ నందీశ్వరుడు వృద్ధాప్యమువలన మరణించకూడదు. ఆయనను మతకర్మలచేతనే హత్యగావించి మరియొక నందీశ్వరుని ఆయనస్థానమున నెలకొల్పుదురు. పాత నందీశ్వరుడు పోయి నూతన నందీశ్వరుడు వచ్చుట మెంఫిస్ నగరములోని ప్రజలకు గొప్ప పండుగదినము. పాత నందీశ్వరుని యొక్క మాంసమును భక్తులు ప్రసాదముగ తినుటకు పంచుకొనిరనియు, చర్మమును ఎముకలను తైలములోపెట్టి వాద్యములతో తీసుకొనిపోయి పాతిపెట్టిరనియు తెలియుచున్నది. ఈ నందీశ్వరులను పాతిపెట్టు స్థలము సక్కారాలోని యొక గుహలో నున్నది. ఫారోరాజుల కాలము పూర్తియగువరకును ఈవిధముగ జరిగెను.

'ఏపిసు' అను నందీశ్వరునికి 'ఐసిసు' అను గోమాతను భార్యగాచేసిరి. వారి కుమారుడగు 'హోరసు'ను ఆవుదూడగ వర్ణించిరి. గోవుయొక్క పూజ ప్రాచీన ఈజిప్టులో బాగుగా ప్రబలినది. ఫారో రాజులకు పిమ్మట వచ్చిన టాలమీ రాజుల కాలములో 'ఒసిరిస్' ను, 'ఏపిస్' ను కలిపి 'సిరిపిస్' అను నూతననామము నిచ్చి 'సిరిపిస్' దేవతనే నందీశ్వరునిగ నారాధించిరి 'ఐసిసు' అను గోమాత ఆయన భార్యయే అయ్యెను. 'హోరసు' అను ఆవుదూడ వారి కుమారుడే అయ్యెను. ఈజిప్టు జాతీయ దేవతలందరును త్రిత్వములుగ తండ్రి, తల్లి, కుమారుడుగ ఆరాధించబడిరి. ఈ త్రిత్వమునే ఈజిప్టునుండి ముఖ్యముగ టాలమీల కాలమున వర్థిల్లిన ఆరాధనమునుండి క్రైస్తవమతములోనికి 'యహోవా,' పరిశుద్ధాత్మ, ఏసుక్రీస్తు, తండ్రి, తల్లి, కుమారుడు అను త్రిత్వమును ప్రవేశపెట్టినటుల పండితులు వ్రాసియున్నారు. మరియు మరణించిన ఒసిరిస్ దేవత మరల బ్రతికెనని మరణించిన మానవులు ఆయన పద్మాసనమువద్ద పుణ్యపాపములనుబట్టి స్వర్గ నాశనముల తీర్పును పొందుదురను భావమే, ఏసుక్రీస్తుయొక్క (Resurection) మరల బ్రతుకుట, ఆయనయే తీర్పు సమయమున నుండుట, అను క్రైస్తవమతములోని విశ్వాసములకు పునాదియని కూడ వ్రాసియున్నారు. ప్రక్కనున్న ఈజిప్టు నుండి యూదులభూమి అనేక విషయములను నేర్చుకున్న దనుటలో అతిశయోక్తి లేదు.

ఈ జాతీయదేవతలు గాక పిల్లితలగల 'బాస్టు' దేవత, ఆడసింహపుతలగల 'షెకుమెటు' దేవత, 'మిన్'అను

మన్మథుడు, నక్కతలగల 'అన్యుబిసు' దేవత, పొట్టేలు తల గల 'కానం' దేవత, మొసలితలగల 'వెపువాసెటు' దేవత, 'మాటు' అను న్యాయదేవత, మొదలైన దేవతలు ఆయా స్థలములలో పూజింపబడుచుండిరి. "ఈజిప్టులోని సుందరమైన దేవాలయములలో ఏకుక్క, ఏనక్క, ఏ మొసలి, ఏ పక్షి ఆరాధింపబడుచున్నదో ఎరి కెరుక?" అని జువినేల్ పండితుడు అధిక్షేపించుటలో నాశ్చర్యము లేదు. ఈ దేవతలన్నియు చారిత్రక కాలమునకు పూర్వమునుండియు వచ్చుచున్నవి.

## స్వర్గము

ఈ దేశములో మంత్రతంత్రముల వలన రోగములు కుదురునను నమ్మకము ప్రబలియుండెను. స్త్రీలు ఈ విద్యలో నెక్కుడు నేర్పరులు. ఫారోరాజులు వారి కుటుంబమువారు మరణించగనే ఆకసములోనున్న ప్రత్యేకస్వర్గమునకు పోయిరి. ఫారోరాజు ఒసిరిస్ అయ్యెను. ఇతర మానవులు మరణించిన పిమ్మట పోయి నివసించు స్వర్గము ఈజిప్టుదేశపు భూమిక్రిందనే నైలునది పారునట్టియు, పల్లెలు బస్తీలు విలసిల్లునట్టియు భూమి క్రిందనేయున్నది. దానికి ఎలీషియాతోటలు (Elysia Fields) అని పేరు. మరణించిన మానవుని జీవాత్మకు 'బా' అని పేరు. ఈ జీవాత్మకు 'కా' అను క్రొత్తవ్యక్తిత్వము, మరియొక యాతనాశరీరము ఇవ్వబడును. ఈక్రొత్త స్వరూపముతో సూర్యునిపడవ నెక్కి మానవుడు పోగా మాట్ అను న్యాయదేవత యొక్క గొప్ప సావడిలో (Judgement) తీర్పుకొరకు తీసుకొనిపోబడును. కొంతసేపటికి 'అన్యుబిసు' దేవత వచ్చి అచట

నున్న త్రాసులో నొకవైపున ఆ మానవుని హృదయమును, రెండవవైపున మాట్ దేవతయొక్క ఈకెను పెట్టితూకము వేయును. హృదయము సరిగ తూగినది లేనిది 'థాత్' దేవత నిర్ణయించి ప్రక్కనున్న దేవతలతో చెప్పును. హృదయము సరిగ తూగనిచో రెండవప్రక్కన సిద్ధముగా నున్న మొసలితలగల క్రూర దేవతకు ఆ మానవుని వప్పగింత చేతురు. అది అతనిని చిత్ర వధ గావించి నాశనముచేయును. ఆ మానవుడు చిత్రగుప్తుని జాబితాప్రకారము పుణ్యాత్ముడైనచో హృదయము సరిగ తూగును. అటుల సరిగ తూగినదని ఆ దేవతలు నిర్ణయించ గనే 'హోరసు' దేవత వచ్చి అతనిని పద్మముమీద నాసీనుడైయున్న 'ఒసిరిస్' దేవతవద్దకు తీసుకొనిపోయి ఆ సంగతిని విన్నవించును. 'ఒసిరిస్' దేవత ప్రక్కనే 'ఐసిస్' 'నెప్తిసు' దేవతలు నిలబడియుందురు. ఆ మానవుని 'ఒసిరిస్' దేవత స్వర్గమునకు (ఎలీషియా తోటలకు) పంపివేయును. స్వర్గములో ఆ మానవుడు సర్వసౌఖ్యముల ననుభవించును. అతని కుటుంబము వచ్చి చేరును. రోగభయము, మృత్యుభయము లేదు. సస్యశ్యామలమైన పొలములలోను, తోటలలోను ఇచ్చవచ్చినపుడు పనిచేయవచ్చును. అచటకూడ నైలునది పారుచున్నది. ఫలములు, పుష్పములు విరివిగ లభించును. పాడిపంటలు సమృద్ధముగ నుండును. అతని వారసులు శ్రాద్ధకర్మనుచేసి పిమ్మట ప్రతిసంవత్సరము తద్దినముపెట్టి భోజనమును బంపవలెను. ఇవి ఈజిప్టు దేశీయుల మతవిశ్వాసములు. ఈ శ్రాద్ధకర్మలు, తద్దినములుకూడ ఫారో రాజులచే

తమ పూర్వుల యోగక్షేమములకొఱకు గొప్పవైభవముతో నాచరించబడుచుండెను.

పర్యవసానమేమనగ, ఈజిప్టులో హేతువాదమునకు. ప్రకృతిశాస్త్రజ్ఞానమునకు ఆధ్యాత్మిక అనుభవమునకు సరిపోవు గొప్పమతము లేకపోవుటవల్ల, రోమనుపాలన మేర్పడి వారు క్రైస్తవమతమును తమక్రిందనున్న నీ దేశములో వ్యాపింప చేయుగనే, అంతకన్న గొప్ప నైతిక ఆధ్యాత్మికతత్వముగల క్రైస్తవమతము ముందర ఎట్టి ఆధ్యాత్మికబలములేని, కేవలము అనాగరిక మూఢవిశ్వాసములమీద నిర్మింపబడిన ఈజిప్టుదేవతల ఆరాధన బొత్తుగ నిలువలేక, నయముననో భయముననో నీ దేశవాసులందరును క్రైస్తవమతమును అవలంబించినారు. పాతదేవతల విగ్రహములు వారి చిల్లరదేవాలయములు బ్రద్దలుకొట్టబడినవి. మిగిలిన గొప్ప దేవాలయములను మార్చి క్రైస్తవచర్చీలుగ గావించినారు. అటుపిమ్మట క్రీ.శ. ఏడవశతాబ్దములో అరబు ఖలీఫాలు ఈజిప్టును జయించి అరేబియానుండి తెచ్చిన యుత్కృష్టమైన ఏకేశ్వరారాధనము గల ముసల్మాను మతమును వ్యాపింపచేయుగా, దాదాపుగా ఈజిప్టుదేశీయులందరు ముసల్మానులైరి. నూటికి ఎనిమిదిమంది మాత్రము క్రైస్తవులుగ మిగిలినారు. అరేబియానుండి వచ్చిన ముసల్మాను మతము వ్యాపించగనే అరబు భాష, అరబు వాఙ్మయము, అరబు నాగరికత, అరబు సంస్కృతి ఈజిప్టుదేశీయులచే పూర్తిగ నవలంబించబడి ఈజిప్టుదేశము అరబుదేశములలో ముఖ్యస్థానమును పొందినది. పాత ఈజిప్టుభాష, ఆ వాఙ్మయము, ఆ సంస్కృతి, ఆ

నాగరికత పూర్తిగ అదృశ్యమైనవి. ప్రాచీన ఈజిప్టును నవీన ఈజిప్టుతో కలుపుటకు ఫారో రాజుల గోరీలు తప్ప మరి యేమియు లేవు. అటుల గాక హిందూమతము, హిందూ ధర్మము యుత్కృష్టమై హేతువాదనకు ప్రకృతిశాస్త్రజ్ఞాన మునకు ఉత్తమ ఆధ్యాత్మికజీవితమునకు సరిపోవునవియై యుండుటవలన హిందూదేశములో జరిగిన రాజకీయమార్పుల వల్ల పడిపోక నాటినుండి నేటికిని సజీవముగాను, దృఢముగాను నిలచియున్నవి. ఈ దేశములో తర్కమునుకూడ వేదాంగము లలో నొకటిగ చేసిరి. హిందూసంస్కృతి, నాగరికత, హిందూ భాషయైన సంస్కృతము, దేశభాషలు, వాఙ్మయములు, హిందూజాతియొక్క వ్యక్తిత్వము గట్టి పునాదులమీద నిలచి యుండి విదేశ దాస్యశృంఖలములు తెగిపోగనే హిందూ దేశము మరల విజృంభించి నవీన ప్రపంచమునకు కళ్యాణప్రద మైన ఆధ్యాత్మిక సందేశముల నివ్వగలుగుచున్నది. ఈ దేశము లోకి విదేశములనుండి వచ్చిన గొప్ప మతములు హిందూమత మును పీకివేయలేక హిందూమతముతో సహకరించుచు, సమన్వయపరచుకొనుచు జాతీయ ఆధ్యాత్మిక యున్నతికి, శక్తికి తోడ్పడుచున్నవి. గాని మతముపేర కొన్ని సాంఘికా చారములు మొదట ఉపయోగకరముగా పెరిగి కొంతకాల మునకు క్రుళ్ళిపోయి మూఢవిశ్వాసములై అభివృద్ధి నిరోధ కములగును. అందువల్ల హిందూజాతి బ్రతికియున్న జాతి గావున అట్టి క్రుళ్ళిపోయిన ఆచారములను కాలమాన స్థితుల కనుకూలముగ మార్చివైచి మతముయొక్క ఆధ్యా త్మిక నైర్మల్యమును కాపాడుకొనుచు మతధర్మములను

బ్రతికించుకున్నది. మత మొక అద్భుతశక్తి. మత వాఙ్మయములోని ఆదర్శములను, కథలను బోధించుటకు కవిత్వము సంగీతము, శిల్పము, చిత్రలేఖనము, నృత్యము, నాటకము పుట్టుచున్నవి. మతమను గొప్పశక్తిని ఎప్పటికప్పుడు సంస్కరించుకొనుచు చక్కగా నుపయోగించినట్లయిన జాతిలో వీర్యమును, చైతన్యమును ప్రజ్వలింపచేయును.

## (6)

## వివాహము - స్త్రీల హక్కులు

ఆ కాలమునందు ఈజిప్టుదేశమునందే గాక ప్రక్కనున్న యూదుల దేశమగు పాలస్తైన్ దేశములోగూడ రాజ్యములును, స్థిరాస్తులును స్త్రీలద్వారానే వారసత్వ సంక్రమణమును పొందెను. పురుషులకన్న స్త్రీలకే గొప్పస్థితి యుండెను. రాజ్యము స్త్రీలది. స్థిరాస్తి స్త్రీలది. ఒక స్త్రీయొక్క రాజ్యముగాని, స్థిరాస్తిగాని ఆమె తదనంతరము ఆమె యొక్క జ్యేష్ఠకూతురుకే సంక్రమించును, గాని కొడుకులకు సంక్రమించదు. మరియొక కూతురిని వారసుగా చేయుచు ఆ తల్లి మరణశాసనము వ్రాయవచ్చును. అటుల రాజ్యము గాని, స్థిరాస్తిగాని సంక్రమణముద్వారా హక్కును పొందిన స్త్రీ, ఆ స్త్రీని వివాహమాడిన భర్త, ఆమె పిల్లలు అనుభవింతురు. మరల ఆమె చనిపోగనే ఆ రాజ్యము, ఆ స్థిరాస్తి ఆమెయొక్క కూతుళ్ళకు మాత్రము సంక్రమించును. ఈజిప్టు రాజ్యము ఒక స్త్రీది. ఆమెను వివాహమాడిన పురుషుడు

ఫారో రాజు అగుచున్నాడు. ఆ భార్యతో కలసి ఫారో రాజు సింహాసన మధిష్టించును. వారి కొక కుమారుడు, ఒకకూతురు జన్మించగ ఆ రాజ్య మా కూతురునకు సంక్రమించుచున్నది. కుమారునకు రాజ్యము లేదు. అందువలన ఆ కుమారుడు తన సోదరియగు ఆ కూతురిని వివాహమాడి ఫారో రాజయ్యెను. రాజ్యము తమ కుటుంబములో నుంచి పరాయి కుటుంబము లోనికి పోకుండగను, రాజవంశములు సూర్యునివంశములై శ్రేష్ఠమైనవి గనుక వారి రక్తము అపరిశుద్ధముగాకుండగను, సోదర సోదరీ వివాహములు ఈజిప్టు రాజవంశములలో తప్పక జరిగినవి. వారి ప్రధాన దేవతయైన ఒసిరిస్ తన చెల్లెలగు ఐసిసును వివాహమాడియున్నాడు. అందువల్ల సోదర సోదరీ వివాహములు పవిత్రములైనవి. ఎక్కువమంది కుమాళ్లున్నచో ఏ కుమారుడు ఫారో కావలెనో తండ్రియే నిర్ణయించి అతనికి రాజ్యమునకు వారసత్వముగల తన కూతురునిచ్చి వివాహము చేయును. వారిద్దరికి కొన్ని వేళల తనభార్య యిష్టముమీాద రాజ్యమును తమజీవితకాలములోనే నప్పగింత చేయవచ్చును. ఒకప్పుడు ఆమోన్ దేవతయొక్క పూజారియే ఆ కుమాళ్లలో నొకరిని ఫారోగా నిర్ణయించును. అంతేగాక ఒక్కొక్క పుడు తండ్రి - కూతురి వివాహములుకూడ జరిగినవి. ఒక ఫారో రాజు గలడు. ఆయనయొక్క భార్యవలన ఆయన కా రాజ్యము వచ్చినది. భార్య చనిపోయినది. కొడుకులు లేరు. కూతుళ్లు మాత్రము గలరు. ఆ కూతుళ్ళలో పెద్ద కూతురి కా రాజ్యము సంక్రమించినది. ఆయన ఆ పెద్దకూతు రిని వివాహమాడి తన రాజ్యమును ఫారో హోదాను నిలుపు

కొనును. లేకపోయినచో వరాయికుటుంబమునుంచి యొక అల్లుడు వచ్చి ఆయన రాజ్యమునకు ఫారో అగును. మిగత కూతుళ్లనుకూడ రాజవంశములోని బంధువులకే వివాహము చేసిరి. పినతండ్రులు, పినతండ్రి పెత్తండ్రికొడుకులు, పినతల్లి పెత్తల్లి కొడుకులు, మేనమామల మేనత్తలకొడుకులు మొదలగు సమీప రక్తబంధువులు అట్టి ఆడపిల్లలను వివాహమాడెదరు. రాజ్యవారసురాలగు స్త్రీ ఫారోయొక్క గొప్ప రాణి. ఆయనకు మరికొంతమంది భార్యలుండవచ్చును. ఒకొక్కప్పుడు ఎక్కువమంది సోదరీలనుగాని కూతుళ్లనుగాని వివాహమాడిన యుదాహరణములుగూడ గలవు. పదునెనిమిదవ రాజవంశమునకు చెందిన హాట్ సెపుసటు రాణి రాజ్యమునకు హక్కుదారురాలు. ఆమెను తండ్రియగు మొదటి థోథ్‌మెస్ వివాహమాడి ఫారో అయ్యెను. ఆయన చనిపోగానే రెండవ థోథ్‌మెస్ ఆమెను వివాహమాడి ఫారో అయ్యెను. ఆయనకు పిమ్మట ఇరువదియేండ్ల వయసుగల మూడవ థోథ్‌మెస్‌కూడ ఆమెనే వివాహమాడి ఫారో అయ్యెను. వీరిద్దరు ఆమె కుమాళ్లు గారు. ఆమోన్ దేవత యొక్క పూజారివలన నిర్ణయించబడినవారు. ఆమె చనిపోయిన పిమ్మట ఆమెకును మూడవ థోథ్‌మెస్‌కును పుట్టిన కూతురగు హాట్ సెపుసెట్ వారసయినందున ఆ ఫారో రాజు తన కూతురగు హాట్ సెపుసెట్‌ను వివాహమాడి తన రాజ్యమును ఫారో పదవిని నిలుపుకొనెను. వారసురాలైన అక్క ఎంత పెద్దదైనను చిన్నవాడైన తమ్ముణ్ణి వివాహమాడవలసినదే. అన్న ఎంతపెద్దవాడైనను వారసురాలగు చిన్న

చెల్లెలిని వివాహమాడవలసినదే. రాజ్య మితరులకు పోగూడ దను సిద్ధాంతమే దీనికి కారణము. ఈ ఆచారము ఫారోలకు పిమ్మట ఈజిప్టునేలిన టాలమీ రాజులచేతకూడ నవలంబించ బడినది. అటుపిమ్మట వచ్చిన రోమను రాజులకాలములో ఆర్యులపద్ధతిని రాజ్యము ఆస్తి పురుషుల ద్వారానే వారసత్వ ముగ సంక్రమించు పద్ధతి ఏర్పడియుండినందున సోదర సోదరీల, తండ్రి కూతుళ్ల వివాహములు రద్దుచేయబడెను. హిందూ లా వలెను, క్రైస్తవ లా వలెను మరీ సన్నిహిత రక్తసంబం ధముగలవారిలో వివాహము నిషేధించబడి దూరముగనున్న నెవరినైన వివావాహము చేసుకొను పద్ధతి ఏర్పడెను. ఇటు లనే యూదుల దేశములోకూడ సోదర సోదరీ వివాహములు, తండ్రి కూతురి వివాహములు జరుగుచుండెనని, బైబిలు యొక్క పాత నిబంధనలో చెప్పబడినది. పాత నిబంధనలోని 1 రాజులు, 15 అధ్యాయము 2, 10 శ్లోకములలో చెప్పబడి నటుల 'దావీదు' రాజుయొక్క కుమార్తెయగు 'టామరు' తన సోదరుడగు 'అబ్సాలమును' వివాహమాడెను. వీరిద్దరికి జన్మించిన కూతురగు 'మాకా' దావీదు రాజ్యమునకు వారసు రాలయ్యెను. ఈమెను సోదరుడగు 'రెహంబోము' పెండ్లి యాడి రాజ్యము ననుభవించెను. వీరిద్దరికి 'అబిజాము' అను కుమారుడు పుట్టెను. తర్వాత చాలకాలమునకు పురుషుల ద్వారానే వారసత్వము సంక్రమించుపద్ధతి ఆర్యులపద్ధతినే ఆ దేశములోకూడ నెలకొల్పబడి ఈ పాడు ఆచారము రద్దు పరచబడెను. ఫారోరాజులలోకూడ కొంతమంది అపు డపుడు తమ రాజ్యమును కుమార్లకే సంక్రమింపచేసిరి.

కాని ఎక్కువ ఫారో రాజవంశములు కూతుళ్లకు సంక్రమించు పద్ధతినే అమలుజరిపిరి.

హిందూ వేదములలో, స్మృతులలో, సూత్రములలో సోదర, సోదరీల మధ్య వివాహములు ఖచితముగ నిషేధింపబడినవి. జ్ఞాతులను కాని, రక్త సమీప బంధువులను కాని వివాహమాడరాదని శాసించబడినది. ఐనను బౌద్ధ జాతక కథలలో తమ రక్తము అపరిశుద్ధముకాకుండ ఇక్ష్వాకువంశములో ఒకసారి సోదర సోదరీ వివాహములు జరిగినట్లును, ఆ వివాహములకు పుట్టినవారే బుద్ధభగవానుని పూర్వీకులైన 'శాక్య' వంశీకులని చెప్పబడినది. దీనినిగురించి బుద్ధఘోషుడు 'మహావస్తు' అను బౌద్ధ గ్రంథమునకు రచించిన తన వ్యాఖ్యానములో నిటుల వ్రాసినాడు:

"కోసలదేశరాజులైన "ఒక్కాకు" (ఇక్ష్వాకు) వంశమునకు చెందిన "భట్ట" రాజుకు మొదటి భార్యవలన నలుగురు కుమాళ్లు, ఐదుగురు కుమార్తెలు జన్మించిరి. ఆమె మరణించిన పిమ్మట ఆయన రెండవసారి మిగుల సుందరమైన యువతిని పెండ్లియాడెను. ఆమెకు 'జంటు' అనుపేరుగల కుమారుడు పుట్టెను. ఆమె తన కుమారుడైన జంటుకు రాజ్యమిచ్చి తన సవతికుమాళ్ళను, కుమార్తెలను వెడలగొట్టమని కోరగ ఆయన అందుకు సమ్మతించి వారికి కొన్ని రథములను, ఏనుగులను, గుర్రములను, ఆభరణములను ఇచ్చి ఎనిమిదిమంది మంత్రులను వెంటనిచ్చి తన రాజ్యమునుండి వెడలగొట్టెను. వారందరు హిమవత్పర్వత ప్రాంతములకు పోయి యొక నూతన నగరమును నిర్మించుకున్నారు. అదియే

"కపిలవస్తు నగరము". బుద్ధభగవానుని తండ్రియగు శుద్ధోధనుని రాజధాని. అప్పుడు ఆ రాజకుమారుల వివాహములనుగూర్చి మంత్రులు దీర్ఘముగ నాలోచించిరి. వారి రాజకుటుంబ రక్తము అపరిశుభ్రము కాకూడదు. ఇతర రాజకన్య లెవరును సిద్ధముగ లేరు. కావున ప్రథమ సోదరిని తల్లి వరుసక్రింద విడిచిపెట్టి, మిగిలిన నలుగురు సోదరీలను నలుగురు రాజకుమారులు వివాహమాడునట్లు నిశ్చయించిరి. ఆ వివాహములకు పుట్టినవారే శాక్యవంశపురాజులు. వీరు 'బెనారెసు' రాజయిన రాముని వంశమునకు చెందిన కొలియనులతో వివాహమాడిరి. ఇటుల 'శాక్య', 'కొలియను' వంశముల వివాహములవలన పుట్టినవారే బుద్ధభగవానుని పూర్వులు. బుద్ధభగవానుని తండ్రియగు శుద్ధోధనుడు శాక్య వంశపురాజు.

## (7)
## పిరమిడ్లు

ఫారోరాజులు 110 సంవత్సరములు జీవించవలెనని వాంఛించినప్పటికి మరణమునకు పిమ్మట తమకు, వేల సంవత్సరములే కాదు, శాశ్వతముగ నివసించుటకు కావలసిన నివేశనము బహుసౌఖ్యముగను, శోభాయమానముగను నుండవలెననుభావముతో తమ శవములను దాచిపెట్టుటకు గొప్ప గొప్ప గోరీలను, పిరమిడ్లను కట్టించిరి. అంతేగాక తాముకట్టించిన గోరీలు, పిరమిడ్లు, దేవాలయములు, నిర్మించెడు విగ్రహములు శాశ్వతముగనిలచియుండి సర్వకాలములలోను తమ పేరు

ప్రతిష్ఠలను స్థిరముగా నెలకొల్పవలెననికూడా వారి యుద్దే శ్యము. వారు నిర్మించిన పిరమిడ్లలోను, దేవాలయముల లోను, విగ్రహములలోను ఆ దేశపు ప్రాచీన శిల్పకౌశలము యొక్క మహోన్నతస్థితి మూర్తీభవించినది. వీటిలో చాల భాగము వేలసంవత్సరముల నుంచి నేటివరకును మంచిస్థితిలో నిలచియుండి ప్రపంచములోని వింతలుగ నెంచబడుచు యాత్రి కులను తండోపతండములుగ ప్రతిదినము నాకర్షించుచున్నవి. మొదటి రెండువంశముల ఫారో రాజులు ఎండలో ఎండిన ఇటుకలతో విశాలమైన సుందరమైన గోరీలను కట్టించిరి. వాటికి మస్తబాలని పేరు. మూడవ రాజవంశమునకు చెందిన జోసెరు ఫారో క్రీస్తుపూర్వము—4,186వ సంవత్సర ప్రాంత మున తన రాజధానియైన మెంఫిసు నగరమునకు ముప్పదిమైళ్ల దూరమున నున్న సక్కారావద్ద రెండువందల అడుగుల ఎత్తు గల గొప్ప పిరమిడును కట్టించెను. అదియే ఈజిప్టు చరిత్రలో మొదటి పిరమిడు. అది నైలునదికి పశ్చిమమున ఆరుమైళ్ళ దూరమున నున్న ఎత్తయిన స్థలములో నున్నది. దానికి ఖాళీస్థలము చుట్టును నిర్మింపబడిన గోడయొక్క పొడుగు ఒక మైలు కలదు. ఇట్టి అతి విశాలమైన స్థలములో ఈ గొప్ప పిరమిడు తళతళలాడెడు మిక్కిలి నాజూకైన తెల్లసున్నపు రాతితో నిర్మింపబడినది. మరియు ఈ పిరమిడుచుట్టు ననేక మైన సౌధములు, దేవాలయములు కౌయ్యాతో నతి రమ్యా ముగ నిర్మింపబడినవి. ఒక పిరమిడుపైన మరియొక పిరమిడు అంతస్థులుగ కట్టబడినందున దీనికి మెట్లపిరమిడు అని పేరు. దీనికి ఏడు అంతస్థులు గలవు. భూమిలోపలకూడ నొక అంతస్థు

కలదు. దీనికి అడుగుభాగము 411 అడుగుల పొడుగు 358 అడుగుల వెడల్పు గలిగి పైకి పోయినకొద్ది కోనగ తేలినది. అనేకమైన సావిడులను, గదులను కలిగియున్నది. వాటి గోడలన్నియు సుందరముగ నలంకరించబడినవి. వాటిమీద అందమైన చిత్తరువులు కలవు. ఈ ఎత్తయిన పిరమిడు కేర్పాటు చేయబడిన మెట్ల వరుసలు ఫారో రాజును ఆకాశమున నున్న స్వర్గమునకు తీసుకొనిపోవునని ఎంచబడెను. దీనిని నిర్మింప చేయుటలో జోసెరు ఫారోయొక్క మంత్రిశేఖరుడగు ఇమ్హోటెపుయొక్క మేధాశక్తి అత్యంతముగ గోచరమగుచున్నది. ఆయన శిల్ప, జ్యోతిష, వైద్యశాస్త్రములలో అసాధారణ పాండిత్యము గలవాడు. గొప్ప విద్యాపోషకుడు. దేశమునకు ఐశ్వర్యమును, నాగరికతను, కళాసంపదను, సుపరిపాలనమును కలుగజేసినవాడు. ఈ మంత్రిపుంగవుని ఈజిప్టు దేశీయులు మహాపురుషుడుగ నెంచుచుండిరి. ఈ మెట్ల పిరమిడు ప్రపంచములో అచ్చమైన రాతితో కట్టబడిన సౌధములలోకెల్ల మిగుల గొప్పదని, సుందరమైనదని చరిత్రకారులు వ్రాసియున్నారు. పిరమిడ్లన్నియు నైలునదికి పడమరవైపుననే యున్నవి.

మూడవ రాజవంశములో ఆఖరు రాజగు స్నెఫ్రూ ఫారో క్రి.పూ. 4000 సంవత్సర ప్రాంతమున మేడెములోను, దాషూరులోను పిరమిడ్లను కట్టించెను. మేడెములోని పిరమిడులోనే ఈ రాజుయొక్క ఈయన భార్య నెఫ్రెటు రాణియొక్క రాజకుమారులయొక్క శవము లుంచబడెను. ప్రతి పిరమిడులోను మరణించినవారి శవములను భూస్థాపితముచేయుటకొక

ప్రత్యేక గది గలదు. మరణించినవారి శవములో నుంచి కొన్ని లోపలభాగములను తీసి శవమును ఎండబెట్టి పిమ్మట కొన్నిదినములు తైలములలో నూరవేసి క్రుళ్ళి పోకుండ మమ్మీగ శాశ్వతముగ నిలచియుండునట్లు గావించి దానికి సరిపోవు పెట్టెలో పెట్టబడి ఆ గదిలో భూస్థాపితము చేయుచుండిరి. శవములు శాశ్వతముగ నిలచియుండునట్లు గావించు విద్య ఈజిప్టుదేశములో మూడవ రాజవంశకాలము నుండి ప్రారంభమై క్రీ. శ. అయిదు ఆరు శతాబ్దములవరకు ప్రబలెను. ముందుగ రాజుల, రాజబంధువుల శవము లటుల నిలవయుంచబడెను. పిమ్మటది సామాన్య ప్రజలలోకూడ వ్యాపించెను. కొన్ని శతాబ్దములకు పిమ్మట అటుల మమ్మీ లుగ గావించి నిలువయుంచబడిన శవములను గోరీలలో నుంచి తీసి ఈజిప్టులోని చిత్రవస్తు ప్రదర్శనశాలలో చెక్కు చెదరకుండ భద్రపరచినారు. నేటికిని వాటి నచ్చట చూడ దగును. ఇది ఆ దేశములోని యొక ప్రత్యేక విశేషము. స్నెఫ్రూ ఫారో మేడెములో కట్టించిన పిరమిడు 720 అడుగుల ఎత్తయినది నాలుగు అంతస్తులు గలది. శిల్ప నిర్మాణ ములో అత్యంత శోభాయమానమైనది. రాతికి బదులు కొయ్య, సున్నముకూడ వాడబడెను. జీవకళలు ఉట్టిపడునట్లు రమ్యమైన విగ్రహములు చెక్కబడెను. దీని ప్రక్కన అంద మైన దేవాలయములుకూడ కట్టబడెను. దాషుర్ లో నిర్మించ బడిన పిరమిడుకూడ మిగుల సుందరమైనదే. దీని ఎత్తు 526 అడుగులుండెను. క్రిందిభాగముయొక్క పొడుగు వెడల్పు కూడ 719 అడుగులుండెను. దీనిపేరు 'ఖే' అనగ ప్రాతఃకాల

మున నుదయించిన సూర్యుని యుజ్వలనము అని అర్థము. మరి యిద్దరు రాకుమారుల శవములు దీనిలో నుంచబడెను.

ఈయనకు పిమ్మట రాజ్యముచేసిన నాలుగవ వంశ స్థాపకుడగు ఖూఫూ ఫారో క్రీ.పూ. 3,990వ సంవత్సర ప్రాంత మున 'గైజే'లోని మిక్కిలి అద్భుతమగు గొప్ప పిరమిడును నిర్మాణము గావించెను. ఈయనను ఛియొప్సు ఫారో అని కూడ పిలచెదరు. ఈయన నిర్మాణము గావించిన పిరమిడు అన్ని పిరమిడ్లలో శ్రేష్ఠమైనది. ఈ పిరమిడుయొక్క క్రింది భాగము పదమూడు ఎకరముల భూమిని ఆక్రమించినది. దీని ఎత్తు 490 అడుగులు కలదు. ఈ పిరమిడులోని రాజ దర్బారు హాలులు గదులు చాల విశాలమైనవి. దీనిలోని చిత్తరువులకు మేర లేదు. దీనిలో అనేక కొయ్య రాగి సామా నులే గాక చాందినీలు, పరుపులు, బంగారు కుర్చీలు, మంచ ములు కూడ అమర్చబడెను. రత్నములు చెక్కిన బంగారు నగలుకూడ నుంచబడెను. దీని నిర్మాణమునకు ఒక లక్ష మంది పనివాండ్రను 20 సంవత్సరములు నియమించెనని హెరుడోటసు అను గ్రీకు చరిత్రకారుడు వ్రాసియున్నాడు. నెపోలియను చక్రవర్తి ఈజిప్టుపై దండెత్తివచ్చినపుడు ఈ పిరమిడు క్రింద కూర్చొని దీనికొరకు ఖర్చైన రాతిని లెక్క వేసి, ఇది ఫ్రాన్సు దేశము చుట్టు పదిఅడుగుల ఎత్తు ఒక అడుగు మందముగల గోడ పెట్టుటకు సరిపోవునని అంచనా వేసెను. దీని రాతి చెక్కడపు పనితనము వర్ణనాతీతముగ నున్నదని నవీనచరిత్రకారులు వ్రాసినారు. ఈ రాజు నైలునది వరద లలో నున్న కాలములోనే ఈ లక్షమంది కార్మికులకు ఏటేట

పని కల్పించుటకే నిర్మాణమునందు వినియోగించెననియు వీరి కందరకు భోజనవసతులు సంతృప్తికరముగ నేర్పాటుచేసె ననియు వ్రాసినారు. మిగతకాలములో మితమైనసంఖ్యగల పనివాండ్రను మాత్రమే నియమించెను. గైజే ఎత్తుప్రదేశ మున నున్నది. దాని క్రిందనే మెంఫిసు నగరరాజ ముండెను. ఈ రాజు ఇచటనే ఇంకను ఐదు మిగుల రమ్యమైన పిరమిడ్లను కట్టించెను. ఈయనకు పిమ్మట రాజ్యముచేసిన ఖాఫ్రా, మెన్‌కౌరా రాజులుకూడ గైజేలో ఇంక రెండు పిరమిడ్లను కట్టించిరి. ఐదవ వంశమువాడగు మెన్‌ఖేరే ఫారోకూడ ఇచ టనే మరియొక పిరమిడును కట్టించెను. ఇటుల తొమ్మిది పిరమిడ్లు ఒకచోటనే యున్నందున 'గైజే' ప్రాంతము పిర మిడ్లను చూచుటకు పోవుచున్న యాత్రికులకు నేటికిని ముఖ్య స్థానముగ నున్నది.

అయిదవ వంశమునకు చెందిన యూజర్ కాఫ్, ఐసెసి, యూనాస్ ఫారోలును, ఆరవవంశపువారైన టేటి, మొదటి పేపి, మేరెన్ రా, రెండవ పెపీ ఫారోలును, 'సక్కా రా'లోనే తలా యొక గొప్ప పిరమిడును కట్టించిరి. వాటి తోపాటు సుందరమైన దేవాలయములనుకూడ నిర్మాణము గావించిరి. మరియు ఐదవవంశపు రాజులగు సాహురా, నెఫెరిర్కారా, నెఫెరెఫ్రా, నియూసెర్రా ఫారోలు 'అబూ సిరులో' తలా యొక పెద్ద పిరమిడును దానితోపాటు అంద మైన దేవాలయమును నిర్మాణము గావించిరి. ఇటుల అయిదు ఆరు రాజవంశముల కాలములో పిరమిడుల దేవా లయముల నిర్మాణము ప్రసిద్ధిగనెను. ఏడు మొదలు

పదకొండువరకు వంశముల ఫారోలు బలహీనులైరి. సామంత ప్రభువుల ఆధిపత్యము ప్రబలెను. పదకొండవ వంశమునకు చెందిన నెట్-హెటిప్-రా-మెంతూహెటెప్ ఫారోరాజుమరల దేశమునంతను స్వాధీనపర్చుకొని సుస్థిరప్రభుత్వమును నెల కొల్పి దేశమునకు సిరిసంపదలను, వైజ్ఞానిక కళాభివృద్ధిని కలుగ చేసెను. ఈ చక్రవర్తి థీబ్సులో రాజధాని నేర్పరచు కొనెను. ఈయన డైరియాల్ బహారీలో నొక పిరమిడును కట్టించెను. ఈయనకు పిమ్మట రాజ్యమునకువచ్చిన పన్నెం డవ రాజవంశముకూడ థీబ్సులో రాజధాని నేర్పరచుకొని దేశమునకు శాంతిని అభివృద్ధిని సుపరిపాలనను కలుగచేసి చరిత్రలో చాల సుప్రసిద్ధులైరి. వీరి కాలములో 'లీష్టు'వద్ద రెండు పిరమిడ్లు, దాహష్రూరువద్ద మూడు పిరమిడ్లు, ఇల్లా హున్‌వద్ద నొక పిరమిడు, హవారావద్ద నొక పిరమిడు, మజ్‌ఘునావద్ద రెండు పిరమిడ్లు, నిర్మించబడెను. మజ్‌ఘునా లోని యొక పిరమిడు నిర్మాత సెబెక్ నెఫ్రూ రాణి అయ్యు న్నది. ఇంతటితో పిరమిడ్లకాలమయిపోయెను. అన్నికాల ములలో పిరమిడ్లకు సమీపముననే దేవాలయములుకూడ నిర్మింపబడెను. పిమ్మట చాలకాలమునకు పదునెనిమిదవ వంశ స్థాపకుడగు మొదటి అమ్ హోసు ఫారో మాత్రము అబిడా సులో నొక చిన్నదగు పిరమిడును నిర్మాణము గావించెను. ఇదియే ఈజిప్టుదేశములో ఆఖరు పిరమిడు. పిరమిడ్లలో పైకి ఎక్కిపోయిన కొలదియు చెట్లవరుసల ప్రక్కన మిగుల అంద మైన గదులు కట్టబడినవి. గదులలో అద్భుతమైన చిత్రములు చిత్రించబడినవి. గోడలమీద మంత్రములను నీతివాక్యము

లను చాలగ (pyramid texts) వ్రాసిరి. మరణించినవారికి జీవితములో అభిరుచి కలిగిన బొమ్మలు చిత్రించబడినవి. శిల్పకళాకౌశలమును ప్రదర్శించు పుష్పగుచ్ఛములు, లతలు, పక్షులు, మృగములు, మానవులు, దేవతలు మొదలగువాటి చెక్కడములకు మితమేలేదు. మరణించినవారికి సరియైన భోజనపదార్థములు, పరుండు మంచములు, కుర్చీలు, సోఫాలు, వారి బంగారు నగలు మొదలైనవన్నియు ఈ గదులలో నుంచబడినవి. మరణించిన రాజుల వేటలు, రాజ్యవ్యాపకము, వృత్తులు, పరిశ్రమలు మొదలైనవికూడ చిత్రించబడెను. మరణించినవారి శవములను మమ్మీలుగ గావించి శవపుపెట్టెలలో పెట్టి పిరమిడ్లలోని ప్రత్యేక గదులలో భూస్థాపితము గావించిరని చెప్పియున్నాము. అటుల నుంచబడినవారి వంశీకులు, మతగురువులను తెచ్చి మంత్రములు చదివించి మాసవారి సాంవత్సరిక తద్దినములు పెట్టి ఆరాధనను గావించి మంచి భోజనమును బొక్కలలోగుండ లోపలపడునట్లు సమర్పించి మరణించివారి ఆత్మలు ఉపవాసము చేయకుండ కాపాడిరి. పిరమిడ్ల, గోరీల నిర్మాణముతోపాటు పూర్వీకుల ఆరాధనకై తద్దినములకొరకు భూవసతినికూడ ఏర్పాటుచేసియుండిరి.

## (8)

## కొండలు తొలచుట, శిలావిగ్రహములు

పన్నెండవ రాజవంశమునుంచి కొండలలో శిలావిగ్రహములు, గోరీలు, దేవాలయములు చెక్కబడెను. 'ఆర్చి' (వంపు)గా కట్టుపద్ధతి అవలంబించబడినది. మిగుల అందమై

నట్టియు, నాజూకైనట్టియు వస్తువులను తయారుచేయుటకు సున్నపురాతిని యుపయోగించిరి. ఫారో మొదటి సెను సర్టు యొక్క మిక్కిలి ఎత్తైన శిలావిగ్రహము సున్నపురాతితో కట్ట బడినది. ఫారో రెండవ ఆమొనంహాటుయొక్క విగ్రహము కూడ పసుపుపచ్చని సున్నపురాతితో నిర్మింపబడినది. నఫెర్ ఔటి రాణియొక్క మిక్కిలి సుందరమైన ముఖము సున్నపు రాతితో నిర్మింపబడి నేడు జర్మనుమ్యూజియములో నున్నది. బెనిహాసన్‌వద్ద కొండలో తొలచబడిన ప్రసిద్ధికెక్కిన శిల్పములు కూడ థీబ్సువంశపురాజులచే నిర్మాణము గావించబడినది. ఆ శిల్పకట్టడములమీద దేశములో ప్రబలియున్న బట్టలనేత, తోలుపనులు, బంగారుపనులు, కొయ్యసామానులు, యుద్ధపరి కరములు, కొన్నిపంటల వ్యవసాయము, మొదలగునవి తయారు చేయు విధములు, మొదటినుంచి తుదివరకు ప్రత్యేకముగ చిత్రిం చబడినవి. నాలుగవ ఆమొ నంహాటురాజుకు పిమ్మట అతని సోదరి సెబెక్ నెఫ్రూరాణి చక్కగ రాజ్యమును పాలించెను. ఆమెకూడ కళాసంపదను పోషించెను. నైలునదియొడ్డున ఇబను ఎల్ ముల్కు వద్ద కొండలలో తొలచబడిన గోరీలు పదునెని మిదవ రాజవంశపు ఫారోలకాలపు శిల్పకళా కౌశలముయొక్క ప్రతిభను చాటుచున్నవి.

## స్ఫి న్ క్సు (Sphynsc)

ఈజిప్టుదేశములో నేటికిని ప్రపంచమునకు అత్యాశ్చ ర్యమును కలుగచేయుచున్న విగ్రహము, స్ఫిన్‌క్సు అను అతి గొప్పవిగ్రహము. అది సుప్రసిద్ధ పిరమిడ్లుగల గైజె ప్రాంత

మునకు సమీపమున నున్న ఎడారిలో నున్నది. ఒక కొండను తొలచి సింహాకారముగా చేయబడినది. దానికి మానవుని తల చెక్కబడి ముఖము "మూడవ ఆమొనెంహాటు" ఫారోను బోలియుండునట్లుగా చేయబడినది. ఈ నరసింహ విగ్రహము మిగుల సుందరమైనదై చూపరులకు హృదయాకర్షముగ నున్నది. దీని పొడుగు 240 అడుగులు. ఎత్తు 66 అడుగులునై యున్నది.

## దేవాలయములు

మొదటినుంచి ఫారో రాజులు మిగుల సుందరమైన గొప్ప శిల్పచాతురిని ప్రదర్శించు దేవాలయములను కట్టించుచుండిరి. పిరమిడ్లతోపాటు దేవాలయములను కట్టించుట చూచియున్నాము. పిరమిడ్ల కాలమునకు పిమ్మటకూడ విశేషప్రసిద్ధినిగన్న దేవాలయములు నిర్మింపబడినవి. కొండలలో దేవాలయములు తొలచబడెను. అటుల తొలచబడిన దేవాలయములలోకెల్ల అత్యంత శోభాయమానమైనది 'అబుసింబలు' వద్ద పందొమ్మిదవ వంశమునకు చెందిన రెండవ రామెసెసు ఫారో నిర్మించినదై యున్నది. అన్ని దేవాలయములలో సౌందర్యమునకు,శిల్పచాతురికి ప్రసిద్ధికెక్కిన 'డేర్ ఎల్ బెహారీ' లోను, 'కార్నకు'లోను నిర్మింపబడిన గొప్ప దేవాలయములను రెంటిని పదునెనిమిదవ రాజవంశమునకు చెందిన హటుషెపుసటు రాణి కట్టించినది. ఆమె డేర్ ఎల్ బెహారీ దేవాలయములో తన దిగ్విజయయాత్రలను చిత్రింపచేసినది. ఆమెకు పిమ్మట రాజ్యము చేసిన మూడవ థోథ్ మెస్ ఫారో తన దిగ్వి

జయ యాత్రలను కార్నకు దేవాలయపు గోడలమీద చిత్రింప చేసెను. దీనిచుట్టు స్థలము అతి విశాలముగ నుండి ఒకగోడచే ఆవరించబడినది. ఆ ఆవరణములో నొక పవిత్రమైన గొప్ప సరస్సుకూడ గలదు. ఈ వంశమునకే చెందిన మూడవ ఆమెనుహోతెపు ఫారో 'లగ్జారు' వద్ద గొప్ప దేవాలయమును కట్టించెను. కార్నకు దేవాలయమునకు నూతనభాగములను చేర్చెను. కార్నకునుంచి లగ్జారువరకు పెద్దరోడ్డు వేయించి దాని కిరుప్రక్కలను చాలచోట్ల పొట్టేలు తలగల స్ఫిన్క్సులను కట్టించెను. పందొమ్మిదవ రాజవంశమునకు చెందిన మొదటి శెటిఫారో అబిదాసులో నిర్మించిన దేవాలయముకూడ గొప్పది. ఇరువదవ రాజవంశమునకు చెందిన మూడవ రామ్సెసు ఫారో 'మాడిసెటు హాబు' వద్ద గొప్ప దేవాలయమును కట్టించెను. ఇరువదియైదవ వంశమునకు చెందిన షబకా ఫారో గొప్ప దైవభక్తుడై యుండి ఈ అన్ని దేవాలయములను అభివృద్ధిచేసెను.

## ఫయూము

ఈజిప్టుయొక్క పడమరవైపు ఎడారులలో అనాదిసిద్ధమైన యొక చాలా పెద్ద నీళ్లునిలిచెడి లోయప్రాంతముండెను. దానికి ఫయూము అని పేరు. పన్నెండవ రాజవంశమునకు చెందిన మూడవ ఆమెనెంహాట్ ఫారో రాజు ఆ ప్రాంతమునంతను యొక గొప్ప తటాకముగ త్రవ్వించెను. దాని చుట్టు ఇరువదిమైళ్ళ పొడుగుగల ఎత్తుకట్టను వేయించి, నైలు నదిలోనుంచి దానికొక కాలువను త్రవ్వించి యొక గొప్ప

సరస్సుగ నిర్మించినాడు. నైలుయొక్క నీటిని అవసరము వచ్చినపుడు దానిలోనికి పోవునట్లును అవసరము లేనపుడు రాకుండ ఆపి యుంచునట్లును ఎక్కువైనపుడు బయటకు పంపుటకును తలుపులు పెట్టించినాడు. దానితో ఎల్లప్పు డును అవసరమైనంత నీరు నిలిచియుండును. దీనిక్రింద నలుబది చదరపుమైళ్ళ వైశాల్యముగల భూమి నీటిపారుదలక్రిందికి తేబడి సస్యశ్యామలముగ చేయబడినది. ఆ ప్రాంతములో ఈజిప్టుప్రజలు ప్రవేశించి గ్రామములు కట్టుకొని వ్యవసా యము చేసుకొని పంటలుపండించుకొని సుఖముగ కాపుర మున్నారు. ఆ తటాకముయొక్క నీటిలో మధ్యభాగమున నొక సుందరమైన పిరమిడు కట్టబడియున్నది. దానియొక్క అంత స్థులు నీటిఅడుగునను, నీటిపైననుకూడ గలిగి మిగుల ఆకర్ష ణీయముగ నున్నవి.

## లె బ రె న్తు

ఆ సరస్సుకు సమీపముననే హవారా ప్రాంతములో అతివిశాలమైన లెబరింతు అను అత్యాశ్చర్యకరమైన భవనము మూడవ ఆమెనెంహట్ ఫారో రాజుచే నిర్మింపబడినది. "పిర మిడ్లే వర్ణనాతీతముగ నున్నవి. వాటినన్నిటిని లెబరింతు మించి యున్నది" అని హెరాడోటస్ అను గ్రీకు చరిత్రకారుడు వ్రాసియున్నాడు. ఈ లెబరింతు ఎనిమిదివందల అడుగుల వెడల్పు, వెయ్యి అడుగులపొడుగు గలిగి కొన్ని అంతస్థులు గల సౌధముగనున్నది. దీనిలో పన్నెండు గొప్పసావడులును మూడు వేల ఐదువందల గదులును నిర్మింపబడెను. ఇది కొంత

కాలను యావత్తు ఈజిప్టుయొక్క రాజ్యపాలనమునకు సంబంధించిన ప్రభుత్వ కచేరీలకు కార్యస్థానముగ నుండెను. ఆకార్యస్థానము అచటినుంచి తీసివేయబడగనే దానిలో కార్మికులు వచ్చి కాపురముండసాగిరి. ఆ భవనము క్రమముగ క్షీణించి చాలవరకు శిథిలమైనది.

(౨)

## ఫారోల చరిత్రసంగ్రహము

సుమారు నాలుగువేల ఐదువందల సంవత్సరములు రాజ్యముచేసిన ఇరువదిఎనిమిది ఫారో రాజవంశముల చరిత్ర ఈ చిన్నపుస్తకములో క్లుప్తముగనైన వివరించుట అసాధ్యమైన పని. ఆ యా వంశముల రాజులు ముఖ్యముగ శిల్పనిర్మాణము విషయములో గావించిన మహాత్కార్యములను గూర్చి ఇదివరకే తెలిపియున్నాము. అందువలన కొన్ని ముఖ్యాంశములను మాత్రము ఈ అధ్యాయమునందు చెప్పుటతో తృప్తిచెందుచున్నాము. మొదటి ఆరురాజువంశములు, ఫ్లిండర్స్ పెట్రి పండితుని ప్రకారము, క్రీ. పూ. 4,777 వ సంవత్సరమునుంచి క్రీ. పూ. 3,3?5 వ సంవత్సరము వరకు శోభాయమానమైన పాలనము నెలకొల్పి సిరిసంపదలనిచ్చి శిల్పకళావైభవమును అత్యున్నతముగ పెంపొందచేసి ఈజిప్టుయొక్క ప్రతిష్ఠను నిలిపియున్నారు. ఆరవ వంశములో ఐదవవాడైన రెండవ పేపి ఫారో తొంబదినాలుగు సంవత్సరములు రాజ్యముచేసినందున ఆ దీర్ఘకాలములో సామంతప్రభువులు స్వతంత్రులై కోటలుకట్టుకొని కేంద్ర

ప్రభుత్వమును లక్ష్యముచేయక తమలో తాము కలహించి అరాజకమును కలుగచేసి ప్రభుత్వమును బలహీనపరచినారు. ఇందువల్ల ఈజిప్టుయొక్క సంపద, సుపరిపాలనము కొంత వరకు క్షీణించినది. విదేశీయులైన సిరియనులు ఈజిప్టు దేశములో కొంతభాగమును స్వాధీనపరచుకున్నారు. ఆయన పిమ్మట వచ్చిన ముగ్గురు ఫారో రాజులును నామమాత్రావశిష్టులై యుండిరి. దేశమునంతను తమక్రిందికి తెచ్చుకొని మంచిపాలనమును స్థాపించలేకపోయిరి. ప్రభువులు ఎక్కడివా వారక్కడ తమ తమ పాలనలను సాగించుచుండిరి. వీరికి తరువాత వచ్చిన ఏడు మొదలుకొని పదివరకు రాజవంశముల రాజులుకూడ బలహీనులుగనే యుండిరి. ఉత్తర దక్షిణ ఈజిప్టులు విడిపోయెను. క్షామము వ్యాపించెను. ప్రజలు కష్టముల ననుభవించిరి. ఇట్టి స్థితిలో పదకొండవ రాజవంశమునకు చెందిన రెండవ మెంటు హోటెప్ ఫారో రాజు యావత్తు ఈజిప్టుదేశమును తన క్రిందికి తెచ్చుకొని ప్రభువులను కొంతవరకు అణచివైచి దేశమునందు సురాజ్యమును స్థాపించెను. ఆశియాలోని కొంతప్రాంతమును న్యుబియాను, లిబియాను జయించి తన క్రిందికి తెచ్చుకొనెను. ఈయన ఏబదియొక్క సంవత్సరములు దృఢమైన రాజ్యపాలనము గావించెను. ఈయనకు పిమ్మట వచ్చిన ఈ వంశమునకు చెందిన ఇతర రాజులుకూడ చక్కగనే పాలనముచేసిరి. పిమ్మట సుప్రసిద్ధమైన పన్నెండవ రాజవంశము, మొదటి ఆమోనెంహాట్ ఫారో రాజుతో ప్రారంభమయ్యెను. ఈ వంశమువారు క్రీ. పూ. 2,778 వ సంవత్సరము మొదలు

క్రీ. పూ. 2,565 వ సంవత్సరమువరకు ఉజ్వలమైన రాజ్య పాలనము గావించిరి. వీరికి థీబ్సు వంశమని పేరు. ఈజిప్టు యొక్క సిరిసంపదలు, విజ్ఞానము, వాఙ్మయము, కళా సంపద, విదేశవ్యాపారము అన్నియు ఈ కాలములో వర్ధిల్లెను. వీరి కాలములో ఆశియాఖండములోనికి సైన్యములను పంపి పాలస్తీను, సిరియాదేశములపైన పాలనము నెలకొల్పిరి. సినాయ్‌నుండి రాగి మొదలగు లోహములు దిగుమతిచేయ బడెను. పరిశ్రమలు వృద్ధియయ్యెను. ఫయూమ్‌వద్ద గొప్ప తటాకము నిర్మింపబడెను. లెబరింతు కట్టబడెను. వీరిలో ఆఖరున పాలించిన సెబెక్ నెఫ్రూ రాణి సుప్రసిద్ధురాలై సుపరిపాలనమిచ్చెను. ఈమె మజ్‌ఘునాలో నొక గొప్ప పిరమిడును దానిప్రక్కన సుందరమైన దేవాలయమును కట్టించెను పిమ్మట పదమూడవ రాజవంశము ప్రారంభమయ్యెను. పదమూడు, పదునాలుగవ రాజవంశములు ప్రసిద్ధికెక్కినవి కావు. ఇవి క్రీ. పూ. 1928 వరకు సాగెను. పదిహేను పదహారవ రాజవంశములు నామమాత్రావశిష్టముగనుండి మిగుల బలహీనమైనందున వీరికాలమున క్రీ. పూ. 1928 వ సంవత్సరమున హిక్సాసులను యాదవవంశీయులగు విదేశ రాజులు ఈజిప్టును స్వాధీనపరచుకొని క్రీ. పూ. 1738 వరకు రాజ్యముచేసిరి. వారు అదివరకే ఈజిప్టులో ప్రవేశించి కొంత రాజ్యమును సంపాదించి రాజ్యపాలనముచేయుచు పిమ్మట ఈజిప్టు దేశమునంతను జయించిరి. వారు మెంఫిసును రాజధానిగ గలిగి అవారిలో గొప్పకోటను కట్టుకొనిరి. ఈ విదేశరాజులు అనాగరికులు, జ్ఞానశూన్యులు, క్రూరులు.

ఈజిప్టుదేశములోని చాల దేవాలయములను బ్రద్దలుకొట్టి నారు. పట్టణములను తగులబెట్టి హత్యలుగావించినారు. స్త్రీలను, పిల్లలను బానిసలుగ పట్టుకున్నారు. ఈ కాలమున ఈజిప్టు సర్వవిధముల క్షీణించెను.

ఈ యావత్తుకాలములో పదునేడవ రాజవంశమువారు థీబ్సు రాజధానిగ దక్షిణ ఈజిప్టులో చాలభాగముపైన రాజ్యము చేయుచునే యుండిరి. ఇంక కొంతమంది స్వదేశ ప్రభువులను కూడగట్టుకొని హైక్సాసులతో యుద్ధము సాగించిరి. ఈవంశములో మూడవవాడైన సెకెనెన్‌రీ ఫారో హిక్సాసులతో గొప్పయుద్ధము గావించి వీరస్వర్గమలంకరించెను. ఆయనకుమారుడైన కామోసీ ఫారో యుద్ధముసాగించి హైక్సాసుల నోడించెను. ఈయన పదునేడవ రాజవంశములో నాఖరువాడు. ఈయన సోదరుడగు మొదటి అహమసు ఫారో హిక్సాసులతో భూమిమీదను, సముద్రముమీదను యుద్ధముచేసి యోడించి వారి అవారికోటను పట్టుకొనగ వారు లోబడి ఈజిప్టును వదలి కుటుంబములతో కూడ సిరియాకు లేచిపోవుట కంగీకరించి ఆప్రకారము లేచిపోయిరి. ఈయనయే సుప్రసిద్ధ పదునెనిమిదవ రాజవంశస్థాపకుడు. ఈ వంశము వారి పాలనము ఈజిప్టుచరిత్రయందు స్వర్ణయుగమని పేర్గాంచినది. క్రీ. పూ. 1587 వ సంవత్సరమునుంచి క్రీ. పూ. 1375 వరకు ఈ వంశపువారగు పదునారుగురు ఫారోరాజులు ఈజిప్టునంతను ఏలి ఖ్యాతిని సంపాదించిరి.

ఈ రాజవంశమువారును, వీరికి తరువాత వచ్చిన 19, 20 రాజవంశములవారును, ఈజిప్టును బలమైన రాజ్యముగ

చేసి సిరిసంపదలలోను, రాజకీయ పలుకుబడిలోను చుట్టుపట్టు దేశములలోకెల్ల గొప్పదిగ నుండునట్లు గావించినందున ఈ కాలమునకంతకును కొత్తరాజ్యము (New Kingdom) అని పేరు పెట్టబడినది. ఈ కొత్తరాజ్యము క్రీ. పూ. 1102 వ సంవత్సరంవరకు బాగుగ సాగినది. ఈ యావత్తుకాలములో సైన్యము వృద్ధిచేయబడినది. రథములు, గుఱ్ఱములు ఉపయోగించబడినవి. ఈజిప్టుదేశముయొక్క రాజ్యము దక్షిణమున న్యూబియామీాదను, ఉత్తరమున సిరియా, పాలస్తీనులమీాదను స్థాపింపబడినది. ఈజిప్టుదేశపు సరిహద్దు యూఫ్రెటీస్ నది వరకు వ్యాప్తముచేయబడినది. ఈజిప్టుయొక్క ధనధాన్యములు వృద్ధియైనవి. గొప్ప దేవాలయములు విలసిల్లినవి. మమ్మీలకు తగిలించబడిన నగలకొరకు దొంగలు బొక్కలు చేసి మమ్మీలను వికలాంగముగచేసి బంగారమును దొంగిలించుచున్నందున వీరికాలములో మమ్మీలను తీసి భద్రముగ దాచినారు. పిమ్మట అవి కైరోలోని చిత్రవస్తు ప్రదర్శనశాలకు తీసుకొనిపోబడినవి. ఈ కాలములో శవములను మమ్మీలు చేయు విద్య ఎక్కువగ వృద్ధిచెందినది. దేశమునందు శిల్పకళ అభివృద్ధిచెందుటయే కాక విదేశములనుండి కూడ క్రొత్తక్రొత్త పనివాండ్రను రప్పించి పరిశ్రమలను, కళలను, చేతిపనులను వృద్ధిచేసిరి. చుట్టుపట్లనున్న బాబిలోనియా, క్రీటు, సైప్రస్, గ్రీస్, దక్షిణాఫ్రికా, పంటు, పశ్చిమఆసియా ఇండియా మొదలగుదేశములన్నిటితోడను వర్తకవ్యాపారములు అత్యంతముగ వృద్ధిచెందెను. పింగాణీ పరిశ్రమ, రాతిపాత్రలు, తోలుపనులు, మంచిగంధపుచెక్కతో

పనులు, బంగారముతో చేయబడి రత్నములు పొదుగబడిన ఆభరణములు, లోహపుపనులు, వడ్రంగము, రథముల, పడవల నిర్మాణము మొదలగునవి వృద్ధియై కళకళలాడుచుండెను. నీటిపారుదల, మురుగుకాలువలు వ్యాపింపచేయబడి వ్యవసాయ మెంతో వృద్ధిచెందెను. గోరీలమీదను, దేవాలయములమీదను చెక్కడములు, చిత్తరువులు నూతనశోభను దాల్చెను. థీబ్సులోని దేవాలముపైన హాట్ పెపు సట్ రాణి పంటుదేశముపై గావించిన దండయాత్ర మిగుల మనోహరముగ చిత్రించబడినది. రాజనగరులు మిగుల అందముగ గావించబడినవి. వాటిలోని శిల్పపుపనులు మిగుల సుందరముగ చేయబడినవి. వాటిచుట్టును పండ్లతోటలు, పుష్పోద్యానవనములు, సరస్సులు, స్నానపు కొలనులు నిర్మింపబడినవి. కచేరీలు, విద్యాలయములు అందముగ నిర్మాణము గావింపబడినవి. గొప్పగొప్ప దేవాలయములు నిర్మించబడినవి. పదునెనిమిదవ రాజవంశములోనివాడగు 'అఖేనటన్' ఫారో అదివరకు దేశములో ప్రబలియున్న ఆమోన్ విగ్రహారాధనపై తిరుగుబాటుచేసెను. మతగురువులను వెడలగొట్టెను. ఆయన వ్రాసిన లేఖలలో ఏకేశ్వరోపాసన వేదాంతము గోచరమగుచున్నది. ఆయన మిగుల సుందరమైన నెఫ్రూటిటి రాణిని వివాహమాడెను. ఆయన కవిత్వము నందు శ్రద్ధగలవాడు. కవిత్వమును వ్రాసెను, పోషించెను. ఆటేస్ అనుపేరున ఈశ్వరారాధనగావించవలెనని ప్రబోధము గావించెను. కాని ఆయనతోనే ఆయనమతము మృగ్యమయ్యెను. ఆయనకు పిమ్మట వచ్చినవారు ప్రాచీనదేవతల

ఆరాధనను మరల నెలకొల్పిరి. మతగురువులను ప్రోత్సహించిరి. దేవాలయములను వృద్ధిచేసిరి. పందొమ్మిదవ రాజ వంశమునకు చెందిన రెండవ రామ్సెసు చాల గొప్పవాడు. సిరియాలో జరిగిన తిరుగుబాట్లను అణచివేసి దేశములో పూర్తియైన శాంతిని నెలకొల్పెను. ఆయన తన రాజధానిని డెల్టాలోని 'టానిసు' పట్టణమునకు మార్చుకొనెను. థీబ్సు గొప్ప మతకేంద్రమయ్యెను. 'కార్నక్', 'లగ్జర్' దేవాలయములలో నూతనభాగములను కట్టించెను. ఇరువదియవ రాజ వంశములో 'సెట్‌నాక్‌టు' ఫారో మిగుల గొప్పవాడు. ఆయనకు పిమ్మట వచ్చిన మూడవ రామ్సెసుకూడ పేరు పొందినవాడే. పడవలలో వర్తక వ్యాపారములను వృద్ధిచేసెను. ఇరువదియవ రాజవంశమునాటికి మతగురువులు బలవంతులైరి. వారు వివాహమాడకూడదను నిషేధమును తొలగించుకొనిరి. థీబ్సులోనున్న ఆమోన్‌రీ దేవత మిగుల ప్రసిద్ధికెక్కెను. ఆమెయొక్క పూజారియగు మతగురువు దివ్యదృష్టి కలిగియున్నాడనియు, ఆయనద్వారా ఆ దేవత అన్ని ప్రశ్నలకు సరియైన సమాధానములు చెప్పుననే మూఢవిశ్వాసము రాజులలోను, ప్రజలలోను ప్రబలెను. ఆ పూజారి చెప్పిన చొప్పున రాజులుకూడ నడచుకొనసాగిరి. తుదకు మతగురువులలో ముఖ్యుడగు 'హరిహార' అనునతడు ఆరవ 'రామ్సెసు' ఫారోరాజుయొక్క కుమార్తెను వివాహమాడి క్రీ. పూ. 1102 వ సంవత్సరమున ఈజిప్టుసింహాసనము నధిష్టించి ఇరువదియొకటవ రాజవంశమును స్థాపించెను. ఈ మతగురువులపాలనము క్రీ. పూ. 952 వరకు సాగినది. వీరు

రాజ్యమును దృఢముగ నిలుపుకొనలేకపోయిరి. పిమ్మట ఈ మతగురువులపై ప్రజలు తిరుగబడిరి. అంతఃకలహములు చెల రేగినవి. దక్షిణ ఈజిప్టు విడిపోయెను. తుదకు ఇరువది రెండవ ఫారోరాజవంశస్థాపకుడగు 'షెషాంకు'ఫారో మత గురువులను వెడలగొట్టి అల్లరులను అణచి యావత్తు ఈజిప్టు పైనను రాజ్యమును స్థాపించెను. ఈ వంశమువారు క్రీ.పూ. 952 వ సంవత్సరము మొదలుకొని క్రీ. పూ. 749 వ సంవత్సరము వరకు బాగుగనే రాజ్యముచేసిరి. ఈ 'షెషాంకు' ఫారో తనకుమార్తెను జెరూసలేములోని యూదుల రాజగు 'సాలమన్' కిచ్చి వివాహముచేసెను. పిమ్మట వచ్చిన ఇరువదిమూడు, ఇరువదినాలుగు, ఇరువదియైదు, ఇరువదియారవ రాజవంశములవారు క్రీ. పూ. 525 వరకు రాజ్యముచేసిరి.

## పర్షియనుల దండయాత్రలు

క్రీ. పూ. ఆరవశతాబ్దములో పర్షియా దేశపు పారసీకరాజగు సైరసు విజృంభించి ప్రక్కనున్న దేశములను జయించి తన రాజ్యమును విస్తరింపజేసెను. అతని కుమారుడగు 'కాంబిసెసు' క్రీ. పూ. 525 వ సంవత్సరమున ఈజిప్టుపై దండయాత్రచేసి లోబర్చుకొనెను. మతసహనము లేనివాడై 'మెంఫిసు'లోను 'థీబ్సు'లోను నున్న దేవతలవిగ్రహములను బ్రద్దలుకొట్టించెను. రెండుసంవత్సరములలోనే యాతడు మరణించెను. క్రీ. పూ. 404 వ సంవత్సరమున ఈజిప్టు ప్రజలు 'ఆమిూరిటయసు' ఫారోక్రింద పర్షియనులను వెళ్ళగొట్టి మరల ఫారోల రాజ్యమును స్థాపించిరి. 28 వ వంశపు

రాజగు మొదటి నెక్టనెబో గొప్పరాజు. ఈతనికాలమునసము ద్రవర్తకము దూరదేశములకుకూడ వృద్ధియయ్యెను. శిల్పము ప్రోత్సహించబడెను. కాని పర్షియనులు విడువకుండ ఈజిప్టుపైకి దండయాత్రలు సలుపుచుండిరి. ఈజిప్టుయొక్క ఆఖరు ఫారో రెండవ నెక్టనెబో క్రీ.పూ.341వ సంవత్సరమున పర్షియనులచేత నోడిపోయి దేశమును విడిచి అబిసీనియాకు పారిపోగా మరల దేశము కొంతకాలము పర్షియనుపాలనము క్రిందికి వచ్చెను.

## అలెగ్జాండరు చక్రవర్తి

క్రీ. పూ. 332 వ సంవత్సరములో గ్రీసుదేశములోని మాసిడోనియా రాజగు అలెగ్జాండరు చక్రవర్తి తన ప్రపంచ దిగ్విజయయాత్రలో ఈజిప్టుపై దండెత్తి 'ఇస్సను' యుద్ధములో పర్షియనుల నోడించి, ఈజిప్టును స్వాధీనమును పొందెను. ఈజిప్టు ప్రజలు అలెగ్జాండరుకు గొప్ప స్వాగత మిచ్చిరి. అలెగ్జాండరు అప్పటికి రాజధానిగ నున్న మెంఫిసు నగరములో ప్రవేశించెను. సూర్యుని కుమారుడగు ఫారో అను బిరుదముతో కిరీటధారణము గావించి సింహాసనాసీనుడయ్యెను. 'శివా' అను ప్రదేశములోనున్న ఆమెను దేవతను దర్శించి ఆయనయొక్క ఆశీర్వచనమును పొందివచ్చెను. ఆ ప్రాంతముననే అలెగ్జాండ్రియా అను తన నూతన రాజధానిని నిర్మించెను. 'ఐసిస్' దేవతకొక దేవాలయమును కట్టించెను. క్రీ. పూ. 331 వ సంవత్సరములో ఈజిప్టును విడిచి తూర్పుదేశముల విజయముకొరకు వెళ్ళి మరలిరాలేదు. ఆతని గవర్నరగు టాలమీ ఈజిప్టును పాలించసాగెను. ఇంతటితో ప్రాచీనరాజులగు ఫారోలరాజ్య మంతరించెను.

# ఈజిప్టుదేశ చరిత్ర

## రెండవ అధ్యాయము

### టాలమీరాజులు - రోమనులు

### (1)

### టాలమీరాజులు

క్రీ. పూ. 323—క్రీ. పూ. 31

### మొదటి టాలమీ సోటరురాజు

క్రీ. పూ. 323వ సంవత్సరమున అలెగ్జాండరు చక్రవర్తి బాబిలోనులో జ్వరముచే మరణించెను. రెండవటాలమీ కాలములో ఆయనశవము ఈజిప్టు కపుడు రాజధానిగనున్న అలెగ్జాండ్రియాపట్టణమునకుతీసికొనివచ్చిసమాధిచేయబడెను. దానిపైన శిల్పచాతురిగల గొప్ప గోరీ కట్టబడెను. అలెగ్జాండరుయొక్క సవతిసోదరుడు, అలెగ్జాండరుకు పారసీకభార్య వలన కలిగిన మొగశిశువు- ఇద్దరు వారసులు. కాని వీరినిద్దరిని రాజ్యములో కాలుపెట్టనివ్వకుండ అలెగ్జాండరుయొక్క సేనాధిపతులు ఆయనయొక్క రాజ్యమునంతను పంచుకొనిరి. ఆ పంపిణీతో ఈజిప్టు, అదివరకే దానిని గవర్నరుగ పాలించుచున్న టాలమీభాగమునకు వచ్చెను. అలెగ్జాండరువారసులిరువురును కొలదికాలములోనే పేరూరులేకుండ మరణించిరి.

మొదటి టాలమీ మిగుల నాగరికుడు. తెలివిగలవాడు. విద్యాభిమాని. ఈజిప్టును తన కుటుంబమునకు స్వదేశముగ చేసికొని చక్కగా పాలించెను. ఈజిప్టుప్రజలను ఆదరించి వారిక్షేమముకొరకు పాటుపడి వారిగౌరవమును ప్రేమను సంపాదించెను. అలెగ్జాండరుయొక్క వారసులిద్దరును మరణించగనే మొదటి టాలమీ ఈజిప్టుకు రాజుగా పట్టాభిషిక్తుడయ్యెను. ఈజిప్టుప్రజల సైన్యములను నౌకాదళమును నిర్మాణముగావించి వాటిసహాయమున అలెగ్జాండరుయొక్క యితర సేనానుల నోడించి పాలస్తైన్, ఫొనీషియా, సైప్రసు, సిరియాలను జయించి లోబర్చుకొనెను. గ్రీకుపట్టణములకెల్ల స్వాతంత్రమును కలుగచేసి వాటిని తన సంరక్షకత్వముక్రింద చేర్చుకొని, నూరుసంవత్సరములవరకును చుట్టుపట్టుప్రాంతములలో ఈజిప్టుఆధిక్యతను స్థాపించెను. సముద్రవర్తకమును మిగుల నభివృద్ధిచేసెను. పరిశ్రమలు, కళలు, వ్యవసాయము వృద్ధిచెంది దేశము సంపదతో తులతూగుచుండెను. రాజధాని యగు అలెగ్జాండ్రియానగరము దినదిన ప్రవర్ధమానముగ పెరిగెను. అచట 'సెరపిస్'యొక్క గొప్ప దేవాలయమును నిర్మించి సెరపిస్,ఐసిస్ హోరసులమంత్రిత్వముయొక్క ఆరాధనను ప్రోత్సహించినందున టాలమీరాజులకాలములో అలెగ్జాండ్రియా నగరముకూడ ప్రాముఖ్యమైన పుణ్యక్షేత్రమయ్యెను.

## అలెగ్జాండ్రియాలోని విశ్వవిద్యాలయము గ్రంథాలయము

అలెగ్జాండ్రియా నగరమునకు పెక్కుమంది గ్రీకులు వచ్చి నివసించిరి. గ్రీకుభాష బాగుగ ప్రచారములోకి వచ్చి

నది. అప్పటికి గ్రీసు దేశముకూడ విజ్ఞానమునకు గొప్ప కేంద్ర మయ్యెను. ప్రకృతిశాస్త్రములు, కళలు, శిల్పము వృద్ధిచెందెను. మొదటిటాలమీరాజు అలెగ్జాండ్రియానగరమునందు అందమైన రాచనగరులను, ఉద్యానవనములను, నాటకశాలలను, మార్కెట్లను, శరీరపరిశ్రమశాలలను, ఆటప్రదేశములను, రెండు గొప్ప రేవులను, ఒక నౌకా నిర్మాణశాలను నిర్మాణముగావించి యీ నగరమును మిగుల యాకర్షవంతముగ జేసెను. ఆ రేవునందొక గొప్ప (light house) జ్యోతి స్తంభ భవనమును నిర్మించెను. అన్నిటికంటె మిగుల యుత్కృష్టమైనట్టియు టాలమీవంశరాజులకీర్తిని చరిత్రలో శాశ్వతముగ గావించినట్టియు మహాత్కార్యము, అలెగ్జాండ్రియా నగరమునందు మొదటి టాలమీరాజు స్థాపించిన సుప్రసిద్ధమైన గ్రంథాలయము, "మ్యూజియము" అని పిలువబడిన విశ్వవిద్యాలయము అయ్యున్నవి. అన్నిచోట్లనుండియు సుప్రసిద్ధులగు కవీశ్వరులను చరిత్రకారులను తత్త్వశాస్త్రజ్ఞులను ప్రకృతిశాస్త్రజ్ఞులను రావించి వారిచేత విద్యార్థులకు పాఠములను చెప్పించుటయేగాక, క్రొత్తక్రొత్త పరిశోధనలను గావింపజేసి నూతనగ్రంథములను రచింపచేసెను. ఆ విశ్వవిద్యాలయసౌధములు మిగుల యున్నతమైనవిగను శోభాయమానముగను నిర్మింపబడెను. అచట టాలమీరాజు ఖర్చుమీద ఆచార్యులు విద్యార్థులు కలసి నివసించుచు కలిసిమెలసియుండుచు విషయములను చర్చించుచు జ్ఞానాభివృద్ధిని గావించుచుండిరి. ఆ సౌధములనుండి వెడలిపోగనే ప్రక్కనే మరియొక గొప్ప సౌధముకలదు. అది గ్రంథాలయము. అంతకుపూర్వకాల

మున ప్రచురించబడిన అయిదులక్షల గ్రంథముల నచట సమ కూర్చిరి. వ్రాతప్రతులకు నకళ్లు వ్రాయుచుండిరి. విద్యార్థు లకు తమ పూర్వపుతరములవారు గావించిన జ్ఞానసంపాదన మును ఉపయోగించుకొని లాభముపొందుటకు అవకాశము కలిగెను. ఆ సౌధములలో థియాక్రిటస్, కాలిమాకసు, అప లోనియసు, మహాకవులు కవిత్వముల నల్లుచుండిరి. మత గురువు చరిత్రకారుడునగు మానెథో ఈజిప్టు దేశపు పూర్వరాజు లగు ఫారోల చరిత్రను వ్రాయుచుండెను. హెకటియసు యూదులచరిత్రను వ్రాసెను. ఎరటోస్తనీసు భూగోళమును తయారుచేసెను. ఆరిస్టార్కసు సూర్యమండలినిగూర్చి గుణిం చుచుండెను. థొసెథియసు, హిపార్కసులు జ్యోతిశ్శాస్త్ర ప్రవీణులైరి. యూక్లిడు (జ్యామెట్రి) రేఖాగణితమును వ్రాయు చుండెను. ఆర్కిమిడిస్ గణితశాస్త్రమును వ్రాయుచుండెను. అపల్లోనియసు ట్రిగ్నామెట్రీ (త్రిరేఖాగణితము)ని వ్రాసెను. ఎరస్ట్రాటసు, హెరాఫలిసు పండితులు మానవశరీరముయొక్క సూక్ష్మవిషయములనన్నిటిని శోధించుచుండిరి. థియోఫ్రాస్టసు యొక్క శరీరశాస్త్రము వైద్యశాస్త్రము శస్త్రచికిత్స,హీరోన్ యొక్క ఆవిరియంత్రనిర్మాణము అచటనుండియే బయల్ప డినవి. ఆకాలము కష్టించి చదివి నూతనపరిశోధనలు గావించబడినకాలము. ముఖ్యముగా ప్రకృతిశాస్త్రపరిశోధన లకు పేరువడసినకాలము. ఫయూం రాష్ట్రములో పెపైరా చెట్లను విశేషముగ పెంచి కాగితపు పరిశ్రమను పెంపొంద చేసినారు. ఆ కాగితములమీద యావత్తు వ్రాయబడుచుం డెను. ఈజిప్టు దేశము ఆ చుట్టుపట్టు ప్రపంచములో విజ్ఞానము

నకును మానసికవికాసమునకును ప్రధాన కేంద్రమయ్యెను. మొదటి టాలమీరాజు క్రీ.పూ. 323 మొదలు 285 వరకును తేజోవంతమైన పాలనము గావించి తన కుమారుడగు ఫిలడ ల్ఫసు రెండవ టాలమీని పట్టాభిషిక్తుని గావించి రెండు సంవత్సరములు ఆత్మశాంతితో కూడిన వైరాగ్యజీవితమును గడపి 283 వ సంవత్సరమున స్వర్గస్థుడయ్యెను. ఆ కాలమే చంద్రగుప్త చక్రవర్తి భరతవర్షమును శోభాయమానముగ పరిపాలించినకాలము. ఆయనమంత్రియైన చాణక్యుడు తన అర్థశాస్త్రమును వ్రాసినకాలము. అశోకచక్రవర్తి బౌద్ధధర్మ ప్రచారకులను ఈజిప్టుకుకూడ పంపగ టాలమీరాజులు వారిని గౌరవించి యాదరించిరి. టాలమీలు మతసహనము నకు పేరెన్నికగన్నవారు. భరతవర్షమునుండి బౌద్ధధర్మము, వేదాంతము, వైద్యము, ప్రకృతిశాస్త్రములు ఈజిప్టును ప్రస రించి, ఈజిప్టుయొక్క విజ్ఞానాభివృద్ధికి తోడ్పడినవి. తక్షశిల విశ్వ విద్యాలయమునుండి యొక భారతీయ ఆయుర్వేద శాస్త్రపారంగతుని రావించి అలెగ్జాండ్రియా విశ్వవిద్యా లయములో ఆయుర్వేదపీఠమును స్థాపించిరి.

## తర్వాత వచ్చిన టాలమీలు

రాజకుటుంబముయొక్క రక్తము అపరిశుభ్రముకాగూ డదను సిద్ధాంతముపైన ఫారోలవలెనే టాలమీలుకూడ సోదరీ సోదరులను వివాహమాడు ఆచారము నవలంబించిరి. ఈ పాడు ఆచారము టాలమీల వంశనాశనమునకును ఈజిపు దేశపు ప్రాచీన నాగరికతా పతనమునకును కారణములలో

నొకటైనది. రెండవటాలమీ తన చెల్లెలిని వివాహమాడెను. రాజు రాణిలకు కలసియే పట్టాభిషేకము జరిగెను. ఇంతటి నుంచి ప్రతి తరములోను టాలమీలు తమభార్యలతో కలసియే సింహాసన మధిష్ఠించిరి. పదునలుగురు టాలమీలు రాజ్యముచేసిరి. అయిదవ టాలమీ కాలమునుండియు రాణి కూడ "క్లియపాట్రా" యను బిరుదమునువహించి రాజ్యమేలుటలో రాజుతో సమానభాగస్వామియయ్యెను. రెండవ మూడవ నాలుగవ టాలమీలు దేశములోని విజ్ఞానమును వర్తకమును శిల్పమును ఐశ్వర్యమును బాగుగ వృద్ధిచేసిరి. వారికాలము ఈజిప్టుకు చాల అభివృద్ధికరమైనకాలము. అలెగ్జాండ్రియా విశ్వవిద్యాలయము అనేకరెట్లు వృద్ధిచెందెను. అచట గొప్పజంతుప్రదర్శనశాలకూడ నిర్మింపబడెను. నక్షత్రములపటములు తయారుచేయబడెను. సుప్రసిద్ధ గ్రీకుమహాకవి యగు హోమరు కొక దేవాలయము కట్టించబడెను. అవన్నియు శిల్పచాతురికి ప్రసిద్ధికెక్కినవి. మూడవ టాలమీరాజు హోరసు కొక గొప్పదేవాలయమును ఎడుఫోలో నిర్మాణముగావించెను.

## రాజకుటుంబములో అంతఃకలహములు
## రోముయొక్క జోక్యము

ఏడవ టాలమీ ఫైనార్టి కాలములో అతని తల్లియగు క్లియపాట్రా రాజ్యమును చక్కగా పాలించెను. ఎనిమిదవ టాలమీ తన అన్నభార్యయగు క్లియపాట్రాను, ఆమెకూతురగు క్లియపాట్రానుకూడ వివాహమాడెను. ఈ యిద్దరు భార్యలమధ్య అంతఃకలహములు చెలరేగెను. పెద్ద క్లియ

పాట్రా టాలమీని, అతని రెండవభార్యను వెళ్లగొట్టి రాజ్యము నాక్రమించినది. కొంతకాలమునకు వారి యుభయులకును రాజీనామా కుదిరెను. పదవ టాలమీని అనేకసార్లు అతని తల్లియగు క్లియపాట్రా రాజ్యమునుండి వెళ్ళగొట్టినది. ఆ టాలమీ సమీపముననున్న రోముకుపారిపోయి వారిసహాయ మపేక్షించెను. అప్పటికి రోమన్ సామ్రాజ్యము (**Roman Empire**) ఉత్తర ఆఫ్రికా, పశ్చిమఆసియాలలోను, యూరపు ఖండములోను వ్యాపించి బలవత్తరముగ నున్నది. ఈజిప్టు రాజకుటుంబముయొక్క అంతఃకలహములలో రోముప్రభుత్వనాయకులు జోక్యముకలుగచేసికొనప్రారంభించిరి. పన్నెండవ టాలమీ తనసవతితల్లినే వివాహమాడినందున హత్యగావించబడెను. క్రీ. పూ. 81 వ సంవత్సరమున అతను తన రాజ్యమునంతను రోముప్రభుత్వమునకు దఖలుపర్చుచు మరణశాసనమును వ్రాసి చనిపోయెను. ఆతనికి పిమ్మట పదమూడవ టాలమీ రాజ్యమునకు రాగా, విశేషమైన సొమ్మునివ్వనిచో ఈజిప్టుపైదండెత్తివచ్చెదనని రోమనుకాన్సలు జూలియసుసీజరు బెదిరించెను. క్రీ. పూ. 59 వ సంవత్సరమున జూలియసుసీజరుకు విశేషముగు లంచమునిచ్చి పదమూడవ టాలమీ తన రాజ్యమును నిలుపుకొనెను.

## ఆరవ క్లియపాట్రా

కాని పదమూడవ టాలమీని అలెగ్జాండ్రియావాసులు వెళ్ళగొట్టి ఆతని రెండవకూతురిని రాణిగా గావించిరి. కొలది కాలమునకే ఆమె హత్యగావించబడి ఆయన మరల తన

సింహాసనమును పొందెను. ఆయన క్రీ. పూ. 51 వ సంవత్స రమున మరణించుచు తనరాజ్యము తన పెద్దకుమారుడగు పదునాలుగవ టాలమీకిని, తన పెద్దకుమార్తెయగు ఆరవ క్లియపాట్రాకును చెందవలెననియు, వారుభయులును వివాహ మాడవలెననియు మరణశాసనమును వ్రాసెను. అప్పటికి పదు నాలుగవ టాలమీకి పదిసంవత్సరముల వయస్సు, ఆరవ క్లియ పాట్రాకు పదిహేడుసంవత్సరముల వయస్సు గలదు. ఆమె మిగుల అందగత్తె. భోగలాలసురాలు. ఆమె రాజ్యపాలన మును వహించెను. ఆకాలమున రోములో నాయకులమధ్య అంతఃకలహములు సాగుచుండెను. కాన్సలుపదవిని తీసివేసి రాజరికమును స్థాపించవలెనని ప్రయత్నములు జరుగుచుండెను. జూలియసుసీజరుకును పాంపేకును పోటీయేర్పడెను. జూలియసు సీజరుకు తాను రాజుకావలెనని యుద్దేశ్యము. పాంపేకు తన కుమారుని రాజుగాచేయు తలంపు. జూలియసుసీజరుకు వ్యతిరేకముగా తనకు సహాయముచేయవలెనని పాంపే ఈజిప్టు రాణియగు ఆరవ క్లియపాట్రాను కోరెను. ఆమె అంగీ కరించినది. రోముకు రాజుగా కావలసియున్న పాంపే కుమా రునికిని ఆమెకును మోహసంబంధ మేర్పడినది. ఇంతలో క్రీ. పూ. 47 వ సంవత్సరమున మైనార్టీవదలి పదునాల్గవ టాలమీ రాజ్యమును స్వాధీనపర్చుకొని ఆరవ క్లియపాట్రాను వివాహ మాడుటకు నిరాకరించి ఆమెను వెళ్ళగొట్టెను. ఆమె చెడు ప్రవర్తనవలన ప్రజానురాగమును కోల్పోయినది. ఆమె సైన్య మును పోగుచేసుకొని ఈజిప్టుపై దండెత్తినది. ఈలోపుగా

పాంపే పారిపోయి ఈజిప్టులో దాగుకొనగా, పదునాలుగవ టాలమీ అతనిని చంపించెను. యుద్ధములో క్లియపాత్రా యోడిపోయినది. టాలమీ గెలిచెను. ఆమె వెంటనే రోముకు పారిపోయి అపుడుచ్చస్థితిలోనున్న జూలియసుసీజరును పట్టుకొనెను. ఆయన ఆమెయొక్క మోహవాగురిలో పడెను. ఆయన ఈజిప్టు రాజు రాణీలమధ్య తగవును మధ్యవర్తిగ పరిష్కరించెదనని చెప్పి అలెగ్జాండ్రియాకు వచ్చెను. తనతోకూడ క్లియపాత్రాను వెంటబెట్టుకొని వచ్చెను. టాలమీరాజు సీజరుయొక్క మధ్యవర్తిత్వమున కంగీకరింపక యుద్ధముచేసి హతుడయ్యెను. అతనితమ్ముడగు పదునేనవ టాలమీ ఆరవ క్లియపాత్రాను వివాహమాడు ఏర్పాటుతో అతనిని ఆమెను సీజరు రోముకు తీసుకొని వెళ్లెను. సీజరుసైన్యములు ఈజిప్టులో నుంచబడెను. ఆయన యుద్యోగస్తులు ఈజిప్టును పాలించసాగిరి. అచ్చట రోములో కొలదిరోజులలోనే జూలియసు సీజరు హత్యగావింపబడెను. సీజరుస్నేహితుడైన ఆంటనీకిని, అవతలిపక్షనాయకుడైన బ్రూటసుకును యుద్ధము ప్రారంభమయ్యెను. క్లియాపాత్రా తనకు జూలియస్‌సీజరువలన పుట్టిన 'సీజరియన్' అను కుమారుని, తన సోదరుడును భర్త కావలసినవాడును నగు పదునేనవటాలమీని వెంటబెట్టుకొని ఈజిప్టుకు మరలివచ్చినది. దోవలో పదునేనవ టాలమీని హత్యగావించినది; తన కుమారుని 'టాలమీసీజరు' అను రాజుగా ప్రకటించి, ఆమె ఈజిప్టుపై రాజ్యమును చేయసాగెను.

## ఆంటనీ క్లియపాత్రాలు

రోములో బ్రూటసుయొక్క కక్షి యోడిపోయి ఆంటనీ గెలిచెను. ఆంటనీ క్లియపాత్రాను ఆమె రోమను ప్రజాస్వామ్యమున కెందుకు సహాయముచేయలేదో తగిన సంజాయిషీ నిచ్చుటకు టార్ససుకు స్వయముగా హాజరుకావలసినదని చారులను బంపెను. ఆమె వెళ్ళి ఆయనను సందర్శించి తనవలలో వేసుకొనెను. ఆంటనీ క్లియపాత్రాల ప్రేమనుగూర్చి షేక్స్పియరు మహాకవి యొక ప్రత్యేకనాటకమును వ్రాసియున్నాడు. ఆంటనీ రోములో ప్రభుత్వాధికారముకొరకు తనకు పోటీదారులు బయలుదేరిన అక్టేవియానసు ప్రభృతుల కుట్రలను కాచుకొనక, తాను సైన్యములు తీసుకొనివెళ్ళవలసిన చోట్లకు వెళ్ళక, ఈజిప్టులోని రాచనగరులో క్లియపాత్రా రాణితో మన్మథక్రీడలను సలుపుటలో కాలము గడుపుచుండెను. ఇది అతని స్నేహబృందమునకు చాల కంటకముగ తోచెను. అతనిభార్య మిగుల యుత్తమురాలు. ఆమె అక్టేవియనసుయొక్క చెల్లెలు ఆమెను,బిడ్డలను కంటచూడక క్లియపాత్రాతో కాలముగడుపుటవలనకూడ అతను అందరియొక్క సానుభూతిని గోల్పోయెను. ఎటులనో మిత్రుల సలహాననుసరించి, సైన్యములను తీసుకొని అలెగ్జాండ్రియానువదలి తూర్పుదేశములపైకి వెళ్లెను. కాని కొలదిదినములకే క్లియపాత్రా కూడ వచ్చి అతనిని చేరెను. తాను జయించిన దేశములనన్నిటిని రోముప్రభుత్వమున కర్పణచేయక, అతను క్లియపాత్రాకు తనవలనను జూలియసుసీజరువలనను పుట్టిన కుమాళ్ళకు స్వంతహక్కు అయినట్లు ప్రకటించెను. ఇందుమీద

అతనిమిత్రులుకూడ అతనిని త్యజించిరి. యావత్తు రోము దాదాపుగ అక్టేవియానసుపక్షమున చేరెను. ఆరవ క్లియ పాత్రా రోమనుప్రభుత్వమునకు శత్రువని ప్రకటించబడెను. అక్టేవియానసు సేనలతోపోయి ఆమెను ఓడించి ఈజిప్టుతో కూడ అన్నిరాజ్యములను స్వాధీనపర్చుకోవలసినదని రోము ప్రభుత్వ మాజ్ఞాపించెను. క్రీ. పూ. 31వ సంవత్సరమున ఆక్టియంవద్ద రోమనుసైన్యము లొకవైపునను ఆంటనీ, క్లియ పాత్రాలు రెండవవైపున నుండి గొప్ప యుద్ధముచేసిరి. ఆంటనీ క్లియపాత్రాలు పూర్తిగ ఓడిపోయి అలెగ్జాండ్రియాకు పారిపోయిరి. కాని ఈజిప్టుప్రజలకు వారియందు రోతకలిగి యుండుటచే వారి కెట్టి సహాయమును చేయరైరి. గొప్పరోమను సైన్యములతో అక్టేవియానసు వచ్చి అలెగ్జాండ్రియా నాక్ర మించియుండెను క్లియపాత్రా తన కిరీటమును, రాజదండ మును అక్టేవియానసుకు బంపి తనకు దర్శనమిప్పించవలెనని కోరెను. ఆంటనీని ఒకపౌరునిగ అలెగ్జాండ్రియాలో బ్రదుకనివ్వ వలెనని ప్రార్థించెను. ఆమెయొక్క రంకులాడితనము ధీరుడగు అక్టేవియానసువద్ద యెందుకును పనికిరాలేదు. అందుమీద ఆంటనీ క్లియపాత్రాలు ఆత్మహత్యగావించుకొని మరణిం చిరి. అక్టేవియానసు రోమకసామ్రాజ్యమునకు ప్రథమచక్ర వర్తిగ 'అగస్టసుసీజరు'అనుబిరుదముతో పట్టాభిషిక్తుడయ్యెను. ఇంతటితో ఈజిప్టు రోమనుచక్రవర్తియొక్క పాలనముక్రిందికి వచ్చినది. క్లియపాత్రాకు జూలియసుసీజరువలన పుట్టిన కుమా రుడగు సిజరియను హత్యగావింపబడెను. ఆమెకు ఆంటనీవలన

పుట్టిన యిద్దరుకుమాళ్ళను ఈజిప్టునుండి పంపివేసిరి. టాలమీ రాజవంశ మంతరించినది. స్వదేశపాలన మంతమై ఈజిప్టుపైన విదేశపాలనము ప్రారంభమయ్యెను.

(2)

## రోమనుల పాలనము

### క్రీ. పూ. 31—క్రీ. శ. 641

### అచ్చమైన విదేశపాలనము

ఈజిప్టుపైన రోమనులు గావించిన పరిపాలనము అచ్చమైన విదేశపాలన మయ్యుండెను. మొదటి టాలమీరాజు విదేశస్తుడయినను ఆయన కుటుంబముతో వచ్చి ఈజిప్టులో కాపురమేర్పరచుకొనెను. ఆయనవంశీకులును ఈజిప్టును తమ స్వదేశముగ చేసికొనిరి. కావున టాలమీల పాలనము హిందూదేశములోని మొగలాయీలపాలనమువలెనే స్వదేశ పాలన మయ్యుండెను. రోమనుచక్రవర్తులు అటులగాక తమ దేశములోనే నివసించుచు కొంతకాలము తమ రాజధానిగ నుండిన రోమునగరమునుండియు, పిమ్మట తమ రాజధానియైన కాన్‌స్టాంటినోపిలునుండియు చాలదూరముననున్న ఈజిప్టును తాముపంపిన 'ప్రిఫెక్సు' అని పిలువబడిన రాజప్రతినిధిమూాల మునను ఆయనక్రిందనున్న యుద్యోగస్తులపరంపరమూలము నను నిరంకుశముగా పాలించి, ఆ దేశీయులు తిరుగబడకుండ తమసైన్యముల నక్కడ యుంచి కాపాడుకొనిరి. అందువలన

నీ రోమనుపాలనము హిందూదేశములోని ఆంగ్లేయులపాల నమువలె అచ్చమైన విదేశపాలన మయ్యుండెను. రోమనుప్రభుత్వము అలెగ్జాండ్రియా మొదలగు ఈజిప్టులోని పట్టణములకు మ్యునిసిపలుస్వపరిపాలనము నిచ్చెను. గ్రామములలో పన్నులు వసూలుచేసి ప్రభుత్వకచేరీలకు పంపు బాధ్యత యుద్యోగులపై మోపబడెను. రోమనుచట్టములు దేశమంతటను అమలులో పెట్టబడెను. ప్రథమసంవత్సరములలో ఈజిప్టునుండి అమితమగు ధనము రోముకు గొనిపోబడెను. ఈజిప్టు రాజప్రాసాదముల లోని ధనమును, ఆభరణములను, అందమైన వస్తువులన్నిటిని రోముకు తీసికొనిపోయిరి.

## ఈజిప్టు సర్వవిధముల క్షీణించెను

పెద్ద యుద్యోగములన్నిటిని రోమనులకే యిచ్చిరి. రోముకు ముఖ్యముగా ఆ కాలమునందు ఈజిప్టునుండి కావలసినది ధాన్యము. ఈజిప్టునుండి పడవలమీద ధాన్యము రోముకు విశేషముగ రవాణాయగుచుండెను. ఈజిప్టులోని వర్తకము ఈజిప్టుదేశీయులకన్న ఎక్కువగ రోమనులచేతులలో నుండెను. రోమనులు ఈజిప్టుమీదుగ నితరదేశములతో వర్తకము బాగుగా చేసిరి. ఇండియాతో వర్తకములో అరబులతో పోటీ గలిగి రోమనులే గెలిచిరి. రోమను వేషభాషలు ఈజిప్టులో వ్యాపించెను. మొదలు మొదలు ఎవరో ఒకరిద్దరు చక్రవర్తులు తప్ప ఈజిప్టుయొక్క శిల్పమునందుగాని, పరిశ్రమలు కళల యందుగాని, విజ్ఞానమునందుగాని శ్రద్ధగాని సానుభూతిగాని చూపిన చక్రవర్తులు యుద్యోగస్తులు లేరు. అందువలన నవి

యన్నియు మిగుల యధోగతికివచ్చినవి. అలెగ్జాంద్రియాలోని సర్వకళాశాల గ్రంథాలయము రాజపోషణ లేక క్షీణించెను. క్రీ. శ. నాలుగవశతాబ్దములో థియొడోసీయను చక్రవర్తి అచ్చట ఆచార్యులను వెళ్ళగొట్టించెను. పిమ్మట క్రీ.శ.ఆరవ శతాబ్దములో జస్టియను చక్రవర్తి యా గ్రంథాలయమును, విశ్వవిద్యాలయమును సొంతముగ మూయించివేసెను. అచటి ఆచార్యులును విద్యార్థులును వెళ్ళగొట్టబడిరి. ఆచార్యులు పారసీక దేశమునకు పారిపోయిరి. క్రైస్తవమతమునందు పట్టుదలగల రోమనుచక్రవర్తులు స్వతంత్రవిజ్ఞానమును వృద్ధిచేయు ప్రతిష్ఠాపనలకు మిగుల వ్యతిరేకులుగ నుండిరి. కొన్ని శతాబ్దములవరకును ప్రకృతిశాస్త్రములు కేవలము సైతానుయొక్క విద్యలనియు, మతమునకు వ్యతిరేకమనియు నను మూఢనమ్మకము క్రైస్తవ మతగురువులలో వ్యాపించియుండి, ప్రకృతిశాస్త్రజ్ఞులమీాద విశేషమైన నిర్బంధములను విధింపజేసిరి. రోమనుపాలమునందు ఈజిప్టుప్రజలపై పన్ను లెక్కువయ్యెను. వ్యవసాయభూములమీాదను, పరిశ్రమలమీాదను, వర్తకము మీాదను, సరుకుల దిగుమతుల ఎగుమతులమీాదను, గృహజంతువులమీాదను, పన్నులువేయబడెను. తలపన్ను కూడ విధింపబడెను. నిర్బంధసేవ అమలుపర్చబడెను. వ్యవసాయము, పరిశ్రమలు క్షీణించెను. ఐశ్వర్యము మృగ్యమయ్యెను. పేదరికము వ్యాపించెను. కొన్నిపర్యాయములు ప్రజలు తిరగబడిరి. ఆ తిరుగుబాటులను మిగుల క్రూరముగ నణచిరి.

## రోమనురాజ్యములో నూతన మతము

ఈజిప్టులో రోమనుపాలన నేర్పడిన కొలదివత్సరములకే రోమనుసామ్రాజ్యములో చేరిన పాలస్తైన్ దేశములో నొక నూతన మహాశక్తి యావిర్భవించినది. పెట్రిషియనులు ప్లీబియనులు, యూదులు జంటైలులు, పారసీలు పాపాత్ములు, పాలకులు పాలితులు, భాగ్యవంతులు పేదవారు అను ఎక్కువ తక్కువలు లేక అందరు మానవులును, పాపములకై పశ్చాత్తాపమును పొంది తమపాపముల క్షమాపణకొరకును ఆత్మశాంతికొరకును మోక్షముకొరకును తనద్వారా ప్రేమస్వరూపుడగు భగవంతుని ఆరాధించవలసినదనియు, మానవులందరును అన్నదమ్ములవలె ఒకరినొకరు ప్రేమించుకొనవలసినదనియు నను మహాసందేశమును, ఒకపేద వడ్రంగి కుమారుడగు 'ఏసుక్రీస్తు' మానవకోటి కిచ్చెను. పరమేశ్వరుని ధర్మరాజ్యమును భూమిమీద స్థాపించుటకు తాను పంపబడితినని ఆ మహాపురుషుడు చెప్పెను. ఆయన నిరంతరము వేలకువేల జనులకు చేయుచుండిన యుత్కృష్టమైన బోధలు అన్ని జాతుల వారిని ఆయనవైపు కాకర్షించినవి. యూదులజాతిలో నొక గొప్ప ఆధ్యాత్మికవిప్లవము ప్రారంభమయ్యెను. అదియూదుల మతగురువులకును పాలకులగు రోమనులకును గొప్ప భీతిని జనింపజేసెను. ఎక్కువ తక్కువలమీదను నిరంకుశత్వము మీదను స్థాపించబడిన రోమనురాజ్యమునకు ఆయనబోధలు అపాయకరమని ఆరోపణచేయబడినది. మతగురువుల ఫిర్యాదు పైన రోమనుగవర్నరుచే ఏసుక్రీస్తుప్రభువు శిలువమీద ఘోరమైన మరణశిక్షనుపొందెను. అట్టి క్రూరమరణమునుపొందుచు

"తండ్రీ, వీరు అజ్ఞానమువలన నన్నిట్టి మరణముపాల్జేసినారు. వీరిని క్షమింపుము" అని ఆయన యుచ్చరించిన మాటలు ఆయనను నాటికిని నేటికిని ఇకముందుకును మానవకోటికిఆదర్శ ప్రాయునిగ చేసినవి. ఏసుక్రీస్తుప్రభువుయొక్క అసమాన త్యాగ మువలన ఆయనయొక్క మహిమ మహాత్మ్యము లెక్కువైనవి. ఆయన లోకమునుద్ధరించుటకు పుట్టిన గొప్ప మహాత్ముడని ప్రజలలో నమ్మకము దృఢముగా నేర్పడెను. ఆయనశిష్యులు ఆయనబోధలను ఒక నూతనమతముగా దేశదేశములలోను వ్యాపింపజేసిరి. ఆ నూతనమతమునకు క్రైస్తవమతమని పేరు. అది ఈజిప్టుదేశములోకూడ వ్యాపించినది. మూడువందలసంవ త్సరములవరకును రోమనుచక్రవర్తులు తమ సామ్రాజ్యమునం దంతటను క్రైస్తవమతమును స్వీకరించినవారిమీద పెక్కు నిర్బంధములను ప్రయోగించి ఆ మతము నణచివేయవలెనని అనేకప్రయత్నములు చేసిరి. కాని, నిర్బంధప్రయోగములను లక్ష్యపెట్టక క్రైస్తవులు చేసిన త్యాగములవలన ఆ మతము క్షీణించకపోగా బాగుగా వ్యాపించినది.

## రోమను చక్రవర్తులు క్రైస్తవమతమును స్వీకరించుట

తుదకు క్రీ. శ. 341 వ సంవత్సరమున రోమను సామ్రాజ్యమునకు చక్రవర్తియైన కాన్‌స్టాంటైన్ చక్రవర్తి క్రైస్తవమతమును స్వీకరించి దానిని రోమనుప్రభుత్వ మతముగ చేసెను. రోములో కల్లోలములు కలుగుట వలన ఈ చక్రవర్తి తన రాజధానిని రోమునగరమునుండి తూర్పుగా బైజంటియము పట్టణమునకు మార్చుకొనెను.

ఆ పట్టణమున కంతటినుంచియు కాన్‌స్టాంటినోపిలు (Constantinople) అనుపేరు వచ్చెను. పిమ్మట ఇరవైయైదు సంవత్సరములకు క్రీ. శ. 364 వ సంవత్సరమున రోమనుసామ్రాజ్యములో నాయకులమధ్య తగవులు చాలగ వృద్ధిచెందినందున, రోమునగరము రాజధానిగ గల పశ్చిమరోమను సామ్రాజ్యమనియు, కాన్‌స్టాంటినోపిలు నగరము రాజధానిగగల తూర్పు రోమనుసామ్రాజ్యమనియు రెండుభాగములుగ విభజించుకోబడి, వేరువేరు చక్రవర్తులచే పాలింపబడసాగెను. ఈ విభజనమునందు ఈజిప్టుదేశమును తూర్పు రోమనుసామ్రాజ్యముక్రింద చేర్చిరి. కాన్‌స్టాన్‌టైన్ చక్రవర్తి తనసామ్రాజ్యమునందంతటను క్రైస్తవమతమును వ్యాపింపజేయుటకు తీవ్రముగా కృషిసలిపెను. బౌద్ధమతమునకు అశోకచక్రవర్తి ఎట్టిసహాయము చేసియుండెనో కాన్‌స్టాంటైన్ చక్రవర్తి క్రైస్తవమతమునకు అట్టి సహాయముచేసెను.

## ఈజిప్టు క్రైస్తవులలో అంతఃకలహములు

ఈతనికి పిమ్మట వచ్చిన చక్రవర్తులుకూడ క్రైస్తవులై ఈజిప్టులో క్రైస్తవమతవ్యాపకమునకు చాల దోహదమిచ్చిరి. కాని ఈ మతవ్యాపకమువలన ఈజిప్టులో అశాంతి యెక్కువయ్యెనేగాని శాంతి కలుగలేదు. ఆ దేశములోని క్రైస్తవబిషపులు ప్రథమమునుండియు ఏవో కొన్ని అర్థములేనిసిద్ధాంతములమీదభేదాభిప్రాయులై ఏరియనులనియు ఎథెనేషియనులనియు రెండుశాఖలుగా విభజింపబడి ఎడతెగకుండ కలహించుచుండిరి. ఆ దేశములోని క్రైస్తవులందరును ఇందులో ఏదో ఒక

శాఖకు చెందినవారై రెండు తెగలవారును బజారులలో పోట్లాడుకొనుచు నరుకుకొనుచుండిరి. చక్రవర్తులపుడపుడు జోక్యముకలుగచేసికొని మధ్యవర్తిత్వమునుచేసినప్పటికి వారి తీర్పులనుకూడ లక్ష్యముచేయక తమ మామూలు కలహము లనే సాగించుచుండిరి. అలెగ్జాండ్రియాయొక్క బిషపు ముఖ్య స్థానమును వహించెను. ఆ స్థానము నాక్రమించవలెనను ప్రయత్నములోకూడ నిరు తెగలవారికిని కలహము లెక్కువ య్యెను. క్రైస్తవులసంఖ్య ఎక్కువైనకొలదియు ప్రభుత్వో ద్యోగులు నిస్సహాయులై చూచుచు నూరకుండవలసివచ్చెను. ఇటుల క్రైస్తవులమధ్య అంతఃకలహములు, ఇండ్లు తగులబెట్టు కొనుట, హత్యలుగావించుకొనుట రోమనురాజ్యకాలమునం దంతటను అణగక సాగెను. ఈజిప్టుప్రజలు రోమనుప్రభుత్వ మును ధిక్కరించుట నేర్చుకొనిరి.

## కత్తితో క్రైస్తవమతమును వ్యాపింపచేయుట

ఈ రెండు తెగల క్రైస్తవులును కలసి, క్రైస్తవేతరులై ప్రాచీన ఈజిప్టుమతము నవలంబించియున్న ఈజిప్టుప్రజలయిండ్ల మీాదపడి దోచుకొని హత్యలుగావించి బలవంతముగా వారిని క్రైస్తవమతములోనికి చేర్చుకొనిరి. ఫారోరాజులు టాలమీా రాజులు కట్టించిన జాతీయదేవాలయములను నాశనముగావిం చిరి. ఒకప్పుడు వాటిని క్రైస్తవమందిరములుగమార్చిరి. వాటి లోని దేవతలవిగ్రహములను బ్రద్దలుకొట్టిరి. చిత్తరువులు మొద లగు అందమైన వస్తువులను ముక్కలు ముక్కలుగ చేసిరి. క్రైస్తవులు ఇతరప్రజల నెట్టిహింసలు గావించినను ప్రభు

త్సోద్యోగు లెట్టి జోక్యమును కలుగజేసికొనరైరి. వారిసాను భూతి క్రైస్తవులపక్షముననే యుండెను. క్రైస్తవ దుండగీడులకు ప్రోత్సాహమే కలిగెను. పైగా క్రీ.శ.378 మొదలు 395 వరకు రాజ్యపాలనముచేసిన మొదటి థియొడోసియను చక్రవర్తి తన సామ్రాజ్యములోనిప్రజలందరును క్రైస్తవ మతము నవలంబించితీరవలెనని నిర్బంధశాసనమును గావించెను. అలెగ్జాండ్రియా నగరములోను ఉత్తర ఈజిప్టులోను దాదాపుగా ప్రజలందరును క్రైస్తవులైరి. దక్షిణ ఈజిప్టు ప్రజలు ఈ శాసనముపైన తిరుగుబాటుగావించి తమ తాత తండ్రుల మతమును విడిచిపెట్టుటకు నిరాకరించి, పెక్కు శిక్షలకు కూడ లోనైరి. తిరుగుబాటుదారు లెక్కువైన కొలదియు ప్రభుత్వము శిక్షించుట మానుకొనెను. అలెగ్జాండ్రియాలోని సుప్రసిద్ధమైన సెరపిస్ దేవాలయమును క్రైస్తవులు నాశనముగావించుటకై ప్రయత్నించినపుడు క్రైస్తవేతరులు అటకాయించి గొప్పపోరాటమును జరిపిరి. వారిమధ్యను క్రైస్తవులమధ్యను జరిగిన కలహములలో రక్తప్రవాహములు కారెను. తుదకు ప్రభుత్వసైన్యములువచ్చి క్రైస్తవులకు సహాయము గావించగ, క్రైస్తవులు గెల్చి ఆ 'సెరపిస్' దేవాలయమును నాశనముగావించిరి. విగ్రహములను బ్రద్దలుగొట్టిరి. అలెగ్జాండ్రియాలో నున్న తత్వశాస్త్రబోధకుల యిండ్లమీదపడి వారినందరిని బలవంతముగా వెళ్ళగొట్టిరి. సుప్రసిద్ధ తత్వశాస్త్రపండితురాలగు హిపేషియాను ఒక జాతీయ దేవాలయములో నుండగ క్రైస్తవ మతగురువులు బయట కీడ్చుకొనివచ్చి నడిబజారులో నామెను హత్య

గావించినను వారి కేమియు ప్రభుత్వదండన కలగలేదు. క్రీ.శ. 530 వ సంవత్సరమున మొదటి జస్టినియను చక్రవర్తి ఫయూంలోనున్న శిల్పచాతురికి ప్రసిద్ధికెక్కిన 'ఐసిస్' యొక్క దేవాలయమును పడగొట్టించి పూజారులనందరను ఖయిదుచేసి అచటి విగ్రహములను తన రాజధానికి గొని పోయెను. ధనాశచే సోమనాథదేవాలయములోని విగ్రహము లను బ్రద్దలుకొట్టి అచటి ధనమును దోచుకొనిపోయిన గజనీ మహమ్మదును వెక్కిరించుటకు క్రైస్తవుల కెట్టి అధికారము కలదో దురూహ్యము.

## క్రైస్తవమఠములకు పన్నుల మినహాయింపు

రోమనుపాలకులు ప్రజలమీద పన్నుల నెక్కువగ వేసిరి. వాటిని తప్పించుకొనుటకై క్రైస్తవులు చాలమంది తమఆస్తులను క్రైస్తవమఠములకు వ్రాసియిచ్చిరి. ఈమఠముల మీద పన్నులు వేయుటకు ప్రభుత్వము ప్రయత్నించగ బిష పులు అటకాయించిరి. జిల్లాలకు జిల్లాలుగ భూములు మతగురు వులక్రిందకువచ్చి, వారికి రైతులుగా క్రైస్తవప్రజలు సాగుచేసి కొనుచుండిరి. దినదినమునకు బలహీనమగుచుండిన రోమను ప్రభుత్వమును ఈజిప్టులోని క్రైస్తవులు ధిక్కరించుచుండిరి. దేశములో నెట్టి అభివృద్ధి లేకపోగా, అరాజకము బాగుగా ప్రబలెను.

## అరబులు జయించుట

క్రీ. శ. 610 వ సంవత్సరమున పారసీకరాజగు ఖుస్రూ ఈజిప్టును జయించి పదిసంవత్సరములు రాజ్యపాలనముచేసెను.

క్రీ. శ. 620 వ సంవత్సరమున రోమనుచక్రవర్తి గొప్ప సైన్యములను బంపి పారసీకులను వెళ్ళగొట్టి, మరల ఈజిప్టును స్వాధీనమును పొందెను. కాని రోమనుపాలనము ఆ పిమ్మట యెంతో కాలము నిలవలేదు. దానితో ఈజిప్టుప్రజలందరును విసిగియుండిరి. అత్యధికసంఖ్యాకులగు 'కాప్టు'లను క్రైస్తవులు కూడ దరిద్రము అరాజకము నిర్బంధములు పడలేక అరబు దేశమునుండి దండెత్తివచ్చిన ఓమరుఖలీఫాయొక్క సేనాధిపతికి ఆతిథ్యమిచ్చి క్రీ. శ. 641 వ సంవత్సరమున ఈజిప్టులో రోమనుపాలనము సంతరింపజేసిరి. అరబు ఖలీఫాల పాలనము ఈజిప్టులో స్థాపితమయ్యెను.

—(०)—

# ఈజిప్టుదేశ చరిత్ర

## మూడవ అధ్యాయము

### అరబు ఖలీఫాలు - ఫాతిమైడులు

క్రీ. శ. 641—క్రీ. శ. 1250

(1)

### అరబు ఖలీఫాలు (సున్నీలు)

క్రీ. శ. 641—క్రీ. శ. 971

### మహమ్మదు ప్రవక్త

ప్రేమస్వరూపుడును అహింసా సత్యములకు అవతార మూర్తియునైన ఏసుక్రీస్తు ప్రభువుయొక్క అనుచరులు తమ అర్థములేని అంతఃకలహములవలనను మూఢవిశ్వాసముల యవలంబనమువలనను పూర్తిగ దౌర్జన్యము నవలంబించుట వలనను క్రైస్తవమతము తన గౌరవమును పోగొట్టుకొనెను. రోమనుసామ్రాజ్యము త్వరితముగా పతనమగుచుండెను. ఆ సమయమున క్రీ. శ. ఆరవశతాబ్దములో యూదుల సాంప్రదాయమునుండియే యొకమహాసంస్కర్త అరేబియాఎడారుల నుండి బయలుదేరి విగ్రహారాధనమును క్రైస్తవమతములో జొరబడిన త్రిత్వమును ఖండించి, ఏకేశ్వరోపాసనమును

మానవసమానత్వమును సోదరత్వమును బోధించసాగెను. తాను ఈశ్వరునివల్ల పంపబడిన ప్రవక్తనని ప్రకటించెను. ఆయనయే మహమ్మదుప్రవక్త. ఈయన స్థాపించిన మతము ఇస్లాం. దాని వేదగ్రంథము ఖురాను. యూదులమతమునకు ప్రమాణగ్రంథము బైబిలుయొక్క పాత నిబంధన (Old Testament). క్రైస్తవులు, ముస్లిములుకూడ పాతనిబంధన నంగీకరింతురు. క్రైస్తవులకు బైబిలుయొక్క క్రొత్త నిబంధన (New Testament) ప్రమాణగ్రంథము. మహమ్మదీయులు క్రొత్త నిబంధనను కూడ అంగీకరింతురు గాని, వారికి ప్రమాణగ్రంథము ఖురానుఅయ్యున్నది. గావున క్రైస్తవమతము ఇస్లాముమతము యూదులమతము యొక్క సంస్కరణములే. మహమ్మదుప్రవక్తను విగ్రహారాధకులగు అరబులు నానాబాధలుపెట్టిరి. చంపుటకు ప్రయత్నించిరి. ఆయన జన్మస్థలమైన మక్కానుండి మదీనాకు పారిపోయెను. ఆత్మసంరక్షణార్థమై తనఅనుచరులగు ముసల్మానులను ఆయుధపాణులను చేసెను. పిమ్మట ముసల్మానులగు అరబులనందరిని సైనికయోధులుగ తయారుచేసి అరేబియా నంతను జయించి వారందరిని యిస్లాముమతములో చేర్చుకొనెను. అరబులు, మహమ్మనుప్రవక్తక్రిందను ఆయనకు పిమ్మట ఆ మతపీఠాధిపతులుగా వచ్చిన ఖలీఫాలక్రిందను మతోద్రేకముతో పోరాడి గొప్ప (సారసన్) అరబుసామ్రాజ్యమును స్థాపించిరి. ఆ సామ్రాజ్యము కొంతకాలమునకు పశ్చిమమున స్పెయిన్ మొదలు తూర్పున హిందూదేశములోని సింధురాష్ట్రమువరకును వ్యాపించెను. మహమ్మదు ప్రవక్త క్రీ. శ. 632వ సంవత్సరమున మరణించెను. ఆయన

కాలములోను ఆయనకుపిమ్మట రాజ్యాధికారమునకు వచ్చిన నలుగురు ఖలీఫాల—అబూబకరు, ఓమరు, ఉస్మాన్, ఆలీ—కాలములోను అరేబియా దేశములోని మదీనా నగరము సామ్రాజ్యమునకు రాజధానిగ నుండెను.

### ఈజిప్టు అరబుసామ్రాజ్యములో భాగమయ్యెను

రెండవ ఖలీఫాయగు ఓమరుకాలమున ఆయనసేనాధిపతియగు ఓమరు క్రీ. శ. 639 వ సంవత్సరమున ఈజిప్టుపై దండెత్తెను. అపు డచట రోమనులకు తగినంత సైన్యము లేదు. ప్రజలు రోమనులకు వ్యతిరేకులుగ నుండిరి. ముసల్మానుల కాతిథ్యమిచ్చిరి. ముసల్మానులు క్రమక్రమముగ ఈజిప్టునంతను స్వాధీనముపొంది క్రీ. శ. 641 వ సంవత్సరమున రాజధానియగు అలెగ్జాండ్రియానగరమున ప్రవేశించిరి. రోమనుసైన్యములు ఈజిప్టును వదలిపోయినవి. పదునెనిమిదిసంవత్సరములు నిండిన ప్రతి పురుషుడును స్త్రీయు జిజియాపన్ను (తలపన్ను)ను చెల్లించినచో, ముసల్మానుమతమును స్వీకరించనక్కరలేదని ఓమరుసేనాని ప్రకటించెను. ఆ ప్రకారము చెల్లించుటకొప్పుకొని ఈజిప్టులోని క్రైస్తవులును ఇతర ప్రజలును తమ స్వంత మతమును నిలుపుకొనిరి. తలపన్ను చెల్లించినను ప్రజలమీద పన్నులు రోమనుకాలముకంటె చాల తేలికగనే యుండెను. పూర్తియగు మతస్వేచ్ఛ ప్రబలెను. వారి దేవాలయములు మందిరములు ముసల్మానులచే గౌరవింపబడి కాపాడబడెను. ముసల్మానులకు సహాయముచేసినందుకు కాప్టునాయకులకు గొప్పయుద్యోగము లివ్వబడెను. ఈజిప్టుదేశము అరబుఖలీఫా

స్సామ్రాజ్యములో నొకభాగమై ఆయనచే నియమింపబడిన గవర్నరులచే పాలింపబడుచుండెను. ఓమరుసేనాని ప్రథమ గవర్నరుగ నా దేశమును కొంతకాలము పాలించెను. ఈజిప్టు యొక్క రాజధానిని అలెగ్జాండ్రియానుండి మార్చివైచెను. 'ఎల్ఫుస్టాటు' అనుచోట నొక గొప్ప మసీదును ఓమరు ఖలీఫాపేర కట్టించి అచట నొకనగరమును నిర్మాణముగావించి, దానిని రాజధానిగ గావించెను. తరువాత కొంతకాలమునకు పాతికైదు ఖలీఫాలు రాజ్యమునకు వచ్చి 'కైరో' (Cairo)నగరమునకు మార్చువరకును 'ఎల్ఫుస్టాటు' నగరమే రాజధానిగ నుండెను.

## కర్బాలా హత్య

అచ్చట మదీనా (Madina)లో నాలుగవ ఖలీఫాయగు 'ఆలీ' మరణించిన పిమ్మట ఆయన పెద్దకుమారుడగు 'హాస్సన్' ఖలీఫా యయ్యెను. మహమ్మదుప్రవక్తయొక్క కూతురగు ఫాతిమాను ఆలీ వివాహమాడెను. ఫాతిమా పెద్దకుమారుడే హాస్సన్. ఆయన ఆరునెలలు ఖలీఫాగా నుండెను. అపుడు సిరియాకు గవర్నరుగా నున్న 'మావియా' అను నాతడు గొప్ప తిరగబాటును లేవదీసెను. ఈజిప్టుప్రజలు హాస్సన్పక్షమున నే యుండిరి. కాని 'మావియా'యే జయించి, సాలుకు నాలుగు లక్షల దహరములను హాస్సన్ ఫింఛన్గా పుచ్చుకొనునట్లును, మావియా మరణించిన పిమ్మట హాస్సన్ తమ్ముడును, ఫాతిమా రెండవకుమారుడును నగు హుస్సేన్ ఖలీఫాయగునట్లును, ఏర్పాటుజరిగి 'హుస్సన్' ఖలీఫాపదవిని త్యజించి 'మావియా'

ఖలీఫాయయ్యెను. తొమ్మిదిసంవత్సరములకు పిమ్మట విష ప్రయోగముచే 'హాస్సన్' హత్యగావించబడెను. మహమ్మదు ప్రవక్తకు అల్లుడైనందున ఆలీకి ఇమాం అని బిరుదుండెను. 'హాస్సను' రెండవ ఇమాం, హుస్సేన్ మూడవ ఇమాం అయ్యుండిరి. మావియా మరణించినపిమ్మట ఆతనికుమారుడు యజీదు ఖలీఫాపదవిని హుస్సేన్‌కు వదలుటకు నిరాకరించి తానే ఖలీఫాయయ్యెను. యజీదు చాల చెడుప్రవర్తనగల వాడు. హుస్సేన్ చాల యోగ్యుడు, దైవభక్తిపరాయణుడు. ఇరాకు దేశములోని 'కూఫా' పట్టణ ప్రముఖులు హుస్సేన్‌ను తమపట్టణమునకు రావలసినదనియు, తామాయనకు ఖలీఫా యగుటకు సహాయముచేతుమనియు వ్రాసిరి. హుస్సేన్ తన భార్య, పిల్లలు,బందుగులు, నౌకర్లసహా మొత్తం 82మందితో మక్కాను వదలి కూఫాకు బయలుదేరి దారిసమీపముననున్న 'కర్బాలా' (Karbala) యనుచోట విడిదిచేసెను. ఈ సమా చారము ఎప్పటికప్పుడు గూఢచారులవలన యజీదు తెలుసు కొనుచుండెను.కూఫాలోనివారిని భయపెట్టెను.'కర్బాలా'లో మకాంచేసిన హుస్సేను తనను ఆహ్వానించిన కూఫాప్రముఖులు ఎదురుగావచ్చి కలసికొందురని ఆశించెను. వారు భయమువలన రాలేదు. యజీదు ఖలీఫా ఇరవైవేల సైన్యమును కర్బాలాకు బంపెను. వారు యుద్ధముచేయక ప్రక్కన వేచియుండిరి. కాని, ఆ చుట్టుపట్టుల నెక్కడను మంచినీళ్లు దొరకకుండ హుస్సేన్‌ను ఆయనతోనున్నవారిని యెండగట్టిరి. తాను యుద్ధముచేసి మరణించెదననియు, స్త్రీలను పిల్లలను విడిచిపెట్టవలసినదనియు హుస్సేన్ ప్రతిశత్రులను కోరెను. అందుకు వారొప్పుకొన

లేదు. మంచినీటికొరకు నదివద్దకుగాని బావియొద్దకుగాని హుస్సేన్ మనుష్యు లెవరు పోయినను వారిపై శత్రువులు బాణములు వేసి చంపిరి. హుస్సేన్‌ను ఆయనతో కూడ నుండిన స్త్రీలను బంధువులను నౌకర్లను అందరిని బాణములు వేసి శత్రువులు హత్యగావించిరి. మహమ్మదుప్రవక్తయొక్క మనుమడగు హుస్సేన్‌ను భార్యాపిల్లలతో సహా అధర్మముగాను క్రూరముగాను యజీదు హత్యగావించిన యీ చరిత్రనే పీర్ల పండగలో ముసల్మానులందరును మిగుల హృదయభేద్యముగ ప్రదర్శించి హుస్సేన్ యొక్క బలిదానమునుస్మరించుచున్నారు.

## డెమాస్కసు బాగ్దాదు ఖలీఫాలు

ఇంతటితో యజీదు అడ్డులేక ఖలీఫాపదవియందు ఖాయపడెను. అతనిసంతతివారికి "ఒమయ్యాదు" ఖలీఫా లని పేరు. వారు మదీనానుండి సిరియాలోని డెమాస్కసు (Demascus) నగరమునకు తమ రాజధానిని మార్చుకొనిరి. క్రీ.శ. 750 వ సంవత్సరమున ఆఖరు ఒమయ్యాదు ఖలీఫాను వెళ్ళగొట్టి మహమ్మదుప్రవక్తయొక్కపినతండ్రివంశమగు 'అబ్బాసీదు' (Abbaside) వంశమునకు చెందిన 'ఎస్‌సాఫా' అనునాయన ఖలీఫాయయ్యెను. అబ్బాసీదువంశపు ఖలీఫాలు డెమాస్కసునువదలిపెట్టి ఇరాకులోని బాగ్దాదు (Bagdod) ను తమ రాజధానిగ చేసికొని అచటనుండి అరబుసామ్రాజ్యమును పాలించిరి. డెమాస్కసు, బాగ్దాదునగరములు ఆయా ఖలీఫాలకాలములో అత్యంతవైభవము ననుభవించెను. ఖలీఫా (ముసల్మాను) అరబుసామ్రాజ్యమునకు చక్రవర్తి, న్యాయాధిపతి, సైన్యాధిపతి, ప్రధాన

మతగురువు, మతసంరక్షకుడునై యుండెను. క్రీ. శ. పదునేని మిది పందొమ్మిది ఇరువదవ శతాబ్దములలో పాశ్చాత్యదేశము లవారు వర్తకముకొరకు రాజ్యవ్యాపకముచేయుచున్నట్లు, ఖలీ ఫాలు మతముకొరకు రాజ్యవ్యాపకము గావించిరి. మహా మ్మదుప్రవక్తయు, ఆయనకు పిమ్మట వచ్చిన నలుగురు ఖలీ ఫాలును మిగుల దైవభక్తిపరాయణులై అత్యంతమైన పేద వారివలె మిగుల నమ్రతగల జీవితములను గడిపిరి. డెమా స్కసు, బాగ్దాదు ఖలీఫా లటులగాక భోగపరాయణులైరి. ఆ నగరరాజములు మిగుల శిల్పచాతురికి ప్రసిద్ధికెక్కి అందమైన ప్రాసాదములతోను సౌధములతోను మసీదులతోను గోరీల తోను విలసిల్లెను. సరస్సులు, పుష్పవాటికలు, ఉద్యానవన ములు శోభను సమకూర్చెను. చిత్తరువులు, కళలు, సంగీ తము, కవిత్వము చాల వృద్ధిచెందెను. రాజభవనములు సుందర మైన సామానులతోడను మెత్తని సోఫాలు, తివాసీలు అతలఘు మహామ్మల్ శేషిసీలతోడను, నిలవుటద్దములతోడను, అత్త రుల సువాసనతోడను, పుష్పములసౌరభముతోడను వైభ వోపేతముగ నుండెను. అంతేగాక ఆ నగరములు ఆ కాల మునగల విజ్ఞానమున కంతకును కేంద్రములుగ చేయబడెను. అచట గొప్ప విశ్వవిద్యాలయములు స్థాపించబడి పోషించబడి నవి. చాలమంది ఖలీఫాలు మతసహనముగలవారై విద్యా పోషకులైయుండిరి. ఈ ఖలీఫాలు తమ విద్వాంసులను భరత వర్షమునకు విద్యలు నేర్చుకొనివచ్చుటకు బంపియు, సమస్త విద్యలకు ప్రసిద్ధికెక్కిన ఆ దేశమునుండి విద్వాంసులను రావించి సత్కరించియు, ఎంతయో విజ్ఞానమును సంస్కృతమునుండి

అరబ్బీభాషలోనికి ప్రసరింపజేసిరి. వేదాంత, వైద్య, జ్యోతిష, ప్రకృతి, గణితశాస్త్రాదులలో భరతవర్షమునకు గల గొప్ప విజ్ఞానము అరబుదేశములకు ప్రసరించెను. అరబులద్వారా భారతీయవిజ్ఞానము యూరపుఖండమునకు చేరెను. సారసన్‌ల (అరబుల) శిల్పనిర్మాణపద్ధతి భరతవర్షములో కొంతవరకు అవలంబించబడెను.

## ఈజిప్టు ముఖ్యమైన ముసల్మానుదేశమయ్యెను

ఈజిప్టుపై పాలించిన అరబుగవర్నరులలో చాలమంది ప్రజయందు సానుభూతిని కలిగి క్రైస్తవులను స్నేహభావముతో చూచి మతసహనమును చూపిరి. కొద్దిమంది గవర్నరులు మాత్రము క్రైస్తవులపై నిర్బంధములను విధించి ముసల్మానుమతమును బలవంతముగ వ్యాపింపచేయ యత్నించుచు వచ్చిరి. అరబుభాషను వ్యాపింపచేయుటకు పట్టుదలనుచూపిరి. తలవన్ను చెల్లించలేక చాలమంది ఇస్లాముమతమును స్వీకరించిరి. క్రైస్తవమతమునకు ఇస్లాముకునుచాలసామీప్యముండుట వలనను, ఇస్లాముమతమునకు రాజపోషణ యుండుటవలనను కూడ చాలమంది తేలికగా ముసల్మానులైరి. అరబుసైనికులును ఇతరఅరబులును వేలకువేలుగవచ్చి ఈజిప్టులోని బస్తీలలోను పల్లెలలోను నివసించి భూములు మొదలగు ఆస్తులను సంపాదించి ఈజిప్టుస్త్రీలను వివాహమాడిరి. వారికిపుట్టినబిడ్డలందరును ముసల్మానులైరి. అయినను కాప్టులలో చాలమంది తమ స్వంతమతమగు క్రైస్తవమతమును విడిచిపెట్టకనే యుండిరి. అందువలననే నేటికిని కాప్టులను క్రైస్తవులు ఆ దేశములో

మైనార్టీగా నిలచియున్నారు. క్రీ. శ. 830 వ సంవత్సరమున కాప్తులు ఖలీఫా ప్రభుత్వముపై గొప్ప తిరుగుబాటును లేవదీయగా, ఖలీఫా "ఎల్ మామూన్" ఈజిప్టుకు స్వయముగా వచ్చి ఆ తిరుగుబాటును క్రూరముగ నణచి కాప్టులననేకుల చంపించి వారియిండ్లను తగలబెట్టించి వారి పెండ్లాముబిడ్డలను బానిసలుగ నమ్మించెను. ఆసమయమున కాప్టులనేకులు ఇస్లాం మతమును స్వీకరించి శిక్షలను తప్పించుకొనిరి. ఇంతటితో ముసల్మానులసంఖ్య ఆ దేశములో విశేషముగ వృద్ధియై కాప్టుల సంఖ్య స్వల్పమైనది. ఈజిప్టు దేశము అరబులమతమును అరబుల విజ్ఞానమును అరబులనాగరికతను వేషభాషలను పూర్తిగ అవలంబించి ముఖ్యమైన అరబు దేశములలో నొక్కటియైనది. అరబుభాష దేశమునకంతటిని జాతీయభాషయైనది. పాత స్వదేశనాగరికత మరల తలయెత్తలేదు. పూర్తిగ నదృశ్యమై పాత ఈజిప్టుజాతికి కొత్త ఈజిప్టుజాతికి ఎట్టి సాదృశ్యము లేకుండెను.

## మామ్లూకులు

చాలకాలమువరకు ఖలీఫాలు అరబులను ఈజిప్టుపైన గవర్నరులుగ నియమించుచువచ్చిరి. గాని అరబు గవర్నరులు కుట్రలుచేసి తమ అధికారమును లాగుకొందురను భయము ఖలీఫాలకు కలిగి క్రీ శ. 856వ సంవత్సరమునుండియు తురుష్క బానిసలను గవర్నరులుగ బంపిరి. శరీరదార్ఢ్యము అందము తెలివితేటలు గల తురుష్కబానిసలను కొనివచ్చి వారికి ఖురానును అరబ్బీభాషను ప్రభుత్వచట్టములను నేర్పి కొంత

రాజకీయజ్ఞానమునిచ్చి చిన్నయుద్యోగములలో తరబీయతు చేసి, అక్కరకువత్తురని అనుకొనెడివారికి గొప్పయుద్యోగముల నిచ్చుచువచ్చిరి. అప్పుడు వారికి బానిసత్వమునుండి స్వాతంత్రము కూడ లభించెను. వారు తమస్థితిఅంతయు తమ యజమానుల వలననే కలిగినదని యెంచి మిక్కిలి విధేయత తోడను నమ్మకముగాను పనిచేయుచుండిరి. ఈవిధముగా నొక బానిసలజాతి ఖలీఫాలవద్ద తయారుచేయబడినది. వీరికి మామ్లూకులని పేరు.

రాజనగరిలో ముఖ్య ఉద్యోగములన్నియు వీరికే లభించెను. ప్రధానరాష్ట్రము లన్నిటిమీదను వీరే గవర్నరులైరి. ఖలీఫాలకు సైనిక చక్రరక్షకులును వీరేయైరి ఖలీఫాలవద్ద సమస్తవిధములైనఅధికారములు ఈ మామ్లూకులచేతులలోనికి వచ్చెను. ఈ మామ్లూకు అమీరులందరును ఒక బృందముగ నేర్పడిరి. ఇతరులనెవరిని పలుకుబడి సంపాదించకుండచేసిరి. తుదకు ఖలీఫాలను కీలుబొమ్మలుగచేసిరి. తమకిష్టములేనివారిని ఖలీఫాపదవిలోనుండి తీసివేయుచు కొత్తవారిని ఎక్కించుచుండిరి. బాగ్దాదు ఖలీఫాలరాజ్యము వీరివశమయ్యెను. వీరి నెదిరించినవారికి మరణము తప్ప వేరులేదు.

## టులూను వంశము

టులూను అట్టి తురుష్కబానిసయే. ఖలీఫావద్ద చిన్నయుద్యోగములనుచేసెను. అతనికుమారుడగు అబుల్ అబ్బాసు అహమ్మదు గొప్ప విద్వాంసుడై సేనానియై రాజకార్యదురంధరుడై క్రీ. శ. 86౸వ సంవత్సరమున బాగ్దాదు ఖలీఫాచే ఈజిప్టుకు

గవర్నరుగా నియమింపబడెను. ఈతడు ఈజిప్టును సర్వాధికారముతో రాజువలె పరిపాలించెను. ప్రజలకు చాల మేళ్ళు చేసి పండితులనుపోషించి, రాజనగరులను కట్టించి 884 వ సంవత్సరమున మరణించెను. సిరియానుకూడ తన క్రిందకు తెచ్చుకొనెను. ఆయన చనిపోగనే ఖలీఫా సిరియాపై దండెత్తి లోబరచుకొనెను. ఆయునకుమారుడగు టులూను అహమ్మద్ గొప్ప సైన్యముతో పోయి ఖలీఫా నోడించి, ఈజిప్టు, సిరియా, రోము ప్రాంతములను రాజుగా పాలించుటకు ఖలీఫానుండి ముప్పదిసంవత్సరముల దానపట్టాలను పొందెను. అతడుకూడ ఈజిప్టును చక్కగా పాలించెను. ఆతనివంశీకులు బలహీనులైనందున 906 సంవత్సరమున ఖలీఫాసైన్యములువచ్చి ఈజిప్టును లోబర్చుకుని రాజధానిని తగులబెట్టి టులూన్‌వంశీకులనెల్ల ఖయిదీలుగ పట్టుకొనిపోయిరి.

## నైలునది పండగ

పిమ్మట వచ్చిన గవర్నరులు స్వతంత్రులైరి. ఖలీఫాలు బలహీనులైరి. ఖలీఫా "ఎల్‌ముత్తాకి"యొక్క కండ్లు నొక మామ్లూకుఅమీరు పొడిచివేసి నిస్సహాయునిగ చేసి వేసెను. 'ఇఖడీ' యను గవర్నరుకాలములో నైలునది పండగ పునరుద్ధరణచేయబడెను. అది నేటికిని ఈజిప్టువాసులందరిచే ముసల్మానులు క్రైస్తవులను భేదములు లేక శోభాయమానముగ జరుపబడుచున్నది. జనవరి 10వ తేదీన కాలువలు మూసివేతురు. ఆ రాత్రి ప్రజలందరును నైలునదిమీద పడవలలో షికార్లుచేతురు. సంగీతములు, నాట్యములు ఫలహారములు,

దీపావళి జరుగును. నదిలో స్నానమాడెదరు. స్నేహితులు బంధువులు మిగుల సంతోషముతో కాలముగడిపెదరు. పిమ్మట అబుల్ మిస్కకఫూరు అను భోజ్జావానికి ఈజిప్టుపై ముప్పది సంవత్సరములు రాజ్యముచేయుటకు ఖలీఫా దానపట్టా నిచ్చెను. ఇతడు సంగీతమును కవిత్వమును సత్కరించెను. కవీశ్వరులు ఈతనిని స్తోత్రముచేసి ద్రవ్యసత్కారము పొందిరి. ఇతను మరణించిన మరుసంవత్సరమునకే క్రీ. శ. 970 సంవత్సరమున ఫాతిమైడు ఖలీఫా దండెత్తివచ్చి ఈజిప్టు నాక్రమించెను.

(2)

## ఫాతిమైడు (షయ్యా) ఖలీఫాలు

క్రీ. శ. 971—1171

### ఎల్ అజర్ విశ్వవిద్యాలయము

ఇస్లాముమతము రెండు గొప్ప శాఖలుగ చీలినది. సున్నీలని, షయ్యాలని మహమ్మదుప్రవక్తయొక్క మనమలను హత్యగావించి సామ్రాజ్యాధీశులైన డెమాస్కసు ఖలీఫాలను, వారికి పిమ్మటవచ్చిన బాగ్దాదుఖలీఫాలను షయ్యాలు తమమతగురువులని ఖలీఫాలని అంగీకరించరు. సున్నీలు వీరినందరినే ఖలీఫాలుగ నంగీకరింతురు. షయ్యాల సిద్ధాంతప్రకారము, ఆలీ మొదటి ఇమాము, ఆయనకు పిమ్మట ఆయనకుమాళ్ళగు హస్సన్, హుస్సేన్‌లు రెండవ మూడవ ఇమాములు. వీరికి పిమ్మట మరి

తొమ్మండుగురుఇమాములుగవచ్చినారు. మొత్తము(పన్నెండు మంది)బారాఇమాములు.ఈఇమాములే ఖలీఫాలు.వీరందరును మహామద్ ప్రవక్తయొక్క కూతురగు ఫాతిమా వంశీకులు. పన్నెండవ ఇమాము అదృశ్యుడైనాడు. కొలదికాలములో 'మహది' అను పేరున మరల వచ్చి అక్రమముగా రాజ్యమునకు అధిపతులైన ఖలీఫాలను వెళ్ళగొట్టి సరియైన మహామ్మదీయమతమును మహామ్మదీయసామ్రాజ్యమును స్థాపింతునని చెప్పిపోయెను. షియ్యాలు అట్టి 'మహది'కొరకు వేచియున్నారు. క్రీ.శ. 910 వ సంవత్సరమున "ఇమాము ఒబయదుల్లా 'ఏల్ మహది' అను నాయన అట్టి మహదీని తానేనని బయలుదేరి పశ్చిమోత్తర ఆఫ్రికాలో మొరాకో మొదలగు దేశములలోని అరబులను బర్బరులను తనక్రింద చేర్చుకొని, యచ్చట రాజ్యస్థాపనమును గావించెను. ఈతని వంశమునకు ఫాతిమైడు ఖలీఫాలని పేరు. ఈ వంశములోని ఖలీఫాయగు ఎల్ మొయిజ్జి గొప్పసైన్యములతో వచ్చి క్రీ. శ. 969 సంవత్సరమున ఈజిప్టును జయించెను. ఈయన విద్యాధికుడు, ఔదార్యవంతుడు, న్యాయమార్గానువర్తియై యుండెను. అచ్చటినుండి ఫాతిమైడు ఖలీఫాలకు ఈజిప్టు వాసస్థానమై యిచ్చట నుండియే వారి యావత్తురాజ్యమును పాలించిరి. మొరాకో మొదలగు ఉత్తరాఫ్రికాయంతయు వీరిక్రిందనుండుటయేగాక, మక్కా, మదీనా, సిరియా, హెజాజ్‌లు కూడ వీరిక్రిందికి వచ్చినవి. వీరు ఈజిప్టులో "ఎల్ ఫుస్టాటు" నగరమును వదలి 'ఎల్ కహారా అనుచోట తమరాజధానిని స్థాపించుకొని దానిని గొప్ప నగరముగ గావించిరి. అదియే కైరో(Cairo)నగరము.

ఆ నగరమున అందమైన సౌధములు నిర్మాణముగావించ బడెను. గొప్ప శిల్పచాతురి ప్రదర్శించబడెను. చిత్తరువులు విలసిల్లెను. గొప్పసైన్యము, నావికాదళము నిర్మాణముగావించ బడెను. నావికానిర్మాణశాలలు కట్టించబడెను. నైలునది నుండి నూతన కాలవలు త్రవించబడెను. కైరోనగరమును సుప్రసిద్ధముగచేసినది, యచట నీ ఫాతిమైడు ఖలీఫాలు స్థాపించిన 'ఎల్ అజర్' (El-Azhar) విశ్వవిద్యాలయమై యున్నది. అది క్రమముగా వృద్ధిచెంది, అరబుదేశములన్నిటిలో విజ్ఞాన కేంద్రముగ ప్రథమస్థానమును వహించినది. యావత్తువిద్య అరబుభాషలోనే నివ్వబడును. ఇప్పు డా విశ్వవిద్యాలయము నందు షుమారు పదిహేను వేలమంది విద్యార్థులు, విద్యార్థినులు నివసించి విద్యనభ్యసించుచున్నారు. భారతీయమహాసభ (Indian National Congress) అధ్యక్షులగు కీ. శే. శ్రీ అబుల్ కలాం అజాదుగా రా విశ్వవిద్యాలయమునందు విజ్ఞానమును పొందినవారే. క్రీ. శ. 970 వ సం॥ నుండియు 'హస్సన్,' 'హుస్సేన్'ల బలిదానము స్మరించుటకు మొహరంపండగల నేర్పాటుచేసిరి.

## స్వదేశరాజులు - మతస్వేచ్ఛ - అభివృద్ధి

ఈ ఖలీఫాలు క్రీ. శ. 970 మొదలు 1171 వరకును పదకొండుమంది ఈజిప్టుపై రాజ్యముచేసిరి. సంపూర్ణమగు మతస్వేచ్ఛయే వీరి రాజనీతి. ఖలీఫా అజీజు క్రైస్తవస్త్రీని పెండ్లియాడెను. ఆమెకూతుళ్ళిద్దరును క్రైస్తవమతాధిపతులైరి. ముస్లిములు క్రైస్తవులయిననుకూడ ఎట్టి ఆటంకములు

లేకుండెను. యూదులకును క్రైస్తవులకునుకూడ ముస్లిముల తోపాటు అన్నియుద్యోగములును లభించెను. ఖలీఫాలలో హాకీము అనునతడు మాత్రము ప్రథమవత్సరములలో క్రైస్త వులను బాధించెను. అతను వెర్రివాడు. పిమ్మట క్రైస్తవుల కనుకూలుడై ముస్లిములను బాధించెను. పాతరాజధానియగు ఎల్ ఫుస్టాటును తగలబెట్టించెను. కాని అతను విద్యాపోష కుడై ఎల్ అజర్ విశ్వవిద్యాలయములో వైద్య, జ్యోతిష, వ్యాకరణ, ప్రకృతిశాస్త్రశాఖల నెంతయో వృద్ధిచేసెను. (Hall of Science) ప్రకృతిశాస్త్ర పరిశోధనామందిరము నొకదానిని ప్రత్యేకముగ కట్టించెను. అతనుతప్ప మత నిర్బం ధములను పెట్టిన ఖలీఫాలు ఈ వంశమువారిలో లేరు. ఈజిప్టు తమ దేశమేనని ఆ ప్రజలు తమప్రజలేనను భావముతో నీ ఖలీ ఫాలు స్వదేశరాజులుగ పాలించిరి. వీరు భరతవర్షమును పాలిం చిన మొగలాయిచక్రవర్తులవంటివారు. అందువలన నీకాల మున ఈజిప్టు ఎంతయో అభివృద్ధిచెందినది. ఖలీఫా ముస్తాసిరు కాలములో (1036-1094) బాగ్దాదు సున్నీ ఖలీఫాలు గొప్ప సైన్యములను బంపి సిరియాను, ఉత్తరఆఫ్రికాను మరల లోబ ర్చుకొనిరి. ఫాతిమైదు ఖలీఫాలకు ఈజిప్టుమాత్రమే మిగిలెను. మక్కామదీనాలుకూడ వీరిక్రిందనే యుండెను. ఆకాలములో ఈజిప్టుకు వచ్చిన పారసీక బాటసారులు కైరో, మిసర్ పట్టణ ముల వైభవమునుగూర్చియు ఫాతిమైదు ఖలీఫాల సుపరిపాలన మునుగూర్చియు వ్రాసినారు. వీరు చాల యోగ్యులనియు ప్రజానురంజకులనియు వ్రాసినారు. ఎటుల వీరిపాలనమునందు స్వదేశపరిశ్రమలు వర్తకము ఐశ్వర్యము వృద్ధిచెందినవో వర్ణిం

చినారు. ఢిల్లీ సుల్తానుయొక్క కుమాళ్ళిద్దరు నైలునదిపండుగ కాలమున కైరోనగరమును దర్శించి ఈ ఖలీఫాకు అతిథులుగ గొప్ప సత్కారమునుపొంది వెళ్ళిరి. కాని తురుష్క సేనలు తిర గబడి రాజధానిలోని ఒకలక్ష గ్రంథములుగల గ్రంథాలయ మును తగలబెట్టిరి. ఇతరచోట్లనున్న గ్రంథములే మిగిలెను. నూరుసంవత్సరములకు పిమ్మట సాలడీను సుల్తాను ప్రయ త్నించి యొక లక్షాఇరవయివేల గ్రంథములను పోగుచేయ గలిగెను. క్రీ. శ. 1101 మొదలు 1132 వరకు ఖలీఫా యల్ అమీారే రాజ్యముచేసెను. ఇతనికి అఫ్జాలు అను యోగ్యు డును సమర్థుడును నగు ప్రధానమంత్రి యుండెను. సుపరిపాల నము జరిగెను. ఆకాలమున పాలస్తైన్‌నందలి జరూసలేము లోని ఏసుక్రీస్తు ప్రభువుయొక్కసమాధిని స్వాధీనపర్చుకొనుట కొరకై యూరపులోని క్రైస్తవజాతులు కలిసి ముసల్మానుల మీాద మతయుద్ధములను సలిపిరి. వాటికి (crusades) పవిత్ర యుద్ధములని పేరుపెట్టబడెను. ఆ యుద్ధములు రెండువందల సంవత్సరములు జరిగి తుదకు ముసల్మానులే గెల్చిరి. ఆ యుద్ధ ములలో ఈజిప్టుకూడ కొంతవరకు ముసల్మానులపక్షమున పాల్గొనెను. ఈ ఖలీఫాకు పిమ్మట మంచి ఖలీఫాలు రాలేదు. ఖలీఫాలకుటుంబములలో అంతఃకలహములు చెలరేగెను. మంత్రులు రాజ్యము నాక్రమించిరి. మంత్రులలో మంత్రు లకు కలహములేర్పడెను. ఆఖరు ఖలీఫా ఎల్ అడిడ్ కాల ములో అప్పటి ప్రధానమంత్రియు సైన్యాధిపతియు నగు 'సాల డీను' ఈజిప్టు సింహాసనమధిష్ఠించి ఫాతిమైదు ఖలీఫాపదవిని రద్దుపరచెను.

# ఈజిప్టుదేశ చరిత్ర

## నాలుగవ అధ్యాయము

### మామ్లూకులు - తురుష్కులు

(1)

### మామ్లూకులు

క్రీ. శ. 125—క్రీ. శ. 1517

### సాలడీను సుల్తాను

సాలడీనుసుల్తాను సున్నీశాఖకు చెందినవాడు గావున తాను రాజ్యమునకురాగానే ఈజిప్టులోని మసీదులన్నిటిలోను మరల అబ్బాసీదు (బాగ్దాదు) సున్నీ ఖలీఫాపేర మత గురువుగా శుక్రవారంనాడు నమాజు చదవవలెనని ఆజ్ఞాపించెను. ఈజిప్టుకు రాజుగా సాలడీను పేరకూడ నమాజు చదవబడెను. అతనికాలములో (1171-1193) ఈజిప్టు శాంతిని, సుపరిపాలనమును అనుభవించెను. అతడు కైరోలోను, అలెగ్జాండ్రియాలోను కొన్ని కళాశాలలను పెట్టించెను. అచట సున్నీమతమును నేర్పించెను. విద్యలను కవిత్వమును పోషించెను. వ్యవసాయమును పరిశ్రమలను వృద్ధిచేసెను. తనరాజ్యమును విస్తరింపచేసెను. ఆ కాలమున ముసల్మానులమధ్యను

క్రైస్తవులమధ్యను జరుగుచుండిన మతకలహములలో (crusades) ముసల్మానులపక్షమున ప్రవేశించి గొప్ప జయములను పొందెను. మిగుల నాగరికుడని పాశ్చాత్యులచేతకూడ గౌరవింపబడెను. అతనివంశపురాజులకు 'అయ్యూబిడు'లని పేరు.

## అయ్యూబిడు వంశము

ఆతనివారసులుకూడ బాగుగానే రాజ్యముచేసిరి. రాజ్యములను నిలుపుకొనిరి. మహమ్మదీయ క్రైస్తవ మతకలహములలో జయముల నొందిరి. కాని, సాలడీనుకాలమునుండియు మామ్లూకు బానిసలసైన్యములను పెట్టుకొను ఆచారము ప్రబలెను. వీరే రాజనగరులకు రక్షకులు. క్రమక్రమముగా వీరు మిగుల బలవంతులైరి. ఆఖరు అయ్యూబిడు రాజగు తురాన్‌షా సుల్తానును మామ్లూకులు హత్యగావించి, క్రీ. శ. 1250 వ సంవత్సరమున రాజ్యాధికారమును వహించిరి.

## బెయబర్సు

మామ్లూకులు ప్రథమమున తురాన్‌షా సుల్తానుయొక్క సవతితల్లిని రాణిగ గావించి ఆమెపేరున రాజ్యపాలనము గావించసాగిరి. కాని బాగ్దాదు ఖలీఫా యొక స్త్రీయొక్క రాజ్యదక్షత కంగీకరించనందున, ఆమెను సర్వసేనాధిపతియగు "అయబెకు" అను మామ్లూకుకు వివాహముచేసి ఆయనను సింహాసనము నెక్కించిరి. కొలదికాలమునకు రాణికిని ఆయనకు కలతలుకలిగి రాణి ఆయనను హత్యగావించగ, రాణిని మరియొక మామ్లూకు చంపివేసెను. ఇంతటితో సాలడీనులవంశ మంతరించినది. మరియొక మామ్లూకు సేనాని

'కుటుజ్' అను నాతడు సింహాసనాధీశుడయ్యెను. ఆయనను క్రీ. శ. 1260 వ సంవత్సరమున మామ్లూకుల నాయకుడగు 'బెయబర్సు' హత్యగావించి ఈజిప్టుకు సుల్తానయ్యెను. బెయబర్సు మామ్లూకు రాజ్యస్థాపకుడని చెప్పనొప్పును. ఆయన గొప్పసేనాని. మామ్లూకుల సైన్యములను నావికాదళమును నిర్మాణముచేసెను. మామ్లూకుఅమీర్లకు మామ్లూకు సైనికులకు భూములనిచ్చెను. మామ్లూకుజాతిని బలపర్చెను. సిరియాను తనక్రిందికి తెచ్చుకొనెను. చుట్టుపట్టుల రాజులతో స్నేహముచేసెను.

## మంగోలు సామ్రాజ్యము-బాగ్దాదు ఖలీఫా ఈజిప్టుకు చేరెను

క్రీ. శ 1216 నుండియు చైనాసామ్రాజ్యములోని మంగోలియాలోని పర్వతప్రాంతములనుండి చెంఘిస్ ఖాను అను రణశూరుడు బయలుదేరి, దేశములవెంట దేశములను జయించసాగెను. ఆయనయు ఆయనకుమాళ్లును చైనా మొదలు పశ్చిమమున పోలెండువరకును, అటు రష్యావరకును గొప్ప మంగోలుసామ్రాజ్యమును స్థాపించిరి. ఇది రెండు వందల సంవత్సరములు సాగెను. పిమ్మట నిది విచ్ఛిన్నమయ్యెను. పశ్చిమఆశియాలో ఈ వంశమువారందరును ముసల్మాను మతమును స్వీకరించిరి. వారిలోనుండి బేబరు అను నాయన హిందూదేశముపై దండెత్తి క్రీ. శ. 1526 వ సంవత్సరమున మొగలాయిసామ్రాజ్యమును స్థాపించెను. మంగోలువంశీకులనే మొగలులని పిలచిరి. మొగలులరాజ్యమే

మొగలాయిరాజ్యము. ఈ మంగోలుల సేనాధిపతి యగు హులుంగుఖాన్ క్రీ. శ. 1258 వ సంవత్సరమున బాగ్దాదునగరమును ముట్టడించి ముసల్మానుఖలీఫా నోడించి హత్యగావించెను. ఆ నగరమును దోచుకొని ధ్వంసముచేసెను. ఆ ప్రాంతములన్నియు మంగోలుసామ్రాజ్యముక్రిందికి చేరెను. బాగ్దాదు ఖలీఫాల రాజ్యము అంతరించినది. ఆ ఖలీఫావంశీకుడొకడు ఈజిప్టుకు పారిపోయివచ్చెను. అతనిని ఈజిప్టు మామ్లూకు సుల్తానగు బెయబర్సు తనవద్ద పెట్టుకొని ఆయనను సున్నీ ఖలీఫాగ ప్రకటించి, ఆయనచేత ఖలీఫా సామ్రాజ్యమునకంతకును సుల్తానుగ తనను అభిషిక్తునిగ గావించుకొనెను. అప్పటినుండియు అబ్బాసీదు వంశీకులను ఖలీఫాలుగ తమవద్దనే పెట్టుకొని మామ్లూకు సుల్తానులు వారిపేర రాజ్యము చేయుచుండిరి. ఖలీఫాలు కేవలము మతపీఠాధిపతులుగ నుండిరి.

## మామ్లూకు అమీరుబృందము

బెయబర్సు మరణించినపిమ్మట అతనికుమారుని మామ్లూకుబృందము రాజ్యభ్రష్టుని గావించి, తమలో పెద్దయగు 'కలాను' అనునతనిని సుల్తానును గావించిరి. అతని కుమారుడును మనుమడునుకూడ రాజ్యముచేసిరి. మనుమడగు నాసరెద్దీన్ కాలములో శిల్పచాతురికి ప్రసిద్ధికెక్కిన సౌధములను మసీదులను కట్టించెను. విద్యలను కళలను పోషించెను. అభివృద్ధికరమైనపాలనము జరిగెను. అతనికి పిమ్మట మామ్లూకు అమీరులు నలుబదిసంవత్సరములలో పన్నెండుమంది సుల్తానుల నెక్కించి హత్యగావించి క్రొత్తవారిని సుల్తానులను చేయు

చుండిరి. సుల్తానులు నామమాత్రావశిష్టులు. రాజ్యాధికార మంతయు ఉద్యోగములన్నియు అమీరులచేతులలో నుండెను.

## సుల్తానులను అమీరుబృంద మెన్నుకొనుట

క్రీ శ. 1382లో సార్కేషియా బానిసయగు 'బారుబుకు' అను అమీరు సింహాసనము నాక్రమించెను. అతను మరణించగనే మామ్లూకు అమీరు సుల్తానుల నెన్నుకొను ఆచారమును ప్రవేశపెట్టిరి. తురుష్క బానిసలేగాక గ్రీకు, మంగోలు, సార్కేషియను బానిసలు కూడ మామ్లూకులలో చేర్చుకొనబడిరి. సుల్తానుచుట్టు పెద్ద అమీర్లు చిన్న అమీరులు నుండిరి. ప్రతి అమీరు కొంత సైన్యమును పెట్టుకొనెను. ఆ సైనికులందరు మామ్లూకులే. ఎవరు బాగుగ కుట్రలుసలిపి ఎక్కువ మందిని కూడగట్టుకొనిరాగలిగితే వారు సుల్తానులైరి. ఆ సుల్తానులు తమకు మద్దతుచేసిన మమ్లూకులకందరికి భూములు ద్రవ్యము నిచ్చిరి. ఏ సుల్తానుకును తాను చాలకాలము రాజ్యముచేతునని నమ్మకములేదు. మరియొక కుట్రదారుడు బయలుదేరి పలుకుబడి సంపాదించి సుల్తానును హత్యగావించి తాను సుల్తానుగ నెన్నుకొనబడును. సుల్తానుల ఎన్నికలలో ఈ మామ్లూకు అమీర్లు కక్షలుగా నేర్పడి దారుణహత్యలను గావించుకొనెదరు. కాని బయటవారు వచ్చినపుడు మామ్లూకులందరు నేకమై యెదిరింతురు. శూరులైన మంగోలులను మామ్లూకులబృందమువా రోడించి ఈజిప్టులో కాలుపెట్టకుండ చేసిరి. ఈవిధముగా మామ్లూకులరాజ్యము క్రీ. శ. 1517 వరకును జరిగెను. నూటముప్పదిసంవత్సరములలో ఇరు

వది ముగ్గురు సుల్తాను లెన్నుకొనబడిరి. వీరిలో పదునలుగురు సుల్తానులు ఒక్కొక్కరు ఒకసంవత్సరముకూడ రాజ్యముచేయ లేదు. ముగ్గురు మాత్రమే అయిదుసంవత్సరములకన్న యెక్కువ కాలము రాజ్యముచేసిరి. సుల్తానులు తమకాలము చాల అస్థిరమైనదనియే నమ్మిరి. ఏదో స్మారకచిహ్నము శాశ్వత ముగనుండుటకై తమపేర కట్టించుచుండిరి. ఈవిధముగా శిల్ప చాతురి వృద్ధియయ్యెను. గొప్పగొప్ప మసీదులు సౌధములు విద్యాలయములు వైద్యాలయములు కట్టించబడెను. విద్యలు కళలు ప్రోత్సహించబడెను. అమీరులు కూడ శిల్పమును, విద్యలను, కళలను పోషించిరి. క్రీ. శ. 1517 లో తురుష్క సామ్రాజ్యాధీశుడగు సుల్తాను 'సలీము' ఈజిప్టును జయించి లోబర్చుకొని తురుష్క (అట్టోమాను) పాలనమును స్థాపించెను.

## (2)

## (అట్టోమాను) తురుష్కులపాలనము

### క్రీ. శ. 1517–1841

### తురుష్కసామ్రాజ్యము.

చైనాసామ్రాజ్యములోని మంగోలుప్రాంతమందున్న 'తుర్క' అను పేరుగల పర్వతప్రదేశములనుండి తుర్కలను జాతివారు తండోపతండములుగ క్రీ. శ. పదకొండవ శతాబ్ద ములో ఆశియాఖండములో పశ్చిమముననున్న అనటోలియా దేశమునకువచ్చి నివాసమేర్పరుచుకొనిరి. కొలదికాలములో

వారందరును ముసల్మానులైరి. వారికి తురుష్కులనియు, అనటోలియా దేశమునకు తురుష్కదేశమనియు (Turkey) పేర్లు వచ్చెను. ఆ దేశములో వారికి నాయకులుగనున్న అట్టోమానురాజవంశమువారు క్రీ. శ. 1399 లో రాజ్యస్థాపనము గావించిరి. వారు శీఘ్రకాలములో ఆశియా, ఆఫ్రికా, యూరపు ఖండములు కలియుచోట గొప్ప సామ్రాజ్యమును సంపాదించిరి. అచటి దేశములన్నియు వారిక్రిందకు వచ్చెను. దానికి తురుష్కసామ్రాజ్యమని పేరు (Turkish Empire). అదివరకే పారసీకసామ్రాజ్యము, అలెగ్జాండరుసామ్రాజ్యము, రోమను సామ్రాజ్యము, అరబు ఖలీఫాలసామ్రాజ్యము, మంగోలు సామ్రాజ్యము ఒకదాని తరువాత యొకటి ఆ ప్రదేశమునందే యేర్పడి కొంతకాలము వృద్ధిచెంది, పిమ్మట కూలిపోయినవి. అటులనే (అట్టోమాను) తురుష్కసామ్రాజ్య మేర్పడినది. కొంతకాలమునకే సామ్రాజ్యముకూడ కూలిపోవనారంభించినది. పూర్తిగ కూలిపోవుటకు 1916 వరకు పట్టెను. తురుష్కదేశము మాత్రము పాశ్చాత్యసామ్రాజ్యవాదులదాడినుండి తప్పించుకొని 1922లో స్వతంత్రమును స్థాపించుకొనినది. ప్రతి సామ్రాజ్యము కొంతకాలమునకు కూలిపోవుటయే మానవచరిత్రలో జరిగినది.

### ఈజిప్టు తురుష్క సుల్తానుక్రిందికి వచ్చెను, ఆయన ఖలీఫా అయ్యెను

అట్టోమాను తురుష్కసుల్తాను 1453 లో యూరపు ఖండములోని కాన్‌స్టాంటినోపిలు నగరమును జయించి అచట

తన రాజధాని నేర్పరచుకొనెను. 1517 లో సుల్తాను సలీము ఈజిప్టుపై దండెత్తి, మామ్లూకుల నోడించి మామ్లూకు సుల్తానగు ట్యుమానుబేను పట్టుకొని హత్యగావించి కైరో నగరమున ప్రవేశించి రాజ్యాభిషిక్తుడయ్యెను. ఆ నగరమున మామ్లూకులక్రింద శరణుజొచ్చియున్న 'ముతావక్కిలు' అను పేరుగల అబ్బాసీదు ఖలీఫాను కాన్స్టాంటినోపిలుకుగొనిపోయి యచట ఖైదుచేసెను. 'సలీము'కు పిమ్మట రాజ్యమునకు వచ్చిన 'సులేమాన్‌దిగ్రేటు' సుల్తాను అబ్బాసీదు ఖలీఫాను నిర్బంధమునుండి వదలివేసి ఆయనచేత ఖలీఫాపదవిని, దానికి సంబంధించినహక్కులన్నిటిని తనకు సంక్రమించినట్లు వ్రాయించుకొని ఆయనను ఈజిప్టుకు పంపివేసెను. ఆయన కొలదికాలములో ఈజిప్టులో మరణించెను. 1538 నుండియు తురుష్క సుల్తానులే ఖలీఫాలై యావత్ప్రపంచములో ఇస్లాముమతములోని సున్నీ శాఖకు పీఠాధిపతులైరి.

## అచ్చమైన విదేశపాలనము - ఈజిప్టుయొక్క క్షీణత

తురుష్కసుల్తానులు 1517 మొదలు 1804 వరకును ఈజిప్టును తమ రాజప్రతినిధిద్వారా పాలించిరి. ఆయనకు 'పాషా' యని బిరుదము. అది అచ్చమైన విదేశపాలనము. అన్ని విదేశపాలనములవలెనే అది ఈజిప్టును క్షీణింపజేసెను. ఈజిప్టు తురుష్కసామ్రాజ్యములోభాగమై తన వ్యక్తిత్వమును గోల్పోయినది. విదేశమగు తురుష్కములోనున్న సుల్తానులు దూరముననున్న ఈజిప్టుప్రజలయొక్క బాగోగులనుగూర్చి యాలోచించలేదు. ఈజిప్టువ్యవహారములను తమ

రాజప్రతినిధులగు పాషాలకు వదలివేసి తాము తమస్వదేశ మునుగూర్చియు తమ సామ్రాజ్యవిస్తరణమును కాపాడుకొను టనుగూర్చియు మాత్రమే శ్రద్ధవహించిరి. తురుష్క బానిస బృందమగు 'జనీసరీ' పటాలములు ఈజిప్టు నాక్రమించెను. ఇచటి మామ్లూకుసైనికులతో అశ్వదళము నేర్పరచిరి. మామ్లూ కుల పలుకుబడి ఈజిప్టులో తురుష్క పాలనము క్రింద తగ్గలేదు. ముఖ్యమైన ఉద్యోగములన్నియు మామ్లూకుఅమీర్లకే ఇవ్వ బడెను. రాష్ట్రగవర్నరులుగ వీరే నియమింపబడిరి. కొన్ని జనీసరీ పటాలములపై సేనానాయకులుగకూడ నియమింపబడిరి. మామ్లూకులు సంపాదించిన భూములన్నియు కొలతలుగొలిచి వారిక్రిందనే ఖాయపర్చబడెను. ఎప్పటికప్పుడు క్రొత్తబానిస లను విదేశములనుండి కొనితెచ్చి మామ్లూకులు తమ సంఘ మును బలపర్చుకొనుచుండిరి, ఇంతేగాక తురుష్క దేశము నుండి వచ్చినవారుకూడ ఈజిప్టులో గొప్ప యుద్యోగములు చేసియు భూములను సంపాదించియు బలవంతులైరి. ఇటు విదే స్థుల యాజమాన్యము దేశములో హెచ్చెను. ఈజిప్టుప్రజలు సుల్తానుప్రభుత్వముయొక్క ప్రోత్సాహమేమియు లేక అణగి పోయిరి. అనేకసార్లు గొప్పక్షామములకులోనయిరి. మామ్లూ కుబృందనాయకునికి షేకు-ఎల్-బలాడని బిరుదము. అతడు చాల బలవంతుడై తురుష్కసుల్తానువద్ద గొప్ప పలుకుబడిగల వాడై పాషాలను ధిక్కరించగలస్థితిలోకి వచ్చెను. కొలదికాల ములో పాషాలు, మామ్లూకు అమీర్లు చెప్పినచొప్పున నడచు వారైరి. సుల్తానులు మామ్లూకులకు, వారికి సహాయకులుగా నున్న మామ్లూకు, జనీసరీ సైన్యములకు భయపడి, పాషా

లకు మద్దతుచేయక, మామ్లూకు అమీర్లకే మద్దతుచేసిరి. ఇంకొక కష్టమేమనగా తురుష్కసుల్తానుల నాశ్రయించి పాశ్చాత్య దేశములవారు తురుష్కసామ్రాజ్యమునందంతటను కాపురముండి వర్తకము చేసికొనుటకు ఫర్మానాలను పొందిరి. ఆ సామ్రాజ్యముయొక్క తక్కినభాగములందువలెనే ఈజిప్టులోకూడ నివసించి వర్తకము చేసికొనసాగిరి. ఇంతటితో పోలేదు. ఈ తెల్లవారు ఎగుమతి దిగుమతి చేసికొనెడి సరకుల పైన నూటికి అయిదుకన్న ఎక్కువ సుంకములు విధించకుండ గను, తెల్లవారు ముద్దాయిలుగనున్న క్రిమినలు కేసు లోను, ప్రతివాదులుగనున్న సివిలు కేసులోను, ఆ తెల్లవారి ప్రభుత్వప్రతినిధులగు కాన్సలులు, వారేర్పరచిన తెల్ల న్యాయాధిపతులుమాత్రమే విచారణచేసి తీర్పుచెప్పవలెను గాని, సుల్తానుయొక్క ప్రభుత్వమున కధికారములేకుండగను, సుల్తానుయొక్క పోలీసులకు చట్టములకు తెల్లవారు లోబడ కుండగను కూడా సుల్తానులు ఫర్మానాలనిచ్చిరి. ఇందువలన మిగిలిన తురుష్కసామ్రాజ్యములోవలెనే ఈజిప్టులోకూడ తెల్లప్రభుత్వముల కాన్సలు లేర్పడిరి. తెల్లన్యాయాధిపతుల కోర్టు లేర్పడెను, తెల్లవర్తకులు ప్రవేశించిరి. తమసరుకులను ఈజిప్టు అంగళ్ళలోనింపిరి. తెల్లవారెట్టి అక్రమములు దౌర్జ న్యములు చేసినను ఈజిప్టు ప్రభుత్వమునకు ఈజిప్టుకోర్టులకు చట్టములకు వారిని శిక్షించుట కధికారములేకుండెను. కాల క్రమేణ తెల్లవారి సరుకులపోటీలో ఈజిప్టు పరిశ్రమలు దెబ్బ తినెను. తెల్లవారి ప్రాబల్యము క్రమముగా బాగావృద్ధిచెందెను. ఈ తెల్లవారి సమస్య చాలకాలము ఈజిప్టును పీడించినది.

## నెపోలియను సేనాని

ఫ్రెంచివిప్లవమునకు పిమ్మట ప్రపంచసామ్రాజ్యము కొరకు ఆంగ్లేయులకును, ఫ్రెంచివారికిని జరిగిన యుద్ధకాలములో ఫ్రెంచినాయకుడగు నెపోలియనుసేనాని 1798 లో సముద్రముమీద బయలుదేరి కొంతసైన్యముతో ఈజిప్టులో దిగెను. అక్కడనుండి హిందూదేశమునకు వచ్చి ఆంగ్లేయులను వెడలగొట్టి హిందూదేశములోకూడ ఫ్రెంచిరాజ్యస్థాపన చేయవలయునని ఆయన ఆశయము. హిందూదేశములో తమ స్వతంత్రముకొరకు ఆంగ్లేయులతో పోరాడుచున్న టిప్పూసుల్తాను, మహారాష్ట్రప్రభువులు ఆతనితో చేరుదురని ఆంగ్లేయులకు భయము కలిగెను. "ఇంగ్లాండును మనము నిజముగా నాశనముచేయదలచినచో మనము ఈజిప్టును స్వాధీనపర్చుకోవలెను" అని ఆయన ఫ్రెంచిప్రభుత్వమునకు వ్రాసెను. కాని ఫ్రెంచివారికపుడు తగినంత నావికాదళములేకుండెను. ఆంగ్లేయ నౌకాసైన్యము నెపోలియనును వెంబడించి 'అబూబికరుబే' యను చోటి ఫ్రెంచినౌకాదళమును నాశనముగావించెను.

## మామ్లూకుల నాశనము

నెపోలియను తనసైన్యముతో ఈజిప్టును ఆక్రమణచేయసాగెను. మామ్లూకులమధ్య నెపోలియనుమధ్యను 'పిరమిడ్ల' వద్ద గొప్పయుద్ధము జరిగి, వేలకువేలుగ మామ్లూకు అమీరులు తమ సైనికులతోకూడ హతులైరి. దానితో మామ్లూకుల బలము ఈజిప్టులో శాశ్వతముగ అణగిపోయినది. మరల నెన్నడును తలయెత్తలేదు. కైరో మొదలగు కొన్నిచోట్ల

ఈజిప్టుదేశీయులు జరిపిన తిరుగబాట్లను నెపోలియను తేలికగ నణచి, 1798 మొదలు 1801 వరకు ఈజిప్టుపై ఫ్రెంచిపాలనమును సాగించెను. ఆయన అచట గొప్ప మసీదును కట్టించెను. ఆయనయును ఆయనక్రింది సేనాధిపతులును ఇస్లాము మతమునందు సానుభూతిని ప్రకటించిరి. ఏసుక్రీస్తు తల్లియగు మరియమ్మకును మహమ్మదుప్రవక్తకును అన్ని యుత్సవములలోను సమానగౌరవము నిచ్చిరి. కొన్ని గొప్పగొప్ప సంస్కరణములను పరిపాలనాపద్ధతిలో ప్రవేశపెట్టసాగిరి. కాని ఫ్రాన్సులో జరిగిన రాజకీయమార్పులనుబట్టి నెపోలియను సేనాని 1799 లో ఫ్రాన్సుకు వెడలిపోయెను. ఆంగ్లేయులు తురుష్కసుల్తాను సహాయమును గొనివచ్చి, 1801లో ఈజిప్టులోని ఫ్రెంచిసేనల నోడించగ, ఫ్రెంచిసేన లెటులనో తప్పించుకొని ఫ్రాన్సుకు చేరెను. తురుష్కసుల్తానుతో చేసికొనిన యొడంబడికప్రకారము ఆంగ్లేయసేనలుకూడ 1803వ సంవత్సరమున ఈజిప్టును వదలివెళ్లెను.

—(౦)—

# ఈజిప్తుదేశ చరిత్ర

౽

## అయిదవ అధ్యాయము

### నవీన ఈజిప్టు - సూయజుకాలువ

(1)

### మహమ్మదాలి నవీన ఈజిప్టు జాతీయనిర్మాత

మామ్లూకులు పడిపోయి, ఫ్రెంచివారు, ఆంగ్లేయులును లేచిపోగనే, మహమ్మదాలియను సైన్యాధిపతి ఈజిప్తుపై తన రాజ్యమును స్థాపించి 45 సంవత్సరములు ఈజిప్టు దేశీయులకు శాంతిని, సుపరిపాలనమును, అభివృద్ధిని ప్రసాదించెను. ఆయనను నవీన ఈజిప్టు జాతీయనిర్మాతయని ఆ దేశీయులు గౌరవించుచున్నారు. ఆంగ్లేయుల ప్రోత్సాహముచే మామ్లూకులు కొందరు సుడానుకు పోయి దాని నాక్రమించగ మహమ్మదాలి వారినోడించి సుడానుదేశమును మరల ఈజిప్టులో చేర్చెను. తురుష్క సుల్తానునుండికూడ ఈజిప్టును స్వతంత్ర జాతిగ గావించవలెనని మహమ్మదాలి ప్రయత్నించెను. పెక్కు సంవత్సరములు ఆయనకును తురుష్క సుల్తానుకును యుద్ధములు జరిగెను. కొంతకాలము మహమ్మదాలియే జయములు పొందెను. అరబుదేశముల నాక్రమించెను. ఈ యుద్ధములు యూరపుసామ్రాజ్యవాదులకుట్రలలో భాగమయ్యెను. ఇంగ్లాండు తురుష్కసుల్తానుప్రక్కన చేరెను. ఫ్రాన్సు, ఆస్ట్రి

యాలు మహమ్మదాలిపక్షమున నుండిరి. తుదకు 1841 లో ఉభయపక్షములవారికిని లండను సంధిని కుదిర్చిరి. దానివలన మహమ్మదాలి ఈజిప్టుయొక్క వంశపారంపర్యాయపుహక్కుతో రాజగునట్లును, 'పాషా' యను బిరుదుగలిగి ఈజిప్టును పాలించునట్లును, తురుష్కసుల్తానుయొక్క సార్వభౌమత్వ మంగీకరించి ప్రతిసాలునకు ఆయనకు కొంతకప్పమును చెల్లించునట్లును, ఒడంబడిక జరిగెను. ఈజిప్టుమీద యావత్తు అధికారము మహమ్మదాలికి, ఆయనవారసులకు కలిగెను. తురుష్కసుల్తానుయొక్క సార్వభౌమత్వము నామమాత్రావశిష్టముగ నుండెను. నవీన ఈజిప్టుజాతి ప్రారంభమయ్యెను.

## ప్రజలకు తండ్రి

మహమ్మదాలి ఈజిప్టుప్రజలకు అనేకమేళ్ళను చేసెను. ఆ దేశములోకి ప్రత్తి, నీలిమందు, జనపవిత్తనములను తెచ్చి, ఆ పైర్లను వృద్ధిచేయించినవా డాయనే. నైలునదిమీద గొప్ప ఆనకట్టను కట్టించి నీటిపారుదలల నెంతయో వృద్ధిచేసెను. రైతులవద్దనుంచి ధాన్యమునుకొని ప్రభుత్వమే విదేశవర్తకముచేసి లాభముపొందు నేర్పాట్లుగావించెను. రైతులకు సకాలములో సరియైన ధరలు లభించెను. ఈజిప్టులోని రైతులకు 'ఫెల్లాహీను'లని పేరు. వారి కాయన భూములలో శాశ్వతహక్కును కలుగచేసెను. ప్రత్యేకముగ నొక విద్యామంత్రి నేర్పరచి ఆయనయాజమాన్యముక్రింద జాతీయవిద్యావిధానమును నెలకొల్పి ప్రాథమిక, మధ్యమ పారిశ్రామికపాఠశాలలను చాల నెలకొల్పెను. వీటిని తనఖీచేయుట కొక

ఫ్రెంచివిద్యానిపుణుని నియమించెను. పరిశ్రమాభివృద్ధికి విశేషముగప్రోత్సాహమిచ్చి దేశముయొక్క ఐశ్వర్యమును పెంపొందించెను. అదివరకు ఈజిప్టు ప్రభుత్వసైన్యములు విదేశస్థులతో నిండియుండెను. ఆ పద్ధతిని మాన్పించి ఈజిప్టుప్రజలనుండియే సైన్యములను నౌకాదళమును నిర్మాణముగావించెను. ఆంగ్లేయులను నమ్మక, వారు రైల్వేలు వేసుకొనుహక్కును అడుగగా నివ్వలేదు. ఈజిప్టును పన్నెండురాష్ట్రములుగ విభజించి వాటిపై స్వదేశీయులగు గవర్నరులను నియమించెను. 1826లో ప్రివీకౌన్సిలు, కౌన్సిలు ఆఫ్ స్టేటు, మంత్రివర్గము అను మూడు రాజ్యాంగప్రతిష్ఠాపనలను నెలకొల్పెను. వైభవములతో కాలముగడుపుటయు విశేషసొమ్ము దుబారాచేసి పెద్దపెద్దభవనములను కట్టించుటయు ఆయన కిష్టములేదు. మిగుల వినమ్రత గల జీవితమును గడపుచు ఏ వ్యయముచేసినను తన ప్రజల లాభముకొరకే చేయుచు రాజ్యపాలనమును గావించెను. ఉద్యోగస్థులలో లంచగొండితనము లేకుండచేసెను. కాప్టులు (క్రైస్తవులు) ముసల్మానులను భేదములులేక ముసల్మానులతోపాటు కాప్టులకుకూడ పెద్దయుద్యోగముల నిచ్చెను. ప్రజలాయనను తమ తండ్రియని ప్రేమించిరి. ఆయన వారిని తన బిడ్డలుగ చూచెను. ఈ గొప్పరాజు 1849 లో మరణించెను. ఇటీవలనే రాజరికము రద్దు అగువరకును ఆయనసంతతివారే ఈజిప్టుకు రాజులుగ నుండిరి.

### సయ్యదు పాషా సూయజుకాలువను త్రవ్వ నారంభించెను

మహమ్మదాలి పాషా చనిపోయిన తరువాత ఆయన మనుమడగు అబ్బాసు పాషా రాజ్యమునకువచ్చెను. ఆరు

సంవత్సరములు పాలించెను. ఈతడు విదేశీయులను ద్వేషించెను. విదేశభాషలను నేర్చుకొనుటకు నిరాకరించెను. ఫ్రెంచి యుద్యోగస్థులను తీసివేసెను. తురుష్కసుల్తానుతో స్నేహముగ నుండెను. పూర్వాచారపరాయణుడై మున్సల్మాను మతము నెక్కుడుగ ప్రేమించెను. కఠినమగుపద్ధతులతో సొమ్ము వసూలుచేసెను. కాని తురుష్కసుల్తానును ఆంగ్లేయు లాశ్రయించి ఆయనసిఫారసుపైన ఇతనినుండి అలెగ్జాండ్రియా నుండి కైరోనగరమువరకును రైల్వేను వేయుహక్కునుపొందిరి. మహమ్మదాలి యొప్పుకొనని పనిని ఆయనమనుమడు చేసెను.

అబ్బాసు పాషా మరణానంతరము అతని పినతండ్రి సయ్యదు పాషా ఈజిప్టుకు రాజయ్యెను (1854-1863). ఈతడు ఫ్రెంచిభాషను బాగుగ నభ్యసించి, నవనాగరికపద్ధతుల నవలంబించి భోగలాలసుడై విశేషమగు దుబారాఖర్చుచేయ సాగెను. తన ఆబ్డిన్ రాచనగరులో గొప్పవారి కాతిథ్యమిచ్చు గదులనలంకరించుటకుగాను సామానులకై ఒకకోటిఫ్రాంకులను ఖర్చుచేసెను. చాలవర కా సామానులను ఫ్రాన్సునుండి తెప్పించెను. కొన్ని రైళ్ళు వేయుటకుగాను ఫ్రెంచిషాహుకార్లవద్ద గొప్ప ఋణములను జేసెను. సూయజుకాలవను త్రవ్వించుటకుగాను ముప్పదిమూడులక్షల సవరనులను ఆంగ్లేయషాహుకార్లవద్ద ఋణముచేసి యా కాలవను త్రవ్వ నారంభించెను. అందులో నతనికి ఆ షాహుకార్లు ఇరువైనాలుగు లక్షలు మాత్రము రొక్కముగానిచ్చి, ముప్పదిమూడులక్షలకు ప్రామిసరీనోట్లు వ్రాయించుకొనిరి. ఆ నోట్లకు వడ్డి సాలుకు నూటికి ఏడుచొప్పున చెల్లించవలెను. ఆయన మరణించునప్పటికి విదేశ

షాహుకార్లకాయన ఒక కోటి సవరనులు బాకీపడెను.

## సూయజుకాలువయే ఈజిప్టు దురదృష్టమునకు కారణము

"రాజకీయదృష్టితో పరికించినచో ఈ ఋణమునంతను సయ్యద్ పాషా తన సొంత వైభవముల కుపయోగించుకొని యుండినచో ఈజిప్టుదేశమునకు తీరనిహాని కలిగియుండెడిది కాదు. కొంతసొమ్ము ఖర్చుచేసి సూయజుకాలువను త్రవ్వించుటతోడనే, (1) సముద్రములమీద బ్రిటిషువారియధికారము (2) హిందూదేశము బ్రిటిషువారిక్రింద శాశ్వతముగనుండుట, యను రెండు ప్రధానసమస్యలకు సంబంధించిన రాజకీయ వర్తక వ్యవహారములదృష్టితో ఆంగ్లేయులకు ఈజిప్టుదేశము ప్రాధాన్యమును వహించినది. ఆ దేశమునందు ఆంగ్లేయుల స్వలాభము చాలగ హెచ్చినది. అంతవరకును రష్యా చక్రవర్తి కాన్‌స్టాంటినోపిలును ఆక్రమించకుండ చూచినటులనే కైరోనగరమును ఫ్రెంచివా రాక్రమించకుండ కాపాడుటతో నాంగ్లేయులు తృప్తిచెందియుండిరి. సూయజుకాలువ త్రవ్వబడగనే కైరోలో నితరప్రభుత్వములు చేరకుండగ దానిని తమక్రిందనే యుంచుకొనవలసిన ఆవశ్యకత ఆంగ్లేయులకు కలిగినది"............సూయజుకాలువలో నాంగ్లేయులకు గల స్వలాభము, సుడాను దేశముతో నాంగ్లేయషాహుకార్లకు గల సంబంధము- ఈ రెండును ఈజిప్టుదేశము స్వతంత్రమును పొందకుండ అడ్డుతగులుచున్నవి. ఈజిప్టుదేశము ఆంగ్లేయుల పాలనముక్రిందకి వచ్చుటకు సూయజుకాలువయే కారణ మయ్యున్నది.........ఈజిప్టు పాశ్చాత్యదేశములనుండి ఆర్థి

కముగను రాజకీయముగను తన స్వాతంత్రమును నిలబెట్టు కొనగలిగిన బలమైన స్థితిని పొందిన పిమ్మటనే ఈ కాలవను త్రవ్వించుటకు తలపెట్టవలసియుండెను" అని 'యంగు' అను ఆంగ్లేయగ్రంధకర్త తన 'ఈజిప్టు' అను గ్రంథమునందు వ్రాసి యున్నాడు. సూయజుకాలవవలన తన ప్రభుత్వఆదాయము ఎక్కువగునని మాత్రమే తలచి సయ్యదుపాషా దానినిత్రవ్వించ నారంభించెను కాని యది తర్వాతకాలమున ఈజిప్టుకు సంభవించిన దురదృష్టముల కన్నిటికిని కారణమయ్యెను. మధ్యధరాసముద్రమును ఎర్రసముద్రమునుండి వేరుచేసి ఆఫ్రికా ఖండమును ఆశియాఖండముతో కలిపిన సూయజుభూసంధిలో నీ కాలవను త్రవ్వి సూయజుజలసంధిగా మార్చిరి. అదివరకు ఇంగ్లాండునుండి అట్లాంటికు మహాసముద్రములోగుండ ఆఫ్రికాఖండముయొక్క దక్షిణపుకొననుచుట్టి హిందూమహాసముద్రముగుండ హిందూదేశమునకు వచ్చుటకు పొగయోడ మీాద మూడు నెలలు పట్టుచుండెను. ఆప్రయాణము సూయజు కాలవ త్రవ్వబడగానే మధ్యధరాసముద్రము, సూయజుకాలవ, ఎర్రసముద్రము, అరేబియాసముద్రములగుండ హిందూదేశమును చేరుటకు పదునాలుగుదినములు మాత్రము పట్టుచున్నది. ఇంగ్లాండునుండి హిందూదేశమునకు మాత్రమే గాక, బర్మా, మలయా, సింగపూరు హాంగుకాంగు, ఆస్ట్రేలియాలకు పోవుటకు కూడ సూయజుకాలవయే ప్రధాన మార్గమైనది.

## (2)
## సూయజుకాలువకంపెనీ

యం. డి. లెస్సెప్సు అను ఫ్రెంచి ఇంజనీయరు సయ్యదుపాషా స్నేహమును సంపాదించి సూయజుకాలవను త్రవ్వుహక్కును పొంది, అందుకొరకొక కంపెనీ నేర్పర చెను. ఈ కంపెనీలో సగభాగము ఫ్రెంచిషాహుకార్లకును మిగిలిన సగభాగము ఈజిప్టు, తురుష్కప్రభుత్వములకును చెందవలెను. మొత్తపు పెట్టుబడిసొమ్ము ఇరువైకోట్ల ఫ్రాన్కులలో పదికోట్లను ఫ్రెంచిషాహుకార్లు పెట్టుబడిపెట్టిరి. మిగతా సొమ్ము ఈజిప్టు, తురుష్కప్రభుత్వములకు ఋణముగనిచ్చుట కంగీకరించిరి. ఆ కాలువ త్రవ్వుప్రదేశము, దానికి చుట్టుపట్టుల నున్న గనులు త్రవ్వుకొనుహక్కు ఈ కంపెనీకి తొంబదితొమ్మిది సంవత్సరముల కౌలుకివ్వబడెను. ఆరుసంవత్సరములలో పని పూర్తికావలెను. త్రవ్వుటకు కావలసిన కూలిపనిలో నైదింట నాలుగువంతుల కూలిని ఈజిప్టుప్రభుత్వమువారూరక సప్లయిచేయవలెను. ఒక వంతుకుమాత్రమే మజూరీని కంపెనీ చెల్లించవలెను. కాలవలోగుండ ప్రయాణముచేయు ప్రతి మనుష్యుడును, ప్రతి టన్నుసరుకుకును పది ఫ్రాన్కుల చొప్పున చెల్లించవలెను. వచ్చెడి లాభములో నూటికి డెబ్బదియైదువంతులు కంపెనీభాగస్తులకును పదివంతులు కంపెనీనేర్పరచిన యం. డి. లెస్సెప్సుకును, పదిహేనువంతులు ఈజిప్టుప్రభుత్వముకును పంపిణీకావలెను. ఈ కాలవ త్రవ్వుకొనుహక్కు ఫ్రెంచి ఇంజనీయరు కిచ్చినచో తమ

కేమైన అభ్యంతరము కలదాయని సయ్యదుపాషా ఆంగ్లప్రభు త్వము నడిగెను. ఆంగ్లేయులకు నిజముగ నిష్టములేదు. కాని యపుడు ఆంగ్లేయులును ఫ్రెంచివారును కలసి రష్యాను కాన్‌స్టాంటినోపిలును మ్రింగకుండ ఆటంకపర్చుటకై క్రిమి యాయుద్ధములో పోరాడుచుండిరి కావున, ఆంగ్లేయ ప్రధాన మంత్రి అపుడు చేయగలిగినది, రెండు సంవత్సరములవరకు తురుష్కసుల్తాను యొక్క అనుమతిరాకుండ నాపుదలచేయ గలుగుట మాత్రమే అయ్యెండెను. పిమ్మట సయ్యదుపాషా కైరో అలెగ్జాండ్రియా రైల్వే వేయుహక్కును ఆంగ్లేయులకు ఖాయపర్చి, ఈజిప్టులో బ్యాంకు ఆఫ్ ఈజిప్టు పేరున నొక బ్యాంకిని స్థాపించుహక్కును ఆంగ్లేయులకు కలుగజేసి, 1857 వ సంవత్సరమున హిందూదేశములో నాంగ్లేయప్రభుత్వముపై జరిగిన సిపాయీలతిరుగబాటను పేరుగల స్వతంత్రపోరాటము నణచుటకుగాను ఇంగ్లాండునుండి ఆంగ్లసేనలు ఈజిప్టు సూయజుభూసంధులగుండ హిందూదేశమునకు పోవు అధికా రమును కలుగచేయగా, ఈ ప్రతిఫలములను పొంది ఆంగ్లే యులు సూయజుకాలవకంపెనీకి తమకుగల యభ్యంతరము లను వదలుకొనిరి. తురుష్కప్రభుత్వపు అంగీకారము రాక మునుపే సయ్యదుపాషా 1859 ఏప్రిలు 25 వ తేదీన కాలవ త్రవ్వపనిని ప్రారంభింపజేసెను. 1863 లో సయ్యదుపాషా మరణించునప్పటికి కాలవత్రవ్వపనికి అనేక కష్టములు కలిగెను.

## సూయజుకాలువ తెరవబడెను

సయ్యదుపాషా మరణించగనే ఆయనకుమారుడగు ఇస్మాయిల్ పాషా రాజ్యమునకు వచ్చెను. ఈయన సూయజు

కాలవత్రవ్వు షరతులను తిరగతోడెను. ఈయనకును యం.డి. లెస్సెప్సుకును మనస్పర్థ లేర్పడెను. సూయజుకాలవ పూర్తిగా ఈజిప్టుప్రభుత్వమునకు చెందవలెనని ఇస్మాయిల్ పాషా పట్టుపట్టెను. మజూరిలేకుండ ఊరికెనే బలవంతముగ కూలీలచేత పనిచేయించుటవలన పెద్ద కల్లోలము బయలుదేరెను. కూలీలను చాల క్రూరముగ చూచుచున్నారను ఆందోళనమునకు ఆంగ్లేయులు పూనుకొనిరి. తురుష్కసుల్తానుచేత నిర్బంధ కూలీని ఆపివేయించుచు ఫర్మానాను తెప్పించిరి. కాలవ త్రవ్వుపనిలో నియమింపబడిన ప్రతికూలివానికిని మజూరి ఇవ్వవలసివచ్చెను. ఈ నష్టపరిహారముక్రింద మార్పుచేయబడిన సూయజుకాలవకంపెనీకి ఇస్మాయిల్ పాషా కొంత సొమ్ము చెల్లించవలసివచ్చినది. సూయజుకాలవ కిరుప్రక్కలనున్న భూములలో గనులు త్రవ్వుకొను హక్కును కంపెనీనుండి తీసివేసినందుకు ఇస్మాయిల్ పాషా మరికొంతసొమ్ము కంపెనీకివ్వవలసివచ్చెను. వీటియన్నిటిక్రింద ఇస్మాయిల్ పాషా కంపెనీ కెంతసొమ్మునివ్వవలెనో పరిష్కరించుటకై ఫ్రాన్సు చక్రవర్తిని మధ్యవర్తిగ కోరుకొనిరి. ఆయనతీర్పుప్రకారము కంపెనీకి ఇస్మాయిల్ పాషా ముప్పదిమూడులక్షల అరవై వేల నవరసులను చెల్లించవలసివచ్చినది. దీనిని చెల్లించుటకు ఇస్మాయిల్ పాషా విదేశషాహుకార్ల వద్ద ఋణముచేసెను. ఇన్ని ఆటంకములు కలిగినను ఎటులనో ఇస్మాయిల్ పాషా పట్టుపట్టి సూయజుకాలవ త్రవ్వుపనిని పూర్తిచేయించి 1869వ సంవత్సరము నవంబరు 17 వ తేదీన గొప్పయుత్సవముల పండుగల మధ్య సూయజుకాలువను తెరిపించెను.

(3)

## ఇస్మాయిల్‌పాషా

ఇంతటితో ఇస్మాయిల్ పాషా యొక్కయు ఈజిప్టు యొక్కయు దురదృష్టము ప్రారంభమయ్యెను. ఇస్మాయిల్ పాషా కేవలము నవనాగరికుడు. తన ప్రజలకు మేలుచేయ వలెననియు, తన దేశములో సుపరిపాలనను స్థాపించవలె ననియు నుద్దేశ్యములు కలవాడే. ఈజిప్టులోను సుడాను లోను బానిసత్వమును రద్దుపరచెను. తన పన్నెండుసంవత్స రముల (1863—1875) పరిపాలనలో ఈజిప్టులో పదమూండు వందలమైళ్ళ పొడవుగల రైళ్ళను, కొన్ని వేలమైళ్ళ రోడ్లను వేయించెను. టెలిగ్రాములు ఆరువందలమైళ్ళనుండి ఆరువేల మైళ్ళకు వృద్ధిచేసెను. రెండువందల పోస్టాఫీసులను పెట్టించెను. "పోర్టుసైడ్" తీరమును నిర్మాణముగావించెను. అలెగ్జాండ్రి యాలో నొక నౌకాశ్రయమును నిర్మించెను. కైరోనగర మును వృద్ధిచేసెను. నైలునదిమీదను, మధ్యధరాసముద్రము మీదను స్టీమరులు నడువనారంభించెను. నీటిపారుదలపనులు చాల వృద్ధిచెందెను. రైతులకు ఋణములిచ్చుటకు భూమి తనఖాబ్యాంకులు పెట్టబడెను. విద్యాభివృద్ధికై ఇస్మాయిల్ పాషా చాల శ్రద్ధవహించి తనరాజ్యపాలనాప్రారంభమున నూటఎనుబదియైదుగ నున్న ప్రాథమికపాఠశాలలను అయిదు వేల యెనిమిదివందల ఇరువదివరకు వృద్ధిచేసెను. పేద విద్యా ర్థులకొరకు పూటభోజనముపెట్టు సౌకర్యముకూడ కలుగజేసెను. మాధ్యమికపాఠశాలలను, వృత్తివిద్యలనిచ్చు పాఠశాలలను

కూడ నెలకొల్పెను. ఒక గొప్పజాతీయ కేంద్రగ్రంథాలయమును తన రాజధానిలో స్థాపించెను. అదివరకు ఈజిప్టులోనున్న 'విదేశీయుల'పైన ఈజిప్టుప్రభుత్వపుకోర్టులకు విచారణాధికారము లేకుండెను. ఇస్మాయిల్ పాషా న్యాయవిచారణాపద్ధతులను సంస్కరించి, విదేశన్యాయాధిపతులతోపాటు ఈజిప్టు న్యాయాధిపతులుగూడ కలసికూర్చొని విచారించు మిశ్రమ న్యాయస్థానముల నేర్పాటుచేసెను. ఈయన పరిపాలనాకాలమున వ్యవసాయాభివృద్ధి, పశుసంవృద్ధి, ప్రజాభివృద్ధికూడ బాగుగ కలిగెను. స్వదేశపరిశ్రమలు వృద్ధిచేయబడెను. ఇంగ్లాండుయొక్క బట్టల యంత్రశాలలకొరకై ఎగుమతిచేసి లాభమును పొందుటకుగాను ప్రత్తిపంటకూడ వృద్ధిచేయబడెను. "గడచిన పన్నెండుసంవత్సరములలో ఈజిప్తుదేశమునందు ఆశ్చర్యకరమైన అభివృద్ధి జరిగినది. ఇతరదేశాలలో నైదువందలసంవత్సరములలో జరిగినంతఅభివృద్ధిని డెబ్బదిసంవత్సరములలోనే ఈజిప్తుదేశము పొందినది" అని 1876 జనవరినెలలో లండనుటైమ్సు పత్రిక వ్రాసినది. మహమ్మదాలికాలమునుండి యిస్మాయిల్కాలమువరకును ఈజిప్టు విశేషముగ అభివృద్ధి పొందినదని టైమ్సువాఖ్యయొక్క సారాంశము. ఒక్కొక్క రైతుకొక యకరముభూమి, ఒకఆవు అను ఈజిప్టురైతులఆశయము ఫలించుటకు సమీపించుచుండెను.

## సూయజుకాలవలో పెద్దభాగమును ఆంగ్లేయప్రభుత్వమున కమ్మెను

కాని తనదేశములో తాను జరుపుచున్న నిర్మాణ కార్యక్రమాలలో చాలభాగము ఋణములుచేసియే నిర్మిం

చెను. ఆయన జీవితమంతయు దుర్వ్యసనములతోను, దుర్వ్య యములతోను కూడియుండెను. ఆయనచుట్టును స్తోత్రపాఠకులును, యూరోపియన్ అందగత్తెలును, దళారీలును, తార్పుడుగాండ్రును చేరిరి. ఋణములు తెచ్చు ఏజంట్లు విశేషలాభములను గడించుచుండిరి. "పాషా" అను బిరుదము తనకు చాలదనియు, మహమ్మదాలి 1841వ సంవత్సరమున తురుష్క సుల్తానుతో చేసికొనిన యొడంబడికలోగల నిర్బంధములను తొలగించుకొనవలెననియు కోరికకలిగి సుల్తానుకును ఆయనమంత్రులకును లంచములిచ్చి తాను సుల్తానుకు చెల్లించవలసిన కప్పమును వృద్ధిచేసికొని, 'పాషా'కు బదులుగా 'ఖడీవు' అను బిరుదమును సంపాదించెను. నిర్బంధములను తీసివేయించుకొనెను. యూరపురాజుల మన్ననలను తాను పొందవలెనని తన దర్బారులను, రాజనగరులను గొప్పవైభవముతోనలంకరించుకొనుచు, యూరపురాజలకు రాణీలకు విశేషవ్యయకరమగు ఆతిథ్యములనిచ్చుచుండెను. సూయజుకాలువను తెరచినపుడు యూరపు చక్రవర్తుల కాహ్వానముల నంపగా ఫ్రెంచిరాణి, ఆస్ట్రియా చక్రవర్తి, ఇంక కొంతమంది ప్రభువులు విచ్చేసిరి. వారికి మిగులవైభవోపేతములగు సన్మానములనుకావించెను. యూరోపియనులు షికారుకు వచ్చుటకై 'పిరమిడుల'వరకును మంచి రోడ్డువేయించెను. ఈజిప్టులో చాల భూములను తన స్వంత యెస్టేటుగా కొని స్వంతవ్యవసాయమును పెట్టించెను. స్వంతముగ వర్తకము చేయసాగెను. స్వంతముగ పంచదార ఫ్యాక్టరీలను పెట్టించెను. స్టీమరులను నడిపించెను. పెద్ద పెద్ద జీతములనిచ్చి యూరోపియను మేనేజరులను నియమించెను.

వీటన్నిటిలో చాల నష్టము కలిగెను. ఋణములవెంట ఋణ ములను పాశ్చాత్య షాహుకారులవద్ద చేయసాగెను. రాత్సు చైల్డు, గోషెన్సు, ఒప్పిన్‌హైమ్ మొదలగు తెల్ల షాహు కారులు అయిదుకోట్ల సవరనులను రొక్కముగ నిచ్చి ఏడు కోట్ల డెబ్బదిలక్షల సవరనులకు ఇస్మాయిల్ ఖెడీవుచేత నోట్లు వ్రాయించుకొనిరి. ఆయనవద్ద మంత్రిగానున్న 'న్యుబరు పాషా' అను ఆర్మీనియన్ ఈ తెల్ల షాహుకారులవద్ద కమిష న్లు కొట్టి కొన్ని లక్షలు సంపాదించెను. ఈ ఋణదాతలే ఈజిప్టులోని రేవులు, రైళ్ళు మొదలగు నిర్మాణకార్యములకు కంట్రాక్టులు తీసికొని ఆ కంట్రాక్టులలో సగానికిసగము లాభ ములను పొందిరి. ఋణదాతలగు పాశ్చాత్య షాహుకారులు ఈజిప్టులో ఇతర ఆర్థికహక్కులను కూడ పొందిరి. ఆర్థిక హక్కులను, రాజ్యమును సంపాదించుటకే పాశ్చాత్యులు సుల్తానులకు ఋణములుపెట్టుట. మొరాకో, ట్యునిసు, తురు ష్క దేశములలో జరిగినట్లే ఈజిప్టులోకూడ జరిగినది. ఇటుల ఇస్మాయిల్ ఖెడీవు ఋణములనుఎక్కువగ చేసి 1875 సంవ త్సరమునాటికి కష్టములలోపడెను. ఆయనయొక్క గవర్న మెంటుపత్రముల విలువ పడిపోయెను. సాలుకు నూటికి ఏడు చొప్పున వడ్డీవచ్చు మూడుకోట్ల ఇరవైలక్షల విలువగల పత్ర ములు రెండుకోట్లకే అమ్ముడుపోయెను. అప్పుడు సూయజు కాలువకంపెనీలో తనకు గల 176602 భాగములనన్నిటిని అమ్ముటకు ఇస్మాయిల్ ఖెడీవు ఫ్రెంచివర్తకులకు బేరములు పెట్టెను. ఈ సంగతి తెలియగనే మరియొకరి చెవినిపడకుండ అతి త్వరితముగ నా భాగములనన్నిటిని నలుబదిలక్షల సవర

నులకు ఇంగ్లాండుప్రభుత్వపక్షమున ప్రధానమంత్రియగు "డిస్రయలి" బీకన్సుఫీల్డు ప్రభువు కొనెను. ఈజిప్టుప్రభుత్వమునకు ఆ కంపెనీయొక్క లాభములో రావలసిన నూటికి పదునైదు వంతులభాగమును కూడ ఏడులక్షలసవరనుల కమ్మి, ఇస్మాయిల్ ఖెడీవు తా నెంతగనో ప్రేమించిన సూయజుకాలువలో తొంబదితొమ్మిదిసంవత్సరములకవులు తీరినదాక (1968వ సంవత్సరమువరకును) ఎట్టి హక్కు లేకుండ పోగొట్టుకొనెను. ఆంగ్లేయ ప్రధానమంత్రి సూయజుకాలువలో భాగములను కొనినప్పుడు ఆంగ్లేయబొక్కసములో ద్రవ్యములేదు. రాత్సుచైల్డు వద్ద ఋణముచేసి విక్రయమునుపొందెను. ఒకలక్ష సవరనులను రాత్సుచైల్డుకు కమీషన్ క్రింద నిచ్చెను. ఋణముచేయుటకును, విక్రయమునుపొందుటకును కూడ పార్లమెంటుయొక్క మంజూరు కావలయును. విక్రయమునుపొందినపిమ్మట ఆంగ్లేయపార్లమెంటులో మంజూరునకై పెట్టిరి. కొందరు సభ్యులాక్షేపించగా ప్రధానమంత్రి "మనహిందూదేశసామ్రాజ్యమును సంరక్షించుకొనుటకుగాను అచటికి చేరుటకు మిగుల సమీపత్రోవయగు ఈ సూయజుకాలువ అత్యంతావశ్యకమై యున్న"దని చెప్పగనే అందరు సభ్యులును సంతోషముతో మంజూరుజేసిరి. ప్రతిసంవత్సరము సూయజుకాలువగుండా ప్రయాణముచేయు పొగయోడలలో నూటికి యెనభైపాళ్ళు ఆంగ్లేయులవే.

# ఈజిప్టుదేశ చరిత్ర

## ఆరవ అధ్యాయము

## ఈజిప్టును బ్రిటిషువారాక్రమించుట

### (1)

### పాశ్చాత్యప్రభుత్వముల ప్రతినిధులసంఘము ఈజిప్టుపై యాజమాన్యము వహించెను.

ఇంతటితో ఇస్మాయిల్ ఖెడీవుయొక్క ఋణములు తీర లేదు. పాతఋణదాతల తొందర లెక్కవై క్రొత్తఋణముల కొరకు ప్రయత్నించసాగెను. ఆంగ్లేయులను క్రొత్తఋణముల నిమ్మని కోరగ, వారు ఈజిప్టుయొక్క ఆర్థికస్థితినిగూర్చి విచారణజరిపి రిపోర్టుచేయుటకు స్టివెన్ కేవు కమిటీని బంపిరి. ఆ కమిటీవారికి ఇస్మాయిల్ ఖేడీవు పిరమిడ్ల వద్ద గొప్ప విందు చేసి అనుకూలముగ రిపోర్టు వ్రాయించుకొనెను. ఇస్మాయిల్ ఖెడీవుయొక్క దుబారావ్యయమంతయు రాజ్యములోని ప్రజల పైన అంటగట్టుట గొప్ప అక్రమము. అతని స్వంతఋణముగా నెంచి అతని స్వంతఆస్తిని, ఎస్టేటు నమ్మించి అతనిని దివాళా దీయించవలసియుండిరి. అటులచేయక కమిటీవారు ఋణము నంతను ఈజిప్టుప్రభుత్వము భరించవలెననియు, మంచిపద్ధతుల మీద నడపినచో ఈజిప్టు ఆర్థికదుస్థితి అచిరకాలములోనే బాగుపడగలదనియు వ్రాసి, ఋణదాతలపక్షమున ఋణ

దాతల ప్రభుత్వములవారు ఈజిప్టుప్రభుత్వమును మంచిపద్ధతులమీద నడుపు సూచనను గావించిరి. అందుమీద 1876 లో ఈజిప్టుమీద ఆర్థికయాజమాన్యము వహించుటకు ఇంగ్లాండు, ఫ్రాన్సు, ఇటలీ, ఆస్ట్రియా ప్రభుత్వముల ప్రతినిధులసంఘ మొకదానిని నియమించిరి. పిమ్మట జర్మనీ ప్రతినిధినికూడ చేర్చుకొనిరి. ఇస్మాయిల్ ఖెడీవుకు అప్పటికి నిలచియున్న ఋణములనన్నిటిని మొత్తముగచేర్చగా తొమ్మిదికోట్ల పదిలక్షల సవరనులని తేలినది. దానిమీద సాలుకు నూటికి ఏడు చొప్పున వడ్డీ ఋణదాతలకు చెల్లించబడును. ఈజిప్టుయొక్క పన్నులలో సగభాగము ఈ ప్రతినిధులసంఘమే వసూలుచేసి ఋణములనుతీర్చును. ఈజిప్టుప్రభుత్వపు ఆదాయ వ్యయపట్టిక ఈ సంఘముచే మంజూరుకావలెను. ఈసంఘము యొక్క అనుమతిలేనిది ఖెడీవు క్రొత్త ఋణములను చెయ్యకూడదు. ఆంగ్లేయ ఫ్రెంచి సాహుకార్లు ఈ యేర్పాట్లతో తృప్తిచెందక నొక ఆంగ్లేయుని తనకు రెవిన్యూమంత్రిగను, నొక ఫ్రెంచివానిని అర్థికమంత్రిగను నియమించునట్లు ఇస్మాయిల్‌ను నిర్బంధపరచిరి. 187౮వ సంవత్సరమున గొప్పక్షామము సంభవించినది. ప్రజలు వేలకువేలుగ చనిపోయిరి. పన్నులు సరిగా వసూలుకాలేదు. ఇస్మాయిల్ ఖెడీవు వడ్డీరేటును తగ్గించవలెనని కోరెను. సాహుకార్లు వప్పుకొనలేదు. ఆరుగురు తెల్లవారు ఒక ఈజిప్టుదేశీయుడుగల మరియొక విచారణ సంఘము నియమింపబడెను. వారు కొన్ని సంస్కరణములను సూచించిరి. వడ్డీరేటును నూటికి ఏడునుండి అయిదుకు తగ్గించవలెననియు, అసలులోకూడ కొంత తీసివేయవలెననియు సిఫా

రసుచేసిరి. అసలులో తగ్గించుటకు సాహుకా ర్లొప్పుకొన లేదు. ఖెడీవుయొక్క సొంతఎస్టేటును ఈజిప్టుప్రభుత్వమున కిచ్చి వేయవలసినదనియు, లేనిచో నీ ఋణములు ఈజిప్టుప్రభుత్వ మునకు గొప్ప భారముగ నుండుననియు వ్రాసిరి. ఇందుకు ఖెడీవు పేచీపెట్టెను.

## బాధ్యతాయుతప్రభుత్వము

ఇట్లుండగ వెంటనే తనదేశములో బాధ్యతాయుత ప్రభుత్వమును ప్రవేశపెట్టితిననియు, అదివరకే యున్న ప్రము ఖులసభ(**Assembly of Notables**)కు తనమంత్రివర్గము బాధ్యత వహించి నడచుననియు ఇస్మాయిల్ ఖెడీవు ప్రకటించి, న్యూబరు పాషాను ప్రధానమంత్రిగచేసి, విల్సను అను ఆంగ్లేయుని ఆర్థికమంత్రిగను, డిబ్లిగ్నేర్సు అను ఫ్రెంచివానిని నిర్మాణ మంత్రిగను నియమించెను. ఇందుమూలమున విదేశప్రభుత్వ ముల ప్రతినిధులసంఘముయొక్క యాజమాన్యము తీసివేయ వలెనని ఆయనప్రయత్నము. విల్సను ఎనుబదిఅయిదు లక్షల సవరనులను ఇంగ్లాండులో అప్పుతెచ్చి తాత్కాలికపు తొందరలను సర్దుబాటుచేసెను. వడ్డీరేటు తగ్గించబడెను. కాని అసలులో నేమాత్రము తగ్గలేదు. అందువలన క్రొత్త పన్నులు వేయుటకు విల్సను పూనుకొనెను. ఫెల్లాహీనులు క్షామముతోను పన్నులభారముతోను కృంగియున్నారు. వారి మీద ఎక్కువపన్నులు వేసిన ప్రయోజనములేదు. పైతరగ తులవారిపై పన్నులు వేయుటకు విల్సను తలపెట్టెను. ఇందుకు ప్రముఖులసభవా రాక్షేపించిరి. ప్రతిష్ఠంభన మేర్పడెను.

ప్రముఖులసభవారు విల్సను మంత్రిగనుండుటకు వీలులేదనిరి. మంత్రివర్గముమీాద విశ్వాసరాహిత్యమును ప్రకటించిరి. ఇస్మాయిల్ ఖేడీవు ప్రధానమంత్రి న్యూబరును, ఆర్థికమంత్రి విల్సనును, నిర్మాణశాఖామంత్రి డిబ్లిగ్నేరున్సు తీసివేసెను. జాతీయవాదియగు షెరీఫు పాషాను ప్రధానమంత్రిగ నియమించెను. ఒక రాజ్యాంగవిధానమును తయారుచేయవలెననియు పూర్తిగ ఈజిప్టుదేశీయులుగల మంత్రివర్గము నేర్పాటుచేయవలెననియు నాజ్ఞాపించెను. నూతన మంత్రివర్గము ఋణదాతల ఋణములుచెల్లించుట కేర్పాట్లుచేయుచుండిరి. ఆర్థికసంస్కారణములనుగూర్చి యాలోచించుచుండిరి.

## ఇస్మాయిల్ ఖేడీవు దేశభ్రష్టుడు గావింపబడెను

ఉద్యోగమునుండి తీసివేయబడిన విల్సను ఇంగ్లాండుకు పోయి ఇస్మాయిల్ ఖేడీవుకు వ్యతిరేకముగ ఆంగ్ల, ఫ్రెంచి ప్రభుత్వమంత్రులతోను ఋణదాతలతోను కుట్రలుసలిపెను. ఋణదాతలలో ముఖ్యుడైన రాత్సుచైల్డును పట్టుకొని ఇస్మాయిల్‌ను తీసివేయనిచో ఋణదాతలఋణమును ఎగబెట్టుదురను భయమును కలుగచేసెను. రాత్సుచైల్డు యూదుడు. జర్మనీ ప్రధానమంత్రియగు బిస్మార్కుద్వారా ఆంగ్లేయఫ్రెంచి ప్రభుత్వములను వత్తిడిచేసెను. ఆంగ్లేయ ఫ్రెంచి ప్రభుత్వములు వెంటనే రాజ్యమును త్యజించి, దేశమును విడిచి వెళ్ళవలసినదని ఇస్మాయిల్ ఖేడీవు కాజ్ఞాపించిరి. అట్లాజ్ఞాపించుటకు వీరి కేమి హక్కుకలదు ? పశుబలమే. పైగా తురుష్కసుల్తానువద్దనుండి ఇస్మాయిల్‌ను రాజ్యభ్రష్టుని



జమాలెద్దీన్ ఆఫ్ఘని

గావించితినని ఫర్మానానుకూడ తెప్పించిరి. ఖెడీవును తీసి వేయుటకు సుల్తాను కెట్టి హక్కును లేదు. సుల్తాను కప్పము పుచ్చుకొనవలసినవాడే. ఇస్మాయిల్‌కు ఆంగ్ల ఫ్రెంచిప్రభుత్వములను సుల్తానును ధిక్కరించుటకు ధైర్యము చాలలేదు. 1879 వ సంవత్సరము జూన్ నెలలో తన విలువగల ఆభరణములను, తన కుటుంబమును ప్రభుత్వ బొక్కసములో నిలవయున్న ముప్పదిలక్షల ద్రవ్యమును తన వెంట తీసికొని, ఇస్మాయిల్ ఖెడీవు పడవమీాద నెక్కి ఈజిప్టుతీరమును వదలి ఇటలీలోని నేపిల్సునగరమునకు పోయి నివసించెను. ఇస్మాయిల్ కుమారుడగు ట్యూఫికు ఖెడీవుగ చేయబడెను. ఆంగ్లేయ ఫ్రెంచి ఆర్థికపెత్తనదార్లగు కాల్విన్, డిబ్లిగ్నేరుస్లు వచ్చి మరల ఆర్థికయాజమాన్యమును వహించిరి. మాలటు కాన్సలు జనరులుగ నియమింపబడెను.

## జమాలెద్దీన్ ఆఫ్ఘని

ఇస్మాయిల్ ఖెడీవుకాలముననే దేశములో నొక జాతీయవాదులబృంద మేర్పడి వృద్ధియగుచున్నది. దానికి నాయకుడు జమాలెద్దీన్ ఆఫ్ఘనీ. ఆయన ఆకాలములో ముసల్మాను దేశములలో గొప్పజ్యోతిగ నుండెను. అఖండ విద్యాపారంగతుడై ఖురానుయొక్కయు, నితర ముస్లిం మతగ్రంథముల యొక్కయు పాండిత్యమునందును సాటిలేనివాడుగ నుండెను. ఆయనయొక్క మతబోధలు ముసల్మానులను వెనుకకు తీసుకొనిపోవు మూఢాచారభూయిష్టములుగాక అన్నివిధముల ముందుకునడపించునవిగను మిగుల విశాలదృష్టిగలవిగను నుం

డెను. ఇతరమతములతో సహనముచూపి యోగ్యత వినమ్రతలు కలిగియున్నట్టియు పరోపకారముచేయునట్టియు జీవితములను ముస్లిములు గడుపుట ఖురానుయొక్క మతమని ఆయన బోధిం చెను. స్త్రీలు పూర్దాలోను, ఘోషాలోను నుండుట ఖురానుకు వ్యతిరేకమని చెప్పుచు స్త్రీలకు విద్య నివ్వవలసిన దనియు, ఘోషాను తగ్గించవలసినదనియు ప్రబోధము గావించెను. ముసల్మాను దేశము లన్నిటిలోను సుల్తానుల నిరంకుశత్వము దౌష్ట్యము దుర్వ్యయము రాజ్యముల బలహీన పర్చి పాశ్చాత్తుల అధికారము యాజమాన్యము స్థాపితమగు టకు కారణమగుచున్నదనియు, వెంటనే ప్రతిముసల్మాను దేశము లోను ప్రజాపాలన మేర్పడవలెననియు అదియే ఖురానుకు సమ్మతమనియు ఆయన చేయుచుండిన బోధలు యువకుల నుద్రేకపర్చి తురుష్కములోను, ఈజిప్టులోను, పారసీకము లోను రానున్న స్వాతంత్ర్యవిప్లవములకు పునాదులు వేసెను. ఆయన 1833 లో ఆఫ్ఘనిస్థానములో జన్మించి, బుఖారాలో విద్య నభ్యసించి అక్కడక్కడ తిరిగి జ్ఞానోపార్జనముగావించి, కాన్‌స్టాంటినోపిలులో వాసస్థాన మేర్పరచుకొనెను. అక్కడ మతగురువులలోను విద్యార్థులలోను గొప్ప ఖ్యాతిని పొం దెను. ఆయనవ్రాతలు, ఉపన్యాసములు యువకులను బాగుగ నాకర్షించెను. కాని యచట వృద్ధియగుచున్న యౌవన తురుష్కకక్షికి ఈయన బలము కలుగచేయుచున్నందున ప్రధాన మతగురువుయొక్క సలహాపైన తురుష్కసుల్తాను 1871 లో ఈయనను కాన్‌స్టాంటినోపిలునుంచి వెడలగొట్టగా ఈజిప్టులోని కైరోకువచ్చి నివసించెను.

## ఎల్ అజర్ విశ్వవిద్యాలయము జాతీయతత్వమునకు కేంద్రమైనది.

కైరోలో ఈయనబోధలు, వ్రాతలు, ఉపన్యాసములు అందరినీ ఆకర్షించెను. ముఖ్యముగ ఎల్ అజర్ విశ్వవిద్యాలయ విద్యార్థులందరును ఈయన శిష్యత్వములోనికి వచ్చిరి. ఎల్ అజరులో ఆచార్యులుగానున్న షేకుమహామ్మదు అబ్దు, ఇబ్రాహం ఎల్ ఆష్టనీలు ఆయనయొక్క ప్రధానశిష్యులైరి. తర్వాతకాలమున వీరిలో మహామ్మదు అబ్దు రాజకీయనాయకుడై జైలుశిక్షననుభవించి దేశభ్రష్టుడుగ గావించబడి, మరల దేశమునకు వచ్చి ఎల్ అజరు విశ్వవిద్యాలయములో న్యాయశాస్త్ర ఆచార్యుడై, పిమ్మట ఉన్నతన్యాయాధిపతియై దేశముయొక్క ప్రభుత్వ ప్రధానమతగురువై పేరువడసెను. ఇబ్రాహిం ఎల్ ఆష్టనీ గొప్ప గ్రంథకర్తగను పత్రికాధిపతిగను మత గ్రంథసంస్కర్తగను ఖ్యాతిపొందెను. వీరందరికి ఎల్ అజరు బృందమని పేరు. ఇస్మాయిల్ ఖెడీవు కాలములో వీరు నిర్భయముగా మాటలాడినను బోధలుసలిపినను, ఆయన వీరి తెరువుకు రాలేదు. అహామ్మదు అరబిపాషానుకూడ జమాలెద్దీన్ యొక్క బోధలు ఆకర్షించినవి. ఈ బృందమువారు ఇస్మాయిల్ ఖెడీవు యొక్క దుర్వ్యయమునకు దుబారాలకు ప్రజలపైమోపబడుచున్న ఋణభారమునకు చాలవిసిగిరి. ఆయన దేశమును నాశనము చేయుచున్నాడని తలచిరి. క్రమముగ దేశము విదేశప్రభుత్వము యొక్క అధికారములోనికి పోవుచున్నందుకువగచిరి. వీరేగాక దేశములో జాతీయతత్వముగల ప్రముఖులగు షెరీఫుపాషా, మహ

మ్మదు సామీ బే, ఆలీపాషా ముబారకు మొదలగువారు కూడ ఇస్మాయిల్ యొక్క చర్యల కేవగించిరి. ఇస్మాయిల్‌పై తిరుగు బాటుగావించి ఆయనను రాజ్యభ్రష్టునిగావించి సంపూర్ణ ప్రజాస్వామ్యమును స్థాపించుట యుక్తమని జమాలెద్దీన్ బృందము 1879లో దీర్ఘముగ ఆలోచించిరి. కాని తిరుగుబాటు జయప్రదముకానేరదని భయపడి యూరుకొనిరి. ఇంతలో ఇస్మాయిల్ దేశభ్రష్టుడయ్యెను. వీరు సంతోషించిరి. అదివరకు విద్యార్థిదశలో జమాలెద్దీన్‌బోధలలోనికివచ్చి తాను ఖెడీవు నయినచో ప్రజాపాలన మేర్పరచెదనని ప్రగల్భములాడుచుం డిన ట్యూఫికు రాజ్యమునకువచ్చుటవలన వీరికి ఆశలుకలిగెను. కాని కొలదికాలములోనే ట్యూఫికు నమ్మదగినవాడుకాడనియు మిగుల బలహీనుడనియు తేలినది. వీరి ఆశలన్నియు అడుగంటి నవి. ట్యూఫికు సింహాసనమెక్కునాటికి విద్యావంతులలోను విద్యార్థులలోను సైన్యములలోను సామాన్యప్రజలలోనుకూడ జాతీయభావములు వ్యాపించియున్నవి. తురుష్కములో యవ్వనకక్షివారు 1876 లో సుల్తాను అబ్దుల్ అజీజును రాజ్య భ్రష్టుని గావించి నూతన సుల్తానుచేత ప్రజాప్రతినిధిసభను స్థాపింపజేయించుకొనుటకూడ ఈజిప్టులో జాతీయతత్వవ్యాప కమునకు తోడ్పడినది.

(2)

## ఆంగ్ల ఫ్రెంచి సమిష్టి యాజమాన్యము

ఆంగ్ల ఫ్రెంచి ప్రభుత్వములకు విధేయతతో వర్తించ నిచో తండ్రికిపట్టినగతియే తనకును పట్టునని ట్యూఫికు ఖెడీవు

మందలింపబడెను. ఆయన అతుల విధేయతతో నడచుచుం డెను. ఆంగ్ల ఫ్రెంచి సలహాదార్ల సలహాపైన జాతీయవాది యగు షెరీఫుపాషాను ప్రధానమంత్రిత్వమునుండి తీసివేసి, విదేశీయులకు దాసుడైన రియజుపాషాను ప్రధానమంత్రిని గావించెను. ఆంగ్లేయ ఫ్రెంచి సమిష్టి యాజమాన్యము 1879 మొదలు 1882 వరకును జరిగెను. రైతులమీద హెచ్చు పన్నులు వేయుట మానుకొని భాగ్యవంతులమీద హెచ్చు పన్నులను వేసిరి. కాని, ఖర్చు తగ్గించుటయను పేరున వేలకు వేలమంది ఈజిప్టు దేశీయులగు నుద్యోగస్థులు సైన్యములనుండి యు నితర పరిపాలనా శాఖలనుండియు తీసివేయబడిరి. విదేశ స్థుల యుద్యోగములేమిన్ని తగ్గలేదు. వారి కిచ్చుచున్న పెద్ద జీతములలో నేమాత్రమును తగ్గలేదు. వచ్చెడి పన్నులలో చాలభాగము విదేశషాహుకార్ల ఋణములకిందనే పోవుచుం డెను. దేశములో అసంతృప్తి చాలగ హెచ్చినది. విదేశీయుల పాలనము కూడదనుభావము దేశమందంతటను చెలరేగెను. తమ ఖెడీవు ఆంగ్ల ఫ్రెంచియాజమాన్యమున నుండుట స్వాతం త్రిమును కోల్పోవుట జాతీయ అవమానమని యెంచబడెను.

## ట్యూఫికు ఖెడీవు విదేశసలహాదార్లకు దాసుడు

ప్రముఖుల అసెంబ్లీవారు సమావేశమై విదేశ ఋణసంఘ మునకు తాకట్టుపెట్టబడిన సగభాగపు పన్నులమీదగాక మిగి లిన సగభాగపు పన్నులపైన యాజమాన్యమును కోరిరి. మిగి లిన సగమునకు ఆదాయ వ్యయపట్టికను తయారుచేసిరి. ప్రజా ప్రతినిధిపాలనమును వాంఛించిరి. యావత్తు ఆదాయవ్యయ

పట్టికపైనను యావత్తుపన్నులపైనను యాజమాన్యము తమదే నని ఆంగ్ల ఫ్రెంచి ఆర్థికపెత్తనదార్లు పట్టుపట్టిరి. ట్యూఫికు ఖెడీవు ఆంగ్లఫ్రెంచి సలహాదార్ల సలహానను సరించి ప్రముఖుల ఎస్సెంబ్లీవారి కోర్కెలన్నియు నిరాకరించెను. ఆయనయొక్క నిరంకుశరాజ్యమును బలపర్చుటకే విదేశసలహాదార్లు సహాయ ముచేసిరి. గాని ఆయన నిరంకుశరాజ్యమనగ ఆయనకు తోచి నటుల పాలించుట కాదు. విదేశ సలహాదార్లకు కేవలము దాసుడై వారు చెప్పినప్రకారము విధేయతతో ప్రవర్తిం చుట. విదేశ సలహాదార్లు కోరినది ట్యూఫికు ఖెడీవు తన ప్రజల నుండి నిరంకుశుడుగ నుండవలెననియు, తమకు (విదేశసలహా దార్లకు) దాసుడుగ నుండవలెననియు మాత్రమే. ఇదియే హిందూదేశములో స్వదేశసంస్థానాధీశులస్థితి అయ్యుండెను. అందుకు ట్యూఫికు అంగీకరించి వారికి యాజ్ఞానువర్తియై సంచ రించుచుండెను. విదేశ సలహాదార్లసలహాపైన ట్యూఫికు ఖెడీవు జాతీయోద్యమనాయకుడగు జమాలెద్దీన్ ఆఫ్ఘనీని అరెస్టుచేసి ఈజిప్టుదేశమునుండి బయటకు వెడలగొట్టెను. జమాలెద్దీన్ యూరపునకుపోయి మ్యూనికులో నుండగా పారసీకదేశపు షా (రాజు) నశిరుద్దీన్ 1889 సం॥మున పారసీకమునకు తీసుకొని పోయెను. గాని నశిరుద్దీన్ ఆంగ్లేయులకు లోబడి తనదేశము నకు అపకారముగావించుచున్నందున పారసీకములో జాతీయ వాదులు ఆయన నెదిరించిరి. జమాలెద్దీన్ బహిరంగముగ జాతీ యవాదులతో చేరి షాను ఖండించెను. అందుమీద షా నశి రుద్దీన్ జమాలెద్దీనును 1890 లో జాడ్యగ్రస్తుడుగనున్నను పట్టి తెప్పించి పారసీకమునుండి వెడలగొట్టెను. జమాలెద్దీన్ యొక్క

దేశభ్రష్టత కొలదికాలములో పారసీకజాతీయవాదుల జయమునకు తోడ్పడినది. నశిరుద్దీన్ హత్యగావించబడెను. పారసీకదేశములో ప్రజాస్వతంత్రవిప్లవము ప్రారంభమయ్యెను. జమాలెద్దీన్ అటుపిమ్మట రెండుసంవత్సరము లింగ్లాండులోను నాలుగుసంవత్సరములు కాన్‌స్టాంటినోపిలులోను కాలము గడిపి ఎడతెగకుండ పారసీకపాల దుష్పరిపాలనమునుగూర్చి యాందోళనముగావించి 1896వ సంవత్సరమున మరణించెను. జమాలెద్దీన్‌నేగాక జాతీయవాదులగు హస్సేన్ మూసాఅక్బాడ్ మొదలగు మరికొందరు ప్రముఖులనుగూడ ట్యుఫికు ఖెడీవు నైలునది దక్షిణప్రాంతభూములకు ప్రవాసమునకు బంపెను.

## అహమ్మదు అరబి పాషా

ఇకమీద ఈజిప్టులోని జాతీయోద్యమమునకు అహమ్మదు అరబిపాషా సేనాని ముఖ్యనాయకు డయ్యెను. అరబిపాషా 1840 లో ఈజిప్టులోని హూరియేయము అను పల్లెటూరియందు ఎనిమిది యకరములన్నర భూమిని కలిగిన యొక గ్రామపెత్తనదారు (షేకు)కు జన్మించెను. గావున అరబిపాషా కేవలము ఫెల్లాహీను నాయకుడు. ఈయన కొంతకాలము ఎల్ అజరు విశ్వవిద్యాలయమునందు విద్యనభ్యసించి సైన్యములో చేరి తన సామర్థ్యమువల్ల పైకివచ్చెను. సయ్యాదు పాషా ఈతనిని తన సైనిక కార్యదర్శిగా తీసుకొనెను. సయ్యాదు పాషా చనిపోయినపిమ్మట ఇస్మాయిల్ ఖెడీవుకాలములో ఫెల్లాహీను సైనికోద్యోగులకు తగిన ప్రోత్సాహములేక, నీయన అక్కడక్కడ సేనాధిపతిగనుండి పనిచేయుచుండెను. నెపోలి

యను బోనోపార్టుయొక్క జీవితమును చదివి ఈజిప్టుకు మంచి తరిబీయతుగల సైన్యమువుండవలెనని ఆశించుచుండెను. జమాలెద్దీన్‌యొక్క మత సాంఘిక రాజకీయబోధలతో నీయనకు చాల సానుభూతి యేర్పడెను. ఫెల్లాహీనులయొక్క అభివృద్ధి ప్రధానముగ నీయనమనసునం దుండెను. ఈయకు స్వభాష యగు అరబితప్ప మరియొక భాష రాదు. స్వభాషలో స్వదేశస్థుల నుద్రేకపరచగలిగినంత ధారాళముగ నుపన్యసించగలిగెను. ప్రవర్తనలో బహు యోగ్యుడై దుర్గుణములేమియులేక అందరిమన్ననను పొందెను. మతసహనము పూర్తిగ గలిగి కాప్టులతో స్నేహముచేసెను. ఇస్మాయిల్ ఖెడీవు దుర్వ్యయపరుడు. ఫెల్లాహీనులను సైనికోద్యోగములలో పైకి రానివ్వలేదు. ఆయనను రాజ్యభ్రష్టునిగావించి సంపూర్ణ ప్రజాస్వామ్యమును స్థాపించవలెనని అరబిపాషాకూడా జమాలెద్దీన్ బృందముతో ఆలోచనచేసి అది సాగదని నిర్ణయమునకు వచ్చినవాడే. విదేశస్థుల యాజమాన్యమును తొలగించి ఖెడీవుఅధికారమునుతగ్గించి ఈజిప్టులో ప్రజాపాలనమును స్థాపించుటయే నీయన ఆశయముగా పెట్టుకొనెను. సైన్యములలో జాతీయభావము పూర్తిగ వ్యాపించినది. సైనికులేగాక రైతులందరు ఈయనపక్షమున నుండిరి. ఈయనను తమనాయకునిగ భావించిరి.

## అరబి పాషా గొప్ప జాతీయధీరుడయ్యెను

1881 జనవరిలో దేశములోగల అసంతృప్తినిబట్టి తురుష్క దేశస్థుడును విదేశసలహాదార్లకు దాసుడును నగు

ఉస్మాన్ రిఫ్కీని మంత్రిత్వమునుండి తొలగించవలసినదని అరబి పాషాసేనానియు అతని సోదరసేనాధిపతియగు అబ్దెల్ ఆల్ సేనానియు—ఇద్దరును కలసి వెళ్ళి ప్రధానమంత్రిని కోరిరి. ప్రజలకష్టముల నివారణకు సంబంధించిన వినతిపత్రమును సమర్పించిరి. "ఆయనను తీసి ఎవరిని మంత్రిగా వేయమంటారు?" అని ఆయన ప్రశ్నించెను. "ఈజిప్టు దేశమాతకు ఎనిమిది మందియేనా కుమాళ్ళు? గొడ్డుపోయినదా?" అని వీరు బదులుచెప్పిరి. వీరిని మందలించి ఆయన పంపివేసెను. ఫిబ్రవరి 3వ తేదీన అరబిపాషాను, అబ్దెల్ ఆల్‌ను- ఇద్దరుసేనానులను అరెస్టుచేసి నైలునదియొడ్డుకుగాని నైలునదిఅడుగుకుగాని పంపుటకుగాను ట్యూఫికు ఖెడీవు తన రాచనగరులోనికి పిలిపించెను. వీరిద్దరికిని తమ నెందుకు ఖెడీవు పిలిపించుచున్నాడో ముందుగనే తెలిసెను. కావున తగిన కట్టుదిట్టములతోనే వెళ్ళిరి. వీరిద్దరితో ఖెడీవు మాటాడుచుండగ సైన్యములు పోయి రాచనగరును చుట్టుముట్టి, లోన ప్రవేశించి వీరినిద్దరిని విడిపించుకొనివచ్చిరి. ట్యూఫికు ఖెడీవుప్రతిష్ఠ నాశనమయ్యెను. అరబిపాషా గొప్ప జాతీయధీరుడయ్యెను. ఈజిప్టులోని అన్నితరగతులవారును తమ కష్టముల నివారణకు ఆయనకు మనవులను పంపుచుండిరి.

## ఖెడీవుతో అరబి సంభాషణ

దేశములోని ఆందోళనమునకు భయపడి ట్యూఫికు ఖెడీవు తురుష్కుడగు ఉస్మాన్ రిఫ్కీని మంత్రిత్వమునుండి తొలగించి మహమ్మదు బేసామి యను జాతీయవాదిని యుద్ధమం

త్రిగ నియమించెను. మహమ్మదుబేసామి అరబిపాషాకుస్నేహి తుడు. రాజనగరులోని రహస్యములను అరబిపాషాకు తెలుపు చుండెను. ట్యూఫికు ఖెడీవు నిలకడయైనవాడుగాడు. అంతేగాక ఆంగ్ల ఫ్రెంచి పెత్తనదార్లను సంతోషపెట్టుటయే ఆయన పర మావధి. కొలదిరోజులలోనే మహమ్మదుబేసామీనితీసివేసి తన బావమరదిని యుద్ధమంత్రిగ నియమించెను. అరబి సేనానిని అబ్దెల్ ఆల్ సేనానిని ఇద్దరిని తమ సేనలనురాజధానియగు కైరో నుండి తీసివేయవలసినదని యాజ్ఞాపించెను. కైరోలోనున్నచో వారిపలుకుబడి వృద్ధియగునని భయము. మారుమూలప్రదేశ మునకు బొమ్మని యాజ్ఞాపించెను. వెంటనే వారిద్దరును తమ సైన్యములతో రాజనగరును చుట్టుకొనిరి. తమకు దర్శన మిప్పించవలెనని ఖెడీవును కోరిరి. ఖెడీవు భయముచెంది సొంత కాపురమున్న రాజనగరులో దర్శనమివ్వక ఆబ్దినగరులో దర్శన మిచ్చెను. ఆయనకు సేనానులిద్దరును తమ విన్నపములను గావించుకొనుచుండగ ఆంగ్లేయపెత్తనదారగు కాల్విన్ హాజ రుగనుండెను. అరబిసేనానిని తత్క్షణము కాల్చివేయవలసిన దనియు లేదా తత్క్షణము అరెస్టుచేయవలసినదనియు కాల్విను ఖెడీవుకు గట్టిగ సలహానిచ్చెను. గాని అటులచేయుటకు ఖెడీ వుకు ధైర్యము చాలలేదు. అరబిసేనాని మూడువరములను కోరెను. "నేను ఖెడీవును, నా చిత్తమే చట్టము" అని ఖెడీవు ప్రత్యుత్తరమిచ్చెను. "మేము బానిసలముకాము. నిరంకుశ ప్రభుత్వమును సహించజాలము" అని అరబిపాషా బదులు చెప్పెను. ఏమియు జవాబు చెప్పక ఖెడీవు లోపలికి వెళ్ళి

పోయెను. అరబిపాషాయును అతని సహచరుడును బయటికి వచ్చిరి.

## జాతీయప్రభుత్వ మేర్పడినది

ఆ సాయంత్రము ఖెడీవు అరబిపాషాను పిలిపించి అతడు కోరిన మూడువరములను మంజూరుచేసితిననియు సంతోష చిహ్నముగ బ్యాండు వాయించవద్దనియు చెప్పి పంపివేసెను. ఆతడు కోరినట్లుగనే ప్రముఖుల అసెంబ్లీని సమావేశపర్చెను. జాతీయనాయకుడగు షెరీఫుపాషాను మరల ప్రధానమంత్రిగ గావించెను. క్రొత్తరాజ్యాంగవిధానమును ప్రధానమంత్రిని తయారుచెయ్యవలెనని యాజ్ఞాపించెను. దేశమందంతటను ఉత్సవములు జరిగెను. అన్నితరగతులవారిలోను ఉత్సాహము ప్రబలెను. నూతన రాజ్యాంగవిధానమును ప్రధానమంత్రి తయారుచేయుచుండెను. అస్సెంబ్లీ, మంత్రివర్గము, సైన్యము ఐకమత్యముతో పనిచేయుచుండెను. విదేశపెత్తనదార్లతో కూడ సహకారము సలుపుటకే నిశ్చయించుకొనిరి. అంతయు శాంతముగ నడచునట్లు కనబడెను. జాతీయస్వాతంత్రము, శాంతి, అందరియందును స్నేహభావము అనునూతనయుగము ప్రారంభమైనదని అరబిపాషా, షెరీఫుపాషా మొదలగు జాతీయనాయకు లుపన్యాసములనిచ్చుచుండిరి. ఫెల్లాహీనులు తమయొక్క భావ్యభివృద్ధియందు మిగుల ఆశాపూరితులై యుండిరి. "ఈజిప్టులో జాతీయోద్యమము ప్రబలినది. దానిని మనము నిరుత్సాహపరచకూడదు" అని కాల్విను ఆంగ్లేయ ప్రభుత్వమునకు వ్రాసెను.

## ఆంగ్లేయ ప్రధానమంత్రి గ్లాడుస్టను అడ్డమువచ్చెను

అదివరకు ఈజిప్టుయొక్క అనుభవముగల మేజరు ఎల్వీను బేరింగు (పిమ్మట క్రోమరుప్రభువను బిరుదమును పొందెను) కాల్వినుతో నేకీభవించక నీ నూతన జాతీయప్రభుత్వమును సాగనివ్వకూడదనియు, నిందువలన ముందుముందు తెల్ల ఋణదాతల ఋణముల కిబ్బందిరాగలదనియు లండను లోని ప్రధానమంత్రి గ్లాడుస్టనుకు రిపోర్టుచేసెను. మేజరు ఎల్వీనుబేరింగు లండనులోని గొప్పషాహుకార్లకు బంధువు. ఆర్థికవిషయములలో నిపుణుడు. అట్టివాడు ఆంగ్లేయషాహుకార్లకు నష్టమురాగలదని అభిప్రాయమిచ్చినపుడు షాహుకార్ల లాభములనే ప్రధానముగనెంచు బ్రిటిషుప్రభుత్వ మా యభిప్రాయమును తృణీకరించగలుగునా? ఈ జాతీయప్రభుత్వము కేవలము సైనికనాయకుడగు అరబిపాషాయొక్క బలవంతమువలన నేర్పడినది గావున సైన్యమునే బలపర్చుననియు, దేశములోని ప్రజలలో నిజముగ జాతీయతత్వము లేదనియు, సైన్యములోకూడ రెండుకక్షులు గలవనియు ఈ రెండుకక్షులను సమ్మేళనముగానివ్వకూడదనియు, వెంటనే జాతీయప్రభుత్వమును విచ్ఛిన్నముచేయించి ఖేడీవుయొక్క అధికారమునే బలపర్చుట అత్యవసరమనియు ఎల్వీనుబేరింగు వ్రాసినరిపోర్టు గ్లాడుస్టనుకును ఆయనయొక్క ఔదార్యకక్షి (liberal party)కి చెందిన తక్కినమంత్రులకును బాగుగా సమ్మతియయ్యెను. 1880 లో పార్లమెంటుఎన్నికలు జరిగినపుడు లిబరలు (ఔదార్య) కక్షికి నాయకుడగు గ్లాడుస్టను తన ఎన్నికోపన్యాసము

లలో బీకన్సుఫీల్డు ప్రభువుయొక్క సామ్రాజ్యతత్వమును ఖండించుచు ఆయన సూయజుకాలవయొక్క భాగములను కొనుటను ఆక్షేపించెను. ఈజిప్టుతో నెట్టి జోక్యముకలిగించు కొనరాదని గట్టిగా వాదించెను. ఈజిప్టు ముసల్మానులకు సంపూర్ణముగ స్వపరిపాలనము కలుగవలెనని చెప్పెను. ఆ యెన్నికలలో గెలిచి ఆయన ఇంగ్లాండుకు ప్రధానమంత్రి అయి నాడు. అట్టి ఆయన యిపుడు మేజరు బేరింగుతో నేకీభవించి ఈజిప్టులో జాతీయోద్యమము నణచుటకు ఈజిప్టుయొక్క స్వాతంత్రము నపహరించుటకు కృతనిశ్చయుడైనాడు. బ్రిటిషు రాజకీయవేత్తలు తా మధికారములోలేనపుడు మిగుల విశాల భావములను, తమక్రిందిజాతులతో నెక్కడలేని సానుభూతిని ప్రకటించుచు తా మధికారములోనికి రాగనే అదివర కధికార ములలో నున్నవారికంటె నెక్కువ అక్రమముగ ప్రవర్తిం చుట మామూలు. ఈ సమయముననే ఫ్రెంచివారు ఉత్తరా ఫ్రికాలోని ఈజిప్టుకు సమీపముననున్న అరబ్బుదేశమగు ట్యునీసును అక్రమముగ ఆక్రమించుటయు, అచటి అరబులు ఫ్రెంచివారితో పోరాడుచుండుటయు జరుగుచుండెను. ఇది ఫ్రెంచిప్రభుత్వమునకు చాల వ్యయప్రయాసలను కలుగచేయు చుండెను. మానవస్వతంత్రము, సమానత్వము, సోదరత్వము అను పెద్దమాటలమీద స్థాపించబడిన ఫ్రెంచి ప్రజాస్వామ్య ముయొక్క ప్రధానమంత్రియగు గాంబెట్టాకూడ ట్యునీసు అరబులలోనే గాక ఈజిప్టుఅరబులలోకూడ ప్రబలుచున్న జాతీయభావములను పూర్తిగ అణచివేయుటకే నిశ్చయించి ఇందువిషయమున గ్లాడుస్టనుకు పూర్తిగ తోడ్పడెను. ఇంతటి

నుండియు ఈజిప్టులోని విదేశసలహాదార్లు అరబిపాషాను వడ గొట్టవలెనని పూర్తిగ కుట్రలను సలిపిరి.

## ఆదాయవ్యయపట్టికమీద రాజీ కుదరలేదు

యుద్ధమంత్రి మహమ్మదు బేసామీ అరబిపాషాను తనకు సహాయమంత్రిగ నియమించుకొనెను. అరబిపాషా సైన్యమును రెట్టింపుచేయుటకు తీర్మానమును ప్రవేశపెట్టగ విదేశసలహాదార్లు ఆక్షేపించిరి. తుదకు కొంతవరకు సైన్యమును వృద్ధిచేయుటకు సొమ్ము మంజూరుచేయబడెను. మరల విదేశపెత్తనదార్లు అడుగడుగుకు ప్రముఖుల అస్సెంబ్లీని ప్రతిఘటించుచుండిరి. నూతనరాజ్యాంగవిధానమును మంజూరు చేయుటకు 1881 సంవత్సరము డిసెంబరు 26 వ తేదీన ప్రముఖుల అస్సెంబ్లీ సమావేశమయ్యెను. విదేశఋణదాతల ఋణములకొరకు తాకట్టుపెట్టబడిన సగభాగపుపన్నులు పోగా మిగిలిన సగభాగపుపన్నులమీదను అసెంబ్లీకే అధికారము కలదనియు వాటికి ఆదాయవ్యయపట్టీని అసెంబ్లీయే మంజూరు చేయవలెననియు నారాజ్యాంగవిధానములో కలదు. ఇది కూడదనియు యావత్తుపన్నులమీదను యావత్తుఆదాయవ్యయపట్టికమీదను తమకే అధికారముకలదనియు ఆంగ్ల ఫ్రెంచి పెత్తనదార్లు గట్టిగా ఆక్షేపించిరి. ఇందువిషయములో ఏదోవిధముగా రాజీపడినచో బాగుండునని కాల్విను అభిప్రాయపడెను. కాని ఏవిధముగాను రాజీ పనికిరాదనియు ఆర్థిక అధికారమంతయు తమదేననియు ఆంగ్ల ఫ్రెంచిప్రభుత్వములు వ్రాసెను. రాజీకి అనుకూలుడగు షెరీఫుపాషా ప్రధానమంత్రిత్వమునకు రాజీ

నామానిచ్చెను. అంతకన్న దృఢాభిప్రాయుడగు మహమ్మదు సామీంబే ప్రధానమంత్రిఅయ్యెను. అరబిపాషా యుద్ధమంత్రి యయ్యెను. మంత్రివర్గము కేవలము జాతీయవాదులతో నిండెను. ఎస్సెంబ్లీకిని ఆంగ్ల ఫ్రెంచి ప్రభుత్వములకును రాజీ కుదరక ఎసెంబ్లీ కిష్టమువచ్చినటులనే నూతనరాజ్యాంగవిధానమును మంజూరుచేసెను. ఆదాయవ్యయపట్టికమీద అధికారములేని అసెంబ్లీవలన ప్రయోజనమేమి? అట్టి అధికారముతోడనే రాజ్యాంగవిధానము మంజూరు కాబడెను. మంత్రివర్గము చక్కగా పాలించసాగెను.

(3)

## ఆంగ్లేయులొక్కరే ఈజిప్టు నాక్రమించ నిశ్చయించిరి

ఈజిప్టుతో జోక్యముపుచ్చుకొని అరబిపాషాయొక్క అధికారమును నాశనముగావించి శాంతిని నిలువబెట్టవలసినదని లండనులోని 'టైమ్సు' జాన్ మార్లేయొక్క 'పాల్ మాల్ గెజెట్' 'స్టాండర్డు' మొదలైన పత్రికలు వ్రాయసాగెను. అరబిపాషా మరియొక హైందవసిపాయీల తిరుగుబాటువంటి దానిని ఈజిప్టులో లేవదీయుటకు తయారుచేయుచున్నాడనియు, ఈజిప్టులోని బ్రిటిషువారినందరిని నరికివేయుటకు సిద్ధముగానున్నాడనియు కూడ నా పత్రికలు వ్రాసెను. విదేశపెత్తనదార్లు ఖెడీవును తమతో చేర్చుకొనిరి. ప్రముఖుల అస్సెంబ్లీని విచ్ఛిన్నముచేయించిరి. ప్రముఖుల అస్సెంబ్లీ ఖెడీవుయొక్క అధికారమును ధిక్కరించి సమావేశమయ్యెను. అస్సెంబ్లీ, మంత్రివర్గము, సైన్యము ఖెడీవుపేరున దేశమును

పాలించసాగెను. దేశములోని క్రైస్తవులగు కాప్టులుకూడ జాతీయవాదులతో కలసియుండిరి. విదేశస్థుల ఋణము లెగ బెట్టెదరనికూడ లండనులో అల్లరిచేయబడెను. అరబిపాషాను గూర్చి దినమున కొక కట్టుకథ లండనుపత్రికలలో కనపడు చుండెను. బ్రిటిషుప్రజలలో అరబిపాషా క్రూరుడైన మతావేశ పరుడైన ముసల్మానురాక్షసియని చూపుటకు సర్వప్రయత్న ములు గావింపబడెను. ఆతనికిప్రక్క ఈజిప్టుప్రజలు లేరని కూడా వ్రాయబడుచుండెను. తాము జాతీయోద్యమమును అణచుటలేదనియు క్రైస్తవులకు వ్యతిరేకమైన ముసల్మాను మతోద్రేకపూరితుడైన నొక అనాగరికుడగు సైనికనాయకుని మాత్రమే అణచివేయుచున్నామనియు ఇంగ్లాండుప్రజలకు చూపుటయే ఆంగ్లప్రభుత్వముయొక్కయు వారి కనుకూల మగుపత్రికలయొక్కయు నుద్దేశ్యము. 1882 మే 20 వ తేదీన ఆంగ్లేయ ఫ్రెంచి యుద్ధనావలు ఈజిప్టురేవులలో దిగెను. ఈ లోపుగ ఫ్రాన్సులో ప్రధానమంత్రిగనుండిన గాంబెట్టా మంత్రి త్వము మారెను. ట్యునిసు ఆక్రమణవ్యవహారములలో ఫ్రెంచి వారికి చాల వ్యయప్రయాసలు కలిగెను. ఆంగ్లేయులతో కలసి ఈజిప్టు నాక్రమించుటకు కావలసిన ద్రవ్యమును మం జూరుచేయవలసినదని నూతన ఫ్రెంచి ప్రధానమంత్రి కోరగ ఫ్రెంచి పార్లమెంటు నిరాకరించెను. అంతటితో ఫ్రెంచి యుద్ధనౌకలు ఈజిప్టుతీరమునువదలి తమదేశమునకు పోయెను. ఆంగ్లేయులొక్కరే "అరబిపాషాయొక్క దౌర్జన్యమునుండి ట్యూఫికు ఖెడీవును కాపాడి ఈజిప్టులో శాంతిని నెలకొల్పు టకుగాను ఈజిప్టు నాక్రమణచేయు" మహత్కార్యమును

సాగించుటకు మిగిలిరి. అరబిపాషా అలెగ్జాండ్రియాకోటలను బురుజులను దిట్టపరచుచుండెను.

## బ్రిటిషుప్రభుత్వముయొక్క దుష్కృత్యములు

మేనెల 20వ తేదీన ఆంగ్ల ఫ్రెంచి యుద్ధపడవలు అలెగ్జాండ్రియాకు వచ్చినవి. మేనెల 25వ తేదీన ఆంగ్ల ఫ్రెంచి మంత్రివర్గములు నూతనమంత్రివర్గమునుతీసివేయవలసినదనియు అరబిపాషాను ఇంక నిద్దరు శాంతినాశకులను దేశమునుండి వెళ్ళగొట్టవలసినదనియు ప్రముఖుల అస్సెంబ్లీ అధ్యక్షునికి అంత్యసందేశమంపిరి. ట్యూఫికుఖెడీవు విదేశీయులతోచేరి దేశద్రోహముగావించుచున్నాడని ప్రకటించుచు మంత్రివర్గము వారు రాజీనామానిచ్చిరి. ఇందుమీద దేశములోని మతగురువులు ప్రముఖులు స్వదేశక్రైస్తవులు గొప్ప ఆందోళనము గావించిరి. కైరోలో అల్లరులుజరుగుటకు సిద్ధమయ్యెను. ట్యూఫికు ఖెడీవును మరల జాతీయవాదులమంత్రివర్గము నేర్పాటుచేయవలెనని కోరిరి. విదేశ యుద్ధపడవలు తమ ఫిరంగుల బెదరింపుతో ఖెడీవుచేత ప్రజాపాలనమును నాశనముగావింపచేయుటవలన అన్ని జాతులవారికిని ఆగ్రహము కలిగెను. మే నెల 27వ తేదీన ట్యూఫికు ఖెడీవు మరల జాతీయవాదులమంత్రివర్గమును నియమించి అరబి పాషాను యుద్ధమంత్రిగ చేసెను. అరబికి ఎక్కువ అధికారము బాధ్యత వచ్చినది. అక్కడ లండనులో జాన్‌మార్లేయొక్క 'పాల్ మాల్ గేజెట్‌లో మేనెల 30వ తేదీన అరబిపాషా ఖెడీవును ఖైదీగనుంచినాడనియు ఆయనను తక్షణము విడుదలచేయవలెననియు ఆంగ్లేయమంత్రివర్గ

మును కోరుచు అబద్ధములు ప్రచురించబడెను. ట్యూఫికును రాజ్యభ్రష్టునిగావించి క్రొత్త ఖేడీవును అరబిపాషా ఎక్కించ బోవుచున్నాడని జూన్ 1వ తేదీన గ్లాడుస్టను బ్రిటిషు పార్లమెంటులో మరియొక అబద్ధమును చెప్పెను. ఇంతటితో నాగక అరబిపాషాను పట్టుకొని కాన్‌స్టాంటినోపిలుకు చేర్చుటకును అతడు రాక నిరాకరించినచో అతని తెగటార్చుటకును, దుర్మార్గుడగు దర్విషుపాషాను ఈజిప్టుకు పంపునట్లుగా ఆంగ్లేయులు తురుష్కసుల్తానుతో నేర్పాటుచేసిరి. బలవంతుడును హత్యలకు వెనుదీయనివాడునునగు దర్విషు ఈజిప్టుకు వచ్చినాడు గావున, కొలదిరోజులలో అరబిపాషానుండి ఈజిప్టు విముక్తి చెందగలదని పాల్‌మాల్ గేజెట్‌లో బహిరంగముగ వ్రాయబడెను కాని, దర్విషుపాషాతోపాటు సుల్తాను షేకు అసదునుకూడ బంపెను. ఈ తురుష్కసుల్తానే అదివరకు కొలదిరోజులక్రిందట తన చారులనుబంపి విదేశస్థుల కేమాత్రము లొంగవద్దనియు విదేశపాలనమును ఈజిప్టులోనికి రానివ్వవద్దనియు అరబిపాషాకు రహస్యముగా కబురుచేసియుండెను. ఈజిప్టుప్రజల అభిప్రాయమును ముఖ్యముగా మతగురువుల అభిప్రాయమును కనుగొనవలెనని సుల్తాను అసదును బంపెను. అసదు అరబిపాషా కనుకూలుడు. వారిద్దరికి ఈజిప్టుప్రభుత్వము సన్మానముచేసినది. మతగురువులకు మిగతవర్గములవారికి వెంటనే అలెగ్జాండ్రియానుండి విదేశ యుద్ధనౌకలు పోవలెననియు విదేశీయులఅధికారము దేశములో నేర్పడగూడదనియు జాతీయవాదులప్రభుత్వమే సాగవలెననియు ఆవచ్చినవారికి తెలియపర్చిరి. దర్విషు పాషాకు గుండెలు చల్లబడినవి. కాన్‌స్టాంటి

నోపిలుకు రమ్మని అరబీని కోరెను. ఆయన ప్రస్తుతము రాజా లనని చెప్పెను. ఆయన నేమిచేయుటకును దర్వీషుకు ధైర్యము చాలలేదు. ఆమరునాడు అనగా జూన్ 10వ తేదీన అలెగ్జాండ్రియాలో అల్లరులుజరిగి ఒక బ్రిటిషుద్యోగి ఏబదిమంది స్వదేశక్రైస్తవులు హత్యగావింపబడిరి. ఆంగ్లేయకాన్సలు కుక్సన్‌కు దెబ్బలు తగిలెను. ఇటాలియను గ్రీకు కాన్సలులు అవమానపర్చబడిరి. ఇంతకన్న దేశమంతయు అరాజకముగ నున్నదని రుజువు ఏమికావలెను? ఈ అల్లరులను అణచివైచి అరబిపాషా శాంతిని నెలకొలిపెను. ఇందువలన ఆయనప్రతిష్ఠ దేశములో హెచ్చెను. తమ జాతీయప్రభుత్వము శాంతి భద్ర తలను కాపాడగలదని ప్రజలకు రుజువయ్యెను. ప్రజలు తమ సురక్షితముకొరకు జాతీయప్రభుత్వము వైపునకును దానినాయ కుడగు అరబిపాషా వైపునకును మాత్రమే చూచిరి. దేశీయ క్రైస్తవులెల్లరును అరబిపాషాకును జాతీయప్రభుత్వమునకును వెనుకనుండిరి. అయినను అక్రమముగాను అబద్ధముగాను లండ నుపత్రికలలో స్వదేశక్రైస్తవులను హత్యలుగావించుచున్న టుల తరుచుగా ప్రచురించబడుచుండెను. ఈ అల్లరుల నన్ని టిని ట్యూఫికు ఖెడీవే అరబిపాషాయొక్క యుద్యోగమిచ్చెద నని ఆశలుబెట్టి అలెగ్జాండ్రియాకు గవర్నరుగనున్న విదేశస్తు డగు ఓమరు లట్ఫీచేత చేయించెననియు, దర్వీషుపాషాసలహా వల్లనే ఖెడీవు ఈ పనికి పూనుకొనెననియు, ఈ విషాద యుదంతము గ్లాడుస్టనుకును ఆయనయొక్క లిబరలుపార్టీ వారి కిని మిగుల లజ్జాకరమనియు బ్లంటు తన 'ఈజిప్టుయొక్క బ్రిటిషు ఆక్రమణ' అను గ్రంథమునందు వ్రాసియున్నాడు. ఖెడీవే

ఈ అల్లరులు చేయించినటుల రుజువైనదని 1883లో రండాల్ఫు చర్చిలు ప్రభువుకూడ వ్రాసియున్నాడు. ఏమైతేనేమి అల్లరులు జరిగి విదేశస్థులగు తెల్లవారియొక్కయు స్వదేశ క్రైస్తవులయొక్కయు మాన ప్రాణములకు అపాయము కలిగినది. సురక్షితము లేకున్నది. కాని కొందరాంగ్లేయులకు ఈజిప్టునాక్రమించుట దుర్లభ కార్య మనిపించినది. ఈజిప్టును తెల్లవారిఆక్రమణనుండి రక్షించి జాతియొక్క న్యాయమైన హక్కులను సంరక్షించుటకే కొందరునాయకులు ఆంగ్లేయమిత్రులద్వారా రాయబారములు జరుపుచుండిరి. ఇంకను ఈజిప్టుకు న్యాయము జరుగుననియే ఆశించబడుచుండెను. అరబి మంత్రివర్గము ఆంగ్లేయుల నెదిరించుటకై తగిన సైన్యములను సిద్ధపర్చుకొనలేదు. కాని ఆంగ్లేయ మంత్రివర్గము మాత్రము అరబిని జాతీయవాదులను వెళ్ళగొట్టి ఆంగ్లేయులఅధికారము స్థాపించుటకు దృఢాభిప్రాయులై యుండిరి. అలెగ్జాండ్రియా కోటలలో నెట్టి క్రొత్తపనులను చేయించకూడదని జులై 6వ తేదీన ఆంగ్లేయ నౌకాసేనాని అరబి పాషాకు అంత్యసందేశ మివ్వగా అరబి క్రొత్తపనులను చేయించుట మానుకొనెను.

## బ్రిటిషువారు అలెగ్జాండ్రియా కోటలను ధ్వంసముగావించుట అరబి పాషాయొక్క జయము

జులై 9వ తేదీన అలెగ్జాండ్రియాకోటలలో క్రొత్తపనులను మరల చేయించుచున్నారని ఆంగ్ల నౌకాసేనాని స్టేమరుకు తెలియవచ్చినదట. క్రొత్తపనులు చేయించినమాట అబద్ధమని జాతీయవాదులవాదము. ఏమైతేనేమి జులై 11వ తేదీన

ఆంగ్ల సేనాని స్టేమరు అలెగ్జాండ్రియా కోటలపై ఫిరంగులను కాల్చి యా కోటలనన్నిటిని ధ్వంసముగావించెను. అరబి క్రిందనున్న ఈజిప్టుసైన్యములు అలెగ్జాండ్రియాను వదలి పోయెను. ఆ పట్టణము తగులపెట్టబడెను. దోపిళ్లు జరిగెను. ప్రజలు తిరగబడి కొందరు తెల్లవారిని హత్యగావించిరి. ఆంగ్ల సైన్యములు పట్టణమునంతను స్వాధీనపర్చుకొని శాంతిని నెల కొలిపెను. జాతీయవాదియగు సులేమాను పాషాను పట్టుకొని ఉరిదీసిరి. అరబిపాషా జాతీయసైన్యమును బాగుగ పోగు చేసి అలెగ్జాండ్రియానుండి ముందుకు పోవుచున్న ఏడువేల ఆంగ్లేయసైన్యము నోడించి రెండు నెలల కాలము ఈజిప్టును స్వాధీనపర్చుకొనకుండ చేయగలిగెను. వెంటనే జాతీయప్రముఖులకౌన్సిలు సమావేశమై ఆంగ్లేయులను ప్రతిఘటించి దేశ స్వతంత్రమును కాపాడుటకు ఏకగ్రీవముగ తీర్మానించెను. అందుకు ట్యూఫిక్ ఖెడీవుకూడా సమ్మతించెను. కాని కొలది రోజులలోనే ట్యూఫికు పారిపోయి ఆంగ్లేయులశరణుజొచ్చెను. రెండునెలలకాలము ట్యూఫికు ఖెడీవుపేర అరబిపాషా నాయకత్వమున అసెంబ్లీయును మంత్రివర్గమును రాజ్యమునునడిపిరి. ఖెడీవు ఆంగ్లేయులచేతిలో ఖైదీగనున్నాడు గావున, ఆయన యొక్క యుత్తరువులను శిరసావహించనక్కరలేదనియు దేశముయొక్క శాంతిభద్రతలకును సుపరిపాలనమునకును తామే బాధ్యతవహించినామనియు ప్రకటించిరి. కైరోనగరముననున్న యూరోపియనులను కాపాడిరి. అటుల పోదలచినవారిని పోర్టుసేడుకు సురక్షితముగచేర్చిరి. కాప్టులందరును ఈ జాతీయ ప్రభుత్వములోనే యుండిరి. వారికి పూర్తియైన సురక్షణయే

యుండెను. జాతీయసైన్యములను పోగుచేయసాగిరి. రైతు లుత్సాహవంతులై సైన్యములో విరివిగ చేరిరి. గ్రామపెద్దలగు షేకులందరును జాతీయప్రభుత్వపక్షమునుండి రైతులను ప్రోత్సహించుచుండిరి. ముస్తఫా ఫేమి సైన్యాధిపత్యమును వహించెను.

## అపరిమితమైన లంచములు - దేశద్రోహము

కాని "ట్యూఫికు ఖెడీవుకును అతనిబృందమునకును విదేశీయుల ఆయుధసంరక్షణమేగాక, విదేశీయుల బంగారముకూడ బాగుగ లభించినది. సైనికనాయకులలోను రాజకీయనాయకులలోను విశేషముగ పంచిపెట్టబడిన లంచములే జాతీయోద్యమ అపజయమునకు ముఖ్యకారణ మయ్యున్నది" అని యంగు తన 'ఈజిప్టు'లో వ్రాసెను. అసెంబ్లీ అధ్యక్షుడగు సుల్తాను పాషా పదివేల సవరనులను ఆంగ్లేయులవద్ద లంచము తీసికొనెనని 'బ్లంటు' తన "ఈజిప్టుయొక్క బ్రిటిషు ఆక్రమణ" అనుగ్రంథములో వ్రాసినాడు. షెరీఫు పాషా మొదలగు ప్రముఖులు భయపడి ఆంగ్లేయులసంరక్షణలోనే చేరిరి. అరబిపాషాను ఆయన అనుచరులను తిరుగబాటుదారులని ట్యూఫికు ఖెడీవు ప్రకటించెను. తురుష్కసుల్తాను (ఖలీఫా)చేత కూడ ఈజిప్టుజాతీయవాదులు రాజద్రోహులని ప్రకటింపజేసి యొక శ్రీముఖమును బ్రిటిషువారు తెచ్చిరి. ముసల్మాను మతోద్రేకముతో ఈజిప్టుప్రజలు తమకు వ్యతిరేకముగ లేవకుండుటకై ఆంగ్లేయు లీ రెండుపనులను గావించిరి.

## హిందూదేశమునుండి సిపాయిలు వచ్చిరి

"క్రైస్తవులకు వ్యతిరేకముగనున్న అరాజకమునుండి ఈజిప్టును సంరక్షించి శాంతిని నెలకొల్పుటకుగాను" ఇరువై అయిదులక్షల నవరసులను గ్లాడుస్టన్ ప్రధానమంత్రి ఆంగ్లేయ పార్లమెంటుచేత మంజూరునుపొందెను. జాన్ బ్రైటు మాత్రము ఇందుకొప్పుకొనక తనమంత్రిత్వమునకు రాజీనామానిచ్చెను. గ్లాడుస్టన్ చేయుచున్న అన్యాయమును ఖండించెను. ఇంగ్లాండు నుండి పదిహేను వేలమంది సైనికులును హిందూదేశమునుండి సర్ గార్నెటు వుల్సిలీ సేనానిక్రింద అయిదువేలమందిసిపా యిలును "ఈజిప్టులో జరుగుచున్న సిపాయీల తిరుగుబాటు నణచుటకు" పంపబడిరి, ఇన్నికష్టములలో అరబిపాషాయును అతనితో మిగిలియున్న జాతీయవాదులును పోరాడవలసివచ్చి నది. వీరు లంచములకుగాని బెదరింపులకుగాని లొంగక చివర వరకును దేశస్వాతంత్రముకొరకు పోరాడినధీరులు. ప్రథమమున ఈజిప్టుసేనలే జయములనొందుచుండెను.

## యుద్ధములలో ఆంగ్లేయుల జయములు

ఇంతలో సూయజుకాలవగుండ వుల్సిలీసేనానిక్రింద హైందవసేనలు ఈజిప్టులో దిగెను. ఇటు అలెగ్జాండ్రియా నుండి అల్లిసన్ సేనానిక్రింద సేనలు వచ్చెను. రెండువైపు లను ఈజిప్టుసేనలను ముట్టడించెను. ఆంగ్లసేనలు ముప్పది వేలుండెను. ఈజిప్టుసేనలు తరిఫీయతైనవారు పదమూడువేల మంది మాత్రమే యుండిరి. మిగిలినవారు క్రొత్తగా చేరు చున్నవారు. ఆగస్టు 23 వ తేదీన కస్ససిన్‌వద్దను సెప్టెంబరు

2 వ తేదీన టెలెల్ కబీరువద్దను ఈజిప్టుసేనలను ఆంగ్లేయు లోడించిరి. ఈ రెండవయుద్ధములో పదివేలమంది ఈజిప్టుసైని కులు హతులై వీరస్వర్గమలంకరించిరి. అరబిపాషా కైరోపట్టణ మును చేరెను. ఆంగ్లేయులు వెంబడించి, కైరోపట్టణమును పట్టుకొనిరి. అరబిపాషానుకూడ చుట్టుముట్టి పట్టుకొనిరి. దేశమునంతను ట్యూఫికు ఖెడీవుపేర ఆంగ్లేయసైన్యములు స్వాధీనపర్చుకొనెను.

## అరబిపాషాను సింహళమునకు ప్రవాసమునకు బంపిరి

జాతీయవాదులలో కొందరుప్రముఖుల నురిదీసిరి. అరబి పాషాను ఖెడీవుపై తిరుగబాటు, అలెగ్జాండ్రియాహత్యలు, అలె గ్జాండ్రియాను తగులబెట్టుట మొదలగు నేరములకు విచారణ సలిపి యురిదీయవలెనని ప్రయత్నించిరి. కాని ఏమియు రుజువు లేదు. ఖెడీవు ఆంగ్లేయులను ప్రతిఘటించమని అరబిపాషాకు వ్రాసిన లేఖలు దాఖలుచేయబడెను. ఈజిప్టుజాతి యావత్తు జాతీయోద్రేకముతో నిండియున్నదనియు అరబిపాషాను అక్ర మముగా నురిదీసినచో అల్లరులు ఎక్కువగ జరుగుననియు గ్లాడు స్టన్‌కు తెలిసెను. విచారణనిమిత్తము డఫరిన్‌ప్రభువునుబంపిరి. ఒకసేనానాయకుని పట్టుకొని అతనిచేత అలెగ్జాండ్రియాను తగులబెట్టమని తమకుత్తరువు అరబిపాషా యిచ్చెనని చెప్పిం చిరి. కాని ఆ సాక్ష్యము చాల అసంతృప్తికరముగను అసంద ర్భముగను కన్పించెను. అందుమీాద ఖెడీవువద్దనున్నప్పటికిని తాను యుద్ధమునుసాగించినమాట వాస్తమేనని అరబిపాషా అంగీకరించునటులను తక్కిన కేసులన్నిటిని వదులుకొనునటు



అరబిపాషా

లను సింహళద్వీపమునకాయనను జైలులోలేకుండద్వీపాంతర వాసమునకుబంపునటులను, ఇంకకొందరికి తక్కువశిక్షలువిధిం చుటకును డఫరిన్ప్రభువు రాజీ కుదిర్చెను. అరబిపాషాకు కొంతజీవనభృతినిచ్చిసింహళద్వీపములో యావజ్జీవమునివసించు టకు బంపివేసిరి. తాత్కాలికముగ జాతీయోద్యమము అణగి పోయినది. 1883 వ సంవత్సర ప్రారంభమునకు ఈజిప్టుపైన ఆంగ్లేయులు తమ నిరంకుశాధికారమును స్థాపించుకొనిరి.

## గ్లాడుస్టనుయొక్క వాగ్దానము కల్లయని తేలినది

ఈజిప్టును ఆక్రమణచేయుటకుగాను "నిజముగా శాంతి యుతమైనట్టియు అభివృద్ధికరమైనట్టియు లిబరలు (ఔదార్య) కక్షియొక్క సహాయ సానుభూతుల కర్హమైనట్టియు ఈజిప్టు జాతీయోద్యమమును, ముసల్మానుమతోద్రేకులయొక్క అరా జకమనియు తమ ఔదార్యకక్షివారు అణచివేయుటకర్హమైన దనియు నా కక్షియొక్క నాయకుడగు గ్లాడుస్టను చెప్పవల సివచ్చిన"దని యంగు తన 'ఈజిప్టు'లో వ్రాసినాడు. లిబరలు పార్టీకి నాయకుడగుటచే ఈజిప్టును తమక్రింద శాశ్వతముగ నుంచుకొనుట తన యుద్దేశ్యముకాదనికూడ ఆయన చెప్ప వలసివచ్చినది. 1883 జనవరి 8 వ తేదీన దేశముయొక్క పరి స్థితులు, ఖెడీవు అధికారము సరిగ స్థాపితమగు నేర్పాటులు, అనుకూలించగనే బ్రిటిషుసైన్యములను ఈజిప్టునుంచి తీసివేసె దమ"ని ఆయన విదేశప్రభుత్వములకు ప్రకటనమునుగావిం చెను. ఈ ప్రకటన చాల పవిత్రమైనదని కూడ ఆయన చెప్పెను. కాని అటుపిమ్మట చాల సంవత్సరము లాయన అధి

కారములోనున్నను జీవించియున్నను దీనిని నెరవేర్చుట కెట్టి ప్రయత్నము గావించియుండలేదు. అట్టి సుదినము రానేరా లేదు. ఒకసారి సామ్రాజ్యవాదులచేతులలోకి యొక దేశము పోయిన పిమ్మట దానిని వారు బుద్ధిపూర్వకముగ విడిచి పెట్టుట అసంభవము. ఈజిప్టునుండి ఆంగ్లేయులను బలవంత ముగ వెడలగొట్టుటకు డెబ్బదినాలుగు సంవత్సరములు పట్టినది.

## హిందూదేశసామ్రాజ్యమును కాపాడుకొనుటకొరకే సూయజుకాలవ, ఈజిప్టుల ఆక్రమణము

ఈజిప్టుసమస్యయొక్క సారాంశము ఆర్థికప్రాముఖ్యమై యున్నదని క్రోమరు ప్రభువు చెప్పియున్నాడు. ఇంతకన్న ఆంగ్లేయులకు ముఖ్యమైనది సూయజుకాలవ. 1882 వ సంవ త్సరమున నీ కాలవలోగుండ ప్రయాణముచేసినపడవలలో నూటికి ఎనుబదిపాళ్ళు బ్రిటిషుపతాకముగలవే. "సూయజు కాలువను శాశ్వతముగ తమక్రిందనుంచుకొనుటకు ఈజిపును కూడ తమక్రిందనుంచుకొనుటావశ్యకమని డిల్కి మొదలగు ఆంగ్లేయప్రభుత్వసభ్యులు నమ్మిరయే ఈజిప్టు నాక్రమించి"రని డాక్టరు మూను తన 'సామ్రాజ్యతత్వము-ప్రపంచరాచకీయ ములు' అనుగ్రంథమునందు వ్రాసెను. ఆంగ్లేయ విదేశాంగ మంత్రియగు కర్జన్‌ప్రభువు తమ హిందూదేశసామ్రాజ్యమును కాపాడుకొనుటకు ఎటుల సూయజుకాలువను ఈజిప్టును ఆక్ర మించవలసివచ్చినదో 1920 లో నీవిధముగ చెప్పెను.

"బ్రిటిషు రాజ్యాంగవిధానమునందు మనకుగల సామ్రాజ్యము హిందూదేశముమాత్రమేనని ఎవరైనను చెప్పి

న్నచో నది మన మంగీకరించక తప్పదు. బ్రిటిషువారి రాజనీతి యొక్క యవలంబనమునందును రాజ్యవ్యాపకమునందును హిందూదేశము ప్రధానస్థానము నాక్రమించియున్నది. తూర్పు దేశములలోను మధ్యధరాసముద్రమునకు దక్షిణముననున్న ప్రదేశములలో బ్రిటిషువారియధికారమును వ్యాపింపజేసి కొనుటలో హిందూదేశమునకుగల సంబంధము ముఖ్యముగ నాలోచించబడుచువచ్చినది. మధ్యమయుగమునందు క్రైస్తవ యాత్రాస్థలములను స్వాధీనమునుపొందుటయే ప్రధానసమ స్యగ నుండెను. ఒకసారి హిందూదేశములో స్థాపన మేర్పర చుకొనినప్పటినుండియు, ప్రాగ్దేశములసమస్య, కొద్దిగ కాన్ స్టాంటినోపిలునుగూర్చియైనను, హిందూదేశముమీాద మన రాజ్యమును సురక్షితముగ కాపాడుకొనుటమీాదనే మన యావత్తు ప్రపంచ వ్యవహారనిర్వాహణము నిజముగ నాధార పర్చబడినది. హిందూదేశము కొరకు గాకపోయినచో బీకన్సు ఫీల్డుప్రభువు సూయజు కాలవలో భాగములనుకొని యుండడు. సూయజుకాలవకొరకు గాకపోయినచో మనము ఈజిప్టులో నిపుడుండము. నూరుసంవత్సరములు రష్యాతో మనకుగల చారిత్రాత్మకమగుకలహములు, హిందూదేశసరిహద్దులనుండి వారిని చాలదూరముగ ఉంచు ఆవశ్యకతనుబట్టియే జరిగినవి. హిందూదేశముకొరకు గాకపోయినచో దక్షిణాఫ్రికాలోని కేపుకాలనీని మనము స్థాపించియుండము. దక్షిణాఫ్రికాలో మనము జరిపిన సుప్రసిద్ధమగు రాజ్యవ్యాపనము జరిపి యుండము.''

# ఈజిప్టుదేశ చరిత్ర

## ఏడవ అధ్యాయము

### ఆంగ్లపాలనము_జాతీయోద్యమాభివృద్ధి

### క్రోమరు ప్రభువు

1883 నుండియు ఆంగ్ల ఫ్రెంచి సమిష్టిఅధికారము పోయి ఒక్క ఆంగ్లేయులఅధికారమే మిగిలినది. ఆంగ్లేయ ప్రభుత్వపక్షమున నొక హైకమీషనరు, (కాన్సల్ జనరలు) ఆయనక్రింద కొందరు బ్రిటిషుద్యోగస్థులు ఈజిప్టులో నుంచ బడిరి. వీరి సలహాప్రకారము ఖెడీవు పరిపాలనముచేయవలెను. వీరికి మద్దతుగ బ్రిటిషు సేనలుకూడ నుంచబడెను. డఫరిన్ ప్రభువు మొదటి హైకమీషనరుగ నియమింపబడెను. 1883 లో ఖెడీవుయొక్క పాలనముకొరకొక రాజ్యాంగవిధానము నేర్పాటుచేసెను. ఇది ఈజిప్టుయొక్క 'ఆర్గనికులా'అని ప్రక టించబడెను. ఒక జనరలు అస్సెంబ్లీ, లెజిస్లేటివ్ కౌన్సిల్ ఏర్పాటుగావింపబడెను. వీటి అనుమతి లేనిది క్రొత్తపన్నులను విధింపవీలులేదు. తక్కిన అన్ని విషయములలోను నివి సలహా సంఘములుగ నుండును. విదేశస్థులరుణములనుగూర్చిన విష యము లేమియు నివి చర్చించుటకు వీలులేదు. చట్టసభలలో ప్రవేశపెట్టబడు బిల్లులను తయారుచేయుట కొక ప్రివీకౌన్సిల్ కూడ నియమింపబడెను. ఖెడీవొక మంత్రివర్గమును నియ

మించి వారిమూలమున పరిపాలననుజరుపవలెను. ఇవన్నియు పేరునకు కలవు. "నిజముగా ఈజిప్టుపై రాజ్యాధికారముచేయు నది ఖెడీవుతో సంబంధములేకుండా కైరోలో బ్రిటిషు హైకమీషనరునుండి యుత్తరువులను పొందెడి బ్రిటిషుసలహాదార్లే. వీరు అన్ని పరిపాలనాశాఖలపైనను పెత్తనమునుచేసిరి. బ్రిటిషు హైకమీషనరుగను కాన్సలుజనరలుగను క్రోమరుప్రభువు 1883 మొదలు 1907 వరకును పాతికసంవత్సరములు ఈజిప్టు యొక్క నిజమైన నిరంకుశ సార్వభౌముడుగ నుండెను. ఆయన లండనులోని గొప్పషాహుకార్లకు బంధువు. ఆర్థికవిషయము లలో నిపుణుడు. అప్పటికి ప్రభుబిరుదము లేదు. మేజరు ఎవ్లిను బేరింగు అను పేరుమాత్రము గలదు. ఈజిప్టులో గావించిన యద్భుతకార్యములనుబట్టి ఈయనకు ప్రభుబిరుద మొసంగ బడెను" అని డాక్టరు మూను తన 'సామ్రాజ్యతత్వము-ప్రపంచ రాజకీయములు' అను గ్రంథములో వ్రాసినాడు. ఈయనే ఈజిప్టుయొక్క ఆంగ్లేయాక్రమణమునకు ముఖ్యసలహాదారు డనికూడ పైన చూచియున్నాము. క్రోమరుప్రభువునకు ఈజిప్టు దేశీయులకు స్వపరిపాలనాశక్తిగలదని నమ్మకము లేదు. డఫరిన్ యొక్క రాజ్యాంగవిధానమునకు కూడ నింకను సమయము రాలేదు. ఆంగ్లేయయుద్యోగస్థుల నిరంకుశపాలనమే ఈజిప్టుకు క్షేమకరము అని ఆయనయుద్దేశ్యము కావున, క్రోమరు తన కాలములో శాసనములను తయారుచేయుపనిని ప్రివీకౌన్సి లునుండి తీసివేసి బ్రిటిషుసలహాదార్లకే వప్పగింతజేసెను. లెజిస్లేటివ్ కౌన్సిలును అసెంబ్లీని అల్లరిబిడ్డలని భావించి యెప్పుడో గాని సమావేశపరచలేదు.

## అచ్చమైన సామ్రాజ్యతత్వము

ఆయన సైనికబలముమీాదనే ఆధారపడి కేవలము బ్రిటిషుద్యోగస్తులమూలమున ఈజిప్టుకు 'సుపరిపాలన'మివ్వ దలచెను. పెద్దపెద్ద జీతములిచ్చి అన్ని శాఖలకును బ్రిటిషుద్యోగస్తులను నియమింపజేసెను. కొరడాలతో దెబ్బలుకొట్టు ఆచారమును, నిర్బంధముగ కూలిపనిచేయించు నేర్పాటును రద్దుపరచెను. లంచగొండితనము నిర్మూలించుటకు యత్నించెను. నైలునదిమీాద ఆస్వాన్‌వద్ద పాత ఆనకట్టను బాగుచేయించి ఇంకను రెండుచోట్ల ఆనకట్టలు కట్టించి జలాధారములను వృద్ధిచేసి ప్రత్తిపంటను చెరకుపంటను పెంపొందచేసెను. ఆంగ్ల దేశములోనివస్త్రయంత్రశాలలకు కావలసిన మంచిప్రత్తి ఈజిప్టునుండి రవాణాయయ్యెను. ఇతరముడిపదార్థములు ఆహారపదార్థములు ఇంగ్లాండుకు రవాణాఅయ్యెను. ఇంగ్లాండునుంచి వస్త్రములు ఇనుప ఉక్కుసామానులు మొదలగుపారిశ్రామిక సరుకులువిశేషముగ ఈజిప్టులో దిగుమతియగుటకు సమస్తసౌకర్యములు కోశమరుప్రభువు కలుగజేసెను. రోడ్లను బాగుగా వేయించెను. ఈజిప్టులోని అనాదినుంచి పేరుగాంచిన వస్త్ర పరిశ్రమ, పింగాణి గ్లాసు మొదలగు పరిశ్రమలకు బాగుగా దెబ్బతగిలి, అవి క్షీణించినవి. ఈజిప్టు దాదాపుగా కేవల వ్యవసాయ దేశమయ్యెను. ఐశ్వర్యము మృగ్యమై ప్రజలలో దరిద్రము వ్యాపించినది. 1904 వరకును ఫ్రెంచివా రడ్డుతగులుచువచ్చినందున త్వరలోనే ఈజిప్టునువదలివెళ్ళుదుమనిఅనేక సార్లు ఆంగ్లమంత్రులు ప్రకటించుచువచ్చిరి. ఆ సంవత్సర

ములో ఫ్రెంచివారి మొరాకోఆక్రమణను ఆంగ్లేయు లొప్పు కొనునట్లును, ఆంగ్లేయుల ఈజిప్టుఆక్రమణను ఫ్రెంచివా రంగీ కరించునట్లును, ఉభయులమధ్యను ఒడంబడిక కుదిరినందున అప్పటినుండియు ఈజిప్టునుండి తొలగిపొమ్మని ఆంగ్లేయుల నడుగు తెల్లప్రభుత్వము లేకుండెను. క్రోమరుప్రభువు విద్య వ్యాపించినచో ప్రజలు అల్లరిమూకలగుదురని నమ్మి విద్యకు బహుతక్కువగ ఖర్చుచేసెను. ఇస్మాయిల్ ఖెడీవు పెట్టించిన పాఠశాలలను చాలవరకు మూసివేయించెను. చివరరోజులలో ననగ 1906లో అప్పటి ఆందోళననుబట్టి సాదు జగ్లులుపాషా యను జాతీయప్రముఖుని విద్యామంత్రిగ నియమించెను. అప్పటినుండి విద్యావ్యాపకమునందు కొంత అభివృద్ధికలిగెను. ట్యుఫికుఖెడీవు క్రోమరుప్రభువుయొక్క అదుపాజ్ఞలలోనుండెను. కాని ఆతడు 1892 లో చనిపోయెను.

## ఖెడీవు అబ్బాసుహిల్మి

పిమ్మటవచ్చిన యువకుడగు ఖెడీవు అబ్బాసుహిల్మి జాతీయవాదియై దేశములోని ముస్తఫా కమీలు మొదలగు జాతీయవాదులతో స్నేహసంబంధములనుపెట్టుకొని మంత్రుల నియామకములో స్వతంత్రముగ నుండుటకు యత్నించెను గాని, అడుగడుగుకును అపజయమునుపొందెను. ఇంగ్లాండు లోని ప్రధానమంత్రినుండి శ్రీముఖములను తెప్పించి అబ్బాసు హిల్మిని మందలించి బెదరించి క్రోమరుప్రభువు తన చెప్పుచేత లలోనుండువారినేమంత్రులుగానియమింప జేసెను. తమఖెడీవు కెట్టి స్వతంత్రములేదనియు తమను నిరంకుశముగా పాలించు

చున్నది బ్రిటిషు వుద్యోగస్తులేననియు దేశీయులకందరికిని పూర్తిగా తెలిసెను. అసంతృప్తి బాగుగ వ్యాపించినది.

## దెన్షావి విషాదకథ

ఇరువదవశతాబ్దప్రారంభమునకు ఈజిప్టులో మరల జాతీయోద్యమము విజృంభించసాగినది. రెండువందలపత్రికలు వెలువడినవి. ఎప్పుడు ఆంగ్లేయులు ఈజిప్టును వదలిపోవుదురని ప్రశ్నించసాగిరి. 1906 జూన్ 13 వ తేదీన కొందరు బ్రిటిషు సైనికోద్యోగస్తులు పిట్టలషికారుకు 'దెన్షావి' అను గ్రామమునకు పోయి అకస్మాత్తుగా నొక ఈజిప్టుస్త్రీని కాల్చి చంపిరి. ఆ యూరివారీ యుద్యోగస్తులను ముట్టడివేసి మందలించిరి. ఆ యుద్యోగస్తులు భయపడి అచటనుండి పరుగెత్తుకొనివచ్చిరి. గ్రామస్థులు వెంబడించలేదు. ఆ యుద్యోగస్తులలో నొకడు త్రోవలో క్రిందపడి యెండదెబ్బవలనను, నరములవేగమువలనను మరణించెను. ఒక అమాయకుడగు ఈజిప్టు కుర్రవాడు ఆ యుద్యోగస్తునికి సహాయముచేయుటకు దగ్గరకుపోగా మిగత సైనికోద్యోగులు కుర్రవానిని పట్టుకొని చంపిరి. ఆ యుద్యోగస్తులను విచారణచేసి శిక్షించుటకుమారుగా, ప్రజలు తిరుగబాటుగావించుటకు వేచియున్నారనియు, విదేశీయులను నరకబోవుచున్నారనియు కైరోలోని విదేశపత్రికలును లండనులోని ఆంగ్లపత్రికలును వ్రాసి, ఆ గ్రామస్తులకు తగినశిక్షలువేసి మంచి గుణపాఠము నేర్పవలెనని ఆందోళనముగావించెను. ఆ వెంటనే ముగ్గురు ఆంగ్లేయులును ఇద్దరు జోహుకుములగు ఈజిప్టుదేశీయులును గల యొక విచారణకమిటీని ఏర్పాటు

గావించిరి. ఏదో విచారణచేసి ఆ గ్రామములోని నలుగురికి ఉరిశిక్షను, చాలామందికి కఠినఖైదు, దెబ్బలశిక్షయు విధించిరి. ఇందుమీద అప్పీలులేదు. ఈ శిక్షలన్నియు అమలు జరిగెను. ఇది కేవలము అక్రమమని, ఘోరమని ఈజిప్టుపత్రికలన్నియు ఆందోళనముచేసెను కాని ఫలితమేమియు లేకపోయెను.

క్రోమరుప్రభువు అన్నితరగతులప్రజలను నిరంకుశముగ నణచివేసినాడనుభావము వ్యాపించెను. పిమ్మట కొలది దినములకే క్రోమరుప్రభువు ఈజిప్టును వదలిపోయెను. ఆయన కైరోనగరము వదలిపోయినపుడు ఆయనను గౌరవించినవారు లేరు. ఆయనతోకూడ బ్రిటిషుసైనికులు తప్ప మరి యెవరును లేరు. వీథులన్నియు నిర్జనముగ నున్నవి. ఇరువదియైదుసంవత్సరములు ఈజిప్టునుపాలించిన క్రోమరుప్రభువు ఇట్టి జాతీయ అగౌరవముతో 1907 లో ఈజిప్టును వదలివెళ్ళెను.

## సుడాను దేశము

విదేశీయులును క్రైస్తవులునునగు ఆంగ్ల ఫ్రెంచి ప్రభుత్వములు తమ ముసల్మానురాజగు ఇస్మాయిలు ఖెడీవుయొక్క స్వాతంత్రమును హరించి ఆతనిపై యాజమాన్యమునువహించుట, ఈజిప్టుక్రిందనుండిన సుడానుదేశీయులలో గొప్ప సంచలనమును కలుగచేసెను. మహమ్మదు అహమ్మదు అనునతడు బయలుదేరి తాను మహదీ(ప్రవక్త)ననియు తెల్లవారిని, తెల్లవారికిదాసులగువారిని వెళ్ళగొట్టి సుడానులో స్వచ్ఛమైన ముసల్మానురాజ్యమును స్థాపించుటకు తనకు దైవసందే

శముగలదనియు బోధించగ ప్రజ లాయనక్రిందికి చేరిరి. 1881 లో నీ మహదీ గొప్పసైన్యములను తయారుచేసి సుడానును తనక్రింద స్వతంత్రరాజ్యముగ ప్రకటించెను. సుడానులోని ఈజిప్టుసేనల నోడించెను. 1882 జూన్‌లో సెన్నరు పట్టణమును 1883 జనవరిలో ఎల్ ఒబేదుపట్టణమును స్వాధీనపర్చుకొనెను. సుడానుపై తన పాలనమును సాగించెను. ఇంతలో ఈజిప్టును బ్రిటిషువారాక్రమించుట జరిగెను. గ్లాడుస్టను ప్రధానమంత్రికి "మతోద్రేకముగలఅడవిజాతులతో" పోరాడుట కిష్టములేదు. సుడానులో సూయజుకాలవవంటి ఆర్థిక సమస్యలేదు. ఆంగ్లేయుల కపుడు సుడానుతో పనిలేకుండెను. గావున ఈజిప్టుయొక్క హైకమీషనరగు క్రోమరుప్రభువుకు సుడానును ఖాళీచేయుటయే యుక్తమని ఆంగ్లప్రభుత్వము 1883 నవంబరులో వ్రాసిరి. సుడానుకుపోయి అచటిపరిస్థితులనుబట్టి ఈజిప్టురాజ్యమును శాంతముగ స్థాపించుటకు వీలయినచో అటులచేయవలసినదనియు లేనిచో సుడానులోనున్న బ్రిటిషుసేనలను తీసుకొనిరావలసినదనియు గార్డనుసేనానిని బంపిరి. గార్డనుసేనాని ఖార్టూముపట్టణముచేరి కొన్ని రాజీ ప్రయత్నములు చేయుచుండగ 1885 జనవరి 26 తేదీన మహదీ తన సేనలతో ఖార్టూములో ప్రవేశించి గార్డనుసేనానిని, ఆతనితోనున్న సేనలను హత్యగావించెను. ఇక కొన్ని బ్రిటిషుసేనలు మహదీచే నోడింపబడి ఎటులనో సుడానును విడిచి ఈజిప్టుచేరెను. ఇంతజరిగినను ఆంగ్లేయులు చాల సంవత్సరములు సుడానును విడచిపెట్టి యూరకొనిరి. మహదీయును, పిమ్మట ఆయన కుమారుడును రాజ్యముచేసిరి. తరు

వాత పదకొండుసంవత్సరములకు మరల సామ్రాజ్యావసరము లేర్పడినందున ఆంగ్లేయప్రభుత్వమువారు కిచనరుప్రభువును సేనలతో బంపి సుడానును లోబర్చుకొనిరి. కాని ఈజిప్టు క్రింద చేర్చక, దానిపై ఆంగ్ల ఈజిప్టు సమిష్టిప్రభుత్వము నేర్పాటుగావించిరి.

## హోబ్జెలువతను (జాతీయవాదకక్షి)

క్రోమరుప్రభువుకు పిమ్మట సర్ ఎల్డన్‌గార్ట్సు హైకమీషనరుగ వచ్చెను. 1907 మొదలు 1911 వరకు నాలుగు సంవత్సరములపైకాలము పాలనముచేసెను. క్రోమరుపాలనముయొక్క ఆఖరువత్సరములలో వృద్ధిచెందిన ఈజిప్టుజాతీయోద్యమమును, ఈయన ఎదుర్కొనవలసివచ్చినది. హిందూదేశములోను, తురుష్కములోను, పర్షియాలోను, చైనాలోనుకూడ 1906 వ సంవత్సరమునాటికి జాతీయోద్యమములు బాగుగ విజృంభించెను. 1906 డిశంబరులో అఖిలభారత కాంగ్రెసుమహాసభ కలకత్తాలో దాదాబాయినౌరోజి అధ్యక్షతక్రింద సమావేశమై జాతీయవిద్య, స్వదేశీ, ఆంగ్లేయ వస్తుబహిష్కారము లను ఆయుధములతో భరతవర్షమునకు స్వరాజ్యమును సంపాదించవలెనని తీర్మానించినది. ఆ సంవత్సరమే పారసీకము (పర్షియా లేక ఇరాను) లోని జాతీయవాదులు తమ రాజు (షా) పై తిరుగుబాటుగావించిన మజ్లిసుఅను పార్లమెంటును సంపాదించిరి. అప్పటికే చైనాలో పాశ్చాత్య సామ్రాజ్యప్రభుత్వములకులోబడి దేశమును ముక్కలుముక్కలుగ వారి కమ్ముచున్న మంచూరాజ్యమును

కూలద్రోసి సంపూర్ణ ప్రజాస్వామ్యమును స్థాపించుటకై డాక్టరు సన్‌యటుసేను గొప్ప విప్లవమును నడుపుచుండెను. 1911 లో నీ విప్లవము జయప్రదమయ్యెను. తురుష్కములో జాతీయ వాదులగు యౌవన తురుష్కకక్షివారు తమ నిరంకుశ సుల్తానగు అబ్దుల్ హమీదును వెళ్ళగొట్టి 1908లో పార్లమెంటును (ప్రజాప్రతినిధిసభను) స్థాపించుకొనిరి. అటులనే ఈజిప్టులో కూడ జాతీయోద్యమము విజృంభించెను. ఆశియాఖండదేశమగు జపాను చిన్నదైనను 1903-04 సంవత్సరయులలో యూరపు పెద్దసామ్రాజ్యములలో నొకటగు రష్యాను ఓడించుటకూడ ప్రాచ్యదేశములలో దేశాభిమానమును, ఆత్మగౌరవమును, తమదేశములను తాము పాలించుకొనగలమను ఆత్మవిశ్వాసమును, అటుల పాలించుకొనవలెనను ఉత్సాహమును దిట్టపరచెను. అప్పటి రాజకీయవేత్తలలో హిందూదేశములోవలె ఈజిప్టులోకూడ రెండుపార్టీలుండెను. మితవాద కక్షి (హోజ్బెలుఔము) వారు ఆంగ్లేయులతో సహకారము సలిపి క్రమముగా హక్కులను సంపాదించదలచినవారు. 'హోజ్బెలువతను' అను జాతీయవాదులకక్షివారు వెంటనే ఆంగ్లేయులను లేచిపొమ్మని కోరుచు సంపూర్ణస్వతంత్రమును పొంద నిశ్చయులైనారు. జాతీయవాదకక్షియే దేశములో నెక్కువపలుకుబడి గలిగియుండెను. ముఖ్యముగ విద్యాధికుల లోను న్యాయవాదులలోను విద్యార్థులలోను మధ్యమతరగతి ప్రజలలోను వ్యాపించెను.

## ముస్తఫా కమాలు

ఆకాలమున జాతీయవాదకక్షికి ముస్తఫా కమాలు నాయకుడుగ నుండెను. ఆయన ఫ్రాన్సులో విద్యనభ్యసించి వచ్చెను. కడుసమర్థుడు. అరబిలోను, ఇంగ్లీషులోను, ఫ్రెంచిలోను మూడు దినపత్రికలను నడుపుచుండెను. ఈ పత్రికలు దేశమంతటను బస్తీలలోను పల్లెలలోను బాగుగ చదవబడుచుండెను. మంచి మర్యాదప్రవర్తన గలవాడు. మంచివక్త. ఫ్రాన్సులోని పత్రికాధిపతులలో పలుకుబడిగలవాడు. జాతీయవాదకక్షి కధ్యక్షుడుగ ఈయన నెన్నుకొనిరి. ఈయన ఖెడీవు అబ్బాసు హిల్మికి దుర్బోధలు చేయుచున్నాడని క్రోమరు ప్రభువు ఖెడీవు నితనితో మాట్లాడవద్దని 1901 లో నాజ్ఞాపించెను. అయినను రహస్యముగ ఖెడీ వీయనను పిలిపించి ఆలోచనలుసలుపుచుండెను. ఈయన దేశములోని క్రైస్తవులను ముసల్మానులతో కలిపి జాతీయైక్యతను కుదిర్చెను. పాఠశాలల లోని సర్వకళాశాలలోని విద్యార్థులందరును ఈయనే తమ జాతీయనాయకుడని భావించిరి.

1901 నుండియు స్వతంత్రమగు జాతీయపాఠశాలలను ఈయన స్థాపింపజేసెను. 1905 లో నొక జాతీయ విశ్వవిద్యాలయమును స్థాపించుటకు ప్రయత్నించగ, క్రోమరుప్రభువు దానిని నిషేధించెను. 1908లో నది స్థాపించబడెను. జాతీయ విద్యయొక్క ఆవశ్యకతను ఈజిప్టు జాతీయవాదులు బాగుగ గుర్తించిరి. కాని దేశముయొక్క దురదృష్టమువలన ముస్తఫా కమాలు నడివయస్సులో 1908వ సంవత్సరమున మరణించెను.

ఈయనకు పిమ్మట 'ఎల్ ఆలం' పత్రికాధిపతి యగు షేకు షావిషు, ఫరీదుబే, ఘయతిబేలు జాతీయవాదకక్షికి నాయకులుగ నుండిరి.

## గార్ట్సు మితవాదులను దగ్గరకుతీసి, అతివాదుల నణగద్రొక్కుట

నూతన హైకమీషనరగు గార్ట్సు అదివరకు ఈజిప్టులో కొన్ని యుద్యోగములుచేసియుండి, యా దేశములో మంచి యనుభవముగలవాడు. ఆకాలమున ఇండియామంత్రియగు జాన్ మార్లే అవలంబించినటులే మితవాదులను మిత్రులుగ చేసికొని అతివాదులను అణగద్రొక్కు రాజనీతిని అవలంబించెను. గార్ట్సు ఎక్కువ దర్జాగనుండక అందరితోను కలసిమెలసి తిరిగెను. అదివరకు క్రోమరుకు వ్యతిరేకుడుగ నున్న ఖెడీవు అబ్బాసు హిల్మిని స్నేహితునిగచేసికొని, ఆయనను జాతీయవాదులనుండి పూర్తిగ విడదీసెను. జాతీయవాదులు తురుష్కములోవలె నెప్పటికైన తమరాజుమీాద తిరుగబాటుచేయువారేనని అబ్బాసు హిల్మికి బోధించగ నాయన నమ్మెను. ప్రతియుద్యోగమును ఆంగ్లేయుల కివ్వక చాలా యుద్యోగములను గార్ట్సు మితవాదులగు ఈజిప్టుదేశీయుల కిచ్చి, వారియాదరణను పొందెను. ప్రధానమంత్రిత్వము ఖాళీకాగానే క్రైస్తవప్రముఖుడగు బౌట్రోసుపాషాను ప్రధానమంత్రిగ గావించి చాలవరకు కాప్టులను ప్రభుత్వపక్షమునకు త్రిప్పెను. ఈజిప్టులోని సామాన్యయుద్యోగములన్నియు విశ్వవిద్యాలయములో కడతేరిన ఈజిప్టుయువకులకిచ్చెను. మంత్రు

లను మితవాదులనుండి నియమించి వారికి కొంత స్వతంత్రము నిచ్చెను. అతివాదులలో లోబడినవారికి కొందరికికూడ యుద్యోగములిచ్చి మితవాదులుగ మార్చెను. లెజిస్లేటివ్ జనరలుఅసెంబ్లీనికూడ నొకసారి పిలచెను. సూయజుకాలువ కంపెనీకిగల తొంబదితొమ్మిదిసంవత్సరముల కౌలుకాలము నింకను నలుబదిసంవత్సరములు ఎక్కువగ పొడిగించవలెనను తీర్మానమునుగార్స్టుయొక్కసలహాపైనఅసెంబ్లీయెదుటప్రధాన మంత్రి బౌత్రోసుపాషా ప్రవేశపెట్టెను. అందుకువ్యతిరేకముగ దేశములోని జాతీయవాదపత్రికలన్నియు గొప్ప ఆందోళనను గావించెను. ఆ తీర్మానమును అసెంబ్లీవారు త్రోసివేసిరి. ఇకమీద మరల అసెంబ్లీని గార్స్టు పిలువలేదు.

### ప్రవాసమునకు బంపుచట్టము (Exile law)

ఆ తీర్మానమును ప్రవేశపెట్టి దేశద్రోహముగావించినా డను ఆగ్రహముతో నొక ముసల్మాను జాతీయవాదియగు 'వార్దాని'యనునతడు ప్రధానమంత్రియగు బౌత్రోసుపాషాను హత్యగావించెను. హంతకుని పట్టుకొని యురితీసిరి. కొంత అశాంతి దేశములో కలిగెను. శాంతినాశకులను పట్టుకొని విచారణలేకుండగనే ప్రవాసమునకు బంపవచ్చును. (Exile law) నిర్బంధచట్టమును గార్స్టు చేసి 1911 లో కొందరు జాతీయవాదులను ప్రవాసమునకు బంపెను.

### కిచనరుప్రభువు - నిర్బంధవిధానములు

గార్స్టు అనారోగ్యముచే 1911 లో తన పదవికి రాజీ నామానిచ్చి ఇంగ్లాండుకు వెళ్లెను. ఆయనస్థానములో కిచనరు

ప్రభువు హైకమీషనరుగ నియమింపబడెను. కిచనరుప్రభువు వచ్చిన దినముననే ఇటలీ-తురుష్క దేశములమధ్య లిబియాను గురించి యుద్ధము ప్రారంభమయ్యెను. ఈజిప్టు తురుష్క సుల్తానుయొక్క సార్వభౌమత్వమునకు లోబడియున్నది. మరియు ఈజిప్టుప్రజలకు స్వాభావికముగ తమ సోదరముసల్మానులతో సానుభూతిగలదు. ఆంగ్లేయుల కీ యుద్ధములో ఇటలీతో సానుభూతిగలదు. గావున కిచనరుప్రభువు ఈజిప్టు ప్రజలను ఎటువైపునను చేరకుండ తటస్తముగ నుంచెను. కిచనరు ప్రభువు క్రోమరుయొక్క నిరంకుశపద్ధతులనవలంబించి తన కాలమున జాతీయోద్యమమును కఠినముగ అణచుటకు ప్రయత్నించెను. ఒక కుట్రలనణచుచట్టమును (criminal conspiracy Act), ఒక పత్రికలపై నిర్బంధశాసనమును (Press censorship Act), ఒక పాఠశాలల విద్యార్థుల శిక్షణాచట్టమును (School discipline Act) గావింపజేసి ఈ చట్టములను విరివిగా వినియోగించెను. చాలామంది జాతీయవాదులను గార్స్టు చేసిన ప్రవాసచట్టముక్రింద విచారణలేకుండ ప్రవాసమునకు బంపెను. ఒక యువక దేశాభిమానిచే రచించబడిన దేశాభిమానపూరితమగు కావ్యమునకు పీఠికను వ్రాసినందుకు ఫరీదు బేయను జాతీయనాయకుని విచారించి ఆరునెలల ఖైదును విధించిరి. ఖైదునుంచి బయటకు రాగానే యొక యుపన్యాసమిచ్చినందుకు ఒక యేడాదిశిక్షను విధించిరి. ఆ శిక్షకు పిమ్మట ఆయన స్విజర్లండుకు పోయి కాపురముండెను. ఆయనను తమకువప్పగింత చేయవలసినదని స్విజర్లండుప్రభుత్వమునకు కిచనరు వ్రాసెను. గాని వారు నిరాకరించిరి. ఎల్ అలం

పత్రికాధిపతియగు మరియొక జాతీయనాయకుడగు షేకు పావీ షుకు ఒకవ్యాసమునకుగాను మూడు నెలల శిక్షను విధించిరి. ఆయన కాన్‌స్టాంటినోపిలులో నుండగ నచటి తురుష్క సుల్తానుకు వ్రాసి పట్టి తెప్పించి మరల జైలుకు బంపిరి. 1912 మార్చి నెలలో జనరలు అస్సెంబ్లీని పిలువగ వారు రాజ్యాంగవిధానమును కోరిరి. అందుమీద నది విచ్ఛిన్నముగావింపబడెను. జాతీయవాదులతో చేరియున్నా డని సాదు జగ్లులు పాషాను విద్యాశాఖామంత్రిత్వమునుండి తీసివైచిరి. మితవాదులని అతివాదులని భేదముచూపక కొంచెము తీవ్రముగా మాటలాడినవారినందరిని శిక్షించు చుండిరి. కిచనరుప్రభువుయొక్క నిర్బంధవిధానమువలన అన్ని జాతులు నెటుల స్వతంత్రపక్షమునకు తిరిగిరో చాలాకాల మాంగ్లేయులతో సహకారముసలిపి తుదకు ఆశాభంగము నొందిన ఇస్మాయిల్ పాషా అబాజా యను మితవాదనాయ కునియొక్క యుపన్యాసమువలన తెలియగలదు. ఆయన 1912 లో నిటుల చెప్పెను. "పత్రికలపైన నిర్బంధచట్టములు గావించి వాక్స్వాతంత్ర్యమును ముప్పై సంవత్సరములు వెనుకకు నెట్టి పత్రికాధిపతులను దోపిడిగాండ్రతోపాటు శిక్షించుచున్నందు కును, చట్టనిర్మాణసభయొక్క అధికారమును త్రోసివేసినం దుకును, బ్రిటిషు హైకమీషనరును ఖండించుచున్నాను. పశు త్వములోను, త్రాగుడులోను, వాగుటలోను, ఋణములలోను మాత్రము మన మభివృద్ధి చెందినాము. 1884లో మనము ఒక లక్ష ముప్పదినాలుగు వేల సవరనుల కిమ్మతుగల పిండిని విదే శములనుండి తెప్పించుకున్నాము. 1909 లో పదునెనిమిది

లక్షల ముప్పదిఆరువేల సవరనుల కిమ్మతుగల పిండిని విదేశ ములనుండి దిగుమతిచేసికొనియున్నాము. మహమ్మదాలికాల మున సాలుకు తొమ్మిదివందలమంది విద్యార్థులను విద్యా భ్యాసమునకై విదేశములకు బంపినాము. ఇస్మాయిల్ కాలమున నూటయేబదిఅయిదుగురిని బంపినాము. బ్రిటిషువారియాక్ర మణకు పిమ్మట నలభైమందిని మాత్రము బంపినాము. ఇట్టి పరిస్థితులు మార్చుటకు మార్గమేమి? ఒకటే కలదు. అది స్వపరిపాలనము. గడచిన ముప్పదిసంవత్సరములనుండి స్వపరి పాలనమువైపుకు ఒక అంగుళమైనను ముందుకుపోలేదు" కిచనరుప్రభువు మరల ఉద్యోగములన్నింటిని ఆంగ్లేయులతో నింపివైచెను. ఆయనకు అరబిభాష బాగుగవచ్చును. అది వరకు ఈజిప్టులో సైన్యాధికారిగ నుండెను. ప్రజలతో అరబి లోనే మాటలాడుచు కలసిమెలసి తిరుగుచు వారిసామాన్య కష్టముల నరయుచు న్యాయమునే చేయుచుండెను. ఒక వైపున అతివాదులను జాతీయోద్యమమును అణచివైచుచు, మరియొకవైపున ఈజిప్టులోని యితరప్రముఖులను టీ పార్టీలకు పిలచి గౌరవించుచు చాలమందిని జోహుకుములుగ తయారు చేసెను. మంత్రులందరును ఆయనకు జోహుకుములుగ నుం డిరి. ఖెడీవు అబ్బాసుహిల్మికి మరల స్వతంత్రము పూర్తిగ పోయెను. కిచనరుకును ఖెడీవుకును మనస్పర్థలు హెచ్చెను. ఖెడీవు కిటు జాతీయవాదులతోను అటు ఆంగ్లేయులతోను కూడ వ్యతిరేకభావమే కలిగెను. ఆయనను లక్ష్యపెట్టనివారినే కిచనరు మంత్రులుగ నియమింపజేసెను. ఆయన తురుష్క

సుల్తానుతో స్నేహముగ నుండుచువచ్చెను. ఇది కిచనరుకు చాల అయిష్టమైయుండెను.

## 1913 సంవత్సరపు రాజకీయసంస్కరణములు

సంపూర్ణస్వతంత్రముకొరకు దేశములో ఆందోళన మెక్కువగుచుండుట గనిపెట్టి కొంతవరకు ప్రజలను తృప్తి పరచుటకు కిచనరుప్రభువు 1933లో కొన్ని రాజకీయసంస్కరణములను ప్రసాదింపజేసెను. మునిసిపాలిటీలలోను జిల్లాబోర్డులలోను రాష్ట్రములకౌన్సిళ్ళలోను చాలవరకు ప్రజలకు అధికారములిచ్చెను. కేంద్రప్రభుత్వములో (ఈజిప్టు ప్రభుత్వములో) పాత ఎసెంబ్లీని కౌన్సిలును రద్దుపరచి యొక కొత్త లెజిస్లేటివు అస్సెంబ్లీని ఏర్పాటుగావించెను. అందులో 66 గురు ఎన్నికసభ్యులు, 16 గురు ప్రభుత్వనియమిత సభ్యులు ఉందురు. ఎస్సెంబ్లీలో విషయములు చర్చించవచ్చును. కాని యీ సభయొక్క తీర్మానములు సలహాలేకాని మంత్రివర్గమును బద్ధులనుగావింపవు. మంత్రులు ఖెడీవుచేతనే అనగ ఆంగ్లేయహైకమీషనరుచేతనే నియమింపబడుదురు. ఎస్సెంబ్లీకి బాధ్యులుగారు. విదేశవ్యవహారములను పెద్ద యుద్యోగస్థుల జీతములను గూర్చి ఎస్సెంబ్లీ చర్చించవీలులేదు. ఎస్సెంబ్లి చర్చలు బహిరంగముగ జరుగును. ఇది చాలవరకు 1919 వ సంవత్సరమున గవర్నమెంటు ఆఫ్ ఇండియా చట్టముక్రింద హిందూదేశమున నేర్పాటుగావింపబడిన కేంద్రప్రభుత్వపు లెజిస్లేటివు ఎస్సెంబ్లీని బోలియున్నది. అయితే హిందూదేశములో కౌన్సిలు ఆఫ్ స్టేటు అను ప్రభుత్వమున కెక్కువ పలు

కుబడిగలిగిన రెండవసభకూడ ఎసెంబ్లీ నెత్తినఅంటగట్టబడినది. గనుక 1919 వ సంవత్సరపు హిందూదేశ రాజకీయసంస్కరణ ములకన్న 1913 వ సంవత్సరపు ఈజిప్టుదేశరాజకీయసంస్కరణ ములే మెరుగుగ నున్నవని చెప్పదగియున్నది. కాని అసలు ఖెడీవుయొక్కస్థితి యేమి? ఆయన కెట్టి స్వాతంత్రము లేదు. ఎసెంబ్లీయును మిగత సంస్కరణములును ఆయన యిచ్చి నవికావు. కిచనరుప్రభువు ప్రసాదించినవి.

## ప్రపంచయుద్ధము-ఈజిప్టు సంరక్షకరాజ్యముగ గావించబడినది

1914 ఆగస్టు 4 వ తేదీన ప్రపంచయుద్ధము ప్రారంభ మయ్యెను. అందులో తురుష్కము ఆంగ్లేయులకు వ్యతిరేక ముగ జర్మనీతో చేరినది. గావున తురుష్కసుల్తానుతో స్నేహముచేయుచు ఆంగ్లేయులకు వ్యతిరేకుడుగనున్న ఖెడీవు అబ్బాసుహిల్మిని తీసివేయుటకు ఆంగ్లేయప్రభుత్వము నిశ్చ యించినది. తురుష్కము జర్మనీతో చేరుటతోడనే ఈజిప్టు తురుష్కసామ్రాజ్యమునుండి స్వాతంత్రమునుపొందినదనియు, తురుష్కసార్వభౌమత్వమును వదలినదనియు ఆంగ్లేయప్రభు త్వము ప్రకటించెను. అయితే ఈజిప్టుకుమాత్రము స్వాతంత్రము రాలేదు. బలహీనమగు తురుష్కముతో నిదివరకు పేరునకు మాత్రము గల సార్వభౌమత్వము వదలిపోయినది. ఆంగ్లే యులు వెంటనే ఈజిప్టు తమక్రింద సంరక్షకరాజ్యమయినదని (protectorate) ప్రకటించిరి. ట్యూనిసు మొరాకో దేశములు రెండును ఫ్రెంచివారిక్రింద సంరక్షకరాజ్యములైనటుల, ఈజిప్టు

ఇంగ్లీషువారిక్రింద సంరక్షకరాజ్యముగ చేయబడినది. 1882 లో గ్లాడుస్టను ప్రధానమంత్రి త్వరలోనే మరల ఈజిప్టును స్వతంత్ర దేశముగ గావించెదమని చేసిన వాగ్దానము అమలు జరుగుటకుమారుగా 32 సం॥లకు పిమ్మట (1914లో ఈజిప్టు కేవలము ఆంగ్లేయప్రభుత్వముక్రింద సంరక్షకరాజ్యమై దాస్య శృంఖలములు ఇంకను ఎక్కువ బిగించబడినవి. కీర్తిశేషులైన అరబిపాషా, ముస్తఫా కమాలు మొదలగు జాతీయవాద నాయకుల ఆశయములు ఇప్పటికి పూర్తిగ మంటగలిసినవి.

## ఖెడీవు అబ్బాసుహిల్మి తీసివేయబడి, సుల్తానుగ హూస్సేను కమాలు నియమింపబడెను

ప్రపంచయుద్ధప్రారంభమున నేదో పనిమీద ఖెడీవు అబ్బాసుహిల్మి తురుష్క రాజధానియగు కాన్‌స్టాంటినోపిలుకు పోయియుండెను. మరల నాయనను ఈజిప్టుకు రావద్దని ఆంగ్లే యప్రభుత్వమాజ్ఞాపించెను. ఆయనను ఖెడీవుపదవినుండి తొల గించినామని తెలియపరచిరి. ఆయనతాతగారగు ఇస్మాయిల్ ఖెడీవుకు పట్టినగతియే ఆయనకు పట్టినది. ఆయనస్థానమున ఈజిప్టుపై హుస్సేనుకమాలును రాజుగగావించి, ఆంగ్లేయు లాయనకు ఖెడీవుకు బదులుగా సుల్తాను అను గొప్పబిరుదము నిచ్చిరి. క్రొత్తసుల్తాను ఇంకను ఎక్కువగ ఆంగ్లేయులకు దాసుడయ్యెను.

## సైనిక శాసనము

1914 నవంబరు 2 వ తేదీన ఈజిప్టునందంతటను సైనిక శాసనము ప్రకటింపబడెను. ఈజిప్టులోని బ్రిటిషుసైన్యమును

సూయజుకాలువ సంరక్షణమునకై బంపిరి. హిందూదేశము నుండియు ఆస్ట్రేలియానుండియు సైన్యములు వచ్చిచేరెను. తురుష్క ప్రభుత్వము ఈజిప్టుపైదండెత్తుటకుగాను జెమల్ పాషా యొక్క సేనానాయకత్వముక్రింద సిరియాలో సైన్యములను చేర్చిరి. ఎడారులనుదాటి తురుష్క సైన్యములు 1915 ఫిబ్రవరి 2వ తేదీన సూయజుకాలవ నొకచోట దాటెను. కాని ఆంగ్లేయ సైన్యములు తురుష్క సైన్యముల నోడించి వెనుకకు నెట్టగ, నవి మరల యెడారులను దాటి సిరియాకు పోయెను. సూయజుకాలువ సంరక్షించబడినది. మిత్రమండలివారి పడవ వలుపోవుటకు వీలుకలిగినది. కాని జర్మనులు సూయజుకాలువను ఆకాశవిమానములమూలమున ముట్టడించుచు ఆ ప్రక్కనున్న అనాగరిక ముసల్మానుజాతులచే తిరుగుబాట్లను చేయించుచువచ్చిరి. హిందూదేశపు ముసల్మాను సైన్యములలోకూడ కొంచెముగ ముసల్మానుమతోద్రేకము కలిగి ఆంగ్లేయులకు కొంత తొందరలను కలిగించిరి. వీటినన్నిటిని తప్పించుకొనుచు ఈజిప్టును కాపాడుకొనుటకు కొన్ని ఆంగ్లేయ సైన్యములు యుద్ధమాఖరగువరకును ఈజిప్టులో నిలవ యుండవలసివచ్చినది. తురుష్కులు కైరోనుముట్టడించగ, దానినాంగ్లేయులు కాపాడుకొనిరి. సూయజుకాలువ ప్రక్కనేగాక కైరోలోగూడ సైన్యములనుంచిరి. ఒకొక్కొక్కప్పుడు ఈజిప్టులో రెండులక్షల ఆంగ్లసైన్యము లుండెను. సిరియావైపులనుండి ముసల్మానులకు భయపడి పరుగెత్తుకొనివచ్చిన ఆర్మీనియనులను ఈజిప్టుకు తెచ్చి కాపాడవలసివచ్చినది. "ఆంగ్లసైనికులలో చాలమంది పోర్టుసైదు, కైరో, అలెగ్జాండ్రియాపట్టణ

ములలో ప్రబలియున్న విదేశవ్యభిచారిణులగృహములలోనికి పోయి సుఖసంకటములను తగిలించుకొనిరి. నూటికి పన్నెండు మంది సైనికకొలువునకు అనర్హులైరి. కొన్ని పటాలములలో నూటికి పాతికవరకుకూడ అనర్హులైరి" అని యంగు తన ఈజిప్టులో వ్రాసినాడు. ట్రిపోలీలోని సెమసి తెగల ముసల్మానులు ఈజిప్టులో పశ్చిమమునుండి 1915 నవంబరు నెలలో జొరబడిరి. వారిని ఆంగ్లేయులు తరిమివేసిరి.

## విన్‌గేటు-యుద్ధముపేర ఘోరమైన నిర్బంధవిధానములు

ప్రపంచయుద్ధము ప్రారంభమైన కొలదినెలలలోనే మరియొక-చోట సైన్యాధిపత్యమును వహించుటకు కిచనరు ప్రభువు ఈజిప్టునువదలి వెళ్ళెను. పిమ్మట రెండుసంవత్సరముల కాలము సర్ హెన్రీ మక్ మాహన్ హైకమీషనరుగ నుండెను. 1916 లో సర్ ఆర్. విన్‌గేటు హైకమీషనరుగ వచ్చెను. యుద్ధప్రారంభములో ఈజిప్టుదేశీయులను యుద్ధసైనికులుగ తీసికొననవసరములేదని ఆంగ్లేయులు తలచిరి. ఈజిప్టుకార్మికులను షుమారు పదివేలమందిని దేశములోని రైళ్ళు, రోడ్లు మొదలగు పనులకొరకు వేతనములిచ్చి తీసికొనిపోయిరి. ఇంకను పదివేలమందిని ఫ్రాన్సుకు బంపిరి. పిమ్మట సుమారు ఇరవై వేలమందిని ఒంటెలుతోలుటకు సిరియాకు బంపిరి. యుద్ధము 1918 నవంబరు వరకు జరిగెను. ఈ నాలుగుసంవత్సరములపైకాలములో ఈజిప్టులో ప్రజలస్వాతంత్రములు పూర్తిగ నణచివేయబడెను. క్రొత్తసుల్తాను హుస్సేన్ కమాలు సమర్థుడును జాతీయతత్వముతో కొంతవరకు సానుభూతిగలవాడును

నగు ఇస్మాయిలు సిద్కీని మంత్రిత్వమునుండి తీసివైచి అవమానపరిచెను. ప్రతివిషయములోను ఆంగ్లేయులకు లోబడి నడచెను. యుద్ధము పేరున పెక్కు నిర్బంధశాసనములను గావించిరి. లెజిస్లేటివుఎసెంబ్లీని రద్దుపరచిరి. వాక్స్వాతంత్ర్యమును, పత్రికాస్వాతంత్ర్యములను తీసివైచిరి. అయిదుగురికన్న ఎక్కువమంది కూడినచో అరెస్టుచేతుమని ప్రకటించిరి. జాతీయపత్రికలనెల్ల అణచివైచిరి. మిగిలిన పత్రికలలో మిత్రమండలిపక్షపు సమాచారములు తప్ప మిగిలిన రాజకీయవిషయములను ప్రచురించగూడదని నిషేధించిరి. ఆ పత్రికలలో చిన్నజాతులసంరక్షణకొరకును స్వయంనిర్ణయధర్మస్థాపనకొరకును మిత్రమండలివారు యుద్ధముచేయుచున్నారని ప్రకటింపజేయుచుండిరి. జైళ్ళన్నియు అనుమానగ్రస్తులగు జాతీయవాదులతో నిండెను. వీరినందరిని విచారణలేకుండగనే ఖైదులో పడవైచిరి. 1917 లో ఆయుధశాసనముచేసి ఈజిప్టుదేశీయులలో చాలమందినుండి ఆయుధములను లాగుకొనిరి. ఇండ్లలో జొరబడి వెతకి ఆయుధములను పట్టుకొనిపోయిరి.

## చాల ఉద్యోగములలో ఆంగ్లేయులు

ఇంతేగాక అదివరకు స్వదేశీయులు చేయుచున్న ఉద్యోగములలో ఆంగ్లేయులను నియమించిరి. క్రోమరుకాలమున మూడునాలుగు వందలమంది అంగ్లేయోద్యోగులుండగ యుద్ధము ముగియుసరికి ఒక వెయ్యి ఏడువందలమంది ఆంగ్లేయోద్యోగులుండిరి. "క్రొత్తబ్రిటిషుద్యోగస్థులను, ప్రభుత్వ

మును నడుపుటకు క్రొత్తయుద్యోగములతో నవసరమువచ్చి గాక, ఆ వ్యక్తులకు జీవనోపాధి కలుగజేయుటకు మాత్రమే నియమించిరి" అని యంగ్ వ్రాసెను

ఈజిప్టువిద్యార్థుల కుద్యోగములుచేయుటకు పనికివచ్చు విద్యమాత్రమే యివ్వబడి పరిశ్రమలు, వర్తకము మొదలగు నితరవిధముల జీవనోపాధిని సంపాదించుకొనువిద్య నిచ్చుట లేదు. అట్టిస్థితిలో వారికి ఉద్యోగములు లేకుండచేసి ప్రతి మర్యాదకరమైన యుద్యోగములోను విదేశీయుడగు ఆంగ్లే యుని తెచ్చిపెట్టుటవలన ఈజిప్టు మధ్యమతరగతిప్రజలలో విశే షముగ నసంతృప్తి జనించెను. కళాశాలలలోను పాఠశాలల లోనుచదువుకొను విద్యార్థులలో ఆంగ్లేయులయందు ద్వేషము పూర్తిగ వ్యాపించినది. ఆంగ్లేయులచేతులలో కీలుబొమ్మగ నుండి వారియుత్తరువులప్రకారము నిర్బంధవిధానముల నమలు జరుపుచున్న సుల్తాను హుస్సేన్ కమాలును హత్యగావించు టకు 1915 లో రెండుసార్లు యత్నములుజరిగెను. ఆంగ్లేయు లకు దాసుడుగనున్న ప్రధానమంత్రిని చంపుటకుకూడ యత్నము జరిగెను. ఉభయులును తప్పించుకొని బ్రతికిరి. సుల్తాను హుస్సేన్ 1917 అక్టోబరు 19 వ తేదీన మరణించగ ఆయనసోదరుడగు అహమ్మదుఫౌదును సుల్తానుగ గావించిరి. అప్పటినుండియు జాతీయవాదుల ద్వేషానలము సుల్తానును వదలి ఆంగ్లేయులపై విజృంభించెను.

## ఆంగ్లేయులయం దత్యంతమైన వ్యతిరేకభావము

ఒంటెలసైన్యములో ఈజిప్టుదేశీయులు చాలమంది మరణించుచున్నందునను ఇతరకారణములచేతను 1917 సం॥ నుండియు ఈజిప్టుదేశీయులను సైన్యములలో చేర్చవలసినదనియు, ద్రవ్యమును, ధాన్యమును వసూలుచేసి యివ్వవలసినదనియు ఆంగ్లేయప్రభుత్వమువారు హుకుమును బంపిరి. ఆంగ్లేయ ఈజిప్టుఉద్యోగస్తులు బస్తీలలోను గ్రామములలోను బలవంతముగ సైనికులుగ చేర్చుటను, ద్రవ్యమును, ధాన్యమును పోగుచేయుటను ప్రారంభించిరి. ముఖ్యముగ నా కాలమున జర్మనులు గెలుచుచుండుటవలన ఆంగ్లేయసైన్యములలో చేరుటకు ఈజిప్టుప్రజలు భయపడుచుండిరి. ఉద్యోగస్తులు వారిని నిర్బంధముగచేర్చుటకు యత్నించుటయు, వారు పారిపోవుచుండుటయు జరుగుచుండెను. యుద్ధమునకు సహాయపడని ప్రజలను కొరడాదెబ్బలుకొట్టు పాతఆచారమును మరల ప్రారంభింపచేసిరి. వీటిఅన్నిటివలనను గ్రామములలోని ప్రజలలో ఆంగ్లేయులయందు ద్వేషభావము కార్చిచ్చువలె వ్యాపించెను. ఇంతేగాక యుద్ధమువలన అనేక వర్తకనిర్బంధములు కలిగెను. జపానునుండివచ్చినపొగాకు ఎక్కువ ధరకు కొనవలసివచ్చెను. విదేశములకు సరుకుల ఎగుమతి దిగుమతులు ధారాళముగ లేక వర్తకులకు అసంతృప్తికలిగెను. ప్రత్తిపంటనుతగ్గించి ధాన్యమును ఎక్కువగ పండించవలసినదని ప్రభుత్వ ముత్తరువుచేసెను. ప్రత్తిపంటవలన లాభములు పొందుచున్నవారి కసంతృప్తి కలిగెను.

ఆ నాలుగుసంవత్సరముల మూడు నెలల దీర్ఘ కాలమున ఈజిప్టును తమ క్రింద సంరక్షక రాజ్యముగ గావించుకొని ఈజిప్టు ప్రజలపై నిర్బంధములవెంట నిర్బంధములను ప్రయోగించి ప్రతికార్యమును తమకు లాభకరముగ గావించుకొనుచున్న ఆంగ్లేయులయందు దేశములో అన్ని జాతులప్రజలలోను వ్యతిరేకభావము పూర్తిగ కలిగెను. సైనిక శాసనమువలని భయము వలన ఈ వ్యతిరేకభావము, ద్వేషము బయటకు తెలుపుటకు వీలులేక లోలోపల అనేక రెట్లుగ కుమిలి వృద్ధియయ్యెను. ప్రతివాడినోటను—

"ఓ విన్ గేటా, నీవే మా దుఃఖములకెల్ల కారకుడవు;
మా పంటను ఎత్తుకొనిపోయినావు;
మా పశువులను తోలుకొనిపోయినావు;
మా ఒంటెలను తీసికొనిపోయినావు;
చివరకు మా పిల్లలనుకూడ లాగుకొనిపోయినావు;
ప్రాణములతో మాత్రము మమ్ము విడిచినావు;
అల్లా పేరున ఇంతటితోనైనా విడిచిపెట్టి పో"
అను పాట పాడబడుచుండెను.

## అన్నితరగతులవారిలోను సంపూర్ణ స్వతంత్రేచ్ఛ

"యుద్ధకాలమున భయమువలన ఈజిప్టుప్రజలు ఆందోళనము ఆల్లరులు చేయకుండ లొంగియుండుట చూచి వారు బ్రిటిషుపాలనమును అంగీకరించినారని ఇంగ్లాండులోని పాలకులు తలచిరి. ఆకాలమున లోలోన అత్యంతముగ వృద్ధియగుచున్న జాతీయభావమును వారు గుర్తించలేదు.

జాతీయవాదు లొక చిన్న కక్షియనియు వీలయినంత వరకా కక్షిని నిర్లక్ష్యముగ చూడవచ్చునని యు అవసరములవెంట చురుకుగ నిర్బంధవిధాన మవలంబించిన చాలుననియు వారు తలచిరి. యుద్ధకాలమున కొన్ని ఇబ్బందులవలనను కష్టములవలనను యుద్ధము ముగియగనే అకస్మాత్తుగా ప్రజలు తిరుగబడుట సంభవించినదని కొందరు ఆంగ్లేయగ్రంథకర్తలు వ్రాసినసంగతి సరికాదు. 1919 లో జరిగిన తిరుగుబాటు ఎప్పుడోఒకప్పుడు రాకతప్పదు. అది విదేశపాలనమును సహించని ప్రజలయొక్క సహజమైన కార్యము. విదేశదాస్యబంధములను త్రెంచుకోవలెననుభావము పెరిగి చాలకాలమునుండి దృఢపడి, యుద్ధకాలమున అవలంబించబడిన నిర్బంధవిధానముక్రింద అణగి, లోలోన గట్టిపడి యుద్ధము ముగియగనే తీవ్రముగ బయటపడినది" అని యంగు వ్రాసెను. యుద్ధమునకుపూర్వ మొకవిధమైన స్వపరిపాలనను కోరుచుండినవారు, యుద్ధముముగియగానే సంపూర్ణస్వాతంత్రము కావలెనని ప్రకటించిరి. అదివరకు కొందరు పత్రికాధిపతులకిందను విద్యాధికులకిందను నడచుచున్న జాతీయోద్యమము విద్యార్థులలోను పల్లెటూరిప్రజలలోను కార్మికులలోను కూడ పూర్తిగ వ్యాపించినది. ప్రక్కనున్న తురుష్కదేశములో జరుగుచున్న స్వతంత్రపోరాటపద్ధతులమీద నిర్మాణముగావింపబడినది. ఎవరో బహుకొద్దిమంది జోహుకుములు తప్ప ఎవరును ఆంగ్లేయులపక్షమునలేరు. అదివరకు మితవాదులుగనున్న ప్రముఖులుకూడ జాతీయవాదులైరి.

# ఈజిప్టుదేశ చరిత్ర

## ఎనిమిదవ అధ్యాయము

### మినహాయింపులతోకూడిన స్వతంత్రపోరాటము

(1)

### సాదు జగ్లులు పాషా

1918 నవంబరులో యుద్ధము ముగిసి తాత్కాలికసంధి జరగగనే ఈజిప్టుదేశపక్షమున సాదు జగ్లులుపాషానాయకత్వమున (Saad Zaghlul Pasha) జాతీయవాదులకమిటీ యేర్పడి విల్సను సభాపతి ప్రకటించిన స్వయంనిర్ణయసూత్రప్రకారము తాము తమదేశమునకు సంపూర్ణస్వాతంత్రమును వాంఛించుచున్నామనియు, తాము రాయబారముగా పోయి లండనులోని ఆంగ్లేయప్రభుత్వముతోను పారిసులో సమావేశమగుచున్న సంధిసమావేశములోను వాదించుకొనుట కనుమతి నివ్వవలసినదనియు, హైకమీషనరుద్వారా ఆంగ్లప్రభుత్వమునకు వ్రాసిరి. హైకమీషనరు తన కాక్షేపణలేదని తెలిపినను లండనులోని ఆంగ్లేయమంత్రివర్గము ఈజిప్టుజాతీయవాదుల కోరికను 1918 డిశంబరు 1వ తేదీన నిరాకరించిరి. మరల నా విషయమును పునర్విమర్శచేయవలసినదని జగ్లులు పాషా డిశం

బరు 8 వ తేదీన బహు సరసమైనభాషలో ఆంగ్లప్రభుత్వము నకు వ్రాసెను. దీనినికూడ ఆంగ్ల మంత్రివర్గము నిరాకరించెను. ఇది జాతీయవాదులను నిరుత్సాహపర్చుటకుమారుగ వారి స్వతంత్రసంపాదనాప్రయత్నములను దృఢపర్చెను. సాదు జగ్లులు పాషాయొక్క నాయకత్వమునందు ఈజిప్టుప్రజలకు సంపూర్ణమగు నమ్మకముండెను. ఆయన కీర్తిశేషులైన అరబి పాషాయొక్క శిష్యుడు. ఈజిప్టులోని ఫెల్లాహిన్ (రైతు)బిడ్డడు. అచ్చమైన ఈజిప్టుదేశీయుడు. ఎల్ అజరు విశ్వవిద్యాలయములో విద్యనభ్యసించి ఫ్రెంచిభాషను బాగుగ నేర్చి ఫ్రెంచి బారిస్టరుపట్టమును పొందెను. న్యాయవాదవృత్తి నవలంబించెను. ఇంగ్లీషుకూడ బాగుగ నేర్చుకున్నాడు. కడు సమర్థుడు. గొప్ప వక్త. మంచి వ్రాతగాడు. బహు గౌరవమైన ప్రవర్తన గలవాడు. నిష్కల్మషమైన దేశాభిమాని. ప్రధాన మంత్రిగ నుండిన ముస్తఫాఫెహిమీయొక్క కూతురిని ఆయన పెండ్లియాడెను. ఆమె స్త్రీలయుద్యమమునకు నాయకురాలై పిమ్మట జరిగిన స్వతంత్రపోరాటములో నాయనకు భాగస్వామియై బాగుగ పాల్గొన్నది. అప్పటి ఖెడీవువద్దను, ఆంగ్లేయయుద్యోగస్తులవద్దను జగ్లులుపాషాకు కొంత పలుకుబడి కలిగియున్నందున క్రోమరుప్రభువు 1906 లో నీయనను విద్యామంత్రిగ నియమింపజేసెను. అప్పటి కీయన అంతగ తీవ్రవాది కాడు. ఈయన విద్యాభివృద్ధివిషయమున బాగుగ పనిజేసి యిటు ప్రజానురంజకత్వమును అటు క్రోమరుప్రభువుయొక్క ప్రశంసనుకూడ పొందెను. పిమ్మట ఈయనయొక్క జాతీయ



మదాం జగ్లుల్ పాషా

భావములం దిష్టములేని కిచనరుప్రభువు ఆ మంత్రిపదవినుండి ఈయనను తీసివేయించెను.

## వాఫ్డు పార్టీ

ఈకాలమునకు జాతీయకక్షికి వాఫ్డు (ఇస్తిక్లాల్ ఎల్‌తాం) అని పేరిడిరి. దాని కీయన నాయకుడుగ నెన్నుకొనబడెను. బ్రిటిషువారు వాఫ్డుయొక్క రాయబారమును తిరస్కరించగనే జగ్లులుపాషా 1919 జనవరిలో ఈజిప్టుయొక్క సంపూర్ణ స్వాతంత్ర్యమును కోరుచు దేశములోని అన్నిభాగములోను గొప్ప ఆందోళనమును లేవదీసెను. ఇంకను సైనిక శాసన మమలులోనున్నది చట్టనిర్మాణసభ (ఎస్సెంబ్లీ) విచ్ఛిన్నమైయున్నది. పత్రికలమీద నిషేధములు తొలగలేదు. దీనినంతను లక్ష్యముచేయక 'వాఫ్డు' కక్షివారు తమ కార్యక్రమమును బాగుగ ప్రారంభించిరి. ప్రతిచోటను మారుమూలలలో పల్లెలలోకూడ బహిరంగసభలు జరిగెను. ప్రజలు వేలకొలది గుమికూడి సంపూర్ణ స్వాతంత్రమును వాంఛించుచు తమ ప్రతినిధులను లండనుకును, పారిసుకును పోనివ్వవలసినదని కోరుచు తీర్మానములను గావించిరి. ఈజిప్టుజాతిపక్షమున పోవలసియున్న ప్రతినిధుల పేర్లనుకూడ నిర్ణయించి వారిని పంపుటకు అంగీకరించినటుల ప్రజలచేత దస్కతులు చేయించసాగిరి. అటుల దస్కతులుచేయుటకొరకు పంచిపెట్టబడుచున్న ఫారములను కొన్నిటిని ప్రభుత్వోద్యోగులు లాగుకొని చించి పైనను పంచిపెట్టకూడదని నిషేధించినను ప్రజలు లక్ష్యముచేయక లక్షలకొలది దస్కతులు చేసిరి. దీనివలన వాఫ్డు

పార్టీకి అపరిమితమైన పలుకుబడి దేశములో కలిగెను. ఫౌదు సుల్తాను, మితవాదులు ఈ ఆందోళనము నెదిరించుటకు పూర్తిగ జంకిరి. వాఫ్దుపార్టీనాయకత్వమున దేశములో నైక మత్య మేర్పడెను. నిర్బంధవిధానమవలంబించవలసినదని ఈజి ప్టులోని విదేశీయులు కోరిరి.

## పారిసు సంధిసమావేశమునకు ఈజిప్టుప్రతినిధులను పోనివ్వలేదు.

హైకమీషనరగు విన్‌గేటు, వాఫ్దుయొక్క కోరికలు న్యాయమైనవని అంగీకరించి వ్యవహారము రాజీగా పరిష్క రించవలెనని ఇంగ్లాండుకు వెళ్ళెను. అచటి బ్రిటిషుమంత్రివర్గ మువా రాయనసలహాను విననందున తనపదవికి రాజీనామా నిచ్చి మరల ఈజిప్టుకురాలేదు. ప్రపంచసంధిసమావేశమునందు ఈజిప్టు తన స్వయంనిర్ణయహక్కునుగూర్చి వాదించుకొనుట కవకాశముకలిగినట్లైన యితర దేశములప్రతినిధులు ఆంగ్లేయు లకు వ్యతిరేకముగ ఓటుచేసి ఈజిప్టును స్వతంత్రదేశముగ గావింతురేమోనని ఆంగ్లేయమంత్రుల భయము. ఈజిప్టును ఏకారణముచేతను వదలిపెట్టకూడదని ఆంగ్లేయమంత్రుల నిశ్చ యము. ప్రారంభమున వీలైనంత త్వరితముగ లేచిపోవుదమని ప్రధానమంత్రి గ్లాడుస్టన్‌చే వాగ్దత్తముచేయబడి, పిదప అనేక సార్లు మరల నా వాగ్దత్తము ఆంగ్లమంత్రులచేత ఖాయపర్చ బడి, యుద్ధకాలములో 'స్వయంనిర్ణయసూత్రము'ను అన్ని జాతులకును కలుగజేతుమని ఆంగ్లేయులచేతను ఇతర మిత్ర మండలిరాజకీయవేత్తలచేతను ప్రకటింపబడిన సందర్భములో

ఈజిప్టు సంపూర్ణ స్వతంత్రమును కోరుచుండగ దానికి బదులు చెప్పుటకు ఎవరికిని బొత్తుగ నవకాశముండదు. కాని ఈ ధర్మమును విచారించి న్యాయముగ పరిష్కరించువా రెవరు? ఆంగ్లేయ రాజకీయ వేత్తలవాగ్దత్తములు బొత్తుగ నమ్మ కూడదని తేలినది. నానాజాతుల సంధిసమావేశములో చెప్పు కొని పంచాయతీ కోరుకొనుటకు ఈజిప్టుప్రతినిధుల కాంగ్లేయ ప్రభుత్వ మవకాశమే యిచ్చుటలేదు. ఇక న్యాయ మెక్కడ గలదు?

## సంధిసమావేశములో ఈజిప్టు ఆంగ్లేయుల సంరక్షకరాజ్యముగ ఏకగ్రీవముగ నంగీకరించబడినది

ఈజిప్టునుండి రాయబారము వెడలుటకు వీలుకలుగ నప్పటికిని, జగ్లులు పాషా తమ పక్షముయొక్క న్యాయమును ప్రపంచ రాజకీయవేత్తలకు తెలుపుటకై అన్నివిధములను యత్నించెను. తమ వాదమునంతను వ్రాసి పోస్టుమూలమున అమెరికాసభాపతి విల్సనుకు, ఆంగ్లేయ ప్రధానమంత్రి లాయడు జార్జికి, ఫ్రెంచి ప్రధానమంత్రి క్లిమెన్ షోకు, ఇటలీమంత్రి సీనరు ఆర్లెండోకు పంపెను. సంధిసమావేశము ప్రారంభము కాగానే ఈజిప్టుయొక్క స్వతంత్రకోరికయొక్క న్యాయము నంతను వివరించుచు తమ రాయబారము అచటికి రాకుండ నెటుల ఆంగ్లేయప్రభుత్వము నిషేధించెనో తెలుపుచు, ఒక విన్నపము వాఫ్డుపక్షమున అందచేయబడెను. కాని ఈజిప్టు విన్నపములు బుట్టదాఖలయినవి. తెల్లజాతుల హక్కుల నిర్ణయముతోనే కాలము సరిపోయిన సంధిసమావేశములో

ప్రాచ్యజాతీయగు ఈజిప్టుసంగతి విచారించువారు ఆలోచించు వారు లేకపోయిరి. సంధిసమావేశముయొక్క పర్యవసాన మేమనగా, ఈజిప్టు ఆంగ్లేయుల సంరక్షకరాజ్యముగ నుండ వలెనని ఏకగ్రీవముగ నంగీకరించబడినది. ఆ సమావేశము యొక్క ఫలితముగ 'లోకములోని జాతులమధ్య ధర్మసంస్థా పనగావించుట కేర్పడిన నానాజాతుల సమ్మేళనము' వారికి (అంతర్జాతీయసమితివారికి) ఆంగ్లేయసామ్రాజ్యములో చేరిన ఈజిప్టు, ఇండియా, సింహళము, బర్మా మొదలగు జాతుల విషయము విచారించుటకు హక్కులేదనియు, ఆంగ్లేయప్రభు త్వమే తమకు న్యాయమనితోచినవిధమున పరిష్కరించవల సినదనియు తీర్మానించబడెను. ఈజిప్టులోవాఫ్దుకక్షి కే పూర్తిగ పలుకుబడి కలుగుచున్నందున కొంతపలుకుబడిని తాము పొందుటకై ఏదోరకమైన స్వపరిపాలనముతో తృప్తిపొందు టకు సిద్ధపడిన మితవాదమంత్రులగు రష్డిపాషా, అడ్లిపాషా, మొదలగువా రొక రాయబారమును తయారుచేసి దానిని పారిసు సంధిసమావేశమునకు పోయి చెప్పుకొననివ్వవలసిన దని ఆంగ్లేయప్రభుత్వమును కోరిరి. కాని వారికిని ఆంగ్లేయ ప్రభుత్వము అనుమతి నివ్వలేదు. అంతటితో మితవాదులకు కూడ ఆశాభంగముకలిగి రష్డిపాషా ప్రధానమంత్రిత్వమునకు 1919 మార్చి 1 వ తేదీన రాజీనామానిచ్చెను. ఆకాలము లోనే హిందూదేశపక్షమున నొక రాయబారమును పారిసు సంధిసమావేశమునకు గొనిపోవలెనని లోకమాన్య బాలగంగా ధరతిలకుమహాశయుడుప్రయత్నించగ ఆంగ్లేయప్రభుత్వమువా రనుమతించలేదు. ఇంతటితో జగ్లులు పాషా ఈజిప్టుయొక్క

ఏకగ్రీవమైన నాయకుడయ్యెను. ఆయనయొక్క అపాయకర మైన ఆందోళనము నణచుటకు ఆంగ్లసైన్యములే మిగిలెను.

(2)

## జగ్లుల్‌పాషాను మరికొందరు నాయకులను మాల్టాకు బంపిరి

1919 మార్చి 6వ తేదీన ఆంగ్లసైన్యాధిపతియగు వాట్సన్ సేనాని జగ్లులుపాషాకును మరికొందరు వాఫ్దునాయకులకునుకబురుపంపి పిలిపించి, ఇంకను ఈజిప్టులో సైనిక శాసనమమలులోనున్నదనియు ఎట్టి ఆందోళనము దేశములో జరిగినను తాను సైనికచర్య పుచ్చుకొనవలసివచ్చుననియు మందలించి పంపెను. వీరేమియు బదులుచెప్పక వచ్చిరి. మార్చి నెల 7వ తేదీన సైన్యాధిపతియొక్క చర్యను ఖండించుచు వాఫ్దుపక్షమున నొక బహిరంగ ప్రకటనను గావించిరి. మార్చినెల 8వ తేదీన వాఫ్దునాయకులగు సాదు జగ్లులు పాషా, హామీదుపాషా, ఇస్మాయిలుపాషా సిద్కి, మహమ్మదుపాషా మహమూదు అను నలుగురిని సైన్యాధికారి అరెస్టుచేసి విచారణలేకుండగనే ఆంగ్లేయులపడవమీద మాల్టా ద్వీపమునకు ప్రవాసమున కంపెను.

## గొప్ప తిరుగుబాటు విద్యార్థులతో ప్రారంభమయ్యెను

ఇంతటితో దేశమందంతటను నొకగొప్ప రాజద్రోహకరమగు తిరుగుబాటు ప్రారంభమయ్యెను. ఆంగ్లేయులు తలచినటుల ఈజిప్టుజాతి భయపడక, నిర్బంధవిధానముల కెదురు

తిరిగి జాతీయ స్వతంత్రపోరాటమును సాగించెను. దౌర్జన్య రాహిత్యముగనే రాజకీయవిప్లవము నడచెను కాని, ఉద్రేకము మధ్య అక్కడక్కడ కొంత దౌర్జన్యము జరగక తప్పినది కాదు. విప్లవప్రారంభము విద్యార్థులతో జరిగెను. మార్చి 9 వ తేదీన అజరు విశ్వవిద్యాలయము, మాడరన్ మిడిల్ స్కూలు, వైద్యవృత్తికళాశాలలు, మధ్యమతరగతిపాఠశాలలు విద్యార్థులందరును సమ్మెలుగట్టినందున మూసివేయబడెను. ఈ వేలకొలది విద్యార్థులు వీధులలో ఉత్సవములతో బయలు దేరి బహిరంగసభలుచేసి తమ నాయకులనిర్బంధమును ఖండించిరి. అక్కడక్కడ ట్రాముబండ్లకు లాంతరుస్తంభములకు దెబ్బలు తగిలెను. మరునాడు పనివాండ్రుకూడ సమ్మెలుగట్టి పనులు మానిరి. బజారులలోని జనము ఆంగ్లేయ పత్రికాలయములను కొంత ఆంగ్లేయులఆస్తిని పాడుచేసిరి. రైళ్ళమీద రాళ్ళు రువ్విరి. ఆంగ్లసైనికులు వెంటనే వచ్చి తుపాకులు కాల్చి కొందరుప్రజలను చంపిరి. ఆ మరునాడు గవర్నమెంటు కచ్చేరీలలోని ఉద్యోగస్థులు, కోర్టులలోని న్యాయవాదులు సమ్మెగట్టి పనిమానిరి. కొన్నిచోట్ల పల్లెలలోని రైతులు తంతితీగెలను తెంచి రైలుపట్టాలను పీకివైచిరి. డమాన్‌హూరు, జజాజిగ్, మన్‌సూరా పట్టణములలో కొన్ని అల్లరులు జరిగెను. టాన్‌టా రైలుస్టేషనును ప్రజలు పాడుచేయుచుండగ సైనికులు తుపాకులనుకాల్చి పదిహేనుమందిని హత్యగావించి, ఏబదిమందికి గాయములను కలుగచేసిరి. అలెగ్జాండ్రియానగరములోకూడ కొన్నికొన్నిచోట్ల చిన్నచిన్న అల్లరులు జరిగెను. అచటి విదేశస్థులకు గొప్ప భీతికలిగెను.

యువకులైన జాతీయవాదులు ప్రజలలో దౌర్జన్యరాహిత్యమగు విప్లవమును పురిగొల్పుచుండిరి. మితవాదులుకూడ ఆంగ్లప్రభుత్వమును ఖండించుచు తీర్మానాలనుచేయుచుండిరి. కైరోనగరమున ప్రజలు మోటారులారీలను ఆటంకపర్చినందున సైనికులు వచ్చి తుపాకులుకాల్చి కొందరిని చంపిరి. పదముగ్గురు ప్రజలు మరణించిరి. ముప్పదిమంది ప్రజలు గాయములనొందిరి. అప్పటినుండి (మార్చినెల 14వ తేది) రైళ్ళపట్టాలను తొలగించుట, టెలిగ్రామతీగెలను తెంచుట, ప్రభుత్వకట్టడములను పాడుచేయుట సామాన్యముగ జరిగెను. అక్కడక్కడ దొరికిన బ్రిటిషుసైనికోద్యోగులను, సైనికులను కొట్టిరి. (మార్చి 15వ తేదీన). ఇంతలో బెడూవిన్ లను మోటజాతివారు ఈ విప్లవములో చేరి అస్సియుట్ పట్టణములోని బ్రిటిషువారిగృహములను ముట్టడించిరి. ముట్టడి కొన్నిదినములు జరిగెను. సైనికులువచ్చి తుపాకులుకాల్చి బెడువినులను చంపిరి. అంతటితో నది సమసెను. అనేక రాష్ట్రనగరములలో స్వతంత్రప్రభుత్వములు ప్రకటింపబడెను. 'మఫీషుహూ కేమా' బ్రిటిషు ప్రభుత్వము కూలిపోవునుగాక, 'యహియల్ వతన్' ఈజిప్టు జాతి వర్ధిల్లుగాక, అను కేకలు ప్రతిచోటను మిన్నుముట్టెను.

ఇంతవరకును ప్రజలఆస్తిని పాడుచేయుచున్నారేగాని, విదేశీయులజోలికి పోలేదు. మరణములన్నియు సైనికులవల్లనే కలుగచేయబడినవి. విదేశస్త్రీలను పిల్లలను ఏవిధముగను ప్రజలు అవమానపర్చలేదు. బిడువినులు మాత్రము కొందరు విదేశపురుషులను ముట్టడించిరి గాని, బిడువినులే సైనికులచే చంపబడిరి. కాని మార్చి 18 వ తేదీన నౌక ప్రజలగుంపు

డీరుటులోని యొక రైలును ముట్టడించి ఇద్దరు బ్రిటిషుసైనికో ద్యోగులను, అయిదుగురు సైనికులను హత్యగావించిరి. చని పోవుచున్న యొక బ్రిటిషుసైనికోద్యోగి సహాయమున కొంక హానం అరీఫ్ అను ఈజిప్టుదేశీయుడు పోయి ఆ జనములను వెనుకకునెట్టెను. ఈ హత్యలకుగాను ఏప్రిలు 9 వ తేదీన ముప్పదిమంది ఈజిప్టుదేశీయు లురిదీయబడిరి. ఈ ఉరిదీయ బడినవారిలో కొందరు జాతీయవాదులు విద్యార్థికులుకూడ నుండిరి.

## శాంతియుతమైన తిరుగుబాటు

"జనములు అల్లరులుచేయుచున్న ప్రతి-చోటను రాజ కీయనాయకులు శాంతిని బోధించుచు హత్యలుజరగకుండ నాపుచుండిరి. ఈ హత్యలలో జనము నాయకులబోధలు విన లేదు. ఎవరో తుంటరులుగావించిన హత్య లివి. వాఫ్డుపక్ష మున నిట్టివి ఖండించబడుచునే యున్నవి. మినిహ స్టేషనులోని జనములు ఆంగ్లేయులను హత్యగావించుటకై యత్నించగ, విప్లవనాయకులలో నొకడగు నొక ఈజిప్టు డాక్టరు తనప్రాణ మును పోగొట్టుకొనుటకు సిద్ధపడి ఆ ప్రజల నటకాయించి హత్యల నాపెను. ఇంతచేసినను హత్యాయత్న నేరముక్రింద నాతనికి మూడుసంవత్సరములశిక్ష తప్పినదికాదు.

............కావున కొద్ది మినహాయింపులతో నీ తిరుగుబాటు ప్రభుత్వసంస్థలఆస్తిని పాడుచేయుటతోను, ప్రభు త్వవ్యవహారములను నడవకుండచేయుటతోను తృప్తిచెందెను. ఎక్కడనైనను వ్యక్తుల సొంతఆస్తికి నష్టముకలిగినను కలిగి

యుండవచ్చును. కాని ఉద్దేశ్యముమాత్రము అదికాదు. అక్కడక్కడ జరిగిన హత్యలుకూడ బ్రిటిషుసైనికులకును సైనికోద్యోగస్తులకును సంబంధించినవి. బ్రిటిషుఉద్యోగస్తులు వారికచేరీలకు పోవుటకుగాని, ఒకొక్కప్పుడు అల్లరులు జరుగుచున్నచోట్లకు వచ్చి వాటిని నివారించుటకుగాని అభ్యంతరము కలుగలేదు.........జాతీయవాదులు వాలంటీరుదళమును ఏర్పాటుచేసి వీలయినంతవరకు అల్లరులను తగ్గించివేసిరి. మార్చి 25వ తేదీవరకు అల్లరులన్ని అణగి మామూలు శాంతపరిస్థితులేర్పడెను" అని యంగు తన 'ఈజిప్టు'లో వ్రాసెను. అప్పటినుండి ఆంగ్లేయ సాయుధభటులు వీధులవెంట తిరుగసాగిరి. విమానములు వచ్చి అనుమానగ్రస్తమైన గుంపులమీద బాంబులను పడవేసెను. మరఫిరంగులు వచ్చి రోడ్లప్రక్కను రైలుస్టేషనులచెంతను కూడిన జనసముదాయములమీద గుండ్లను పేల్చెను.

## అల్లన్‌బీ సేనాని నూతన హైకమీషనరు జగ్లులుపాషాను విడిచిపెట్టిరి

విన్‌గేటు స్థానమున అల్లన్‌బీ సేనానిని ప్రత్యేక హైకమీషనరుగ ఆంగ్లప్రభుత్వము పంపెను. ఆయన వచ్చుసరికి అల్లరులన్ని అణగిపోయెను. ఆయన విచారణలుచేసి కొందరికి కఠినశిక్షలు విధింపజేసెను. జాతీయవాదులు దేశములో బలవత్తరముగ నుండిరి. విప్లవసంఘములు ప్రతిచోటను ఏర్పడియుండి, శాంతిని కాపాడుచుండెను. సుల్తానుప్రభుత్వమునకు బలముగాని ప్రతిష్ఠగాని లేదు. బ్రిటిషువారి సైనిక

ప్రభుత్వముతప్ప మిగతా ప్రభుత్వములేదు. దౌర్జన్యమువలన లాభములేదని గ్రహించి వాఫ్దుకక్షివారు సాత్వికనిరోధమునకు (Passive resistance) కు గడంగిరి. దేశములోని యుద్యోగస్తులు, రైల్వే, పోస్టు, తంతి, ట్రాముపనివాండ్రు, ఇతర కార్మికులు అందరును గొప్పసమ్మెను జరుపుటకు తయారు చేయుచుండిరి. ఈ విషయములను గ్రహించి అల్లెన్‌బీసేనాని ఈజిప్టులోని చాలమందిప్రముఖులను సమావేశపర్చి వారితో సంప్రదింపులుజరిపి జగ్లులుపాషా మొదలగు నాయకులనందరిని మాల్టాద్వీపములోని జైలునుండి విడిచిపెట్టించి, పారిసుకు స్వేచ్ఛగా పోవచ్చునని 1919 ఏప్రియల్ 7వ తేదీన ప్రకటించెను. ఆవెంటనే రుష్దిపాషాయును ఇతర మితవాదులును మరల మంత్రిపదవులను స్వీకరించిరి. జాతీయజయచిహ్నముగ గొప్ప యుత్సవములు, సభలు దేశమందంతటను జరిగెను. జాతీయవాదులకు ప్రథమవిజయము కలిగెను.

## జగ్లులుపాషా పారిసుకువెళ్లి ప్రయోజనము లేకపోయెను

జగ్లులుపాషా మొదలగునాయకులు మాల్టానుండి పారిసుకువెళ్ళిరి. అక్కడ సమావేశమైన నానాజాతుల రాజకీయవేత్తలను దర్శించుచుండిరిగాని, ఎవరును ఆంగ్లేయులకు వ్యతిరేకముగ మాటలాడువారు కనపడలేదు. విల్సన్ సభాపతియొక్క 'మానవకోటియొక్క స్వేచ్ఛ' 'అన్నిజాతులకు స్వాయంనిర్ణయము' అను ధర్మసూత్రములు సమావేశమునకుపూర్వమే ఎగిరిపోయినవి. విల్సను తనపదునాలుగుసూత్రములను చాలవరకు సముద్రములోనే పడవైచి యూరపుకు వచ్చినాడు. మిగిలిన

వాటిని సంధిసమావేశపు గుమ్మపుబైట విడిచిపెట్టి లోన ప్రవేశించినాడు. తమతో యుద్ధము చేసిన జర్మనీ, ఆస్ట్రియా, తురుష్క స్సామ్రాజ్యములను ఎటుల పంచుకుని, యా జాతులు మరల తలయెత్తకుండ చేయుట అనునదియే లాయడుజార్జి, క్లిమన్‌షోల సమస్య. వారిద్దరు ఏకమై సంధిసమావేశమును నడిపినారు. విల్సను వారికి లోబడినాడు. తెల్లజాతులస్వతంత్రమే అట్టి విషమపరిస్థితులలో నున్నపుడు ఈజిప్టు ఇండియాలనుగూర్చి అక్కడ తలచువారెవరు? జగ్లులు పాషా మొదలగువారి మొరలు వినువారెవరు?

## దౌర్జన్యరాహిత్య సాత్వికనిరోధము

ఇక్కడ ఈజిప్టులో దౌర్జన్యరాహిత్యమైన గొప్ప సాత్వికనిరోధము ప్రారంభింపబడినది. విద్యార్థులును, లాయర్లును, పాఠశాలలను కోర్టులను బహిష్కరించిరి. వీరు దేశములోని అన్నిచోట్లకు పోయి తమజాతికి కలిగిన అవమానమును గూర్చి ప్రజలకు బోధించిరి. గ్లాడుస్టనుమంత్రి వాగ్దత్తముచేసినటుల ఆంగ్లేయులు ఈజిప్టుకు సంపూర్ణస్వతంత్రమును కలుగచేసి లేచిపోవుటకుమారుగ తమయొక్క శాశ్వతమైన సంరక్షక రాజ్యముగ గావించి ఈజిప్టునెటుల నిరంకుశముగపాలించుచునెట్టి నిర్బంధవిధానముల నవలంబించుచున్నారో ప్రజలకు ప్రబోధముగావించిరి. ఆ వెంటనే పోస్టు, టెలిగ్రాము, ట్రాము, రైల్వేలఉద్యోగస్తులు పనివాండ్రు అందరు సమ్మెలు గట్టి, కొన్నిరోజులవరకును పూర్తిగ రాకపోకలను ఉత్తర ప్రత్యుత్తరములను ఆపివైచిరి. సమ్మెలలో చేరనివారిని సమ్మె

దార్లు పికెటింగుచేసి ఆపిరి. పికెటింగుచేసినవారికి మరణశిక్ష విధించబడునని ఆంగ్లేయ సైనికప్రభుత్వము ప్రకటించినందున పికెటింగు చాలవరకు తగ్గెను. జాతీయ పోలీసుదళమును వాఫ్డు కక్షీవా రేర్పాటుచేసి శాంతినికాపాడుచు సమ్మెలకు సహాయముగావించుచుండిరి. ఆఖరున స్వదేశ ఉద్యోగస్తులం దరును సమ్మెలోచేరి కచేరీలను బహిష్కరించిరి. ఎవరైన కచ్చేరీలకు పోవ యత్నించగనే స్త్రీలు, విద్యార్థులు అడ్డము పడి ఆపిరి. కైరో, అలెగ్జాండ్రియానగరములలో ప్రభుత్వ కార్యాలయములన్నియు కొన్నిదినములవరకు మూసియుంచ బడెను. ప్రధానమంత్రి రుష్డిపాషా జాతీయవాదులతో రాజీ లకు ప్రయత్నించెను. అతడు వాఫ్డుయొక్క ఉత్తరువులనంగీ కరించుట, బ్రిటిషుసంరక్షకత్వము నంగీకరించకపోవుట, బ్రిటిషు సైనికులకు బదులు ఈజిప్టుసైనికులను పెట్టుట, అను మూడు షరతులను అంగీకరించినట్లయిన సమ్మెలను ఆపివైతుమని వాఫ్డుకక్షీనాయకులు చెప్పిరి. రాజీ కుదరలేదు. అల్లెన్‌బీ సేనాని కచ్చేరీలకు హాజరుకాని ఉద్యోగస్తులనందరిని పనిలో నుంచి తొలగింతుమనియు, సైనికశాసనముక్రింద కొందరిని ప్రాసిక్యూషన్‌చేతుమనియు మంత్రివర్గపక్షమున నొక ప్రకట నముగావించెను. అందుమీాద ఉద్యోగస్తుల సమ్మె అంతరిం చెను. విద్యార్థులు పాఠశాలలలో చేరనిచో పాఠశాలలను మూసివేతుమని బెదరించగ కొంతవరకా సమ్మెలు తగ్గెను. లాయర్లు లేకుండగనే దావాలు పరిష్కరింపబడునని చేసిన

బెదరింపులకు లాయర్లు లొంగలేదు. ఇతర సమ్మెలును కొంతవరకు తగ్గినవి.

## ప్రధానమంత్రి రుష్టిపాషా రాజీనామానిచ్చెను

ఇట్టిస్థితిలో ఏప్రియలు 20వ తేదీన "చాలామంది యుద్యోగస్తులు, నౌకర్లు తమపనులను మానివేసినందునను, ఘనతవహించిన సుల్తానుప్రభుత్వమును బెదరించుట కిది యుద్దేశించబడినందునను, ఆంగ్ల ప్రభుత్వమువారు ఈజిప్టుపైన స్థాపించిన సంరక్షకత్వము నెదిరించుటకై చేయబడుచున్న యత్నముగనుకను" అను ఉపోద్ఘాతముతో అల్లెన్‌బీ సేనాని యొక్క ప్రకటనగావించినందున కోపమువచ్చి మరునాడు ప్రధానమంత్రి రుష్డిపాషా తనపదవికి రాజీనామానిచ్చెను. మరల సహాయనిరాకరణము ప్రారంభమయ్యెను. ప్రధానమంత్రి సమ్మెల నంతరింపజేయుటకు తోడ్పడుచుండెనేగాని, సంరక్షకత్వము నంగీకరించి దానికి సహకారమొసల్పుటకు సిద్ధముగా లేడు.

## స్వయంసహాయమే శరణ్యమయ్యెను.

అక్కడ పారిసు సంధిసమావేశములో వర్సైల్సుసంధి యొక్క 147వ ఆర్టికలుప్రకారము ఈజిప్టుయొక్క సంరక్షకత్వము ఖాయపర్చబడి, అమెరికా సంయుక్త రాష్ట్రముల ప్రభుత్వముకూడ దానిని అంగీకరించుటవలన జగ్లులుపాషా మొదలగు నాయకులప్రయత్నములన్నియు పూర్తిగ అపజయమును పొందినవి. ఈజిప్టుజాతీయవాదులు కేవలము స్వయం సహాయమువలననే తమదేశముయొక్క స్వతంత్రముకొరకు

పోరాడవలసివచ్చినది. "మొదటిరంగములో కొంతవరకుదౌర్జ న్యముతో కూడిన అల్లరులు, రెండవరంగములో దౌర్జన్యరాహిత్య సాత్వికనిరోధము', రాబోవు మూడవరంగములో 'బహిష్కారము' అను ఆయుధములను తమ స్వతంత్రపోరాటములో వా రుపయోగించిరి. ఈజిప్టులోని బహిష్కారము హిందూదేశపు జాతీయవాదులవలంబించినటుల ఆంగ్లేయుల వర్తకబహిష్కారము కాదు. ఈజిప్టువర్తకులు చాలవరకు విదేశీయులైనందున, జాతీయవాదులపలుకుబడిలో లేరు. అట్టి వర్తకబహిష్కారముతో అవసరముకూడ లేకపోయెను. ఏప్రభుత్వమైనను ప్రజలసహకారములేనిది జరుగనేరదని వారికి తెలియును. కావున ఆంగ్లేయుల అధికారముతో నెట్టిసహకారము సలుపక నైతికముగ సర్వవిధముల సహాయనిరాకరణముచేయుటకు జాతీయవాదులు నిశ్చయించిరి. ప్రారంభములో పెద్దపెద్ద ప్రదర్శనములు లేవు. అల్లరులు, సమ్మెలు ఆగిపోయి దేశము మామూలు పరిస్థితులకువచ్చినది కాని, ప్రభుత్వములో మంత్రిపదవులను స్వీకరించుటకు ప్రముఖులెవరును రాలేదు. కొన్నివారములకు పిమ్మట మంత్రివర్గము నేర్పరచుటకు మహమ్మదు సయ్యీదు అను నాయన ముందుకువచ్చెను. ఆదాయవ్యయపట్టిక మంజూరుచేయబడెను. సైనికశాసనముక్రింద కొన్నిచట్టములు చేయబడెను. ఉద్యోగములలో కొందరు జోహుకుములు నియమింపబడిరి. సంరక్షకరాజ్య మేదోవిధమున సాగునని తలచబడెను. కాని అందులో జీవకళ లేదు. ప్రజలకందరికిని దానియందు అసహ్యమే యేర్పడెను" అని 'యంగు' తన 'ఈజిప్టు'లో వ్రాసెను.

(3)

## మిల్లరు కమీషను ఏర్పాటు

ఆ సమయములో హైకమీషనరగు అల్లెన్‌బీ సేనాని ఇంగ్లాండుకు శెలవుమీద పోయివచ్చెను. ఆంగ్లేయమంత్రి వర్గమువారు ఈజిప్టులోని తిరుగుబాటులన్నియు సమసిపోయి ప్రజలు సంరక్షకరాజ్యము నేదోవిధముగ అంగీకరింతురని యాశించిరి. నవంబరు 10 వ తేదీన హైకమీషనరు ఇంగ్లాండు నుండి వచ్చి 'మా రాజనీతి యేమనగా బ్రిటిషువారి సంరక్షకత్వముక్రిందను, వారి సలహాప్రకారమును ఈజిప్టుసుల్తాను, మంత్రులు, ప్రజాప్రతినిధులు ఈజిప్టు వ్యవహారములను నడుపుకొనుటకు వలయు స్వపరిపాలనమును స్థాపించుటయే అయ్యున్నది. ఇందుకొరకొకరాజ్యాంగవిధానమునుసిఫారసుచేయుటకొక కమీషనును ఈజిప్టుకు పంపుచున్నాము. అందరునువచ్చి ఆ కమీషనుకు తోడ్పడి పరిస్థితులు తెలుపుకోవలసినది' అని ప్రకటనగావించెను. ఇంకను జగ్లులుపాషా పారిసులోనే యుండెను. ఆ కమీషనును పూర్తిగ బహిష్కరించవలసినదని ఆయన ఈజిప్టుప్రజలకు సందేశమును బంపెను.

## కమీషను బహిష్కారనిశ్చయముతో నిర్బంధవిధానము, బాల్ఫరుమంత్రి ప్రకటనము.

ఈజిప్టుదేశమందంతటను ఆ కమీషనునుబహిష్కరించవలెనని గొప్ప ప్రబోధముగావించుచు బహిరంగసభలు జరిగెను. ఇది ఆంగ్లేయులకు సహించరానివిషయము. బహిష్కారకమిటీ అధ్యక్షుని మరికొందరు ముఖ్యులను ఆంగ్లసైనిక

ప్రభుత్వము అరెస్టుచేసి జైలులోపడవేసిరి. కొన్ని జాతీయ వారపత్రికలు అణచివేయబడెను. ఇందువలన ప్రజలలో ఉత్సాహమెక్కువయ్యెను. విచ్ఛిన్నముచేయబడియున్న శాసన సభ్యులు సమావేశమై ప్రభుత్వచర్యలను ఖండించిరి. పండితులు, భూఖామందులు, లాయర్లు, విద్యార్థులు కమీషనును బహిష్కరించుటకు తీర్మానములు గావించిరి. తమ నాయకులను జైలులోపడవేయుటవలన ప్రజలు మరల అల్లరులు ప్రారంభించిరి. నవంబరు 16 వ తేదీన సైనికులు తుపాకులను కాల్చి నూరుమందిప్రజలను చంపిరి. విదేశ షాహుకార్ల దుకాణములను ప్రజలు దోచుకొనిరి. విదేశస్తులకు దెబ్బలు తగిలెను. ఆ కమీషనును ఈజిప్టుకు పంపవద్దని ప్రధానమంత్రి మహమ్మదు సయ్యదుకూడ ఆంగ్లప్రభుత్వమునకు వ్రాసెను. వారు వినలేదు. నవంబరు 15 వ తేదీన ఆయన రాజీనామా నిచ్చెను. క్రైస్తవుడగు యూసూఫు వాహబును ప్రధాన మంత్రిగ నియమించిరి. ఏదోవిధమైన మంత్రివర్గ మేర్పడెను. ఈ మంత్రులు ప్రతిదినము తమప్రాణములను అరచేతులలో పెట్టుకొని భయముతో మెలగుచుండిరి. ఒకటి రెండుసార్లు వీరిలో కొందరిని హత్యగావించుప్రయత్నములు జరిగెను. తప్పించుకొనిరి. ఆంగ్ల ప్రభుత్వమునకు పట్టరాని కోపము వచ్చెను. పార్లమెంటుసభలో బాల్ఫరుమంత్రి 'ఈజిప్టుమీద బ్రిటిషువారిఅధికారము గలదు. ముందుకూడ నుండబోవు చున్నది. ఈజిప్టులో నెవరుగాని బయటివారెవరుగాని ఆంగ్లేయులు ఈజిప్టుపై అధికారమును వదులుకొందురను భ్రాంతిని పెట్టుకొనకూడదు' అని ప్రకటించెను. ప్రభువులసభలో

"ఈజిప్టు మిగుల అనాగరికస్థితికి బోవుచున్న"దని కర్జన్ప్రభువు చెప్పెను.

## మిల్నరుకమీషను బహిష్కరింపబడినది.

ఇట్టిస్థితిలో పెద్దపెద్ద మరఫిరంగులను వెంటగొని 1919 డిశంబరు 10 వ తేదీన మిల్నరుకమీషను ఈజిప్టులో దిగెను. మిల్నరుప్రభువు, లాయడు, మాక్సువెలు, సర్ రెన్నెలురాండు, మరిముగ్గురుఆంగ్లేయులు ఆ కమీషనులో సభ్యులు. మొత్తము ఏడుగురు తెల్లసభ్యులుండిరి. ఒక్కరైనను ఈజిప్టుదేశీయు డందులో లేడు. 1928 లో నిటులనే ఏడుగురాంగ్లేయులుగల సైమనుకమీషను భారతదేశమున కివ్వవలసిన రాజకీయసంస్కరణలనుగూర్చి విచారించి రిపోర్టుచేయుటకు హిందూదేశమునకు వచ్చెను. కాని భేదమేమనగా సైమనుకమీషనును భారతదేశము సంపూర్ణముగ బహిష్కరించజాలకపోయెను. కాంగ్రెసుమితవాదులు మొదలగు ముఖ్యమైన రాజకీయ పార్టీలు దానిని బహిష్కరించినను ప్రభుత్వప్రోత్సాహము వలన అనేకమంది యితరులు దానికి స్వాగతమిచ్చి తోడ్పడిరి. అటులగాక మిల్నరుకమీషనును ఈజిప్టుదేశము పూర్తిగ బహిష్కరించినది. గావున ఈజిప్టుకు త్వరలోనే కొంతవరకైనను స్వతంత్రము లభించినది. ఈజిప్టులో మిల్నరుకమీషను యొక్కబహిష్కారము పూర్తిగ జరిగెను. వీరితో మాటలాడినవారు, వీరికి స్వాగతమిచ్చినవారు, సహాకరించినవారు ఈజిప్టుదేశమందెచటను లేకపోయిరి. మూడునెలలు అటు ఇటు తిరిగినను ఎట్టి ప్రయోజనము లేదయ్యెను. ఆ సభ్యులలో

సెవరైనను ఎక్కడికైనను చూచుటకు వెళ్ళగనే అచట నల్ల జండాలప్రదర్శనము, 'వెనుకకు పో' అను కేకలు సిద్ధమయ్యెను. ఒక బారిష్టరుసభ్యుడు కోర్టుకువెళ్ళి యెటుల విచారణలుజరుగు చున్నవో చూతమని యత్నించగనే అచటి న్యాయవాదు లందరును వెంటనే అచటినుండి లేచిపోయిరి. స్త్రీలు, విద్యార్థులు కాళ్ళకు అడ్డముపడి జోహుకుములనుకూడ నా కమిషనుదగ్గిరకు పోనీయలేదు.

## (4)
## జగ్లులు పాషా ద్వితీయ ప్రవాసము

మిల్నరుకమిషనవారు తమదేశమునకు పోయి ఈజిప్టు బ్రిటిషుసంరక్షకత్వమును బొత్తుగా సహించుటలేదనియు, ఈజిప్టును స్వతంత్రదేశముగ నంగీకరించి, దానితో బ్రిటిషువారొడంబడికలనుచేసుకొనుట యుక్తమనియు, రహస్యముగ సిఫారసుచేసిరి. ఈ సిఫారసు బ్రిటిషుమంత్రుల కిష్టము లేదు. మిల్నరు జగ్లులుపాషాలమధ్య కొంత రాజీసంప్రదింపులు లండనులో జరిగెను. అవి విఫలమైనవి. చాలకాలము వరకు మిల్నరుని వేదిక బహిరంగప్రకటనచేయబడలేదు. ఈ లోపున బ్రిటిషు విదేశాంగమంత్రియగు కర్జనుప్రభువు ఈజిప్టు మితవాదమంత్రియగు అడ్లిపాషాతో రాజీపడుటకు ఇంగ్లాండుకు పిలిపించెను. ఆయనకు ఈజిప్టుపక్షమున మాటలాడుటకు హక్కులేదని దేశములో వ్యతిరేకాందోళన ప్రబలినది. 1921 ఏప్రిలు 21 వ తేదీన జగ్లులుపాషా ఈజిప్టుకు మరలి రాగానే ఆయనకు దేశమునందన్నిమూలలలోను అత్యంత యుత్సాహకరమైన అఖండ స్వాగతమివ్వబడెను. ఆయన

యొక్కయు వాఫ్డుపార్టీయొక్కయు ఏకైకనాయకత్వము దేశ మందంతటను అంగీకరించబడినది. సంపూర్ణ స్వతంత్రము కొరకే వీరు మరల గొప్ప ఆందోళనమును సాగించిరి. మేనెల 23 వ తేదీన దేశములో అల్లరులు జరిగెను. ప్రజాసమూహా ముచే కొంతమంది విదేశస్తులు హత్యగావింపబడిరి. అడ్లీ పాషా భయపడి కర్జను ప్రభుత్వముతో రాజీప్రయత్నములు మాని మరలివచ్చి, ప్రధానమంత్రిత్వమునకు రాజీనామానిచ్చెను. సభలుచేయించ ప్రయత్నించగ వాటిని ప్రభుత్వము నిషేధిం చినది. ప్రభుత్వము సైనిక శాసనమును ప్రకటించినది. అంతట గొప్ప అల్లరులుజరిగి, ఇద్దరు బ్రిటిషుసైనికులు హత్యగావింప బడిరి. జగ్లులుపాషా మొదలగు నాయకులు నిషేధాజ్ఞల నుల్లంఘించి సైనిక శాసనమునుకూడ నిర్లక్ష్యముచేసి సభలు చేయసాగిరి. వెంటనే జగ్లులుపాషాను మరికొందరు వాఫ్డు నాయకులను అరెస్టుచేసి మొదట నాయజుకు, పిమ్మట ఏడె నుకు, ఆ పిమ్మట సిషైలుకు ప్రవాసమునకు బంపిరి. జగ్లులు పాషాకు చాల జబ్బుచేసెను. బ్రతకడనుకున్నారు. అయినను విడిచిపెట్టలేదు. ఆయనను జిబ్రాల్టరుకు గొనిపోయి, అచట ఆంగ్లేయవైద్యులు రోగనివారణచేయుచుండిరి. ఈజిప్టులో మితిమీరినఅల్లరులు సాగెను. ప్రభుత్వముసాగుట దుర్లభ మయ్యెను. సేనలను, యుద్ధపడవలను తెచ్చిరి. అన్ని బెదిరింపు లు నిష్ఫలమయ్యెను. ఈపరిస్థితులలో అల్లెన్‌బీసేనాని బ్రిటిషు మంత్రివర్గముతో మాటలాడుట కింగ్లాండుకుపోయెను. సంరక్షు కత్వమును రద్దుపరచుటా లేక ఇంక నెక్కుడు సేనలను బంపి, యింక నెక్కుడు నిర్బంధవిధానములను అమలుజరుపుటా

అనునదియే బ్రిటిషుప్రభుత్వముముందున్న ప్రశ్న. ఎక్కువ నిర్బంధవిధానములవలన ప్రయోజనములేదని, ఈజిప్టు అసలే ఎట్టిరాజీకి రాదని ఆయన బ్రిటిషుమంత్రులతో నచ్చచెప్పెను. ఒక నెలరోజు లక్కడ మకాముచేసి కొన్ని మినహాయింపులతో కూడిన యొక స్వతంత్రప్రకటనను తీసుకొనివచ్చెను. ఇది ఈజిప్టుప్రజలకు ముందుగనే తెలిసి ఆయన ఈజిప్టులో ఓడదిగి కాలుపెట్టగానే అన్నివర్గములవారు అఖండ స్వాగత మిచ్చిరి.

## స్వాతంత్ర్యప్రకటనము

ఆ స్వాతంత్ర్యప్రకటనము 1922 ఫిబ్రవరి 28 వ తేదీన ఈజిప్టులో ప్రకటించబడెను. అందులో నిటులున్నది :

1. ఈజిప్టుమీద బ్రిటిషువారిసంరక్షకత్వము రద్దుపరచ బడినది.
2. ఈజిప్టు స్వతంత్ర దేశముగ అంగీకరించబడినది. రాజ్యాంగము అమలులోకి రాగానే సైనిక శాసనము రద్దుపరచ బడును. రాజకీయ నేరస్థులందరికి క్షమాపణనివ్వబడును.
3. ఒక వంశపారంపర్యమైన రాజరికముతో గూడిన ప్రజా రాజ్యవిధానము (పార్లమెంటు) ఈజిప్టును పరి పాలించును.
4. గాని ఈ క్రింది నాలుగువిషయములు మరల స్వతంత్ర ఈజిప్టు స్వతంత్రబ్రిటిషుప్రభుత్వములు కలసి రాజీగా పరిష్కారముచేసుకొనేవరకు ఇపుడున్నటులే బ్రిటిషు వారిక్రింద నుండును...

అ. ఈజిప్టు దేశరక్షణము.

ఆ. సూయజుకాలువరక్షణము.

ఇ. ఈజిప్టులోని విదేశస్తులయొక్క, మైనారిటీల చిన్న సంఘములయొక్క రక్షణము. అనగ విదేశస్తుల ప్రత్యేకహక్కులు.

ఈ. సూడానుదేశము. అనగ ఆంగ్లేయ వస్త్రయంత్రశాలలకు కావలసిన ప్రత్తినిపండించి ఎగుమతిచేయుట. ఇది ఈజిప్టు స్వతంత్రపోరాటములో ప్రథమఘట్టము.

# ఈజిప్టుదేశ చరిత్ర

## తొమ్మిదవ అధ్యాయము

### సంపూర్ణ స్వతంత్రసముపార్జనము - ఈజిప్టు రిపబ్లికు

(1)

### నూతన రాజ్యాంగ విధానము

ఫౌదురాజు వంశపర్యాయమైన రాజయ్యెను. రాజ్యాంగ విధానప్రకారము మొదటిఆర్టికిలులో "ఈజిప్టుదేశము సంపూర్ణస్వతంత్రము సార్వభౌమత్వముగలరాజ్యము" అని నిర్వచించబడినది. పార్లమెంటులో రెండుసభ లుండును. 1. ప్రజాప్రతినిధిసభ, 2. సెనేటు. ప్రజాప్రతినిధిసభ అయిదేండ్లకొకసారి ఎన్నుకోబడును. సెనేటుసభ్యులకాలపరిమితి పదిసంవత్సరముల వరకుండును. ప్రతి అయిదేండ్లకు సగముమంది ఎన్నుకొనబడుదురు. సెనేటులో అయిదింట రెండువంతులమంది రాజుచే నియమితులు. మిగిలిన మూడువంతులమంది ఓటర్లచే నెన్నుకొనబడుదురు. ప్రతి పురుషునికి, స్త్రీకిని ఓటుకలదు. రెండు సభలు మంజూరుచేసిన చిత్తుచట్టమును రాజు అంగీకరించవలెను. అలా అంగీకరించకపోయినయెడల ఒకనెలలోపల ప్రతిసభలోను మూడింట రెండువంతులమందిచేత మంజూరు

చేయించిన యెడల అది చట్టమగును. మంత్రులను రాజు నియమించును. వారు ప్రజాప్రతినిధిసభకు బాధ్యులు ఈ రాజ్యాంగము బ్రిటిషువారితో చేసుకున్న ఒడంబడికలకు లోబడియుండును. ఇది వాఫ్డునాయకులను ప్రవాసపుజైళ్ళలో పెట్టి, మితవాదమంత్రులు అల్లంబిప్రభువు కలిసి తొందరతొందరగ గావించిన రాజ్యాంగవిధానము. బెల్జియంవిధానమును బోలినది. వాఫ్డుపార్టీ ఇండియాలోని కాంగ్రెసువలె దౌర్జన్యరాహిత్యమును అవలంబించిన రాజకీయకక్షి. ఇదిగాక ఈజిప్టులో అరాజకచర్యలమూలమున విప్లవమును కలుగచేయు నుద్దేశ్యముగల యొక విప్లవబృందము కలదు. వారు స్వాతంత్ర్యప్రకటనను నూతనరాజ్యాంగవిధానమును ప్రతిఘటించి, 1922, 1923 సంవత్సరములలో పదిహేడుగురు బ్రిటిషు ఉద్యోగస్తులను హత్యగావించి, ఇరవైమందిని గాయపరచిరి. వారిలో కొందరిని పట్టుకొని విచారణచేసి ఉరిదీసిరి. కొందరికి దీర్ఘమైన ఖైదుశిక్షలను విధించిరి. జగ్లులుపాషా దేశములో నున్నయడల ఆయనకూడ స్వాతంత్ర్యప్రకటనతో తృప్తి చెందక ఆందోళనజరుపుచున్నచో రాజ్యాంగవిధాన మమలులో పెట్ట వీలులేదని యెంచి దానిని అమలులో పెట్టినపిమ్మట నే 1923 మార్చి నెలలో జగ్లులుపాషా మొదలగు నాయకులనందరిని విడిచి పెట్టిరి. అంతవరకు సైనికశాసనముకూడ తీసివేయబడలేదు. జగ్లులుపాషా విడిచిపెట్టబడి దేశములో దిగగ, ఆయన కఖండ స్వాగతమివ్వబడెను. అరాచకచర్యలు తగ్గెను. గాని ఈ రాజ్యాంగవిధానము నొప్పుకొని దీని నమలుజరుపుటలో తోడ్పడవలెనా లేక కేవలము తిరస్కరించి స్వతంత్రపోరాట

మును సాగించవలెనా యనుసమస్య ఆయనయెదుట నుండెను. ఆయన స్వాతంత్ర్యప్రకటనను పూర్తిగఖండించెను. దానితో ఈజిప్టు ఏమాత్రము తృప్తిచెందదని చెప్పెను. సంపూర్ణస్వాతంత్రము వచ్చువరకు పోరాడుచుందుమనియే ప్రకటించెను. గాని రాజ్యాంగప్రకారము ఎన్నికలలోకిదిగి ప్రభుత్వమును చేబట్ట నిశ్చయించెను. 1923 సంవత్సరము ఆఖరున జరిగిన ఎన్నికలలో 214 మంది సభ్యులలో వాఫ్డుపార్టీవారు 177 మంది ఎన్నుకొనబడిరి. జగ్లులుపాషా ప్రధానమంత్రిత్వమును స్వీకరించి, మంత్రివర్గము నేర్పాటుచేసెను.

(2)

### జగ్లులుపాషా రాజీనామా - పార్లమెంటు రద్దు

వాఫ్డుపార్టీ దేశముయొక్క పునర్నిర్మాణమునకు పూనుకొనెను. గాని వ్యవహారములు శాంతముగ జరుగలేదు. జగ్లులుపాషా రాశలసియున్న మిగతా స్వాతంత్రముకొరకు బ్రిటిషుప్రభుత్వముతో రాజీప్రయత్నములు చేసెను. లండను వెళ్ళివచ్చెను. లాభములేకపోయినది. సుడాను బ్రిటిషుప్రభుత్వముక్రిందనుండుట జాతీయవాదులకు దుస్సహముగ నుండెను. ఆగష్టులో సుడానులోని ఈజిప్టుసైన్యములలో కొన్ని తిరుగుబాట్లుచేసినవి. ఆంగ్లేయులు వాటిని తీవ్రముగ నణచివైచిరి. జులైనెలలోనే అరాజకవాదులు జగ్లులుపాషా మీద తుపాకికాల్చి గాయపర్చిరి. దానినుండి ఆయన స్వస్థత పొందుచుండెను. అది బ్రిటిషువారితోసహాకరించవద్దని అరాజకవాదులు ఆయనకుచేసిన హెచ్చరిక. 1924 నవంబరు 19 వ తేదీన సుడానుగవర్నరుజనరలగు సర్దార్ లీస్టాకును ఏడుగురు

ఈజిప్టు దేశీయులు కైరోలో తుపాకులుకాల్చి హత్యగావించిరి. వెంటనే ప్రధానమంత్రి జగ్లులుపాషా వెళ్ళి తనవిచారమును వెలిబుచ్చి, హంతకులను పట్టియిచ్చినవారికి పదివేలపౌండ్లను ఇచ్చెదమని ప్రకటించెను. లండనులోని బ్రిటిషుప్రభుత్వమున కిది చాలలేదు. క్షమాపణకోరుట, నేరస్తులనుశిక్షించుట, అన్నిరాజకీయాందోళనలు ఆపివేయుట, అయిదులక్షల పౌండ్లను నష్టపరిహారముగ చెల్లించుట, ఇరువదినాలుగుగంటలలో సుడానునుండి ఈజిప్టుసైన్యములను తీసివేయుట, విదేశస్తులరక్షణలు ఆంగ్లేయప్రభుత్వముక్రింద నుండకూడదని జగ్లులుప్రభుత్వము పెట్టుచున్న ఆక్షేపణలను వదులుకొనుట ఈ ఆరుపనులు తక్షణము జగ్లులుప్రభుత్వము జరుపనిచో ఆంగ్లప్రభుత్వము కఠినమైన ప్రతీకారముజరుపునను అంత్య సందేశమును అల్లన్‌బి ప్రభువుద్వారా జగ్లులుపాషా కంద చేసిరి. ఇవన్నీ చేయుట ఆంగ్లేయులకు నీచముగలొంగబడుటయని తలచి, జగ్లులుపాషా ప్రధానమంత్రిత్వమునకు రాజీనామా నిచ్చెను. అల్లన్‌బి సేనాని ఫాదురాజుతో చెప్పి, మితవాదియైన జివారుపాషాను ప్రధానమంత్రిగగావించి బ్రిటిషువారు కోరినవాటినెల్లను వెంటనే అమలుజరుపునట్లు అంగీకరింప చేసెను. జగ్లులుమంత్రివర్గమంతయు రాజీనామానిచ్చెను. పార్లమెంటువారు సమావేశమై ఎవరో అరాజకులుగావించిన దుష్కృత్యములకుగాను ఇట్టి దారుణషరతులనువిధించుట న్యాయముకాదని తీర్మానించి అంతర్జాతీయసమితికి పంపిరి. ఫలితమేమనగా డిశంబరు 24 వ తేదీన ఫాదురాజుచేత అల్లన్‌బి సేనానికోరికమీద పార్లమెంటు రద్దుపర్చబడెను. రాజు

యొక్క పాలనము ఆంగ్లేయులకనుకూలముగ సాగెను. సర్దారును హత్యగావించిన నేరముక్రింద ఏడుగురిని ఉరిదీసిరి. ఈ వ్యక్తులుచేసిన నేరమునకు ఈజిప్టును శిక్షించుట ఎట్టి న్యాయమో? బలవంతులయిన ఆంగ్లేయులకే ఎరుక. 1925 ఫిబ్రివరి, మార్చి నెలలలో జరిగిన ఎన్నికలలో జగ్లులు స్వాయముగ నిలవలేదు. అతనిపార్టీయని అతనికివ్యతిరేకపార్టీయని రెండుకక్షలుగ నిలచిరి. వ్యతిరేకపార్టీకి కొంచెము మెజార్టీ వచ్చెను. గాని అందరును ఏకగ్రీవముగ జగ్లులుపాషాను ప్రజాప్రతినిధిసభకు అధ్యక్షునిగ ఎన్నుకొనిరి. తక్కిన అన్ని పార్లమెంటుఉద్యోగములును జగ్లులుపార్టీకి లభించినవి. అందుమీద పార్లమెంటు 1925 మే నెలలో ఫాదురాజుచేత విచ్ఛిన్నముచేయబడినది. రాజు ఆంగ్లేయులతో కలిసి వాఫ్డుపార్టీని అధికారములోకిరాకుండ కుట్రలుపన్నెను. మరల ఎన్నికలు పెట్టివచో వాఫ్డుపార్టీ అత్యధికసంఖ్యాకులుగ వచ్చునను భీతితో ఎన్నికలుపెట్టలేదు.

## జగ్గులు పాషా మరణము

ఫాదురాజు తనకుఇష్టమైనమంత్రిల నేర్పరచుకొని పార్లమెంటులేకుండ రాజ్యమునడిపెను. లిబరలుపార్టీ నాయకుడైన జివారుపాషాను ప్రధానమంత్రిగ చేసెను. కొలదికాలములో రాజుయొక్క స్వంతపార్టీయైన ఇత్తేహాదుపార్టీయొకటి తలఎత్తెను. వారు కొన్ని మంత్రిపదవులను సంపాదించిరి. 1926 లో మరల ఎన్నికలుపెట్టగ వాఫ్డుపార్టీవారు 214 లో రెండువందలమంది సభ్యులుగ ఎన్నుకొనబడిరి. గాని న్యాయ

స్థానములలో సర్దారు లీస్టాకుహత్యకు వాఫ్డుపార్టీతో నెట్టిసంబంధము లేదనినిర్ణయమైనప్పటికిని, ఈజిప్టులోని ఆంగ్లేయహైకమీషనరు జార్జి లాయడ్ దానినిఅంగీకరింపక వాఫ్డుపార్టీలోకొంత మందికి సంబంధముకలదనియు జగ్లులుపాషాను ప్రధానమంత్రిగ చేయవద్దనియు రాజుతో చెప్పినందున జగ్లులుపాషాను మంత్రివర్గము నేర్పాటుచేయవలెనని కోరక ఆయనయొక్క ఒప్పుదలమీాదనే లిబరల్ పార్టీకి చెందిన అడ్లిలుపాషాను ఫాదు రాజు ప్రధానమంత్రిగ చేసెను. ఆయన ఏర్పరచిన సంయుక్త మంత్రివర్గములో ఆరుగురు జగ్లులుపాషా అనుచరు లుండిరి. 1927 లో ఈజిప్టు జాతీయమహానాయకుడైన జగ్లులుపాషా దేశమును దుఃఖసాగరమునముంచి పరమపదించెను. ఆసియా, ఆఫ్రికాఖండముల స్వాతంత్రిపోరాటములో నాయకత్వము వహించి అఖండత్యాగములనుసలిపిన మహాధీరులలో ఆయన యొకరు. దైవభక్తిపరాయణుడు, సత్యసంధుడు, వినమ్రజీవితముకలవాడు, అఖండత్యాగమూర్తి, కడుసమర్థుడు, ఈజిప్టు దేశస్వాతంత్రిపోరాటమును శాంతియుతమైనపద్ధతులచే బహుచక్కగ నడిపి, కొంతవరకు జయమునుపొందిన మహానాయకుడు ఆయన. ఆయనకూడ ఈజిప్టు స్త్రీలకు స్వాతంత్రిమును విద్యాభివృద్ధిని కలుగచేసెను. ఆయన మరణించినపిమ్మట వాఫ్డుపార్టీకి గొప్పనాయకులు రాలేదు. ఆ పార్టీనాయకుడుగ నహాస పాషా ఎన్నుకొనబడెను.

## మైనార్టీలపాలనము - అశాంతి

1928లో ఫాదురాజు మూాడుసంవత్సరములవరకు పార్ల

మెంటును రద్దుపరచెను. వాఫ్దుపార్టీ అధికారములోకి రాకుం డుటకై ఓట్లనుతగ్గించుచు నూతనరాజ్యాంగవిధానమును తయారుచేసి, 1930లో మరల నెన్నికలుపెట్టగ వాఫ్దుపార్టీ ఆ ఎన్నికలను బహిష్కరించినది. మైనార్టీపార్టీలతో రాజు రాజ్యముచేయసాగెను. దేశములో ఫాదురాజుమీదను, ఆంగ్లేయులమీదను ద్వేషము చెలరేగెను. బ్రిటిషుసైన్య ములు దేశము విడిచిపెట్టిపోవలెననియు సంపూర్ణమైన స్వతం త్రము కావలెననియు ఆందోళనము, బహిరంగసభలు దేశ మందంతటను జరిగెను. విద్యార్థులుకూడ ఈ ఆందోళనములో పాల్గొనిరి. ఎక్కడచూచినను అల్లరులు, అశాంతి ప్రబలెను. విద్యార్థులమీద పోలీసులు తుపాకులుకాల్చి కొందరిని హత్య గావించిరి. విదేశస్థులు కొందరు చంపబడిరి. ఈ సమయము లోనే ఇటలీలో ఫాసిస్టుప్రభుత్వము విజృంభించి ఈజిప్టుకు సరి హద్దుననున్న అబిసీనియా నాక్రమించుటకు సైన్యములను పంపెను. ఈజిప్టులో తమస్థితి అపాయకరముగనున్నదని బ్రిటిషువారు తలచిరి. ఈజిప్టులో ప్రధానపార్టీకి నాయకుడైన నహాసుపాషాతో రాజీసంప్రతింపులు జరుపుటకు నిశ్చయించిరి. 1935 లో బ్రిటిషు హైకమీషనరగు జార్జి లాయడుయొక్క సలహాపైన ఫాదురాజు రాజ్యాంగవిధానమును మరల స్థాపిం చెను. 1936 లో ఎన్నికలుపెట్టిరి. ఆ ఎన్నికలలో వాఫ్దుపార్టీ వారు అత్యధికసంఖ్యాకులుగ నెన్నుకొనబడిరి. దాని నాయకు డైన నహాసుపాషా ప్రధానమంత్రియయ్యెను. ఆ సంవత్సరమే ఫాదురాజు మరణించినందున మైనరుగనున్న ఆయన కుమారు డగు ఫరూకీరాజు సింహాసనాధీశుడయ్యెను.

## 1936 ఆంగ్లో-ఈజిప్టు యొడంబడిక

బ్రిటిషువారు ప్రధానమంత్రియగు నహాసుపాషాతో రాజీప్రయత్నములు సాగించిరి. 1936 ఆగష్టు 26వ తేదీన బ్రిటిషు, ఈజిప్టు ప్రభుత్వములమధ్య నొక రాజీయొడంబడిక జరిగెను. దానిప్రకారము విదేశస్థుల ప్రత్యేక హక్కులన్నియు రద్దుపరచబడెను. దేశసంరక్షణబాధ్యతకూడ ఈజిప్టుకు వదలి వేయబడెను. విదేశస్థుల చిన్నసంఘములరక్షణ పూర్తిగ ఈజిప్టుకువప్పగింతచేయబడెను. ఈజిప్టు అంతర్జాతీయసమితిలో సభ్యురాలిగ చేర్చుకొనబడెను. ఈజిప్టు సంపూర్ణస్వతంత్రము గల దేశముగ నంగీకరింపబడెను. కాని సూయజుకాలువ రక్షణకొరకు బ్రిటిషు సైన్యములు అచట యుంచబడెను. యుద్ధకాలములో మిగిలినచోట్లకూడ ఆంగ్లేయులు సైన్యములు పెట్టుకొనవచ్చును. సూడాను దేశము ఆంగ్లో-ఈజిప్టు సమిష్టి పరిపాలనక్రింద నుంచబడెను. ఈజిప్టులోనున్న చాలమంది తెల్ల ఉద్యోగులను తీసివేసి నష్టపరిహారమిచ్చి స్వదేశములకు పంపిరి. దీనితో అల్లరులు సమసిపోయి ఈజిప్టులో శాంతి నెల కొల్పబడెను. ఇది స్వతంత్రపోరాటములో రెండవఘట్టము.

(3)

### అరబులీగు

ద్వితీయ ప్రపంచసంగ్రామము జరుగుచుండగ బ్రిటిషు వారు తమసైన్యములను విశేషముగ తీసుకొనివచ్చి, ఈజిప్టులో నుంచిరి. అందుకు ఈజిప్టు ప్రభుత్వము అంగీకరించెను. ఫరూకి

రాజు 1937 నుంచి మైనారిటీ వెళ్ళినందున రాజుగ వ్యవహారించెను. ఆయనకూడ వాఫ్దుపార్టీ పలుకుబడి నణచివేయవలెనని కోరువాడే. ఈకాలములో ముస్లింసోదరసమితియను నొక అరాజకవర్గముకూడ దేశములో స్థాపితమైనది. ఇది దేశ స్వతంత్రముకొరకు హింసాయుతవిప్లవమును నడపదలచినది. 1945లో ఇరాకు ప్రధానమంత్రియగు నూరీయన్ సయ్యద్ యొక్క పేరేపణచే (అరబు దేశముల సమ్మేళనము) అరబు లీగు స్థాపించబడినప్పుడు ఈజిప్టు ప్రధానమంత్రియగు నహాసు పాషా అందులో చేరెను. అరబు దేశములలో ఈజిప్టుకు నాయకత్వము ఏర్పడెను. 1945లో ఈజిప్టుకూడ ఐక్యరాజ్యసమితిలో చేరెను. కాని ఈజిప్టులో బ్రిటిషుసైన్యములుండుట ఈజిప్టు దేశీయులకందరికి మిగుల దుస్సహాముగనుండెను. వారిని తీసివేయించవలెనని వాఫ్దుపార్టీ చేసిన రాజీప్రయత్నములు సఫలము కాలేదు. బ్రిటిషువారు సూయజుకాలువ, సూడానుల విషయమైన ఎట్టి రాజీలు ఒప్పుకొనుటలేదు.

## ఫరూకిరాజుయొక్క దేశద్రోహము

ఈజిప్టులో స్వతంత్రతృష్ణ, ఐక్యత చెడి, తమతమ అధికారమును, స్వలాభమును అపేక్షించు రాజకీయపార్టీలేర్పడినవి. రాజు ఆంగ్లేయుల చెప్పుచేతలలోనుండి దేశద్రోహము గావించుచుండెను. విద్యార్థులలో కమ్యూనిస్టు భావములుకూడ వ్యాపించుచుండెను. ఫరూకిరాజు మరల నహాసుపాషాను ప్రధానమంత్రిత్వమునుండి తొలగించి, తన అనుచరుడైన అహమ్మదు మెహరును ప్రధానమంత్రిగ గావిం

చెను. ఆయన హత్యగావించబడెను. పిమ్మట మరియొక అను చరుడైన ఎల్ నొక్రషీ అను నాయనను ప్రధానమంత్రిగ చేసెను. దేశములో తీవ్రమైన అల్లరులు జరిగినందున ఆయన కూడ రాజీనామానిచ్చెను. 1946లో లిబరలునాయకుడైన సిద్దికుపాషాను ప్రధానమంత్రిగ చేసెను. 1947లో ఆయన మంత్రివర్గము ఈజిప్టు విషయములను ఐక్యరాజ్యసమితికి విన్న వించెను. కాని ఫలితమేమియును కలుగలేదు. ఐక్యరాజ్య సమితిలో ప్రథమస్థానము వహించిన ఇంగ్లాండుమీద ఫిర్యా దులు వినువారెవరు? దేశములో జరుగుచున్న అల్లరులకు భయపడి, ఫరూకిరాజు మరల నహాసుపాషానే ప్రధానమంత్రిగ చేసెను. ఈజిప్టు, సూడాను దేశముల రాజు అను బిరుదమును ఫరూకిరాజుకు కలుగజేసి, నహాసుపాషా యొక ప్రకటనమును గావించెను. దానిని ఇంగ్లీషువారు ఒప్పుకొనలేదు. సూడాను దేశీయులు తమదేశభవిష్యత్తును తాము నిర్ణయించుకొన వచ్చునని మాత్రము ఆంగ్లేయులు ప్రకటించిరి. ఇందుకు వాఫ్డుపార్టీ యొప్పుకొనలేదు. సూడాను దేశీయులు ఈజిప్టు నుంచి విడివడి, బ్రిటిషువారితో కలిసి డొమినియనుప్రతిపత్తిని అంగీకరించునట్లు చేయుటకై యొక రాజకీయపార్టీని సూడా నులో లేవదీసిరి. సూడానులో ప్రత్తిపంట ఆంగ్లేయులకు కావలెను. వాఫ్డుపార్టీవారికి సూడానుదేశము ఈజిప్టుతో కలసియుండవలెనను పట్టుదల గలదు.

### ఇస్రాయిలు స్థాపనము

మొదటి ప్రపంచయుద్ధము ముగిసినతరువాత తురుష్క

సామ్రాజ్యమునుండి లాగుకొనబడిన పాలస్తీనును 1918 నుంచి బ్రిటిషువారి పాలనములో మాండేటరీరాజ్యముగ నుంచిరి. కాని బాల్ఫరు ప్రకటనముప్రకారము ప్రపంచము లోని దేశములన్నిటిలోనుంచి యూదులువచ్చి అచట కాపుర ముండుటకు దానిని యూదుల జాతీయగృహముగ నిర్ణయిం చిరి. 1918లో ఆ దేశములోగల ఏడులక్షల జనసంఖ్యలో డెబ్బదివేలమందిమాత్రము యూదులుండిరి. మిగిలినవారం దరు అరబుముసల్మానులు. బహుకొద్దిమంది క్రైస్తవులు కూడ నుండిరి. 1938 వరకు ఆ దేశపు జనసంఖ్యలో యూదులసంఖ్య మూడవవంతుకు పెరిగినది. లక్షలకొలది యూదులు వచ్చి ఆ దేశములో కాపురముండిరి. కాని అచ్చటనున్న అరబుముసల్మానులకును, యూదులకును నిరం తరము కలహములుజరుగుచున్నందున ఆంగ్లేయులు వాటినాప లేకపోయిరి. అందుమీద 1948లో ఐక్యరాజ్యసమితివారు ఆ దేశములోని ముఖ్యభాగమైన ఇజ్రాయిలును ప్రత్యేక దేశముగచేసి దానిపైనగల బ్రిటిషుమాండేటును రద్దుపరచి స్వతంత్రముగచేసిరి. అప్పటినుంచి అది యూదులకు ప్రధాన మైన దేశముగ నుండెను. ఏటేటా ప్రపంచములోని యూదు లందరు అచటికి వచ్చి నివాసమేర్పరచుకొనుచుండిరి. పాల స్తీనులోని ఇజ్రాయిలుగాక మిగిలిన చిన్నభాగమును కొంత జోర్డానుకును, కొంత ఈజిప్టుకును ఐక్యరాజ్యసమితివారు కలిపిరి. ఇజ్రాయిలు దేశపు 1957 సంవత్సరపు జనసంఖ్య 19 లక్షలుండగ దానిలో పదిహేడున్నరలక్షలు యూదులు. యూదులు మిగుల భాగ్యవంతులైనందున ఆ దేశములో

పేదలైన అరబుల భూములన్నిటిని ఎంతసామ్మైన నిచ్చి విక్రి యముపొంది స్వాధీనపరచుకొనిరి. ఎదిరించిన అరబులను క్రూరముగ అణచివైచిరి. అరబుల గ్రామములవెంట గ్రామ ములు తగులబెట్టబడెను. తొమ్మిదిలక్షలమంది అరబులు ఆ దేశమునుండి పారిపోయిరి. ప్రక్కనున్న జోర్డాను, లెబ నాన్, సిరియా మొదలైన అరబుదేశములలో ఇపుడు కాందిశీకులుగ నున్నారు. వారు తమ మాతృదేశమైన ఇస్రాయిలుకు వచ్చుటకు యూదులు సుతరాము అంగీకరించరు. వారికి కొంచెముగనో, గొప్పగనో నష్టపరిహారము యివ్వవలసినదే కాని, మరల వచ్చి కాపురముండుటకు వీలులేదు. అంతేకాక ఇజ్రాయిలులోని యూదులు సంపన్నులు, బలవంతులు నైనందున దేశములో వ్యవసాయమును, పరిశ్రమలను అత్యంత ముగ వృద్ధిచేసుకొనిరి. సుస్థిరమైన రాజ్యాంగమును స్థాపించు కొనిరి. సైనికబలమును చక్కగ వృద్ధిచేసుకొనిరి వారికి వెనుక పాశ్చాత్యరాజ్యముల బలము కలదు. ఇస్రాయిలులో తయారయ్యెడు పారిశ్రామికసరకులు దొంగతనముగనో, నిర్లక్ష్యముగనో ప్రక్కనున్న అరబుదేశములలోనికి పోవుట వల్ల అరబుల పరిశ్రమలకుకూడ దెబ్బతగులుచున్నదని అర బులు తలచుచున్నారు. అరబుదేశములన్నియు కలసి ఇజ్రా యిలును నాశనముచేయవలెనని వాంఛించుచున్నవి. కాని అట్టిది జరుగుట అసాధ్యముగనే కన్పించుచున్నది.

## పాలెస్తీన్ యుద్ధము

1948లో ఇజ్రాయిలు ప్రత్యేకముగ నేర్పడగనే

దానిని అణచివేయుటకు ఆరబుజాతులన్నియు దానిమీద యుద్ధమును ప్రకటించినవి.

(4)

## యుద్ధపుఏర్పాట్లలో నిర్లక్ష్యము

పాలెస్తీనులోని అరబుల హక్కులను పునరుద్ధరణ చేయుటకై ఈ యుద్ధము చేయవలసివచ్చినది. 1949 మే నెల 16వ తేదీన ఈజిప్టుసైన్యములు ఇజ్రాయిలుకు తరలినవి. కాని దురదృష్టవశాత్తు సరియైన ఏర్పాట్లులేకుండగనే ఈజిప్టుసైన్యములు యుద్ధములో ప్రవేశించెను. యూదుల కెంత బలము కలదో వారికి బైటనుంచి ఆయుధసామగ్రి సప్లయి ఎంతగా వచ్చునో, అవన్నియు అరబులు తెలుసుకొనలేదు. అరబు దేశములన్నియు కలిసి ఏకసైన్యాధిపత్యముక్రింద నడవలేదు. ఇతర అరబు దేశములు తమ ధర్మమును చక్కగ నెరవేర్చక పోయినచో ఈజిప్టుకు ఎంతభారము మీదపడునో ఆలోచించనేలేదు. ఒకవిధమైన మతోద్రేకముతోను, అరబు అభిమానముతోను మాత్రమే ఈజిప్టు యుద్ధములో పోరాడెను. ఈజిప్టుసేనలు చాలగ నష్టపడెను. సైనికులు, సేనానులు అత్యంతశౌర్యమును ప్రదర్శించిరి. అఖండమైనత్యాగములు చేసిరి. బలిదానములను గావించిరి. ఇటుల ఈజిప్టు సైనికులు యుద్ధభూమిలో వీరస్వర్గము పొందుచున్నకాలములో తమ అనుభవములను పురస్కరించుకొని స్వతంత్ర సేనానాయకులసంఘము (Free Officers Association) ఒకటి స్థాపితమైనది. ఈ సేనానాయకులసంఘసభ్యులు విదేశీయులగు

ఆంగ్లేయసైన్యములను వెడలగొట్టి, ఈజిప్టుకు సంపూర్ణ స్వాతంత్రమును సంపాదించుటకు దీక్ష వహించిరి. దీనికి స్వాతంత్ర సేనానాయకుల క్లబ్బు ( Free Cfficers Club ) ముఖ్యస్థానముగ నుండెను. ఈ యుద్ధములో ఈజిప్టు ఓడి పోయి సైన్యములు మరలివచ్చెను. వృధాగా కోట్లసొమ్ము ఖర్చుపెట్టవలసివచ్చినది. దేశాభిమానులగు ధీరులెందరో మృతిచెందిరి. ధరలెక్కువగుటవలన దేశద్రోహులగు భూఖామందులు వర్తకులు ధనవంతులైరి.

## దేశములోని విషమపరిస్థితులు

1922వ సంవత్సరపు రాజ్యాంగవిధానము అమలులోకి వచ్చినప్పటినుంచియు ఫౌదురాజు, ఆయన కుమారుడగు ఫరూకిరాజు తమ స్వలాభమునకై ఆంగ్లేయులతోకలసి దేశ ద్రోహము గావించుచుండిరి. ప్రజలవల్ల ఎన్నికొనబడిన పార్లమెంటును సరిగా పనిచేయనివ్వకుండిరి. తరచుగ పెద్ద పార్టీవారైన వాఫ్డుపార్టీనాయకులను మంత్రిత్వమునుంచి తొలగించి, పార్లమెంటును రద్దుపరచి, తమ చెప్పుచేతలలో నుండిన మైనారిటీనాయకులచే ప్రభుత్వమును నడిపించుచుం డిరి. ఆంగ్లేయిలతోకుట్రచేయుచు, తమ నిరంకుశాధికార మును స్థాపించుచుండిరి. తమ స్వంతరాజకీయపార్టీని ఇత్తె హాదుపార్టీయనుపేరున లేవదీసిరి. దేశములో ప్రజలకు ఈ రాజులయందు సంపూర్ణమైనద్వేషమే కలిగెను. ఈ రాజులక్రింద గొప్పగొప్ప ఎస్టేట్లుండెను. అట్టి ఎస్టేట్లుగల వారందరిని వీరు బలపర్చిరి. దేశములో భూసంస్కరణములు

జరుగకుండ ఆటంకపరచిరి. పెద్దభూఖామందులు వీరిఅండను చేరిరి. దినదినమునకు ఎక్కువ భాగ్యవంతులగుటకు ఈ రాజ కుటుంబములు సదా ప్రయత్నించెను. వీరిజీవితములు దుర్వ్యాస నములతో, భోగలాలసత్వములతోనిండియుండెను. రాజకుటుం బములోని పురుషులేకాక స్త్రీలుకూడ దుర్వ్యాసనములకు లోనైనవారని చెడుపేరు కలిగియుండిరి. రాజరికము రద్దుపర చిన సమంజసముగనుండునను భావము ప్రజలలో బాగుగ ప్రబలెను. పాలెస్తీనుయుద్ధములో ఆయుధములు సరిగ సప్లయి చేయలేదని, యుద్ధపుఏర్పాట్లు సరిగ జరుగలేదని విచారణ చేయుటకు పార్లమెంటు యత్నించగ ఫరూకిరాజు అడ్డము వచ్చెను. దేశములో అరాజకము, హత్యలు, అల్లరులు ఎక్కువయ్యెను. వాఫ్డుపార్టీ చాలకాలము స్వతంత్రముగ నుండి దేశమును చాలవరకు ముందుకునడపెను. కాని అంతిమదశలో పెద్దభూఖామందులగువారు ఎన్నికలలో విశే షముగ ఖర్చుచేయగలిగినవారు దానిలో సభ్యులుగచేరిపార్ల మెంటుకు దానిపక్షమున సభ్యులుగ ఎన్నుకొనబడినందున సామాన్యప్రజలవిశ్వాసమును గోల్పోయిరి. ఆ పార్టీయొక్క కొంతమంది సామాన్యసభ్యులు లంచగొండితనమునకు లోబ డిరి. నహసుపాషా తనయుద్యోగమును నిలుపుకొనుటకు ఫరూకిరాజుతో స్నేహముచేసి ఆయననుఆశ్రయించుట మొద లుపెట్టినందునకూడ వాఫ్డుపార్టీయందు ప్రజలలో వ్యతిరేక భావము కలిగెను. లిబరలు, ఇత్తేహాదు మొదలైన చిల్లర పార్టీలయందు ప్రజలకు నమ్మకమేలేదు. 1950 లో జరిగిన ఎన్నికలలో వాఫ్డుపార్టీవారే అధికసంఖ్యాకులుగ ఎన్నుకొన

బడి, నహాసుపాషా ప్రధానమంత్రి యయ్యెను. ఆయన ఫరూకి రాజుకు లోబడి నడచుచున్నందున ప్రజలకు ఆశాభంగముకలిగెను. వాఫ్దుపార్టీకి రాజుకు వ్యతిరేకముగ దేశములో పూర్తియైనవిమర్శనలుసాగెను. వారియందువిద్వేషభావములువిద్యార్థికులలోప్రబలెను. వాక్స్వాతంత్ర్యమును, పత్రికాస్వాతంత్ర్యమును అరికట్టునట్టిచట్టములను, అనుమానగ్రస్తులను విచారణ లేకుండ పట్టుకొనుచట్టములను వాఫ్దుపార్టీవారు గావించిరి. రాజకుటుంబమును గురించి చెడువార్తలేమియు ప్రకటించ కూడదని వాఫ్దుపార్టీవారు నిషేధించిరి. రాజుయొక్క సలహాదారుడైన కరీంతాబెటు అనునాయన లంచముపుచ్చుకున్నాడని, అక్రమలాభములను పొందినాడని రుజువుచేయుటకు సెనేటుసభలో కొందరు సభ్యులు తీర్మానములను ప్రవేశపెట్టినపుడు వాఫ్దుపార్టీ వాటిని ప్రతిఘటించెను. రాజకుటుంబముయొక్క చెడుప్రవర్తనను అరికట్టుటకు కొన్ని కొన్ని సాధనములను కొంతమంది సెనేటుసభ్యులు ప్రతిపాదించగ వారిని రాజుగారు సెనేటునుండి వెళ్ళగొట్టుటకు ఉత్తరువులు చేసిరి. వాఫ్దు మంత్రివర్గమువారు ఆ ఉత్తరువులను అమలు పరచిరి. వాఫ్దుపార్టీవారు దేశము నుద్ధరింతురని, సంపూర్ణ స్వతంత్రమును ఈజిప్టుకు కలుగచేతురని నమ్మకము ప్రజలలో పోయెను.

## 1936 ఒడంబడికను రద్దుపరచినట్లు ప్రకటన

ఇట్టిస్థితిలో దేశమునుంచి ఆంగ్లసేనలు తరలిపోవలెనని కోరుతూ వాఫ్దుపార్టీప్రభుత్వము ఇంగ్లండుతో రాజీరాయ

బారములు సాగించెను. ఆ రాజీరాయబారములు 15 నెలలు జరిగినప్పటికి ఏమియు సఫలముకాలేదు. ఈ సంగతి వాఫ్డు ప్రభుత్వము దేశమునకు తెలియజేసి, రాయబారములు ఆపివేసి 1936 వ సంవత్సరపు ఆంగ్లో-ఈజిప్షియన్ ఒడంబడికను రద్దుపరచినామని, సుడానుకుసంబంధించిన ఒడంబడికలన్నీ రద్దుపరచినామని ప్రకటించినది. అంతటితో బ్రిటిషుసేనల మీద వారిని దేశమునుండి వెడలగొట్టుటకై ఈజిప్టుదేశాభిమానులైన ప్రజలు, వాలంటీర్లు ముట్టడులుసాగించిరి. గొరిల్లా పద్ధతులమీద ఈ ముట్టడులుసాగెను. ప్రథమమున కొంత విజయము కలిగెను. కాని సూయజుకాలువవద్ద ఎనుబదివేల మంది బ్రిటిషుసైనికులుండిరి. వాఫ్డుప్రభుత్వము ఈ ముట్టడులకు నాయకత్వమువహించి ఈ గొరిల్లా సైనికులకందరికి తగినంత సహాయము చేసియుండినట్లయిన వారు జయమును పొందియుండెడివారు. కాని ప్రభుత్వమునకు ఏమియు కార్యక్రమము లేక పోయినది. గొరిల్లా వాలంటీరులకు సరియైన ఆయుధములను కాని, క్రమశిక్షణకాని యిచ్చియుండలేదు. వీరిలోచాలమంది బ్రిటిషుసైనికులచేత హతమొనర్పబడిరి. ఈజిప్టుసైన్యములకు కూడ ప్రభుత్వము ఏమియు సలహాయివ్వలేదు. ఈ సైన్యములు పోయి బ్రిటిషువారిని వెడలగొట్టుటకు తగినఏర్పాట్లు చేయలేదు. ఈ సైన్యములను ఒకవైపున యూదులు, రెండవవైపున బ్రిటిషు సైనికులు ముట్టడించిరి. బ్రిటిషుసైన్యములు ఫర్దానువంతెనవద్దకు వచ్చి ఈజిప్టుసైన్యముల నోడించి ఈజిప్టుసేనయొక్క ఆయుధ సామగ్రిని పట్టుకొనిపోయెను. బ్రిటిషుముట్టడిని పోలీసులచేత ఆపుచేయించుటకు ప్రభుత్వము ప్రయత్నించెను. పోలీసులు

బ్రిటిషువారి చేతులలో హతులైరి. ఇట్టి సమయములో ఫరూకి రాజు ఆంగ్లేయులకు స్నేహితుడైన అఫీఫిని తనకు ముఖ్యసలహాదారుగచేసుకొనెను. దానిని వాఫువార్టీ వారు ఆక్షేపించకపోవడమువలనకూడ వాఫ్దుప్రభుత్వమునందు ప్రజలకు ద్వేషము ప్రబలినది. 1936వ సంవత్సరపుఒడంబడికను వాఫ్దుప్రభుత్వము వారురద్దుపరచినారేకాని, సూయజుకాలువవద్దనున్న ఈజిప్టుదేశీయుల మానప్రాణములను రక్షించుటకు ప్రత్యేకప్రయత్నములేవియు చేసియుండలేదు. బ్రిటిషుసైనికులు వారందరిమీద పడగ వారికి శరణ్యములేకపోయెను. బ్రిటిషుసైనికులు వారిని హత్యగావించి కసితీర్చుకున్నారు. ఈజిప్టువాలంటీరులు చూపిన దేశాభిమానము, ధైర్యసాహసములు వర్ణనాతీతము, జాతి గర్వింపదగినవి. సూయజుకాలువనుండి ఇంగ్లీషువారిని వెళ్ళగొట్టుటకు తమ ప్రాణములర్పించిన ధీరులు వారు. ఈ అన్ని యుద్ధములలోను, అల్లరులలోను ఈజిప్టుదేశీయు లోడిపోయినను, అందువలన నిరుత్సాహమేమియు కలుగలేదు. దేశములో స్వతంత్రేచ్ఛ తగ్గలేదు. ఈ గల్లంతులలో నహాసు పాషా రాజీనామానివ్వగ, ఆలి మెహరు అను నాయన ప్రధానమంత్రిగ రాజుచేత నియమింపబడెను. ఆయనచేసిన మొదటిపని సూయజుకాలువప్రాంతమునుండి బ్రిటిషువారితో పోట్లాడుతున్న గొరిల్లావాలంటీరులను తీసివేయడము. ఇంతటితో దేశములో అల్లరులు సాగెను.

## కైరో ప్రజల తిరుగుబాటు

రాజధానియగు కైరోనగరములో ప్రజలు తిరుగుబాట్లు సాగించిరి. అచట అరాజకము సంపూర్ణముగ ప్రబ

లెను. ప్రజలు భవనములకు నిప్పంటించుచుండిరి. విదేశస్తులే గాక దేశస్తులుకూడ ప్రాణములు కోల్పోవుచుండిరి. జీవితా ధారము లేనివారు, రౌడీలు, దేశద్రోహులు, నేరములకు అలవాటైనవారు, అతివాదులు, అందరుకూడ ఆ పట్టణమును దోచుకొనసాగిరి. భవనములను తగులబెట్టసాగిరి. అదివర కెప్పుడును కైరోనగరమున ఇటువంటి దుర్గతి చూడలేదు. దానితో ఈజిప్టుప్రభుత్వముయొక్క, ఈజిప్టుదేశముయొక్క ప్రతిష్ఠ ప్రపంచములో నాశనమైనది. అటువంటిసమయములో దేశమును సంరక్షించగల నాయకుడు కావలసివచ్చెను. ఫరూకిరాజు బయలుదేరి వచ్చి, ఈజిప్టు సైనికోద్యోగులను పిలిపించి తనక్రింద పనిచేయవలెనని కోరెను. దేశాభిమా నులు, యువకులునైన సైనికోద్యోగులందరు దేశముయొక్క దుర్గతికి కారకుడైన ఫరూకిరాజుక్రింద పనిచేయుటకు తిరస్క రించిరి. సైనికోద్యోగుల క్లబ్బుయొక్క ఎన్నికలలో ఫరూకి రాజు జోక్యము కలుగజేసుకొని తన ఇష్టమువచ్చినవారిని నాయకుడుగ ఎన్నుకొనచేయుటకు ప్రయత్నించెను. అది నిష్ఫలమయ్యెను. అపుడు జనరలు హుస్సేను అమీరు అను నాయనను యుద్ధమంత్రిగ చేసెను. ఆయన రాజుకు జోహుకుమ్. అందువల్ల సైనికోద్యోగులకు ఆయనయందు విశ్వాసములేదు. తరువాత 1952 జులైలో యుద్ధమంత్రిగ తన బావమరదియగు ఇస్మాయిలు షెయిన్‌ను నియమించెను. ఆయనయందు సైన్యముల కేమాత్రము విశ్వాసములేదు.

## (4)

## సైనికవిప్లవము

1952 జులై 23వ తేదీన ఈజిప్టు సైన్యములన్నియు ఏక నాయకత్వముక్రింద చేరి, సైనిక ప్రధానకార్యాలయమువద్ద నున్న రేడియోగృహమును స్వాధీనముపొందెను. ఆ వెంటనే అనేకమైన సౌధములను, కచేరీలను లోబరచుకొనెను. ఎక్కడను వారికి అడ్డువచ్చువారు లేకపోయిరి. కొన్ని గంటలలో ఈ సైనికవిప్లవనాయకునిచేత యొక ప్రకటన గావింపబడినది. అందులో ఇట్లు చెప్పబడినది: "ఈజిప్టుయొక్క రాజకీయ చరిత్రలో ఇటీవల కొన్ని సంవత్సరములనుంచి లంచగొండి తనము, అనిశ్చితత్వముతో కూడిన పరిస్థితు లేర్పడినవి. ఇందు వలన సైన్యములో కూడ నిలుకడలేని పరిస్థితు లేర్పడినవి. ఈ లంచగొండులు, అవకాశవాదులు, దేశద్రోహులు పాలస్తీను యుద్ధములో మనము ఓడిపోవుటకు కారకులు. ఆ యుద్ధమునకు పిమ్మట ఈ లంచగొండి బృందమంతయు సైన్యము మీాద కుట్రను ప్రారంభించెను. ఈజిప్టు సైన్యమునందు తమకు లోబడి నడిచే అసమర్థులైన, లంచగొండులైన దేశద్రోహుల నుంచుటకు ప్రయత్నములు జరిగెను. కాబట్టి అటువంటి దేశ ద్రోహులను, లంచగొండులను తీసివేసి, సైన్యములో నీతిని, పవిత్రతను కలుగజేసినాము. సమర్థులైన, నీతివంతులైన, దేశాభిమానులైనవారి నాయకత్వముక్రింద నడచుటకు మేము నిశ్చయించినాము. యావత్తు దేశము ఈ సమాచారమును వినుటకు మిగుల సంతోషించునని మాకు తెలియును.

కొంతమంది సైనికోద్యోగులను చెడుప్రవర్తనక్రింద అరెస్టులో పెట్టినాము. కాని వారిని కొద్దికాలములోనే విడిచిపెట్టెదము. యావత్తుసైన్యము ఈజిప్టుప్రజలకు సేవచేయుటలో సిద్ధముగ నున్నదని, రాజ్యాంగమును రక్షించునని, స్వార్థపరత్వమేమి యు లేవని నేను హామీయిచ్చుచున్నాను. హింసావిధాన మును, దేశద్రోహవిధానమును అవలంబించువారిప్రయత్న ములను సాగకుండ ప్రజలు చేయవలెనని మేము కోరుతు న్నాము. ఈజిప్టులాభముకొరకు మనమందరము కలసి పని చేయవలసియున్నది. దేశద్రోహముచేయువారిని అతికఠినముగ శిక్షించెదమని తెలుపుచున్నాము. సైనికులు పోలీసుతోకూడ సహకరించెదరు. శాంతిని కాపాడెదరు. విదేశస్తులజోలికి పోమని, వారి ప్రాణములను, ఆస్తులను కాపాడెదమని తెలియ చేయుచున్నాము. వారిసంరక్షణబాధ్యత సైన్యమే వహించు చున్నది'' అని ఆ ప్రకటనయందున్నది.

ఈ విస్పష్టమైన, నిర్దుష్టమైనప్రకటన ప్రజలకు సంపూ ర్ణమైనతృప్తిని కలుగచేసెను. అరాజకమునుండి, అశాంతి నుండి అనిశ్చితపరిస్థితులనుండి ఈజిప్టును కాపాడుటకు రక్ష కులు సైనికనాయకులేనని ప్రజలకు తోచినది. 1952 జనవరి నెల 26 వ తేదీనుండి నాలుగు మంత్రివర్గములు మారినవి. వారినందరిని రాజు లోబరచుకొని తనక్రిందికి తెచ్చుకున్నా డు. వారెవరును దేశమును సంరక్షించలేకపోయిరి. రాజు నాయకత్వముక్రింద పెద్ద భూఖామందులు, ధనికులు దేశ ములో నిజమైన అధికారమును వహించియున్నారు. దీనికం తకు నాయకత్వమువహించిన రాజరికమునే కూలద్రోయ

వలసియున్నది. నిస్సహాయులైన ప్రజలు అట్టిపనిని చేయజాలరు. డెబ్బదిసంవత్సరములనుంచి స్వతంత్రముకొరకు పోరాటము జరుగుచున్నను రాజరికము అడ్డువచ్చుచున్నది. రాజకీయపార్టీల వారెవరును దేశమును రక్షించజాలకున్నారు. ప్రజలు ఎన్నితిరుగుబాట్లుచేసినను, అల్లరులుచేసినను, ప్రాణములుపోగొట్టుకున్నను లాభములేకపోయినది. గ్రంథకర్తలు, పత్రికాధిపతులు, వక్తలు రాజుయొక్క, రాజకుటుంబము యొక్క దుశ్చేష్టలను వర్ణించినను లాభములేకపోయినది. పైగా పత్రికాస్వాతంత్రముమీద, ప్రచురణాస్వాతంత్రము మీద నిర్బంధములు చెలరేగినవి. కాబట్టి, ప్రజలఆశలన్నియు సైన్యముమీదనే పెట్టుకొనబడియున్నవి. స్వతంత్రి సైనిక నాయకులఉద్యమముమీదను, వారికల్బుమీదను ప్రజల ఆశలన్నీ కేంద్రీకరింపబడినవి. ఫరూకిరాజు యొక్కభక్తులలను సైన్యములోనుంచి తీసివేయుడమైనది.

## ఫరూకి దేశభ్రష్టుడు గావింపబడెను

పిమ్మట మూడురోజులకు అనగ జులై 26వ తేదీఉదయమున దిగువ అంత్యసందేశము సైనికనాయకునిచేత ఫరూకి రాజుకు అందచేయబడినది :

"దేశములోఏర్పడిన అరాజకమువలన మీ దుష్ప్రవర్తనవలన, రాజ్యాంగవిధానమును మీరు అనేకసార్లు కూలద్రోయుటవలన, ప్రజాభిప్రాయమును మీరు ధిక్కరించుటవలన దేశముయొక్కయు, దేశములోని ప్రతివ్యక్తియొక్కయు భద్రత, ప్రాణము, గౌరవము, ఆస్తి అపాయస్థితిలోనికి వచ్చి

నవి. మీ చెడుప్రవర్తనవలన ఈజిప్టుయొక్క మంచిపేరు ప్రపంచములో పడిపోయినది. దేశద్రోహులు, లంచగొండులు మీ సంరక్షణను పొందినారు. మీ ప్రోత్సాహమువల్ల బాగు పడినారు. ప్రజలు రోజురోజుకు ఎక్కువ దరిద్రము ననుభవించు చుండగ మీ చుట్టునున్నవారు ఎక్కువ ధనవంతులైనారు. పాలస్తీనుయుద్ధము మీ చెడుప్రవర్తనకు ఉదాహరణము. సరిగా ఆయుధములు సప్లయి కాలేదు. అందువిషయమైజరిగిన విచారణలో మీరు జోక్యముపుచ్చుకొని ఆపివేసినారు. ఎవ రును బైటపడకుండచేసినారు. సైన్యమునందు ప్రజలయొక్క నమ్మకమును చెడగొట్టయత్నించినారు. ఎక్కువధనమును సంపాదించుచున్నటువంటి, దేశమును దోచుకొనుచున్నటు వంటి దేశద్రోహులకు మీ సహాయము ఎక్కువగ కలిగినది. కాబట్టి ప్రజలప్రతినిధిగ ప్రవర్తించుచున్న సైన్యపక్షమున, మీరు ఈరోజున మధ్యాహ్నము 12గంటలలోగా రాజ్యమును త్యజించి, మీ కుమారుడైన అహ్మదు ఫౌదు రాకుమారుని రాజుగచేయవలెనని మిమ్ములను కోరడమైనది. మీరు ఈ సాయంత్రమే ఆరుగంటలలోపుగ దేశమును విడిచివెళ్ళవలెనని కూడ కోరడమైనది. ప్రజల ఉద్దేశ్యములకు మీరు లోబడక పోయినచో, దానివల్లకలిగెడుఫలితములకు మీరేబాధ్యులు." అని ఆ అంత్యసందేశములో నున్నది. నిర్ణయమైనకాలమునకు ఫరూకిరాజు దేశమునువిడిచిపెట్టి వెళ్లెను.

## కల్నల్ నాసర్

ఈ సైనికవిప్లవమునకంతకును నాయకుడు కల్నల్

నాసర్ అయియున్నాడు. ఆయన 1918 జనవరి 10వ తేదీన ఈజిప్టుదేశములోని యొక సామాన్య మధ్యమతరగతికుటుంబమునందు జన్మించెను. విద్యార్థిగనున్నపుడే దేశపరిస్థితులను గూర్చి సదా ఆలోచించుచు, దేశమునందు ప్రబలియున్న విభేదములను, దేశద్రోహములను గూర్చి విచారించుచు, అన్నితరగతులవారు ఐక్యతతో ప్రవర్తించి, విదేశస్తులైన ఆంగ్లేయులను వెళ్ళగొట్టవలెనని యుత్సాహమును ప్రదర్శించుచుండెను. మహాపురుషుల జీవితములను, రాజకీయగ్రంథములను, ఫ్రెంచి, అమెరికా, రష్యను, చైనా, తురుష్కము, ఇండియా మొదలైన దేశములస్వతంత్రవిప్లవములనుగూర్చి జాగ్రత్తగచదివిన గొప్ప విజ్ఞానవంతుడు; చాల ధైర్యశాలి; గొప్పదేశాభిమాని; శీలసంపన్నుడు. స్టాఫ్ కాలేజిలో అన్నిపరీక్షలలో ప్రథముడుగ నుత్తీర్ణుడై, సైన్యమునందు చేరెను. సమర్థతవల్లను, యోగ్యతవల్లను పైకివచ్చి, అందరిమన్ననలను పొందినవాడు. పెద్ద భూస్వామందువర్గములను తీసివైచి రైతులకు, కార్మికులకు సహాయముచేసి సోషలిస్టుసమాజస్థాపనను గావించవలెనని ఉద్దేశ్యము కలిగినవాడు. సంపూర్ణప్రజాస్వామికము (రిపబ్లికు) స్థాపించవలెనని ఆదర్శముకలవాడు. కమ్యూనిజమునందు ఇష్టములేనివాడు. కమ్యూనిస్టుల నియంతృత్వమునకు, హింసాకాండకు, నాస్తికత్వమునకు కేవలము వ్యతిరేకి మహాత్మా గాంధి, పండిత జవహర్‌లాల్ నెహ్రూ మొదలగు భారతదేశ నాయకుల యందు ఎక్కువ గౌరవముకలవాడు. ఆయన సాగించిన విప్లవములో తురుష్కవిప్లవమువలె పాశ్చాత్యులను అనుక

రించవలెననుభావము లేదు. ఇస్లాముమతమునందే ఆయన కెక్కువ నమ్మకమున్నది. ఆ మతములో చెప్పబడిన దాన ధర్మముల సిద్ధాంతములోనే సోషలిస్టుసమాజస్థాపనకు, ఆర్థిక సమానత్వమునకు బీజములు కలవని ఆయనయుద్దేశ్యము. అందువల్ల తనవిప్లవములో ఈజిప్టుకు రాజ్యాంగమతముగ ఇస్లామును చేసినాడు. అరబ్బిభాషయందు, అరబువిజ్ఞానము నందు ఆయన కెక్కువ అభిమానము కలదు. తురుష్కములో వలె అరబుఅక్షరములను తీసివేసి, రోమకలిపిని పెట్టుటకు ఆయన అంగీకరించలేదు. అరబ్బిలిపినే ఖాయపరచెను. అరబు జాతీయతత్వమును బలపరచెను. అరబుదేశములన్నియు ఐక మత్యముగనుండవలెనని ఆయన ఆశయము. యూదులదేశ మైన ఇస్రాయిలు అరబులకందరికి అపాయముగనున్నదని ఆయనభావము. ముఖ్యముగ యువకులైన ఈజిప్టుసైనికోద్యోగు లలో జాతీయతత్వమును, దేశమును విదేశీయులసామ్రాజ్యమునుండి పూర్తిగ విముక్తిచేసి, స్వతంత్రము స్థాపించవలె నను దృఢదీక్షను కలుగచేసెను. స్వతంత్రసైనికబృందము నేర్పరచి, దానికి స్వతంత్రసైనికక్లబ్బును ముఖ్యకార్యస్థాన ముగ గావించెను. వెంటనే రాజరికమును పూర్తిగ రద్దు పరచక దేశములో కొంచెము స్థిమితమేర్పడినపిమ్మట దానిని రద్దుపరచి రిపబ్లికుప్రభుత్వమును స్థాపించదలచెను.

ఫరూకిరాజు రాజ్యమును త్యజించి దేశమును వదలి పెట్టి పోవుటతోడనే ఆయనయొక్క మైనరుకుమారుడగు రెండవ ఫౌదు అహ్మదును రాజుగనేర్పరచి ఆగస్టునెలలో (కౌన్సిల్ ఆఫ్ రీజియన్సీ) రాజ్య సంరక్షకసంఘము నేర్పాటు

చేసి అలీ మెహార్ అనునాయనను ప్రధానమంత్రిగ గావించిరి. కాని ఈ ఏర్పాట్లతో వాఫ్డు మొదలైన రాజకీయపార్టీలు సహకారముసలుపనందున సెప్టెంబరు 7వ తేదీన అలీ మెహార్ రాజీనామానిచ్చెను. జనరలు నజీబు అను సేనానిని ప్రధాన మంత్రిగగావించి ఒక కొత్తమంత్రివర్గము నేర్పాటుచేసిరి.

(5)

## రాజరికము రద్దుపర్చబడి ఈజిప్టు రిపబ్లికు అయ్యెను

పిమ్మట పాతరాజ్యాంగముతో పనిచేయుట కష్టమని తోచి, రీజియన్సికౌన్సిలును విప్లవకమిటీవారు అక్టోబరులో రద్దుపరచిరి. 1953 జూన్ 18వ తేదీన ఈజిప్టులో రాజరికమును పూర్తిగ రద్దుపరచి, ఈజిప్టును సంపూర్ణ ప్రజాస్వామ్యముగ (రిపబ్లికుగ) ప్రకటించిరి. సామ్రాజ్యతత్వమును, దానికిఅంగముగనున్నసంస్థలను రద్దుపరచుట ఈ విప్లవముయొక్క ప్రధానోద్దేశ్యమై యున్నది. అందువలన 1952 జూలై 26వ తేదీన ఫరూకిరాజును సింహాసనభ్రష్టునిగావించి దేశమునుంచి వెడలగొట్టడమైనది. పిమ్మట దేశములోని రాజకీయపార్టీలనురద్దుపరచడమైనది. కాని అభివృద్ధినిరోధకశక్తులు కొన్ని ఇంకను రాజరికముచాటున దాగుకొని తలఎత్తుటకు ప్రయత్నించుచున్నందున రాజరికమును పూర్తిగ రద్దుచేయుటకు తీర్మానించబడినది. ... పూర్వమునుంచి ఈజిప్టులోని మహమ్మదాలీవంశమునకు చెందిన రాజరికము దేశమునకు అన్నివిధముల నష్టమే గావించెను. ఇస్మాయిలుపాషాయొక్క దుర్వ్యాసనములు, దుర్వ్యయము దేశమునుఋణగ్రస్తముచేయుట, ఈజిప్టు గౌరవమునకు భంగముకలుగచేసి ఆర్థికపతనమును కలుగచేసి

సామ్రాజ్యవాదులయాజమాన్యముక్రిందికి ఈజిప్టును తెచ్చినవి. తరువాతవచ్చిన ట్యుఫికురాజు దేశమున కెంతయో ద్రోహము గావించినాడు. సామ్రాజ్యవాదులచేతులలో కీలుబొమ్మఅయి నాడు. ఈజిప్టు ఆంగ్లపాలనముక్రిందికి వచ్చినది. ఆంగ్లేయులు, ఈజిప్టురాజులు కలిసి అప్పటినుంచి ఈజిప్టుస్వతంత్రమునకు అడ్డుతగిలి ఎన్నియో అపకారములుచేసినారు. ఈ రాజరికము వలన ఈజిప్టుకు కలిగినలాభము లేశమాత్రము లేకుండెను. దుర్వ్యసనములలో, నిరంకుశత్వములో, ధనమునార్జించుటలో ఫరూకిరాజు తన పూర్వులనందరిని మించియున్నాడు. కనుక రాజరికమును పూర్తిగ రద్దుపరచవలసినసమయము వచ్చినది. కావున (1) ప్రజల పేరిట ప్రజలపక్షమున, ఈజిప్టుదేశములో రాజరికమును పూర్తిగ రద్దుపరచుచున్నామని, మహమ్మ దాలీవంశీకులైనరాజులను పూర్తిగ తీసివేసినామని, ఆ కుటుం బమునకున్న రాజగౌరవచిహ్నములన్నియు రద్దుపరచినామని ప్రకటించుచున్నాము, (2) ఈజిప్టు సంపూర్ణప్రజాస్వామ్య మైనది, అనగ రిపబ్లికు అయినది. దానిమీాద ఇప్పుడు ప్రధాన మంత్రిగపనిచేయుచున్న జనరలు మహమ్మద్ నజీబును అధ్యక్షునిగ చేసినాము. ఇది తాత్కాలిక రాజ్యాంగవిధా నము. (3) ఈ తాత్కాలిక రాజ్యాంగవిధానమును వీలైనంత త్వరగ రద్దుపరచి ప్రజలుకోరిన సంపూర్ణప్రజాస్వామ్యవిధా నము నేర్పాటుచేతుమని ప్రకటించుచున్నాము. అపుడు ప్రజలు నూతన శాశ్వతమైన రాజ్యాంగవిధానముప్రకారము తమ అధ్యక్షుని ఎన్నుకొనెదరు. కనుక భగవంతునియందు

విశ్వాసముతో ప్రజలయందుగల అత్యంతమైన నమ్మకముతో ఈ సంపూర్ణ ప్రజాస్వామ్యస్థాపనవల్ల ఈజిప్టుదేశమునకు మహోన్నతమైన దశ కలుగుననుఆశతో మేము ఈ ప్రకటన చేయుచున్నాము" అని ఆ ప్రకటనయందున్నది.

జనరలు నజీబు ఈజిప్టు ప్రజాస్వామ్యమునకు అధ్యక్షుడు ప్రధానమంత్రి అయ్యెను. 1952 డిశెంబరు 10 తేదీన పాత రాజ్యాంగము రద్దుపరచబడెను. క్రొత్త రాజ్యాంగము త్వరలో వచ్చునని ప్రకటించబడెను. 1953 జనవరి 16వ తేదీన రాజకీయపార్టీలన్నియు రద్దుపరచబడి నిషేధించబడినవి.

## కల్నలు నాసరు అధ్యక్షుడు, ప్రధానమంత్రి

1956 జనవరివరకు మూడుసంవత్సరములకాలమువరకు తాత్కాలికముగ రాజ్యాంగము అమలులోనుండును. అప్పటికి ఎన్నికలుపెట్టి సరియైన శాశ్వతరాజ్యాంగవిధానము అమలులో పెట్టబడునని ప్రకటించబడెను. 195' జనవరిలోనే ముస్లిముబ్రదర్‌హుడ్ అను సంఘమును రద్దుపరచిరి. దాని ప్రధాననాయకుడైన ఆల్ హు దేబి అనునాయనను అరెస్టు చేసిరి. ఈ సంఘము పూ ర్తిగ అణచివేయబడెను. 1953 లో జనరలు నజీబును ప్రధానమంత్రిత్వమునుంచి తొలగించి, కల్నల్ నాసర్ ప్రధానమంత్రిపదవిని స్వీకరించెను. జనరలు నజీబు పిమ్మట కొలదికాలము అధ్యక్షుడుగమాత్ర ముండెను. గాని ఆ సంవత్సరము అక్టోబరు నెలలో ముస్లిముబ్రదర్‌హుడ్ సంఘమునకు చెందిన ఒకసభ్యుడు కల్నల్ నాసరును హత్య

గావింపవలెనని ప్రయత్నించెను. పోలీసువారు ఆ సంఘము యొక్క కార్యాలయమును వెదకి, కొన్ని కాగితములను పట్టుకొనిరి. అందువల్ల ఆ సంఘమువారు కల్నల్ నాసర్ యొక్క సైనికరాజ్యాంగమును పడగొట్టి, తాము రావలెనని ప్రయత్నముచేసినట్లు కనపడెను. కాని వారు హత్యగావింపదలచిన వారిలో జనరలు నజీబును మినహాయించిరి. జనరలు నజీబు వారికి కొంత ఇష్టుడని తేలినది. అంతేగాక విప్లవకమిటీకి వ్యతిరేకముగనున్నవారిలో కొందరిని జైళ్ళలోనుంచి ఆయన విడుదలచేసెను. అందువల్ల నవంబరు 14 వ తేదీన జనరలు నజీబును అధ్యక్షపదవినుంచికూడ తీసివేసిరి. కొంతకాలము అరెస్టులోనుంచి విడుదలచేసిరి. ఇటీవల ఆయన కాలధర్మము నొందెను. అప్పటినుంచి ఈజిప్టురాజ్యాంగమునకు కల్నల్ నాసరే అధ్యక్షుడుగను, ప్రధానమంత్రిగను నున్నాడు.

## సుడానుకు జనవాక్యాధికారము

కల్నల్ నాసర్ సుడానుదేశము ఈజిప్టుతో కలసి యుండవలెనని పట్టుపట్టదలచలేదు. 1953 ఫిబ్రవరి 12 వ తేదీన ఈజిప్టుమీద ఆంగ్లో-ఈజిప్షియను సమిష్టిఅధికారము రద్దు పరచబడినది. కాని సుడాను ఈజిప్టుతో కలిసియుండవలెనా, లేక విడిగా నుండవలెనా అనువిషయమై సుడానుప్రజలు జనవాక్యము తమఓట్ల మూలమున తేల్చుకొనునట్లు అధికారమివ్వబడెను. ఇందుకు ఆంగ్లేయులుకూడ ఒప్పుకొనిరి.

## బ్రిటిషుసేనలు లేచిపోయినవి

ఈ సైనికవిప్లవమువల్ల దేశములో పూర్తిగ శాంతి ఏర్పడినది. రాజకీయఐక్యత కలిగినది. వర్గములు, అంతఃకల

హాములు నశించినవి. యావత్తుదేశము కల్నల్ నాసరును ఏకైకనాయకునిగ అంగీకరించినది. ప్రజలు ఈ కొత్త రాజ్యాంగమునందు మిగుల ఉత్సాహముకలిగియున్నారు. ఎట్టి హింసాకాండకాని, అల్లరులుకాని లేకుండ విప్లవము జరిగి, సంపూర్ణజయమును పొందినది. ఇందువల్ల ఆంగ్లేయులకు ఈజిప్టులో నుండజాలమని భయముకలిగినది. సైనికవిప్లవ ప్రభుత్వముతో రాజీపడుటతప్ప వారికి వేరు శరణ్యములేక పోయెను. అటులగావించనిచో సైనికప్రభుత్వనాయకత్వము క్రింద ఈజిప్టుప్రజలు, వాలంటీరులు, గొరిల్లాలు, బ్రిటిషువారిని సూయజుకాలువవద్ద నుండనివ్వరు అని గ్రహించి, బ్రిటిషువారు 1954 అక్టోబరు 19వ తేదీన కల్నల్ నాసర్‌తో రాజీపడిరి. సూయజుకాలువప్రాంతమును ఈజిప్టుకు ఇచ్చివేయుటకును, 20 నెలలలో బ్రిటిషుసైన్యములన్నియు ఈజిప్టునుండియు, సూయజుకాలువప్రాంతమునుండియు పూర్తిగ లేచిపోవునట్లును ఆ ఒడంబడికలో ఈజిప్టు ఆంగ్లేయప్రభుత్వములు దస్కతు చేసుకొన్నవి. ఆ ఒడంబడిక అమలుజరిగినది. 1956 జూన్ 13వ తేదీన ఆఖరు బ్రిటిషుసైన్యములు ఈజిప్టునుండి లేచిపోయినవి.

## ఈజిప్టుకు సంపూర్ణ స్వాతంత్ర్యము

అంతటితో విదేశసైన్యములు లేమియు ఈజిప్టులో లేవు. విదేశస్తుల అధికారము, యాజమాన్యము, పలుకుబడి ఈజిప్టు మీద పూర్తిగ అంతరించినవి. ఈజిప్టు నిజమైన సార్వభౌమత్వముగల సంపూర్ణస్వతంత్రముగల ప్రజాస్వామికమయ్యెను. ఇది స్వతంత్రపోరాటపుచరిత్రలో తుదిఘట్టము.

# ఈజిప్టుదేశ చరిత్ర

## పదవ అధ్యాయము

### స్వతంత్ర ఈజిప్టు

### (1)

### నూతన రాజ్యాంగవిధానము

1950 వ సంవత్సరము జనవరి 16 వ తేదీన నాసర్ ప్రభుత్వముచేత నొక నూతన శాశ్వత రాజ్యాంగవిధానము తయారుచేయబడి, 1956 జూను 23 వ తేదీన ఈజిప్టుప్రజల జనవాక్యసమ్మతి (referend m) కొరకుపెట్టబడినది. నూటికి 99 మంది ఓటరులచేత అంగీకరింపబడి ఖాయపరచబడినది. ఆ రాజ్యాంగ ప్రకారము 1957 జూను నెలలో (శాసనసభకు) నేషనల్ ఎసెంబ్లీకి ఎన్నికలుపెట్టబడినవి. నేషనల్ ఎసెంబ్లీ ప్రథమసమావేశము జూలై 26 వ తేదీన కైరోనగరమున ప్రారంభమైనది. ఎన్నికలలో రిపబ్లికు (ప్రజాస్వామ్యమునకు) అధ్యక్షుడుగ గెమాల్ అబ్దెల్ నాసర్ ఏకగ్రీవముగ ఎన్నుకొనబడినాడు. 18 మంత్రులుగల మంత్రివర్గమును ఏర్పాటు చేసినాడు. అందులో తాను ప్రధానమంత్రిత్వమునుకూడ స్వీకరించినాడు. ఈ ఎన్నికలలో నేషనల్ఎసెంబ్లీకి కొందరు

స్త్రీలుకూడ సభ్యురాండ్రుగ నెన్నుకొనబడిరి. రాజ్యాంగ విధానముయొక్క ఉపోద్ఘాతమునందు ఇట్లున్నది: "ఈజిప్టు ప్రజలు సామ్రాజ్యతత్వమును అన్నిరూపములలోను అంత రింపచేయదలచినారు. జమీందారీపద్ధతి రద్దుపరచబడును. ధనికవర్గము తీసివేయబడును. ప్రత్యేకహక్కు లెవరికిని లేకుండ చేయబడును. బలవత్తరమైన సైన్య మేర్పాటుచేయబడును. ప్రజలందరిమధ్య సాంఘికన్యాయము కలుగచేయబడును. భావ స్వాతంత్ర్యము, పత్రికాస్వాతంత్ర్యము, వాక్స్వాతంత్ర్యము, సభాస్వాతంత్ర్యము, మతస్వేచ్ఛ ఏర్పాటుచేయబడును. సౌష్ఠవమైన డెమోక్రెసీ (ప్రజారాజ్యము) స్థాపింపబడును. ఇంతే గాక ఈజిప్టుదేశము అరబ్బుప్రపంచములో నొకభాగము కాబట్టి, అరబ్బుజాతిఆత్మగౌరవముకొరకు, ఉన్నతికొరకు అరబ్బుప్రజలు గావించు పోరాటములో ఈజిప్టు తన బాధ్యతను నిర్వర్తించగలదు" అని చెప్పబడియున్నది. మొదటి ఆర్టికిలులో "ఈజిప్టు సంపూర్ణస్వతంత్రముగల, సార్వభౌమాధికారముగల అరబ్బురాజ్యమైయున్నది. డెమోక్రాటిక్ రిపబ్లికు అనగ సంపూర్ణప్రజాస్వామ్యమైన ప్రజారాజ్యమైయున్నది. ఈజిప్టుప్రజలు అరబ్బుజాతిలో భాగమైయున్నారు" అని చెప్పబడినది. రెండవ ఆర్టికిలులో "రాజ్యాంగవిధాన ప్రకారమే సమస్తాధికారములు చెలాయింపబడవలసియున్నది" అనియు, మూడవఆర్టికిలులో "ప్రభుత్వమతము ఇస్లాము" "ప్రభుత్వభాష అరబ్బి" అనియు చెప్పబడినవి. మిగతా ఆర్టికిలులలో ప్రాథమికహక్కులన్నియు ప్రజారాజ్యపద్ధతినే ప్రకటించబడినవి. స్వతంత్రము సమానత్వము నీతిమీదను మత

ధర్మముమీదను దేశాభిమానముమీదనునిర్మింపబడెడుకుటుం బజీవనము, సాంఘిక న్యాయము; ప్రజలజీవనోపాధి; ఎక్కువ ఉత్పత్తి, వ్యక్తులస్వంతఆస్తులరక్షణము; భూసంస్కరణలు; సహకారపద్ధతి విశదీకరింపబడినవి.” ప్రతిపౌరునికి అవసరమైన భోజనము, బట్ట, గృహావసతి, ఆరోగ్యము, విద్య, సాంఘిక సదుపాయములు వీటికి హక్కుకలదని చెప్పబడినది. ప్రత్యేక హక్కులన్నియు బిరుదులన్నియు రద్దుపరచబడినవి. కులమత విచక్షణలేకుండ పౌరులకందరికి సమానహక్కు బాధ్యతలు కలుగచేయబడినవి. చట్టప్రకారమే పౌరులకు శిక్షవిధించ వలెను కాని, చట్టమునతిక్రమించి విధించకూడదు. న్యాయ స్థానములో నేరస్తుడు తనపక్షమున వాదించుకొనుటకుహక్కు కలుగచేయబడినది. సంపూర్ణమైన మతస్వేచ్ఛ కలదు. సభలుచేయుటకు హక్కుకలదు. ప్రాథమికవిద్య నిర్బంధము చేయబడినది. యావత్తువిద్య ఉచితముగ చెప్పబడును. పనికి తగినవేతన మివ్వబడును. కార్మికులు సంఘములు పెట్టుకొన వచ్చును. కార్మికుల కుపయోగకరమైన చట్టములు చేయ బడును. సైనికకొలువు నిర్బంధమైనది. ప్రతిపురుషునికి, స్త్రీకి ఓటుహక్కు కలదు; ఈ మొదలైన ప్రాథమికహక్కులు కలుగచేయబడినవి. ఈజిప్టురిపబ్లికుకు రాజ్యాంగవిధానము చొప్పున ఎన్నుకొనబడిన అధ్యక్షుడుండును. ఒకేపార్ల మెంటు (శాసనసభ) కలదు. దానికి నేషనల్ ఎసెంబ్లీ అని పేరు. ఓటరులు రహస్యవిధముగ ఓటుచేసి సభ్యుల నెన్ను కొనవలెను. సభ్యునిగ నెన్నుకొనబడువానికి 30 సంవత్సర ములవయస్సుకు తక్కువ ఉండరాదు. అయిదుసంవత్సర

ములకొకసారి ఎసెంబ్లీ ఎన్నుకొనబడును. ఎసెంబ్లీ సమావేశములు రాజధానియగు కెయిరోనగరమందు జరుగవలెను. మరి ఎచట జరిగినను చెల్లవు. సభ్యులు ప్రజాస్వామ్యమునకు (రిపబ్లికుకు) భక్తిగలిగియుందుమని ప్రమాణము చేయవలెను. ఎసెంబ్లీ దానిసభాచర్యలను నడుపుటకై ఒక సభాపతిని, ఇద్దరు ఉపసభాపతులను మొదటిసమావేశమునందే ఎన్నుకొనును. ఎసెంబ్లీయొక్క సమావేశములన్నీ బహిరంగముగ జరుగును. ఎప్పుడైనను రహస్యముగకూడ జరుగుటకు సభాపతిగాని, ప్రభుత్వముగాని ఏర్పాటుచేయవచ్చును. ప్రతి (బిల్లు) చిత్తు చట్టము, తీర్మానము, చర్చాంశము ఒక కమిషను (ఉపసంఘము) ఎదుటపెట్టి వారు అంగీకరించినపిమ్మట ఎసెంబ్లీఎదుటికి వచ్చును. ఆ కమిషనును ఎసెంబ్లీవారే ఎన్నుకొనెదరు. ఎసెంబ్లీలో నిరాకరింపబడినబిల్లు అదేసెషనులో మరల చర్చించుటకు వీలులేదు. పన్నులవిధానము ఎసెంబ్లీవల్లనే మార్పుచెందవలెను. ఆదాయవ్యయపట్టికలు ఎసెంబ్లీ మంజూరుచేయును. ఎసెంబ్లీలో సభ్యులిచ్చిన ఉపన్యాసములకు, తెలిపిన అభిప్రాయములకు, ఏ కోర్టు (న్యాయస్థానము) వారు జోక్యముపుచ్చుకొనుటకు వీలులేదు. ఎసెంబ్లీని రద్దుపరచుటకు రిపబ్లికు అధ్యక్షుడికి అధికారముకలదు. ఒకేకారణముచేత రెండవసారి రద్దుపరచుటకు వీలులేదు. రద్దుపరచిన 60 రోజులలో క్రొత్తఎన్నికలు జరిగితీరవలెను. మంత్రులమీద విశ్వాసరాహిత్య తీర్మానము సభ్యులలో ఎక్కువమందిచేత మంజూరుకావలెను. రిపబ్లికు అధ్యక్షుడు ఆయన తల్లిదండ్రులు ఈజిప్టుదేశమువారై యుండవలెను.

35 సంవత్సరములవయసు నిండినవాడైయుండవలెను. అసెంబ్లీలో సభ్యులయొక్క (మెజారిటి) అధికసంఖ్యాకులవల్ల అధ్యక్షుడుగ నిలువవలసినఅభ్యర్థి ఎన్నుకొనబడి జనవాక్యమునకు ఆ ఎన్నిక పంపబడును. జనవాక్యములో ఓటరులలో అధిక సంఖ్యాకులవల్ల ఆయన ఎన్నుకొనబడును. అధ్యక్షుని కాల పరిమితి ఆరు సంవత్సరములు. రిపబ్లికుకు భక్తితోనుందునని ఆయన ప్రమాణముచేయవలెను. ఎసెంబ్లీలో రెండువంతుల మంది సభ్యులు ఓటుచేసి అధ్యక్షుని తీసివేయవచ్చును. ఎసెంబ్లీ ఆమోదించిన ఏ బిల్లునైనను ముప్పదిదినములలోపల అధ్యక్షుడు అంగీకరింపక త్రిపివేయవచ్చును. అటుల త్రిప్పివేసిన బిల్లు మరల ఎసెంబ్లీలో మూడింట రెండువంతులమందిచేత అంగీకరింపబడినయెడల అది చట్టమగును. అధ్యక్షుడే సర్వసేనాధ్యక్షుడైయున్నాడు. ఆయనే ప్రధానోద్యోగస్తులను నియమించును; తీసివేయును. నేరస్తులకు క్షమాపణనివ్వవచ్చును. యుద్ధము, సంధి ఎసెంబ్లీయొక్క ఒప్పుదలకు లోబడియే అధ్యక్షుడు చేయవలయును. అత్యావసరపరిస్థితులేర్పడినప్పుడు ప్రెసిడెంటు ఆర్డినెన్సులను (ప్రత్యేకశాసనములను) చేసి, ఎసెంబ్లీఎదుట పెట్టవలెను. ప్రతి మంత్రి ఈజిప్టు దేశీయుడైయుండవలెను. 30 సంవత్సరములకంటె తక్కువ వయసుకలవాడుగ నుండకూడదు. ఏ మంత్రియైనను అధ్యక్షునిచేత తొలగింపబడవచ్చును. లేదా ఎసెంబ్లీవల్ల తీసివేయబడవచ్చును. స్థానికస్వపరిపాలనవిషయమునకూడ రాజ్యాంగములో నిబంధనలు కలవు. జిల్లాసంఘములు, మునిసిపలు సంఘములు ఏర్పాటుచేయబడినవి. అధ్యక్షునిక్రింద సర్వ

సేనాధిపతి పనిచేయును. ఆయనే యుద్ధమంత్రిగకూడ నియమింపబడవచ్చును. న్యాయాధిపతులు స్వతంత్రులుగ చేయబడినారు. ఈజిప్టురాజధాని కెయిరోనగరము. జాతీయజెండా యొక్క రంగులు తెలుపబడినవి. ఏ చట్టమైనను గెజెటులో ప్రచురింపబడిన 10 రోజులతరువాత అమలులోనికివచ్చును. అధ్యక్షునియొక్కకాని, ఎసెంబ్లీసభ్యులలో మూడవవంతు సభ్యులయొక్కకాని కోరికమీాద రాజ్యాంగవిధానమును మార్పుచేయుటనుగూర్చి ఆలోచించబడవచ్చును. కాని ఎసెంబ్లీలో మూడింట రెండువంతులమంది ఆమోదముతో మార్పులను చేయవలెను. అట్టిమార్పులు జనవాక్యమునకు పంపబడవలెను. ఇదివరకు చేయబడిన చట్టములన్ని అమలులో నుండును. కాని వాటిని ఎసెంబ్లీవారు మార్చవచ్చును. ఎసెంబ్లీలో మూడింట రెండువంతులుమంది అంగీకరించిన చట్టప్రకారమే రాజకీయపార్టీలు ఏర్పడవలయును. ఈ రాజ్యాంగవిధానము దాదాపుగా మామూలు ప్రజారాజ్యములపద్ధతినే యున్నది. కమ్యూనిస్టుపద్ధతిన లేదు. తమ యొక్క యుద్దేశ్యము ఈజిప్టును సోషలిస్టు డెమొక్రెసి (సాంఘికతత్వమునవలంబించెడి ప్రజారాజ్యము)గ చేయవలయుననియేనని అధ్యక్షుడైన కల్నల్ నాసర్ అనేకసార్లు చెప్పియున్నాడు. అందుకు అనుగుణముగనే రాజ్యాంగ విధానము చేయబడ్డది.

(2)

## భూసంస్కరణములు

1952 జూలైలో ఈజిప్టులో సైనికవిప్లవము జరిగిన వెం

టనే భూసంస్కరణములను ఈజిప్టు సైనికప్రభుత్వము ప్రవేశ పెట్టినది. 1952అక్టోబరులో భూసంస్కరణచట్టముము మంజూరైనది. ఈజిప్టులోని 60 లక్షలఎకరముల వ్యవసాయభూములలో నూటికి 37 వంతులు కొద్దిమంది పెద్ద భూఖామందుల క్రింద నుండెను. ఇందులో ఒకలక్ష ఎనుబది వేలయకరముల భూమి రాజకుటుంబముక్రింద నుండెను. 12 లక్షల 50 వేలమంది రైతులకు ఒక్కొక్కఎకరముకంటె తక్కువకలదు. 25 లక్షలమంది భూములులేని వ్యవసాయకూలీలుగ కాని, ఇతరులవద్ద కౌలుదారులుగ కాని జీవించుచున్నారు. అందువల్ల ఎవరికిని రెండువందలఎకరములకంటె ఎక్కువభూమి యుండకూడదని ఈ భూసంస్కరణశాసనములో చెప్పబడినది. రాజకుటుంబమునుంచి ఇతరభూఖామందులవద్దనుంచిసుమారు ఆరులక్షలఎకరములు కొంత నష్టపరిహారమిచ్చి ప్రభుత్వము స్వాధీనపరచుకొని భూములులేనివారికి పంచిపెట్టినది. వ్యవసాయకూలీల కనీసకూలికూడ నిర్ణయించపడ్డది. కౌలుభూమికి దానిమీద సర్కారుకు చెల్లించుశిస్తుకు ఏడురెట్లమొత్తము మాత్రమే భూఖామందుకు కౌలుదారుడు చెల్లించవలెను. వ్యవసాయకూలీలు సంఘములుపెట్టుకొనుటకు, తమ హక్కులను కాపాడుకొనుటకు అనుమతివ్వబడినది. ఈ భూసంస్కరణములతోపాటు నైలునదిమీద అతిగొప్పదైన ఆస్వానుఆనకట్టను నిర్మాణముచేయుటకుకూడ నాసర్ప్రభుత్వము ప్రయత్నముచేయుచున్నది. ఈజిప్టురైతాంగమునకు ఇవి మిక్కిలి ఉపయోగకరమైనకార్యములైయున్నవి. రైతాంగమంతయు

(ఫెల్లాహీనులు) కల్నల్ నాసరుప్రభుత్వమునందు భక్తిగౌరవ ములను కలిగియున్నారు.

## అస్వానువద్ద గొప్ప ఆనకట్ట

ఈజిప్టుదేశముయొక్క వైశాల్యము 3 లక్షల 86 వేల 198 చదరపుమైళ్ళు. కాని ఇందులో షుమారు 14 వేల చదరపుమైళ్ళలోనే బస్తీలు, గ్రామములు ఉన్నవి. ప్రజలు వాటిలోనే నివసించుచున్నారు. మిగిలిన ప్రాంతమంతయు చాలవరకు ఎడారులతోను, కొంతప్రాంతము నీళ్ళునిలిచే లోయలతోనూ నిండియున్నది. ఎడారిప్రాంతమును కొంత భాగము బాగుచేసి అతిత్వరితముగ పెరుగుచున్న ప్రజలు నివసించుటకు యోగ్యముగావించుటకు ప్రయత్నములు జరుగు చున్నవి. జనసంఖ్య త్వరితముగ పెరుగుచున్నది. 1947వ సంవత్సరము జనాభాలెక్క ప్రకారము ఒకకోటి 90 లక్షల జనసంఖ్య యుండగ, 1955లో 2 కోట్ల 32 లక్షల జనసంఖ్య గలదు. ఈజిప్టు ముఖ్యముగ వ్యవసాయదేశమై యున్నది. నూటికి 80 మంది వ్యవసాయమువలననే జీవించుచున్నారు. భోజనపదార్థములు గాక ప్రత్తి విశేషముగ పండుచున్నది. ప్రపంచములో మిక్కిలి ఉత్తమమైనప్రత్తి ఈజిప్టులో పండు చున్నది. ఈజిప్టునుంచి విదేశములకు ఎగుమతిఅయ్యేసరకు లలో నూటికి 75 వంతులు ప్రత్తి అయ్యున్నది. వ్యవసాయము చాలావరకు నైలునది నీటివల్ల చేయుబడుచున్నది. అందువల్ల ఈజిప్టునుంచి బియ్యము, ఉల్లిగడ్డలుకూడ విదేశముల కెగుమతి యగుచున్నవి. ద్వితీయ ప్రపంచయుద్ధమునకుపూర్వము

ఈజిప్టుప్రత్తి ఎక్కువగా ఇంగ్లండుకు, జర్మనీకి పోవుచుండెను. 1956 నుంచి ఇది మారి జెకోస్లోవేకియా, జపాను, ఫ్రాన్సు, ఇండియా, చైనా దేశములకు, ఇంగ్లండు, జర్మనీలకంటె ఎక్కువగ ఎగుమతియగుచున్నది. వృద్ధియగుచున్న జన సంఖ్యకుతగినట్లు వ్యవసాయాభివృద్ధిని కలుగచేయుటకు నైలు నదిమీాద మరియొక గొప్ప ఆనకట్ట అవసరమని ఈజిప్టు ప్రభుత్వము తలచినది. ఆస్వానువద్ద నైలునదిమీాద మిక్కిలి ఎత్తైన ఆనకట్ట కట్టి 20 లక్షల ఎకరములకు నీటిసప్లయిచేయ వలెననియు, దేశమునకు కావలసిన విద్యుచ్ఛక్తియంతయు సప్లయిచేయవలెననియు కల్నల్ నాసర్ప్రభుత్వము ప్రయ త్నించుచున్నది. ఈ ప్రాజెక్టునిర్మాణముయొక్క ప్రథమ దశలో 6 కోట్ల పౌండ్లు ఖర్చగుననియు, వాటిలో నూటికి 45 పాళ్ళు విదేశసరకుల నిమిత్తము ఖర్చుపెట్టవలసియున్న దనియు, 1957 జూలైలో ఈజిప్టు నేషనల్ ఎసెంబ్లీలో అధ్య క్షుడైన కల్నల్ నాసర్ చెప్పియున్నాడు. ఈ ఆస్వాను ఆనకట్టకు కావలసినసొమ్ము చాలవరకు ఋణముగను, కొంత సహాయముగను ఇచ్చెదమని అమెరికా ఇంగ్లండు ప్రభుత్వ ములు 1955 డిసెంబరులో వాగ్దానము చేసినవి. కొంత ఋణము తాము ఇచ్చెదమని సోవియట్రష్యావారుకూడ చెప్పిరి. కల్నల్ నాసర్ ప్రభుత్వము 1955 అక్టోబరులో సిరియా, సౌదీ అరేబియాప్రభుత్వములతో పరస్పరరక్షణ సంధులు కావించుకొన్నది. అటు అమెరికా (బృందము)బ్లాకు లోకాని, ఇటు సోవియటురష్యా కూటమిలోకాని చేరకుండ, కల్నల్ నాసర్ తటస్థముగనున్నాడు. ఉభయకూటములతోను

ఒడంబడికలుచేసుకొని స్నేహముగనుండుటకు ప్రయత్నించుచున్నాడు. 1955 సెప్టెంబరు నెలలో సోవియటురష్యా కూటముసకు చెందిన జెకోస్లేవేకియా ప్రభుత్వము ఈజిప్టుకు ఆయుధ పరికరములను సరఫరాచేసెదమని అంగీకరించినది. అది ఆంగ్లో అమెరికా ప్రభుత్వముల కిష్టములేదు. అంతేకాక కల్నల్ నాసర్ బలవంతమువల్ల 1956 జూన్ 13వ తేదీన బ్రిటిషుసైన్యములు శాంతముగ సూయజుకాలువవద్దనుండి ఈజిప్టుదేశమునుండి వెడలిపోవలసివచ్చినది. ఇందువలన 1956 జులై 20వ తేదీన ఆంగ్లో-అమెరికా ప్రభుత్వములు ఆస్వాను ఆనకట్ట నిర్మాణమున కిచ్చెదమన్న ధనసహాయము నివ్వజాలమని తెలియపరచిరి. సోవియటురష్యా తా నదివరకిచ్చెదనన్న మొత్తమునకంటె ఎక్కువ సొమ్మివ్వలేమని చెప్పినది. ఇటుల ఆంగ్లో-అమెరికను ప్రభుత్వములు ఆస్వానువద్ద ఆనకట్ట నిర్మాణమునకు సహాయముచేయకపోవుటవలన కల్నల్ నాసర్ ప్రభుత్వము సూయజుకాలువను జులై 26 వ తేదీన జాతీయముగచేసె స్వాధీనముపొంది అదివరకు దానిమీాద యాజమాన్యమువహించియున్న సూయజుకాలువ కంపెనీని వెడలగొట్టినాడు.

(3)

## సూయజుకాలువ

సూయజుకాలువను త్రవ్వించుపని సయ్యదుపాషాచేత ప్రారంభించబడి ఇస్మాయిలుపాషాకాలములో పూర్తిఅయ్యెననియు, ఆ కాలువ త్రవ్వించుటకు షుమారు 10 సంవత్సర

ములువబ్టైనదనియు, 1869 నవంబరు 17 వ తేదీన ఆ కాలువ పోగయోడలుపోవుటకు తెరువబడెననియు ఇదివరకే చెప్పి యున్నాము. సూయజు కాలువకంపెనీకి ఆ కాలువమీాదయాజ మాన్యమువహించుటకు ఈజిప్టుసుల్తానుచేత తొంబదితొమ్మిది సంవత్సరములకాలు ఇవ్వబడెను. ఆ కౌలుయొక్క గడువు తీరిపోగనే అనగా 1968 నవంబరు 17 వ తేదీన ఆ కాలువ మీాదగల హక్కులన్నియు ఈజిప్టుప్రభుత్వమునకు సంక్రమిం చును. ఆ కంపెనీయొక్క కౌలును నలుబదిసంవత్సరములు పొడిగించవలెనని బ్రిటిషు హైకమీాషనరు ప్రయత్నించెను గాని ఈజిప్టుఎసెంబ్లీవారు ఒప్పుకోలేదనికూడ పైన తెలిపి యున్నాము. 1888 అక్టోబరు 29 వ తేదీన వివిధప్రభుత్వముల మధ్య కాన్‌స్టాంటినోపిలునగరమున జరిగిన సమావేశము (కన్వెన్షను)లో ఆ కాలువ అన్నిజాతులకును ఎట్టి అడ్డులేకుండ ఎల్లప్పుడును యుద్ధకాలమందును యుద్ధములేనికాలమునం దును కూడ రాకపోకలకు తెరువబడియుండునట్లు ఒడంబడిక జరిగెను. 1954 లో ఆంగ్లసైన్యములు ఈజిప్టుదేశమును సూయజుకాలువను వదలిపోవునట్లు ఆంగ్లో ఈజిప్టుప్రభుత్వ ములమధ్య జరిగిన యొడంబడికలోకూడ, సదరు కన్వెన్షనును అమలుజరుపునట్లు ఉభయపక్షములవారును అంగీకరించినారు. సూయజుకాలువ 107 మైళ్ళపొడుగు గలది. దానివెడల్పు 148 అడుగులు మొదలుకొని 492 అడుగుల వెడల్పు వరకును కలదు. దానిలోతు 45 అడుగులు. సూయజుకాలువ కంపెనీపేరు కంపెని యూనివర్సలు డు కెనాల్ మేరీటిమ్‌డి సూయజ్ (Company Uuiversal Du Canal Maritimedi

Suez) అను ఫ్రెంచిపేరు. ఈ కంపెనీ ఈజిప్టుదేశచట్టముల ప్రకారము జాయింట్‌స్టాక్ కంపెనీగ రిజిస్టరుచేయబడినది. ఆ కంపెనీవాటాలు ఎనిమిదిలక్షలు. వాటిలో ఎక్కువవంతు ఫ్రెంచివారివి. 1875లో బ్రిటిషుప్రభుత్వమువారు ఇస్మాయిలు ఖెడీవువద్ద ఆయనయొక్క అన్నివాటాలను అనగ 1 లక్ష 76 వేల 602 వాటాలను కొనియుండుటవలన ఆ కంపెనీలో మొత్తము 8 లక్షల 53 వేల 204 వాటాలు, అనగ నూటికి నలుబదినాలుగువంతులవాటాలు బ్రిటిషుప్రభుత్వమునకు చెంది యున్నవి. ఆ కంపెనీనిపాలించు ముప్పదిరెండుమంది డైరెక్టరులలో పదునారుమంది ఫ్రెంచివారు, తొమ్మిదిమంది యాంగ్లేయులు, ఐదుగురు ఈజిప్టుదేశీయులు, ఒకరు అమెరికా వారు, ఒకరు డచ్చివారు గలరు. తొమ్మిదిమంది ఆంగ్లడైరెక్టరులలో ముగ్గురుడైరెక్టరులు బ్రిటిషుప్రభుత్వముచే నియమితులైనవారు, ఆరుగురు బ్రిటిషునౌకావర్తకకంపెనీలప్రతినిధులు. 1947 లో ఈజిప్టుప్రభుత్వము చేసిన నూతన కంపెనీ చట్టప్రకారము ఈజిప్టుప్రతినిధులసంఖ్య ఏడుగురికి పెంచబడినది. ఈ కాలువను ఇంకా లోతుచేయుటకును, వెడల్పు చేయుటకును రెండు క్రొత్త ప్రక్కమార్గము లేర్పాటుచేయుటకును ఈజిప్టుప్రభుత్వము సూయజుకాలువకంపెనీమధ్య జరిగిన ఒడంబడికప్రకారము 1956 జూలైనెలలో పని పూర్తియైనది.

## సూయజుకాలువను జాతీయముచేయుట

ఆస్వానుఆనకట్ట ఈజిప్టుదేశమునకు ప్రాణతుల్యమని

కల్నల్ నాసర్ ప్రభుత్వము భావించినది. దానిని నిర్మాణము చేయుటకు ఎట్టిసహాయము ఆంగ్ల అమెరికను ప్రభుత్వములు చేయజాలమని ఈజిప్టుప్రభుత్వమునకు తెలుపుటతోడనే సూయజుకాలువను జాతీయముచేసి దానిమీద సూయజు కాలువకంపెనీ సంపాదించుచున్న విశేషలాభములను ఈజిప్టు ప్రభుత్వమే సంపాదించి, దానిని ఆస్వాన్ ఆనకట్టనిర్మాణము నకై వినియోగించవలెనని నాసర్ ప్రభుత్వము నిశ్చయించినది. ఆ ప్రకారమే 1956 జూలై 26 వ తేదీన ఈజిప్టుప్రభుత్వాధ్య క్షుడైన కల్నల్ నాసర్ సూయజుకాలువను జాతీయముగచేసి నామని ప్రకటనగావించెను. వెంటనే ఈజిప్టుప్రభుత్వము సూయజుకాలువనుస్వాధీనముపొందెను. నిలవయున్నకాలును రద్దుపరచి, పన్నెండుసంవత్సరములకుముందే సూయజుకాలు వను ఈజిప్టుప్రభుత్వము స్వాధీనపర్చుకొనినందున సూయజు కాలువకంపెనీ భాగస్థులకు నష్టపరిహారమిచ్చెదమనికూడప్రక టించెను. ఆ వెంటనే బ్రిటిషు ఫ్రెంచిప్రభుత్వములు తమ సైన్యములను ఈజిప్టుప్రభుత్వమును బెదిరించుటకై మధ్యధరా సముద్రపు తూర్పుభాగమునకు పంపెను. అందుమీద అమె రికా సంయుక్తరాష్ట్రముల ప్రభుత్వకార్యదర్శియగు డల్లెసు సూయజుకాలువతో సంబంధముగల వివిధదేశములప్రతినిధు లను ఆగస్టు 16 వ తేదీన లండనునగరమునందు సమావేశ పరచెను. ఆ సమావేశమునకు వెళ్ళుటకు ఈజిప్టు నిరాకరిం చెను. ఆ సమావేశమునకు ఇరువదిరెండురాజ్యములప్రతి నిధులు హాజరైరి. వారిలో పదునెనిమిదిమంది డల్లెసు ప్రతి పాదించిన సూచనలప్రకారము సూయజుకాలువను అంతర్జా

తీయముగచేయవలెనని తీర్మానించిరి. ఆ తీర్మానము ఆస్ట్రే లయా ప్రధానమంత్రియైన మెంజీసుఅధ్యక్షతక్రింద యొక యువ సంఘముచేత కల్నల్ నాసర్‌కు సమర్పించబడెను. ఈజిప్టు ప్రభుత్వము ఈ తీర్మానమును, ఈ ప్రతిపాదనలను అంగీక రించుటకు నిరాకరించెను. సెప్టెంబరు 9 వ తేదీన సంధిరాయ బారములు విఫలమయ్యెనని ప్రకటించబడెను. సెప్టెంబరు 12 వ తేదీన సూయజు కాలువ నుపయోగించువారిసంఘము నేర్పాటుచేసినామనియు, వారు తమహక్కులను చెలాయిం చెదరనియు ఆంగ్లప్రధానమంత్రి సర్ ఏంథోనీ ఈడెను పార్ల మెంటులో చెప్పెను. తా మీ పనిని ఫ్రాన్సు, అమెరికా సలహా సహాయములతో నిర్వర్తించెదమనికూడ చెప్పెను. సెప్టెంబరు పదునాలుగవ తేదీనుంచి సూయజు కాలువలోనున్న విదేశీయులగు కంపెనీవారందరు వెళ్ళగొట్టబడిరి. సూయజు కాలువలో పడవలరాకపోకలవ్యవహారమంతయు ఈజిప్టుప్రభు త్వముచేతనే నిర్వహింపబడసాగెను. సూయజు కాలువ నుప యోగించువారిసంఘము సెప్టెంబరు పందొమ్మిదవ తేదీనుంచి ఇరువదియొటవ తేదీవరకు లండనులో సమావేశమయ్యెను. డల్లెసుపథకము నంగీకరించిన పదునెనిమిది దేశములప్రతినిధులు కూడ ఆ సమావేశములో పాల్గొనిరి. ఏమిచేసినను, ఎంత బెదిరించినను కల్నల్ నాసర్ ప్రభుత్వము బొత్తుగ లొంగ లేదు. అక్టోబరు 13 వ తేదీన ఆ సమావేశమువారు గావిం చిన తీర్మానము ఐక్యరాజ్యసమితియొక్క భద్రతాసంఘము నకు (సెక్యూరిటీ కౌన్సిలుకు) దాఖలుచేయబడినది. భద్రతా సంఘములో శాంతియుతముగ సూయజు కాలువ వ్యవహారము

ఈజిప్టుప్రభుత్వముతో పరిష్కరించుకొనవలెనని తీర్మానము చేయబడ్డది. ఆ తీర్మానము ఏకగ్రీవముగ జరిగినది. కాని సూయజు కాలువను అంతర్జాతీయముగ చేయవలెనను తీర్మానము భద్రతాసంఘములో ప్రవేశపెట్టబడగ మిగిలినవారు అంగీకరించినప్పటికి సోవియటురష్యాప్రభుత్వముయొక్క నిరాకరణ (వీటో) చేత ఆ తీర్మానము ఓడిపోయినది. ఇంతలో ఆంగ్ల ఫ్రెంచిప్రభుత్వముల కొలకవైపున, అమెరికా ప్రభుత్వమున కొలకవైపున అభిప్రాయభేదములు పొడసూపెను. ఆంగ్లో ఫ్రెంచిప్రభుత్వములు ఈజిప్టును ముట్టడించినచో తాము ఈజిప్టుప్రభుత్వమునకు సహాయముచేతుమని సోవియటురష్యాప్రభుత్వము ప్రకటించెను. ఇందువలన గొప్ప యుద్ధము సంభవించునేమోననియు, ఆంగ్ల ఫ్రెంచిప్రభుత్వములు ఈజిప్టుతో కలహించుట సరియైనపనికాదనియు, ఏదోఒకవిధముగ శాంతముగనే వ్యవహారమును పరిష్కరించుకొనవలెననియు అమెరికా వారు తలచసాగిరి. ఈజిప్టుకు జాతీయముచేయుహక్కు కలదని కూడ అమెరికాలో చాలమంది భావించసాగిరి. అందువల్ల అమెరికావారు ఆంగ్లఫ్రెంచిప్రభుత్వములకు మద్దతుచేయుట మానుకొనిరి. ఇంతలో అక్టోబరు 29వ తేదీన ఇజ్రాయిలు ప్రభుత్వసేనలు ఈజిప్టుదేశముపై దండెత్తెను. ఆంగ్లఫ్రెంచి ప్రభుత్వములే ఈజిప్టును బెదిరించుటకై ఇజ్రాయిలును అటుల దండెత్తుటకు ప్రోత్సహించినవి. ఆమరునాడే ఆంగ్లఫ్రెంచిప్రభుత్వములే యుద్ధము ఆపవలసినదనియు, సూయజు కాలువకు పది మైళ్ళదూరముగ ఈరెండుప్రభుత్వములును తమతమ సేనలను తీసుకొనిపోవలెననియు, ఈజిప్టుకును, ఇజ్రాయిలుకును అంత్య

సందేశమిచ్చిరి. అంతేకాకుండ ఆంగ్లఫ్రెంచిసేనలు తాత్కా-
లికముగ పోర్టుసయ్యీదు, ఇస్మేలియా, సూయజు అను మూడు
సముద్రరేవులలోను నుండునట్లుతమకుఅనుమతినివ్వవలసినదిగ
ఈజిప్టుప్రభుత్వమును కోరెను. ఈజిప్టు, ఇజ్రాయిలు దేశములు
యుద్ధములోదిగుచున్నందున అట్టి యుద్ధము సాగకుండుటకై
ఉభయులకుమధ్యగ తమ సేనలను సూయజుకాలువమీద
నున్న పై మూడు రేవులలో నుంచనివ్వవలెననియు, అందువల్ల
ఇజ్రాయిలునుండి ఈజిప్టుకు, ఈజిప్టునుండి ఇజ్రాయిలుకు
అపాయము కలుగకుండ తాము కాపాడెదమనియు ఆంగ్ల
ఫ్రెంచిప్రభుత్వములు తెలిపినవి. అందుకు ఇజ్రాయిలుప్రభు
త్వము ఒప్పుకొన్నది. కాని ఈజిప్టుప్రభుత్వము నిరాకరించి
నది. తమను కాపాడుమిషతో ఆంగ్ల ఫ్రెంచిసైన్యములు
సూయజుకాలువవద్ద మరల ప్రవేశించగోరుచున్నారనియు,
తామే తమ్ము రక్షించుకొనగలమనియు ఈజిప్టు భావించెను.
ఆ దినముననే ఐక్యరాజ్యసమితియొక్క భద్రతాసంఘములో
ఇజ్రాయిలుసేనలు వెంటనే వెనుకకుపోవలెననియు, ఐక్యరాజ్య
సమితిలో సభ్యులైన యే జాతులవారును ఎట్టి దౌర్జన్యములకు
గడంగకూడదనియు అమెరికావారు ఒక తీర్మానమును ప్రవేశ
పెట్టిరి. అట్టి తీర్మానమును సోవియటురష్యాప్రభుత్వముకూడ
ప్రవేశపెట్టగ ఆ రెండు తీర్మానములను ఆంగ్లఫ్రెంచిప్రభుత్వ
ములప్రతినిధులు వీటోచేసి ఓడగొట్టిరి. అమెరికా, రష్యా
దేశములు ప్రతిపాదించిన తీర్మానములు ఓడిపోయినవి.
ఆమరునాడే అనగ అక్టోబరు 31వ తేదీన ఆంగ్ల ఫ్రెంచి ఆకాశ
విమానములు ఈజిప్టుపై దాడివెడలెను.

## ఈజిప్టుపై ఆంగ్లఫ్రెంచి సైన్యముల దాడి

నవంబరు నెల 5వ తేదీన ఆంగ్ల ఫ్రెంచి సైన్యములు సూయజు కాలువయొక్క ఉత్తరభాగమున దిగెను. ఈ సైన్యములు ఈజిప్టు దేశీయులమీద ఘోరకృత్యములుసలుపసాగెను. గొప్ప యుద్ధముసాగునని భయపడి, ఐక్యరాజ్యసమితియొక్క సర్వసభ్యసమావేశమువారు నవంబరు 2వ తేదీననే సమావేశమై, ఆంగ్లఫ్రెంచిప్రభుత్వములు ఒకవైపున, ఈజిప్టు మరియొకవైపున యుద్ధముసాగించరాదని ఖండితముగ తీర్మానమును పంపిరి. అటుల యుద్ధము జరుగకుండ ఆపుటకును, సూయజు కాలువప్రాంతమునంతను దౌర్జన్యమునుంచి రక్షించుటకును ఐక్యరాజ్యసమితివారే అతిత్వరితముగ సూయజు కాలువకు సైన్యములనుపంపవలెనని కెనడాప్రభుత్వ ప్రతినిధి ప్రతిపాదించినతీర్మానమును ఆమోదించిరి. ఈ లోపల ఆంగ్ల ఫ్రెంచిసైన్యములు పోర్టుసయ్యాదు రేవును, సూయజు కాలువయొక్క ఉత్తరభాగమును ఆక్రమించుకొనియుండెను. ఇస్రాయిలుసైన్యము ఈజిప్టుయొక్కభాగమైన సినాయ్ప్రాంతమును విడిచిపోకుండ ఆక్రమించియుండెను.

## ఇండియాయొక్క ముస్లిమురాజ్యములయొక్క సానుభూతి

ఇంగ్లండుతో కలిసి బాగ్దాదుసంధిచేసుకొనియుండిన నాలుగుముస్లిము దేశములు అనగ ఇరాకు, ఇరాను, టర్కీ, పాకిస్తాను దేశముల ప్రధానమంత్రులు నవంబరు నెల 5వ తేదీన టెహరానుపట్టమున సమావేశమై, ఆంగ్ల ఫ్రెంచిసేనలు ఈజిప్టునుంచి వెడలిపోవలెననియు, ఆంగ్ల ఫ్రెంచిప్రభుత్వములు

సూయజుకాలువవ్యవహారమును ఈజిప్టుతో శాంతముగ పరిష్కరించుకొనవలెననియు తీర్మానించిరి. సూయజుకాలువలో ఈజిప్టునకుగల సంపూర్ణహక్కును, అధికారమును స్థిరపరచవలెననియు, కాని అన్నికాలములలోను అన్నిజాతులును సూయజుకాలువగుండ ప్రయాణముచేయుసౌకర్యములను కలుగచేయవలెననియుకూడ తీర్మానించిరి. ఈ మహాసభకు ఇంగ్లండును పిలువలేదు. నవంబరు 9 వ తేదీన ఇరాకుప్రభుత్వము ఫ్రెంచిప్రభుత్వముతో స్నేహబంధములను విడగొట్టుకొన్నది. సూయజువ్యవహారము న్యాయముగను, సవ్యముగను పరిష్కారముకానియెడల బాగ్దాదుసంధినుండి తాము విడిపోయెదమనికూడ ప్రకటించినది ఇందుమూలముగ సూయజుకాలువవ్యవహారములో ముస్లిముప్రపంచమంతయు ఈజిప్టుపక్షమున నున్నటుల స్పష్టమైనది. ఇండియా ప్రథమమునుండియు ఈజిప్టుకనుకూలముగనే ప్రకటనలుచేసినది. అటిస్థితిలో నవంబరు 15వ తేదీన ఐక్యరాజ్యసమితియొక్క సేనలు ఈజిప్టులో సూయజుకాలువవద్ద దిగెను. అవన్నియు తటస్థదేశములప్రభుత్వములచే పంపబడినసేనలు. ఐక్యరాజ్యసమితిక్రింద సూయజుకాలువకు పంపబడిన సేనలలో హిందూదేశమునుంచి వెళ్ళినసేనలు ప్రధానస్థానమునాక్రమించినవి. భారతీయసేనలకు ఈజిప్టుప్రభుత్వము, ప్రజలుకూడ గొప్ప అతిథ్యమునిచ్చిరి. భారతీయసేనలకు ఈజిప్టుతో సంపూర్ణసానుభూతి యుండెను. వీరు అచటికి వెళ్ళి ఆంగ్ల ఫ్రెంచిముట్టడులు జరుగకుండ ఆపివైచి కాపాడిరి. అప్పటికి సూయజుకాలువలోపని, రాకపోకలు స్తంభించి ఆగిపోయెను. సూయజుకాలువలో పరిస్థితిస్తంభన

మేర్పడెను. రాకపోకలు పూర్తిగ ఆగెను. అన్ని దేశముల వారు యూరోపుఖండమునుంచి ఆసియాఖండమునకు ప్రయాణముచేయుటకుగాను ఆఫ్రికాఖండముయొక్క దక్షిణకొనను చుట్టి రావలసివచ్చినది. ప్రపంచవర్తకమునకు అసౌకర్యము, ఇబ్బందులు, ద్రవ్యనష్టము విశేషముగ కలుగసాగెను.

## ఆంగ్ల ఫ్రెంచి సైన్యములు మరలిపోయినవి

తుదకు ఆంగ్ల ఫ్రెంచి ప్రభుత్వములు తమ సైన్యములను నెమ్మదినెమ్మదిగ తమ దేశములకు మరలించసాగెను. ఒకనెలలోపల పూర్తిగ ఆంగ్ల ఫ్రెంచి సైన్యములు సూయజు కాలువనుండి, ఈజిప్టుతీరమునుండి, మధ్యధరాసముద్రమునుండి తమతమ దేశములకు వెడలిపోయినవి. అంతటితో సూయజు కాలువలోనికి రాకపోకలు మరల ప్రారంభమై, ప్రతిష్ఠంభన అంతరించినది. సూయజుకాలువలో ధారాళముగ ప్రపంచ నౌకలు ప్రయాణము చేయసాగినవి. ఆ ప్రయాణపు ఏర్పాట్లన్నియు ఈజిప్టు ప్రభుత్వముయొక్క కెనాల్ అథారిటీ, (Egyptian Canal Authority) అనగ ఈజిప్టు ప్రభుత్వపు సూయజుకాలువఅధికారవర్గముయొక్క యాజమాన్యముక్రింద జరుగుచున్నవి. ఆ కాలువలో ప్రయాణముచేయువారు మనుష్యులకు, సరకులకు సుంకములను ఈజిప్టుప్రభుత్వముయొక్క అధికారులకే శాంతముగ చెల్లించుచున్నారు. కొన్ని నెలలు ఆంగ్ల ఫ్రెంచిదేశీయులు సూయజుకాలువను బహిష్కరించి, ఆఫ్రికాఖండపు దక్షిణపుకొననుచుట్టి ఆశియాకు ప్రయాణము చేయవలెనని ప్రయత్నించిరి. కాని అందువల్ల చాల నష్టమే

కలిగినందున అట్టి ప్రయత్నములనన్నిటిని విరమించుకొని, మామూలు ప్రకారమే తమ యోడలను సూయజు కాలువగుండ రాకపోకలు చేయించుచున్నారు. సూయజు కాలువగుండ 1956 మొదటి అర్ధభాగములో ప్రయాణముచేసినవారిలో బ్రిటిషుపడవలు 1 కోటి 76 లక్షల 53 వేల టన్నులు కలవి. నార్వేపడవలు 95 లక్షల 87 వేల టన్నులు కలవి. ఫ్రెంచిపడవలు 61 లక్షల 69 వేల టన్నులు కలవి. ఇటుల సూయజు కాలువను జాతీయముగచేయుపని పూర్తిగ జయప్రదమైనది. సూయజు కాలువ ఈజిప్టు ప్రభుత్వము క్రిందికి పూర్తిగ వచ్చినది. దానివల్ల వచ్చేలాభమంతయు ఈజిప్టు ప్రభుత్వమునకే చెందుచున్నది. గాని పాత సూయజు కాలువ కంపెనీకి 1968 వరకు గల కౌలును పన్నెండుసంవత్సరములు ముందుగనే రద్దుపరచి సూయజు కాలువను ఈజిప్టుప్రభుత్వము స్వాధీనముపొందినందుకుగాను, ఆ కంపెనీకి చెల్లించవలసిన నష్టపరిహారమువిషయములో చాలాకాలము కంపెనీవారికిని, ఈజిప్టుప్రభుత్వమునకును ఒడంబడిక కుదరలేదు. తుదకు 17-1-1959 తేదీన ప్రపంచబ్యాంకిఅధ్యక్షుడగు యూజిన్ బ్లాకు మధ్యవర్తిత్వమువలన ఈ వ్యవహారమంతయు ఈజిప్టు ఆంగ్లేయప్రభుత్వములమధ్య శాంతముగ పరిష్కారమైనది. సూయజుకంపెనీభాగస్థుల కివ్వవలసిన నష్టపరిహారము, ఈజిప్టు ఇంగ్లాండు లొకరికొకరు ఇతరసందర్భములలో ఇచ్చి పుచ్చుకోవలసిన నష్టపరిహారములు, పూర్తిగ నిర్ణయింపబడి పరిష్కరించబడినవి. వాటిని చెల్లించుటకు వాయిదాలుకూడా ఏర్పరచబడినవి. ఇంగ్లాండుకును, ఈజిప్టుకును మధ్య వర్తక

వ్యాపారసంబంధములు బాగుగ నెలకొల్పబడ్డవి. ఈజిప్టు తాలూకు ఏడుకోట్ల నలుబదిలక్షలపౌండ్లు ఇంగ్లాండులో బిగబట్టి యుంచబడినవి. దానిలో రెండుకోట్ల, నలుబదిలక్షలు నష్టపరిహారములక్రింద నికరముగ తీసుకొని, మిగిలిన అయిదు కోట్లపౌండ్లను ఒకయేడాదిలోపల ఈజిప్టుకు చెల్లించెదరు. ఆంగ్లేయవర్గనాయకుడు సర్ డెన్నిసురికెటు, సంయుక్తఅరబు రిపబ్లికుప్రతినిధివర్గనాయకుడు డాక్టరు అబ్దుల్ ఎల్ మొనీం కైనున్ని ప్రపంచబ్యాంకిఅధ్యక్షుడైన యూజిన్ బ్లాకుకు కృతజ్ఞతను వెల్లడించిరి. ముఖ్యముగ ఈజిప్టులోను, సిరియాలో నున్న కమ్యూనిస్టులు 1958 ఆఖరుభాగమునుండియు అరబుజాతీయతత్వమునకు వ్యతిరేకులై, సంయుక్త అరబురిపబ్లికును విచ్ఛిన్నముచేయుటకు ప్రయత్నములు చేసినందునను, ఇరాకులో కమ్యూనిస్టులప్రాబల్యమెక్కువై ఇరాకుకును ఈజిప్టుకును స్నేహముచెడినందునను, కల్నలు నాసరు తనరాజ్యములోని కమ్యూనిస్టులను రెండువందలకుపైగా 2-1-1959 తేదీనుండి అరెస్టుచేసి కమ్యూనిస్టులకు పూర్తిగ వ్యతిరేకి అయినాడు. ఇది ఇంగ్లాండుకు సంతోషముకలుగచేసియుండవచ్చును. కల్నల్ నాసరుతో స్నేహసంబంధములు పెట్టుకొనుటకు నిశ్చయించుకొని ప్రపంచబ్యాంకుఅధ్యక్షులు చెప్పినట్లుగ కల్నల్ నాసరుతో రాజీపడియుండవచ్చును. ఆంగ్లో-ఈజిప్టుఒడంబడిక ఉభయులచేత దస్కతుకావడములో కొంత ఆలస్యమైనందున యూజిన్‌బ్లాకు కైరోనగరమునకు వెళ్ళి 1959 ఫిబ్రవరి 28వ తేదీన ఆ పని పూర్తిచేయించినాడు. అది పూర్తికాగనే "ఇంతటితో ఈజిప్టుయొక్క స్టర్లింగునిలు

వలు బ్రిటిషుప్రభుత్వము విడుదలచేయుచున్నదనియు, తమ బ్యాంకులు, భీమాకంపెనీలు, సూయజుకాలువవంటి ఆర్థిక సంస్థలమీద విదేశీయాజమాన్యము పూర్తిగ తొలగిపోవు చున్నదనియు సంపూర్ణమైన ఆర్థిక అధికారముతో బయపడినా మనియు, సూయజుకాలవకల్లోలములో మాకు తోడ్పడిన సౌదు అరేబియా, సోవియటురష్యా, ఇండియా, చైనా, సిరియాప్రభుత్వములకు కృతజ్ఞతను తెలుపుచున్నాననియు" దానిమీద దస్కతుచేసిన సంయుక్త అరబురిపబ్లికుప్రతినిధి డాక్టరు అబ్దుల్ ఎల్ మొనీం కైసున్ని పత్రికాప్రతినిధులతో చెప్పినాడు.

1959 ఏప్రిలు నెలలో సూయజుకాలువను దర్శించి వచ్చిన ఒక ఆంగ్లేయ పత్రికావిలేఖరి, పాత విదేశస్తుల సూయజుకాలువ కంపెనీకంటె జాతీయము చేసినప్పటినుంచి ఎక్కువ జాగ్రత్తగను, సమర్థతతోను ఈజిప్టుప్రభుత్వాధి కారులు సూయజుకాలువలోని రాకపోకల ఏర్పాట్లను జరుపు చున్నారనియు, ఈజిప్టుతో యుద్ధముచేయుచున్న ఇస్రాయిలు తప్ప మిగిలిన అన్నిదేశముల పొగయోడలు శాంతముగ నిష్పక్షపాతముగ సూయజుకాలువగుండ పోవుచున్నవనియు, అక్కడ పనిచేయుచున్న పైలెట్లలో నెక్కువమంది ఈజిప్టు దేశీయులే ఉన్నారనియు వ్రాసినాడు. పాత విదేశస్తుల సూయజుకాలువకంపెనీకాలములో 1955 అక్టోబరులో దినమునకు సగటున నలుబది పొగయోడలు ఆ కాలువలోగుండ ప్రయాణముచేయగ, కాలువ జాతీయముచేయబడిన పిమ్మట 1958 అక్టోబరులో దినమునకు సగటున ఏబదిరెండు

పొగయోడలు ప్రయాణముచేయుచున్నవనికూడ వ్రాసినాడు. సాలుకు ఇపుడు 57 కోట్లరూప్యముల ఆదా ఈజిప్టుప్రభుత్వము నకు ఈ కాలవమీద వచ్చుచున్నది. ఇందులో 35 కోట్ల రూప్యములు సిబ్బంది వగైరా ఖర్చులక్రింద పోగా సాలుకు ఇరు వదిరెండుకోట్ల రూప్యములు నికరాదాయము వచ్చుచున్నది. ఈ సూయజుకాలువను ఈజిప్టుప్రభుత్వము ఎక్కువ వెడల్పు, లోతు చేయుచున్నది. ఈ కార్యక్రమమునకు ఖర్చు 16కోట్ల 40 లక్షల రూప్యములగును. ఇది 1960 ఆగస్టుకు పూర్తి యగును. ఆపిమ్మట దినమునకు 200 పొగయోడలు, అంతే గాక ఇంకా ఎక్కువబరువుమోయు పొగయోడలు ఈ కాలువ గుండ పోవుటకు వీలగును. ఈ పని ఇపుడు అతివేగముగ జరుగుచున్నది. ఇందువల్ల ఈజిప్టుప్రభుత్వమునకు విశేష లాభము కలుగగలదు. దీనికవసరమైన ఋణమును నూటికి సాలుకు 4½ చొప్పున వడ్డీతో నేర్పాటుచేయుటకు యూజిను బ్లాకు 1959 మేనెలలో కైరోకు వచ్చినాడు.

## అస్వాను ఆనకట్టకు రష్యా ఋణము

అస్వాను ఆనకట్ట కట్టుటకు రష్యాప్రభుత్వమువారు కల్నల్ నాసర్‌కు 1958 సెప్టెంబరులో మూడుకోట్ల నలుబది లక్షల నవరసులను, అనగ సుమారు నలుబదియైదుకోట్ల రూప్యములను ఋణముగ నిచ్చియున్నారు. అస్వాను ఆనకట్ట ఈజిప్టుకు ప్రాణతుల్యమని చెప్పియున్నాము. అది 20 లక్షల ఎకరములకు అదనముగ నీటిసరఫరాచేయుటయే గాక సంవత్స రమునకు వేయికోట్ల కిలోవాట్ల విద్యుచ్ఛక్తిని సరఫరా

చేయును. ఇంత పెద్ద విద్యుచ్ఛక్తి సరఫరాచేయు ప్రాజెక్టు అమెరికాలో నొకటి, రష్యాలో నొకటి మాత్ర మున్నవి. ఈజిప్టుదేశముయొక్క పరిశ్రమలకన్నిటికిని విద్యుచ్ఛక్తి లభించుటయేగాక, ఇంక చాల విద్యుచ్ఛక్తి మిగిలిపోవును. ఈ ఆనకట్టఎత్తు 330 అడుగులు ఉండగలదు. దక్షిణము నుంచి నైలునదిలో వచ్చే అధికవరదలను ఇది ఆపివైచి క్రింది ప్రాంతముసంతను వరదలనుండి కాపాడును. ఈ ఆనకట్టకు నిర్మించబోయే గొప్పసరస్సులో పదమూడు వేల కోట్ల క్యూబిక్ మీటర్లనీరు నిలచును. ఈ ఆనకట్టయొక్క పూర్తి నిర్మాణమువలన, అధిక నీటిపారుదలవలన నేమి, అత్యంత విద్యుచ్ఛక్తి లభించుటవలననేమి ఈజిప్టు జాతీయాదాయము ప్రతిసంవత్సరము నాలుగువందలకోట్ల రూప్యములు ఎక్కువగునని అంచనా వేయుబడుచున్నది. ఇది యొక అద్భుతమైన నిర్మాణము. దీనికి ప్రథమదశలో కావలసిన నలుబదియైదు కోట్ల రూప్యములను సోవియటురష్యాప్రభుత్వము కల్నల్ నాసర్ ప్రభుత్వమునకు ఋణముగ నిచ్చినది. దీనికి ఇదివరకే ప్లానులు, ఎస్టిమేటులు తయారైయున్నవి. అందువలన వెంటనే నిర్మాణపువని ప్రారంభమై అతిచురుకుగ జరుగుచున్నది. సోవియటురష్యాకు కల్నల్ నాసర్ వెళ్ళి ఈ ఋణమును కుదుర్చుకొనివచ్చినాడు. ఈ ఋణము కుదరకముందు ఆంగ్లో అమెరికనుల యాజమాన్యముక్రిందనున్న ప్రపంచబ్యాంకు అధ్యక్షుడగు యూజిన్ బ్లాకు ఈజిప్టు రాజధానియైన కైరో నగరమునకు వచ్చి కల్నల్ నాసర్‌తో మాట్లాడెను. కాని ఋణమిచ్చుటకు ఒప్పుకొనలేదు. అందువల్ల రెండుసంవత్సర

ములనుంచి తాను సర్వసన్నాహములు చేసి సిద్ధపరచిన ఈ గొప్పనిర్మాణమును వెంటనే ప్రారంభించుటకై రష్యాయొక్క ఋణము సంగీకరించి కల్నల్ నాసర్ నిర్మాణపువని ప్రారంభించినాడు. ఈ ఋణమును తాను రష్యావద్దనుంచి తెచ్చుకొనుటనుగురించి తన భావములను తెలుపుచు 1958 సెప్టెంబరు 28వ తేదీన ఒక ప్రకటనచేసినాడు. ఆ ప్రకటనలో ఇటులున్నది: "సోవియటురష్యాప్రభుత్వమువారు మా కష్టములను అవకాశముగ తీసుకొనలేదని, వాటినుపయోగించుకొని మామీద నెట్టి అక్రమషరతులను కట్టలేదని నేను స్పష్టముగ తెలుపుచున్నాను. మాకీ సహాయము, సహకారము సలుపుటలో వారియుద్దేశ్యము లేమైయున్నను, ఆత్మగౌరవమును, సార్వభౌమత్వమును గలిగిన మే మొక స్వతంత్రజాతియనియే వారు అంగీకరించినారు. మేము విదేశస్థులసహాయమును అతి అనుమానముతో చూచువారమనియే వారికి తెలుసును. గొప్ప పోరాటముసలిపి విదేశయాజమాన్యమునుండి ఇటీవలనే స్వతంత్రమును పొందినవారమని కూడ వారు జ్ఞప్తియందుంచుకొన్నారు. మామీద ఎట్టి అక్రమమైన, స్వతంత్రమునకు భంగకరమైనషరతులను వారు విధించుటకు ప్రయత్నించలేదు. హృదయపూర్వకముగ స్నేహవాత్సల్యముతో వారు మాకీ ఋణమునిచ్చినారు." అని ఆయన చెప్పినాడు. "పాశ్చాత్యులు ఈజిప్టుకు చేయుటకు నిరాకరించిన ఆర్థిక సహాయమును తాము చేసినామనే ప్రతిష్ఠను పొందుటకే ఈ ఋణమును రష్యావారు ఈజిప్టు కిచ్చియున్నారని, ఇట్టి క్లిష్ట సమయములో తోడ్పడినారని" లండను పత్రికలు వ్రాసినవి.

1959 సంవత్సర ప్రారంభమునుంచి కల్నల్ నాసర్ ప్రభుత్వమునకు ఈజిప్టు, సిరియాలలోని కమ్యూనిస్టులకు తీవ్రమైన వ్యతిరేకత ప్రబలినది. కమ్యూనిస్టుల పలుకుబడిలోకి పూర్తిగ పోయిన ఇరాకు ప్రధానమంత్రియగు ఖాశింకును, కల్నలు నాసరుకును ప్రబల విరోధమేర్పడినది. అప్పటినుంచి ఇటలీ ప్రభుత్వ ప్రతినిధి, అమెరికా ఆంగ్లేయప్రతినిధులు, ప్రపంచ బ్యాంకు అధ్యక్షుడగు యూజిన్ బ్లాకు ఈజిప్టుకు వచ్చి మాట్లాడిపోవుచున్నారు. అమెరికా ఆంగ్లేయప్రభుత్వముల వారు కల్నల్ నాసరుతో నెక్కువ స్నేహసంబంధములు పెట్టుకోవలెనని ప్రయత్నించుచున్నారు. ఆస్వాన్ ఆనకట్ట నిర్మాణమునకు కావలసిన ఋణమును, సాంకేతికనిపుణులను అమెరికా ఆంగ్లప్రభుత్వములు ఇచ్చు సూచనలు కనపడుచున్నవి. ఈ ఆనకట్టనిర్మాణపుపని చురుకుగా సాగుచున్నది. సూయజుకాలవవల్ల మిగిలే లాభములను దీనినిర్మాణము క్రింద ఖర్చుచేయుచున్నారు.

## సుడాను

1953 నవంబరునెలలో నొక అంతర్జాతీయ ఉపసంఘము (కమిషను)యొక్క పర్యవేక్షణక్రింద సుడానుదేశపు పార్లమెంటుకు ఎన్నికలు జరిగెను. ఈ కమిషనులో సుడాను, ఈజిప్టు, ఇంగ్లండు, అమెరికాప్రభుత్వముల ప్రతినిధులుండిరి. ఇండియాప్రతినిధియైన శ్రీ సుకుమారసేను దానికి అధ్యక్షుడుగనుండెను. ఎన్నికలు శాంతముగనే నడచెను. ఈజిప్టునుండి సుడాను విడిపోవలెనని వాదించే ఉమ్మాకక్షికిని

ఈజిప్టుతో కలిసియుండవలెనని చెప్పు జాతీయ యూనియన్ కక్షి కిని తీవ్రమైనపోటీకలిగి, ప్రజాప్రతినిధిసభలోను సెనేటులోను ఈజిప్టుతో కలిసియుండవలెనను జాతీయ యూనియనుపార్టీకే నెక్కుడు స్థానములు లభించెను. 1954 జనవరి 1 వ తేదీన పార్లమెంటు సమావేశమయ్యెను. క్రిందిసభవారు ఇస్మాయిలు అల్ అఝారిని నాయకుడుగ నెన్నుకొనిరి. ఆయన ప్రధాన మంత్రియయ్యెను. జనవరి 9 తేదీన సుడానుదేశపు గవర్నరు జనరలుకు తన మంత్రివర్గసభ్యులపేర్ల జాబితాను అందచేసెను. మార్చి ఒకటవ తేదీన పార్లమెంటు ప్రథమసమావేశము జరుగున ట్లేర్పాటుచేయుబడెను. ఆ దినముననే విదేశప్రభుత్వముల ప్రతినిధులును, ఈజిప్టు దేశఅధ్యక్షుడగు జనరలు నజీబు సుడాను రాజధానికి రాగా, అచట గొప్ప అల్లరులుజరిగి ముప్పది మంది ప్రాణములుకోల్పోయి 25 మంది గాయపడిరి. ఈజిప్టు తన ఎన్నికలలోను, తరువాతను సుడానువ్యవహారములలో జోక్యముపుచ్చుకోకూడదని తీవ్రమైన వ్యతిరేకవాతావరణము ప్రబలి, సుడానుకు ఈజిప్టుతో సంబంధములేని సంపూర్ణస్వాతంత్రము కావలెనను తెగలకుచెందిన 25 వేలమందిజనము గొప్ప ప్రదర్శనమును లేవదీసిరి. మార్చి 10 వ తేదీన ఈజిప్టు పార్లమెంటు సమావేశమై వెంటనే వాయిదా వేయబడెను. సుడానుయొక్క సంపూర్ణస్వాతంత్రమునుగూర్చి జనవాక్య నిర్ధారణకు వదలిపెట్టవలెనని ఐక్యరాజ్యసమితిలో తీర్మానమయ్యెను. కాని సుడానుప్రధానమంత్రియైన ఇస్మాయిల్ అల్ అఝారి తన రాజనీతిని పూర్తిగ మార్చుకొని సుడానుదేశమును స్వాతంత్రదేశముగనే చేతునని ప్రకటించెను. 1955 డిశెంబరు

19వ తేదీన సుడాను పార్లమెంటు సమావేశమైనపుడు దానిలో సుడాను దేశము ఈజిప్టు దేశముతో నెట్టిసంబంధములేనిసంపూర్ణ స్వతంత్రముగల (ప్రజాస్వామ్యముగ) రిపబ్లికుగ ప్రకటించబడి నది. అందుకు ఇంగ్లండు ఈజిప్టుప్రభుత్వము లంగీకరించి, తమ శుభసందేశములను పంపిరి. అందుమీాద గవర్నరుజనరలు రాజీనామానిచ్చెను. నూతనరాజ్యాంగ మేర్పాటుచేయ బడెను. అదివరకే నవంబరు 15వ తేదీనాటికి సుడానునుండి ఈజిప్టు, ఇంగ్లండుసేనలన్నియు తీసివేయబడెను. 1956 జనవరి 1వ తేదీన ఇంగ్లండుయొక్కయు, ఈజిప్టుయొక్కయు పతాక ములు తీసివేయబడి, సుడానురిపబ్లికుయొక్క నూతన పతా కము ఎగురవేయబడెను. అప్పటినుంచి సుడాను సంపూర్ణ స్వతంత్రముగల ప్రజాస్వామిక దేశముగ నున్నది. 1956 జూలై 4వ తేదీన ఉమ్మాపార్టీచేత విశ్వాసరాహిత్యతీర్మానము ప్రవేశపెట్టబడి పార్లమెంటులో ప్రధానమంత్రియైన ఇస్మా యిల్ అల్ అఝూరి ఓడిపోయినందున అధ్యక్షవర్గమునకు ఆయన తనరాజీనామాను సమర్పించెను. మరునాడు ప్రజా ప్రతినిధిసభయొక్క అధికసంఖ్యాకులచేత ఉమ్మాపార్టీకి (సెక్ర టరీజనరలుగ) ప్రధానకార్యదర్శిగనున్న సయ్యదు అబ్దుల్లా ఖలీము నాయకుడుగ నెన్నుకొనబడినందున ఆయన ప్రధాన మంత్రియై, కొన్ని యితరరాజకీయపార్టీలతో కలసి సంయుక్త మంత్రివర్గము నేర్పాటుచేసుకొనెను. జాతీయ యూనియన్ పార్టీ ఓడిపోయినందున వ్యతిరేకపక్షమయ్యెను. ఉమ్మాపార్టీ ప్రథమమునుంచియు ఆంగ్లేయపక్షపుపార్టీ అయ్యున్నది. 1955 ఆగస్టునెలలో సుడానుదేశపుదక్షిణప్రాంతముననున్న సైన్య

ములు ప్రభుత్వముపై తిరుగుబాటుచేసెను. ఉత్తరప్రాంతము నుండి సేనలు, పోలీసు పోయి ఆ తిరుగుబాటును అణచెను. తాత్కాలికముగ శాంతి స్థాపింపబడెను. కాని ఉత్తర దక్షిణ ప్రాంతములమధ్య వ్యతిరేకభావములే నిలచియుండెను. 1956 నవంబరు నెలలో సుడాను ఐక్యరాజ్యసమితిలో సభ్యురాలుగ చేర్చుకొనబడెను. సుడానుపరిపాలనలో సుడాను దేశీయులనే అధికసంఖ్యాకులుగ నియమించుచున్నారు. కొన్ని నూతన రైల్వేలు వేయబడినవి. నైలునదియొక్క కాలువను ఇంకను పొడిగించి 85 లక్షల ఎకరములను నీటిపారుదలక్రిందకు తేవలె నని, నైలునదిమీద రోజేరసువద్ద నొక పెద్ద ఆనకట్ట కట్టవలె నని, 1957 సంవత్సరములో నొకపథకమును తయారుచేసిరి. కాని నైలునదినీటిపంపకమువిషయములో ఈజిప్టుతో నూతన యొడంబడిక జరుపుకొన్న కాని ఈ పథకము నమలులో పెట్టుట సాధ్యముకాదని యెంచి, ప్రధానమంత్రి సయ్యదు అబ్దుల్లా ఖలీము ఈజిప్టురాజధానియైన కైరోకు వెళ్ళివచ్చెను. కల్నల్ నాసరు సూయజు కాలువను జాతీయముగచేసిన వ్యవహారములో ఆంగ్ల ఫ్రెంచిప్రభుత్వములకు వ్యతిరేకముగ సుడాను ప్రభుత్వముకూడ ఈజిప్టునే బలపరచెను. 1957 ఫిబ్రవరి నెలలో నూతనఎన్నికలు జరిగెను. స్త్రీలకు ఓట్లు యివ్వవలెనా అను విషయము వివాదగ్రస్తమయ్యెను. అధ్యక్షవర్గమును తీసివేసి, రిపబ్లికుయొక్క అధ్యక్షుని అమెరికాపద్ధతిన ఎన్నుకొనవలెనా, ఫ్రెంచిపద్ధతిన ఎన్నుకొనవలెనా అనునది మరియొక వివాద గ్రస్తమైన విషయమయ్యెను. ఎన్నికలు శాంతముగజరుగలేదు. రాజకీయపార్టీ లెక్కువయ్యెను. ఏపార్టీకిని పూర్తియైన మెజా

రిటీలభించలేదు. వచ్చినపార్టీలలో ఉమ్మాపార్టీయే కొంచెము పెద్దది. అది స్వంతముగ ప్రభుత్వమును నడువలేక పీపుల్సు డెమోక్రాటిక్ పార్టీ యను మరియొకపార్టీతో కలిసి సంయుక్త మంత్రిత్వమును ఏర్పాటుచేసెను. మంత్రిత్వము సవ్యముగను, శాంతముగను జరుగుటలేదు. అందుమీద 1958 నవంబరు 17 వ తేదీన సైన్యాధిపతియగు జనరలు ఇబ్రహీం అబౌదు పార్లమెంటును మంత్రివర్గమును రద్దుపరచి రాజకీయపార్టీల నన్నిటిని తీసివేసి, తానే సర్వాధికారమును వహించెను. అశాంతిని, అస్థిమితత్వమును, లంచగొండితనమును నిర్మూల నముచేసి, జాతికిమిక్కిలియుపయోగకరమైన, శాంతియుతమైన, అభివృద్ధికరమైన పాలనను స్థాపించుటయే తన యుద్దేశ్యమని జనరలు అబౌదు ప్రకటించెను. ఏ దేశముతోను విరోధము పెట్టుకొనమని, విదేశస్థులందరి మాన ప్రాణ ధనములను సంర క్షింతుమని, అందరితోను మైత్రితో సంచరించెదమని ప్రక టించెను. తన సోదరప్రభుత్వమైన సంయుక్త అరబు రిపబ్లి కుతో సోదరవాత్సల్యముతో మెలగుదుమనియు, వారితోగల స్నేహసంబంధములను బలపరచుకొనెదమనియు చెప్పెను. ఈయన ఉమ్మాపార్టీవలె పాశ్చాత్యరాజ్యములకు లొంగ దలచుకొనలేదు. రష్యాకూటమి పాశ్చాత్యకూటమిలమధ్య తటస్థముగనుండుటకు నిశ్చయించెను. ఈ ప్రభుత్వమును సంయుక్త రిపబ్లికు అధ్యక్షుడైన కల్నల్ నాసర్ అంగీకరిం చెను. అటులనే ఇంగ్లండు, రష్యా, చైనా, ఇరాకు, పాకిస్తాన్, జోర్డానుప్రభుత్వములుకూడ అంగీకరించెను. ఈయన 12మంది మంత్రుల నేర్పాటుచేసుకొనెను. తానే ప్రధానమంత్రిగ

నుండెను. మరియు తన అధ్యక్షత క్రింద పదముగ్గురు సభ్యులుగల విప్లవకమిటీ నొకదానినికూడ నేర్పాటుచేసెను. ఈ విప్లవ కమిటీలో అందరును సైన్యాధిపతులే. మంత్రివర్గములో తనతో కూడ ఏడుగురుసైనికులును, ఐదుగురు ఇతరులు నున్నారు. ఈ ఏడుగురుసైనికులును విప్లవకమిటీలో సభ్యులు. దేశములో శాంతి నెలకొలుపబడెను. ఎట్టి రక్తపాతము లేకుండగను ఎవ రిని అరెస్టులుచేయకుండగను ఈ సైనికవిప్లవము జరిగినది. అన్నిపార్టీలవారును అన్నిసంఘములును జనరలు అబౌదు ప్రభుత్వమునందు విశ్వాసముకలిగియున్నారు. వీలయినంత త్వరితముగనే యొక ప్రజారాజ్యమును స్థాపింతునని జనరలు అబౌదు ప్రకటించియున్నాడు. సుడాను వైశాల్యము 9 లక్షల 67 వేల 500 చదరపుమైళ్ళు; జనసంఖ్య ఒకకోటి రెండులక్షల తొమ్మిదివేల ఐదువందల ఏబదితొమ్మిదిమంది. రాజధాని ఖార్టూము. దీనిజనసంఖ్య 92 వేలు. మరియొకపట్టణమైన ఓండర్మన్ జనసంఖ్య ఒకలక్ష 13 వేలు. 1957లో ఇండియా ప్రధానమంత్రి జవహరులాలునెహ్రూ ఖార్టూముపట్టణమును దర్శించినపుడు సుడాను దేశీయులు ఆయనకు అదివరకు కనివిని ఎరుగనంత అతి గొప్ప స్వాగతమునిచ్చినారు.

## (5)
## జాతీయపురోగమనము

ఈజిప్టు ప్రభుత్వ బ్యాంకు నేషనల్ బ్యాంకు అయి యున్నది. ఇది ఇండియాలోని రిజర్వుబ్యాంకును పోలియున్నది. అన్ని వర్తకబ్యాంకులును దీనియాజమాన్యముక్రింద నుండ

వలెను. దీనిలో కొంతసొమ్ము నిలువయుంచవలెను. 1957 జనవరి నెలలో ఈజిప్టులోనున్న బ్రిటిషు ఫ్రెంచిబ్యాంకులను, భీమాకంపెనీలను ఈజిప్టుప్రభుత్వము జాతీయముచేసినది. ఐదుసంవత్సరములలోపల ఇతర దేశముల బ్యాంకులను, భీమా కంపెనీలను కూడ జాతీయముచేసెదమని ఈజిప్టుప్రభుత్వము ప్రకటించినది. ఈజిప్టులో పరిశ్రమలువృద్ధిచేయుటకు ప్రభుత్వము ప్రయత్నించుచున్నది. సినాయ్ జిల్లాలో పెట్రోలియము కనుగొనబడ్డది. రెండు పెట్రోలియముకంపెనీలు దానిని త్రవ్వితీయుటకు ప్రయత్నముచేయుచున్నవి. 1956లో 19 లక్షల టన్నుల నూనెమాత్రము తీయబడ్డది. 1956–57 సంవత్సరములో ఈజిప్టుప్రభుత్వపు ఆదా 25 కోట్ల ఈజిప్టు పౌండ్లు. ఖర్చుకూడ అంతే. ఒక ఈజిప్టు పౌండు విలువ 13 రూపాయల పదిఅణాల ఎనిమిదిపైసలు అయివున్నది. ఈజిప్టులో కొన్ని సిమెంటురోడ్లున్నవి. వాటిని వృద్ధిచేయుటకు ప్రయత్నించుచున్నారు. పిరమిడ్లను దర్శించుటకు ప్రతి సంవత్సరము విదేశీయులు విశేషముగా వచ్చుచుందురు. 1956లో ఒకకోటి ఎనుబదిలక్షల పౌండ్లు రోడ్లక్రింద ఖర్చు పెట్టినారు.

నూతన జాతీయప్రభుత్వము దేశప్రజలలో విద్యబాగుగ వ్యాపింపచేయవలెనని గట్టి ప్రయత్నముచేయుచున్నది. ప్రతి సంవత్సరము కొత్త పాఠశాలలు కట్టించుచున్నారు. 1962వ సం॥నాటికి ప్రైమరీ ప్రాథమిక పాఠశాలలు పదివేలు అగునని అంచనా వేసినారు. ప్రైమరీ ప్రాథమికవిద్య ఉచితముగ చెప్ప బడుచున్నది. నిర్బంధముచేయబడినది. ఆదాయ వ్యయపట్టి

కలో నూటికి పదమూడుపాళ్ళు విద్యక్రింద ఖర్చుపెట్టబడు చున్నది. 1951-52 సంవత్సరములో 2 లక్షల 65 వేల 444 మంది బాలురను, 18 వేల 206 మంది బాలికలును ప్రాథమికపాఠశాలలలో చదువుకొనుచుండగ, 1956-57 సం॥లో 12 లక్షల 36 వేల 500 మంది బాలురను, 7 లక్షల 43 వేల మంది బాలికలును ప్రాథమికపాఠశాలలలో చదువుచున్నారు. విద్యాశాఖవారు వయోజనవిద్యవిషయమై ఎక్కువ శ్రద్ధ వహించుచున్నారు. ఇపుడు నూటికి 30 మంది చదువుకొన్న వారున్నారు. ఈజిప్టులో యావత్తువిద్య, విశ్వవిద్యాలయముల లోని ప్రకృతిశాస్త్రములు, ఇంజనీరింగువిద్య సహా అరబు భాషలో నేర్పబడుచున్నది. చాలకాలము ఫ్రెంచి రెండవ భాషగ నుండెను. ఇటీవల ఇంగ్లీషు నెక్కువగ రెండవభాషగ వాడుచున్నారు. ప్రపంచములో ఇండియాలో తప్ప మరి యే దేశములోను విదేశభాషలో తమ బాలబాలికలకు విద్యను గరపుటలేదు. విశ్వవిద్యాలయములలోకి పురాతనమైనది అల్ అఝర్ విశ్వవిద్యాలయము. ఇది కైరోనగరమునం దున్నది. క్రీ.శ. 970లో మయ్యాలరాజులచే స్థాపించబడినది. దీనికి సంబంధించిన కళాశాలలలో షుమారు 16 వేలమంది విద్యార్థులు, విద్యార్థినులు చదువుకొనుచున్నారు. 1908లో ఈజిప్షి యను విశ్వవిద్యాలయము కైరోనగరమునందు స్థాపించబడి నది. ఇందులో 27 వేలమంది విద్యార్థులు, విద్యార్థినులు ఉన్నారు. 1919లో అమెరికావారు ఒక విశ్వవిద్యాలయమును కైరోలో స్థాపించియున్నారు. 1942లో అలెగ్జాండ్రియా విశ్వ విద్యాలయము స్థాపించబడ్డది. ఇందులో 11 వేలమంది విద్యార్థులు, విద్యార్థినులు ఉన్నారు. 1950లో అయెన్‌షాము

విశ్వవిద్యాలయము స్థాపించబడ్డది. ఇందులో 18 వేలమంది విద్యార్థులు, విద్యార్థినులు చదువుకొనుచున్నారు. 1957లో అనూబా విశ్వవిద్యాలయము స్థాపించబడ్డది. ఈ అన్ని విశ్వవిద్యాలయములలోకూడ ప్రకృతిశాస్త్రములు, ఇంజనీరింగు, లా, వ్యవసాయము, వర్తకవ్యాపారములు, వైద్యము, చరిత్ర, సాంఘికశాస్త్రములు నేర్పబడుచున్నవి. ఈజిప్టు దేశములో స్త్రీలయుద్యమము బాగుగా వ్యాపించినది. మదాం జగ్లులుపాషా స్త్రీలయుద్యమమును జయప్రదముగ నడిపినది. స్త్రీలు జాతీయ స్వతంత్రపోరాటములో పురుషులతో పూర్తిగ సహకరించినారు. పర్దాను త్యజించినారు. స్త్రీలకు ఓట్లు ఇవ్వబడినవి. శాసనసభలో స్త్రీసభ్యురాండ్రు గలరు. అన్ని తరగతుల పాఠశాలలలోను, విశ్వవిద్యాలయములలోను బాలురును, బాలికలును కలిసియే విద్యనభ్యసించుచున్నారు. అన్ని యుద్యోగములలో స్త్రీలు ప్రవేశించుచున్నారు. వారికి పురుషులతో సమానముగ ఆస్తిహక్కులు కలవు.

ఇవిగాక పరిశ్రమలు, సాంకేతికవిద్యలు, కళలు, చిత్తరువులు మొదలగువాటిని నేర్పు ఉన్నతపాఠశాలలు గలవు. చిత్రవస్తుప్రదర్శనశాలలు, పరిశోధనాలయములు, గొప్ప గొప్ప గ్రంథాలయములుకూడ కలవు. అలెగ్జాండ్రియా విశ్వవిద్యాలయపు గ్రంథాలయములో పదిలక్షల గ్రంథములు కలవు. ఈజిప్షియను లైబ్రరీలో 2 లక్షల 28 వేల అరబు గ్రంథములును, 3 లక్షల 67 వేల యూరోపియను భాషల గ్రంథములును గలవు. అల్ అఝర్ విశ్వవిద్యాలయపు గ్రంథాలయములో 85 వేల గ్రంథములు గలవు. ఇంక ననేక

పెద్దపెద్ద గ్రంథాలయములు ఈజిప్టులో నున్నవి. అలెగ్జాం డ్రియానగరములో ఐదు అరబుభాషలో ప్రచురింపబడు దినపత్రికలు, ఐదు ఫ్రెంచిభాషలో ప్రచురింపబడు దినపత్రికలు గలవు. కైరోనగరములో ఆరు అరబుభాషలో ప్రచురింపబడు దినపత్రికలును, మూడు ఫ్రెంచిభాషలో ప్రచురింపబడు దినపత్రికలును, ఒక ఇంగ్లీషుభాషలో ప్రచురింపబడు దినపత్రికయును గలవు. ఇవేగాక అనేకమైన వారపత్రికలు, మాసపత్రికలు గలవు. పాత మతకోర్టులను తీసివేసి, నవీన ప్రభుత్వ న్యాయస్థానములను ఏర్పరచియున్నారు. మతకోర్టులను పూర్తిగ రద్దుచేసిన మొదటి అరబుదేశము ఈజిప్టుదేశమే. అన్ని న్యాయస్థానములు అరబుభాషలోనే నడచుచున్నవి. యావత్తుశాసనములు అరబుభాషలోనే చేయబడుచున్నవి. ఈ దేశపురాజధానినగరము కైరో. దీని జనసంఖ్య 21లక్షలు. అలెగ్జాండ్రియానగరముయొక్క జనసంఖ్య 9 లక్షల 25వేలు. ఈజిప్టుదేశముయొక్క మతము సున్నీశాఖకు చెందిన ఇస్లాము. దేశములో పదిలక్షలమంది క్రైస్తవులున్నారు. వారికి కాప్టులని పేరు.

# అరబు జాతీయత

## (1)

### ఈజిప్టు ఇండియాల మైత్రి

మొదటినుంచి ఈజిప్టు, ఇండియా దేశముల జాతీయ వాదులొకేవిధమున బ్రిటిషుప్రభుత్వముతో స్వాతంత్రము కొరకు పోరాడి జయములను పొందినారు. స్వాతంత్రపోరాటములకాలములో కూడ తమమధ్య అత్యంతమైన సానుభూతిని, స్నేహవాత్సల్యములనుకలిగియున్నారు. రెండుమూడు సార్లు వాఫ్దుపార్టీప్రతినిధులు ఇండియాలోని కాంగ్రెసుమహాసభలకు హాజరైరి. భారత ముసల్మానుసంఘప్రాతినిధ్యమును వహించిన ముస్లింలీగుమహాసభలకు వారు పోలేదు. వారు గొప్ప జాతీయవాదులుగాని కులతత్వవాదులు కారు. అందువల్ల జాతీయతత్వము మూర్తీభవించిన ఇండియన్ నేషనల్ కాంగ్రెసుమహాసభలకే వారు వచ్చిరి. తమదేశముయొక్క స్నేహవాత్సల్యములను ప్రకటించిరి. భారతదేశ స్వాతంత్రపోరాటముయొక్క జయమును గాఢముగ వాంఛించిరి. 1931 లో బొంబాయిలో అఖిలభారతకాంగ్రెసుకమిటీసమావేశముజరిగి, మహాత్మాగాంధిగారిని లండనులో జరిగెడు రెండవ రౌండు టేబిలుకాన్ఫరెన్సుకు (Second Round Table Conference) ఏకైకప్రతినిధిగ పంపగ, ఆయన బొంబాయినుంచి స్టీమరులో

పయనమై లండనుకు పోయెను. సరోజినీదేవి ఆయనతో వెళ్లినది. త్రోవలో ఈజిప్టుదేశముయొక్క సముద్రతీరములో నిపోర్టుసయ్యాదురేవులో మహాత్మా గాంధీగారు పోవుచున్న పొగయోడ ఆగినపుడు, అపుడు వాఫ్డుపార్టీకి నాయకుడుగనున్న నహాసుపాషా మహాత్మాగాంధీగారిని చూడవలెనని ఇచ్ఛగించినను, ఆంగ్లప్రభుత్వముయొక్క నిర్బంధనిషేధములవల్ల గాంధీగారిని చూచి మాట్లాడుటకు వీలులేకపోయినది. కీర్తిశేషులైన జగ్లుల్‌పాషాగారి ధర్మపత్ని మదాం జగ్లులుపాషా వాఫ్డుపార్టీసందేశమును తీసుకొనివచ్చి మహాత్మాగాంధీగారిని దర్శించి వాఫ్డుపార్టీయొక్క ఈజిప్టుజాతియొక్క శుభాకాంక్షలను తెలిపినది. ఏ విదేశప్రభుత్వము భారతదేశమునకు సంకెలలుంతగిలించి దాస్యమునందుంచియున్నదో, ఆవిదేశప్రభుత్వమే వాఫ్డుపార్టీనాయకులను గాంధీజీని కలియకుండ నిర్బంధముచేసినదని నహాసుపాషా వ్రాసినఉత్తరమును ఆమె మహాత్మాగాంధీగారికి అందించినది. ఆమె స్వాతంత్రపోరాటములో తనభర్తకెంతయో తోడ్పడినవిదుషీమణి. ఆయన దేశభ్రష్టుడుగావించబడినపుడు నిర్బంధితుడైనపుడు అనారోగ్యవంతుడైనపుడు ఆమె వాఫ్డుపార్టీకి కన్నతల్లివలె సలహాలనిచ్చి సహాయపడుచుండెను. భారతదేశ స్వాతంత్రపోరాటము 1947 ఆగస్టు 15 తేదీన సంపూర్ణముగ జయమొందింది, 1950 లో భారతదేశము బ్రిటిషుప్రభుత్వముతో పూర్తిగ విడిపోయి, రాజులు, ప్రభువులు లేని సంపూర్ణప్రజాస్వామ్యమును, కులమత విచక్షణలేకుండ ప్రతి పురుషునికిని స్త్రీకిని ఓటుహక్కుగల ప్రజారాజ్యమును (డెమోక్రసీని) స్థాపించుకొనుట ఈజిప్టుజాతీయ

వాదులను తమ దేశ సంపూర్ణస్వాతంత్రముకొరకును, ప్రజా స్వామ్యమును (రిపబ్లికును) స్థాపించుటకొరకును తీవ్రకృషి సలుపుటకు బాగుగా పురిగొల్పినదనుటలో సందేహములేదు. ఈజిప్టులో సంపూర్ణ స్వతంత్రస్థాపనము జరిగిన పిమ్మట సంపూర్ణ స్వతంత్రస్థాపకుడును, ఈజిప్టురిపబ్లికు అధ్యక్షుడును ప్రధానమంత్రియు నైన కల్నల్ నాసర్ ప్రతివిషయములోను భారతదేశ ప్రధానియైన పండిత జవహరులాలు నెహ్రూతో నేకీభవించి అనుంగుసోదరునివలె కలసిమెలసి పనిచేయుచు న్నాడు. భారతదేశమువలెనే అటు అమెరికాకూటములోను, ఇటు రష్యాబృందములోను చేరకుండ తటస్థముగనున్నాడు. పంచశీలసిద్ధాంతములను అవలంబించియున్నాడు. 1955 లో జరిగిన బాండుంగ్‌సమావేశములో ఇతర ఆసియా, ఆఫ్రికా రాజ్యములతోపాటు పాల్గొని ప్రముఖపాత్రను వహించినాడు. భారతదేశమునకు వచ్చి, ప్రధాని నెహ్రూతో సంప్రతింపులు జరిపినాడు. ప్రధానినెహ్రూకూడ కొన్నిసార్లు కైరోనగర మును దర్శించియున్నాడు. 1956 లో సూయజుకాలువను కల్నలు నాసరు జాతీయముచేసినపుడు జరిగిన కల్లోలములో ఇండియా ఎంతగనో ఈజిప్టుకు తోడ్పడినది. 1959 లో ఆసియా, ఆఫ్రికా దేశముల ఆర్థికసమావేశము, యువజన సమావేశము ఈజిప్టురాజధాని కైరోనగరములో జరిగినవి. ఇరాకు మాత్రము దానికి హాజరుకాలేదు ఆశియా, ఆఫ్రికా ఖండముల జాతీయతత్వమునకు, ప్రజారాజ్యమునకు, స్వాతం త్రమునకు పండిత జవహరులాలు నెహ్రూగారితోపాటు కల్నల్ నాసర్‌కూడ ప్రధాననాయకుడుగ నేడు విలసిల్లు

చున్నాడనుటలో అతిశయోక్తి లేదు. కల్నలు నాసర్ అరబు జాతీయతత్వమును పూర్తిగ నవలంబించినవాడు. అరబులంద రు నొకేజాతియని నమ్మువాడు. అరబులఐక్యతకు, స్వతంత్ర మునకు, ఆర్థికాభివృద్ధికి, అరబుజాతుల సమ్మేళనమునకు విశే షముగ ప్రయత్నించుచున్నాడు. కైరోలో అరబుజాతుల సమావేశము జరిపి యొక అరబుబ్యాంకిని స్థాపించియున్నాడు. అరబుజాతీయతత్వముతో ఇండియాకు పూర్తియగు సాను భూతి కలదు. ఇది మతతత్వము కాదు. కేవలము అరబుల రాజకీయ, ఆర్థిక, సాంఘిక, వైజ్ఞానిక ఐక్యత.

(2)

యవ్వన అరబు కక్షి

పశ్చిమఆసియాలో (1) (మెసపొటేమియా) ఇరాకు, (2) సిరియా (3) పాలెస్తీను (4) అరేబియా దేశములు చాల ప్రాచీననాగరికతగల దేశములు. క్రైస్తవమతము పాలెస్తీనులో రోమనుపాలకులచే బలవంతముగ చొప్పించబడినప్పటినుంచి పాలస్తీనులోని యూదులు చాలవరకు ఆ దేశమును వదలి, ప్రపంచములోని వివిధదేశములలోనివసించుచు నాయా దేశము లలో ధనమును, విద్యను ఆర్జించి ప్రముఖులైనారు. అరేబియా దేశములో జన్మించిన మహమ్మదుప్రవక్త క్రీ. శ. ఏడవశతాబ్ద మునుంచి ముసల్మానుమతమును స్థాపించి ఈనాలుగు దేశముల మీద తనరాజ్యమునువ్యాపింపచేసెను. ఈనాలుగు దేశములు ముసల్మానుమతమును స్వీకరించినవి. అరబుభాషను, అరబు నాగరికతను, అరబువిజ్ఞానమును అవలంబించినవి. అరబు

దేశములైనవి. ఈ విధముగ పాలస్తీనుకూడ అరబు దేశమైనది. అచటకూడ అత్యధికసంఖ్యాకులు ముసల్మానులై యున్నారు. ఈ అన్ని దేశములలో క్రైస్తవులు, యూదులు అల్పసంఖ్యాకులై యున్నారు. మహమ్మదుప్రవక్త స్థాపించిన అరబు ముసల్మానుసామ్రాజ్యము, ఆయనయొక్క వారసులైనఅబూబకరు, ఓమరు, ఉస్మాన్ ఖలీఫాలకాలములో తూర్పున చైనా మొదలు పడమర స్పెయినువరకు వ్యాపించెను. ఈ ఖలీఫాలకాలములో అరేబియా దేశములోని మదీనానగరమే రాజధానిగా నుండెను. పిమ్మట ఈ సామ్రాజ్యపురాజధాని సిరియాలోని డెమాస్కస్‌నగరములో కొంతకాల ముండినది. అటుపిమ్మట ఇరాకు బాగ్దాద్‌నగరమునకు వచ్చినది. డెమాస్కసులోను బాగ్దాదులోను గొప్ప అరబు విశ్వవిద్యాలయములు విలసిల్లినవి. భరతవర్షమునుండి గణిత, జ్యోతిష, వేదాంత, వైద్య, ప్రకృతిశాస్త్రవిజ్ఞానములు విశేషముగ నా రెండు విశ్వవిద్యాలయములకు ప్రవహించినవి. ఈ అరబు దేశములనుండియే నా విజ్ఞానము యూరపుఖండమునకు తీసుకుపోబడినది. క్రీస్తుశకము 16 వ శతాబ్దములో ఈ అరబు దేశములన్నియు ప్రక్కనున్న తురుష్క దేశమునుండి విజృంభించిన తురుష్కసామ్రాజ్యముక్రిందికి వచ్చినవి. అప్పటినుంచి మొదటి ప్రపంచ యుద్ధము ముగియువరకు, అనగ 1918 వరకు తురుష్కసామ్రాజ్యములో భాగములైయుండెను. తురుష్కులు ముసల్మానులే గాని అరబులు కారు. 18 వ శతాబ్దమునుండి పాశ్చాత్య జాతులు, ముఖ్యముగ ఆంగ్లేయులు, ఫ్రెంచివారు, తురుష్క సుల్తానుల అనుమతితో ఈ అరబు దేశములలోగూడ వర్తక

వ్యాపారములను చేయుట, రైలు వేలను వేయుట, బ్యాంకులను స్థాపించుట మొదలైన పనులను సాగించిరి. సిరియాలో ఫ్రెంచివారివలుకుబడి, ఇరాకులో ఆంగ్లేయులవలుకుబడి వ్యాపించినది. ఫ్రెంచివారును, ఆంగ్లేయులును పాఠశాలలను, విశ్వవిద్యాలయములను స్థాపించి, కొంతవరకు తమతమ భాషలను నేర్పి తమతమ విజ్ఞానములను వ్యాపింపచేసిరి. ముఖ్యముగ సిరియావారు పాశ్చాత్యదేశములకు, అమెరికాఖండమునకు కూడ పోయి విద్యాభ్యాసముచేసియు, వర్తక-వ్యాపారములు చేసియు తిరిగివచ్చుచుండిరి. ఇటుల పాశ్చాత్యనాగరికతకూడ కొంతవరకు ఈ అరబులలోని పై తరగతులవారిలో 19 వ శతాబ్దము మధ్యభాగమునాటికి వ్యాపించినది. 19 వ శతాబ్దము రెండవభాగములో తురుష్క సామ్రాజ్యాధీశులక్రింద తా మనుభవించుచున్న నిరంకుశత్వమునుండి, కష్టములనుండి తొలగించుకొని, స్వతంత్రమును పొందవలెననుఅభిలాష ఈ అరబుదేశములలో కలిగెను. ప్రధానముగ సిరియాలోను ఇరాకులోను యవ్వన అరబు జాతీయశక్తి స్థాపించబడి పనిచేయసాగినది. అరేబియాదేశములో ఇబనుసౌదు నాయకుడుగనున్న వాహాబితెగలవారిలో కూడ అరబుజాతీయత బాగుగ వ్యాపించినది. ఈ అరబుదేశములన్నియు కలసి ఒకే అరబుదేశమగుట, తురుష్కమునుండి స్వతంత్రమునుపొందుట వారియుద్దేశ్యము. అరబుభాష పునరుద్ధరింపబడినది. తురుష్కములో గాక అరబుభాషలోనే పరిపాలన జరుగవలెనని, విద్యాబోధనయంతయు జరుగవలెననియు అరబుజాతీయవాదులు తీర్మానించిరి. అరబుస్వతం

త్రమును, అరబుఐక్యతను ప్రబోధముగావించు గ్రంథములు, పత్రికలు వెలువడెను. ఇటుల వ్రాసినవారిలో ముసల్మానులు, క్రైస్తవులు, స్త్రీలుకూడ గలరు. వీరిని తురుష్క ప్రభుత్వము కఠినముగా నణచుచుండెను. కొన్నిసార్లు తురుష్క ప్రభుత్వముపై తిరుగుబాట్లు జరుగుచుండెను. వాటిని తురుష్క ప్రభుత్వము క్రూరముగ నణచివైచెను. అరబుజాతీయవాదులు పెక్కుబాధలకు లోనైరి. పలువురు వీరస్వర్గమలంకరించిరి. ఇటుల జరుగుచుండగ మొదటి ప్రపంచయుద్ధము 1914 లో ప్రారంభమయ్యెను. తురుష్క ప్రభుత్వము జర్మనీతో చేరెను. ఆంగ్ల ఫ్రెంచి, ఇటాలియను సేనలతో పోరాడెను. అమెరికా వారుకూడ ఆంగ్లేయులపక్షమున చేరిరి. యుద్ధకాలములో ఆంగ్లేయులును, ఫ్రెంచివారును అరబుజాతీయతత్వమును ప్రోత్సహించిరి. ఇందుకు ప్రత్యేకముగ ఆంగ్లేయప్రభుత్వ ఏజంటయిన కల్నల్ లారెన్సు పనిచేసెను. ఇదిగాక ప్రవక్త మహమ్మదువంశీకుడైనమక్కా షెరీఫ్‌హుస్సేను వహాబీలనాయకుడైన ఇబనుసాదు మొదలైనవారిని విశేషద్రవ్యమిచ్చి లోబరచుకొని, అరబులచేత ప్రతిచోటను తురుష్కులపై తిరుగుబాట్లనుచేయించిరి. యుద్ధము ముగియగనే అరబులకు స్వాతంత్రము, ఐక్యత కలుగునని బహిరంగహామీలనిచ్చిరి. అమెరికాఅధ్యక్షుడగు విల్సనుసభాపతి ప్రకటించిన పదునాలుగు సూత్రములలో అరబుప్రజలకు స్వయంనిర్ణయాధికారము కలదు. కాని లోలోపల రహస్యముగ ఈ అరబు దేశములను ఆంగ్లేయులును, ఫ్రెంచివారును పంచుకొను ఒడంబడికలను చేసుకొనుచుండిరి. బహిరంగహామీలను, విల్సనుసభాపతి

నూత్రములను అరబులు నమ్మి మిత్రమండలివారిజయము నకు తోడ్పడిరి.

(3)

## అరబుజాతులు చిన్నచిన్న ముక్కలుగ చేయబడినవి

1918లో ప్రపంచయుద్ధము ముగియగనే తురుష్క సామ్రాజ్యము సాంతముగ విచ్ఛిన్నముచేయబడినది. కాని అరబుజాతులకు ఐక్యతకాని, స్వతంత్రముకాని రాలేదు. అరబుజాతీయనాయకులను సంప్రదించకుండగనే 1919లో జరిగిన సంధిసమావేశములలో ఈ అరబుదేశములను ఆంగ్లేయులును, ఫ్రెంచివారును పంచుకొనిరి. వారు అరేబియా దేశమును మక్కా షెరీఫు హుస్సేనుకు స్వాధీనపరచగ, ఆయననోడించి 1926లో ఇబన్‌సాదు రాజ్యాధికారమును వహించెను. ఇబన్‌సాదుయొక్క రాజ్యాధికారమును ఆంగ్లేయులు ఒప్పుకొనకతప్పలేదు. మక్కాషెరీఫు విదేశముల పాలయ్యెను. సిరియాను ఫ్రెంచివారికి మాండేటరీరాజ్యముగ నప్పగించిరి. ఆ దేశములోని అరబులు ఫ్రెంచివారిపై తిరుగుబాట్లను సాగించిరి. అందుచేత సిరియాలో ఒకభాగమైన లెబనానులో క్రైస్తవులెక్కువమంది కాపురమున్నారను మిషతో సిరియానుండి వేరుచేసి ఆ రెండు దేశములను ఫ్రెంచివారే మాండేటురాజ్యములుగ పాలించసాగిరి. మాండేటరీ పాలన మనగ కొంతకాలము పాలించి ఆ దేశస్తులకు స్వపరిపాలనను క్రమముగా నేర్పి, పిమ్మట సంపూర్ణస్వతంత్రమును కలుగజేయుటయ్యున్నది. పాలెస్తీనుదేశములోకి ప్రపంచ

ములో నివసించుచున్న యూదులను తీసుకొనివచ్చి మరల నా దేశమును వారికి మాతృదేశముగగావించి వారి నచట కాపురముంచవలెనని ఆంగ్లేయులు, ఫ్రెంచివారు, అమెరికనులు సంకల్పించిరి. అటులచేతుమని యుద్ధకాలమున ఆంగ్ల మంత్రి బాల్ఫరు ప్రకటచేసియుండెను. వేలకొలది యూదులు వచ్చి పాలెస్తీనులో కాపురముండసాగిరి. ఇరాకులోనుండి ఒక చిన్నభాగమైన జోర్డానును విడదీసిరి. ఇరాకును మక్కాషెరీఫుకుమారుడైన అమీరీ ఫైసల్ అను రాజుక్రిందనూ, జోర్డానును ఆయనయొక్క మరియొక కుమారుడైన అమీర్ అబ్దుల్లా అను రాజుక్రిందను నుంచి రెండు దేశములమీదను బ్రిటిషువారు తమ మాండేటరీ పాలనమును సాగించిరి. సిరియాలోను, ఇరాకులోను జరుగుచున్న అరబుల తిరుగుబాట్లను ఫ్రెంచివారును, ఆంగ్లేయులును కఠినముగ అణచి వేయుచుండిరి. ఈ అరబువిభాగమునకు, మాండేటరీ పాలనమునకు నానాజాతుల సమ్మేళనమువారు అంగీకరించిరి. ఆ సమ్మేళనము ఆంగ్ల ఫ్రెంచిప్రభుత్వముల పలుకుబడిలోనున్న కపటనాటకసంస్థ. ఇంతేగాక అరేబియా రాజ్యమునుండి విడదీసి కొన్ని అరబుసంస్థానములను ఆంగ్లేయులు తమ సంరక్షకత్వముక్రిందను, లేదా పలుకుబడిక్రిందను ఉంచుకున్నారు. వాటిలో ఒక లక్ష ఏబదివేల జనసంఖ్యగల కువైటు, ఒక లక్ష ఇరువదియైదువేల జనసంఖ్యగల బహిరేను, ముప్పదివేల జనసంఖ్యగల కాటారు, ఎనుబదివేల జనసంఖ్యగల డ్యూబే సంస్థానముల బృందము ప్రత్యేక అరబురాజులక్రింద నుంచబడి, 1948 సంవత్సరపు బ్రిటిషునేషనాల్టీ చట్టప్రకారము

బ్రిటిషుప్రభుత్వముక్రింద సంరక్షకరాజ్యములుగ చేయబడి నవి. వీటి విదేశవ్యవహారములన్నియు ఇంగ్లాండుక్రిందనే యున్నవి. వీటిమీద నొక బ్రిటిషురెసిడెంటు బహిరేనులో నుండును. అయిదులక్షల ఏబదివేల జనసంఖ్యగల మస్కటు అండు ఓమనుసంస్థానము బ్రిటిషువారి ప్రత్యేక యొడంబడి కలో నున్నది. మస్కటులో బ్రిటిషుకాన్సలు జనర లుంచ బడినాడు. ఇవిగాక ఒకలక్ష ముప్పదిఎనిమిదివేల జనసంఖ్య గల ఏడెనురాజ్యము బ్రిటిషువారి సొంతపాలనములో నున్నది. దానికానుకొని వివిధ అరబుప్రభువులక్రింద తూర్పు సంరక్షక రాజ్యమని, పశ్చిమ సంరక్షకరాజ్యమని బ్రిటిషువారిచేత సృష్టించబడి వారి యాజమాన్యమున నున్నవి. తూర్పు సంరక్షకరాజ్యపు జనసంఖ్య నాలుగులక్షలమంది. పశ్చిమ సంరక్షకరాజ్యపు జనసంఖ్య మూడులక్షల ఏబదివేలు. ఇవన్నీ గాక యేమను పేరుగల నొక అరబురాజ్యము 75 వేల చదరమైళ్ళ వైశాల్యమును, ఏబదిలక్షల జనసంఖ్యను గలిగి యున్నది. దాని రాజగు ఇమాము అహమ్మదు ఇబను యాహ్యానసిరుద్దీన్ అల్లా కొంతకాలము బ్రిటిషు అమెరికా వారి పలుకుబడిలో నడచి, నెమ్మదిగ తప్పించుకొని స్వతం త్రుడై ఈజిప్టు అధ్యక్షుడైన కల్నల్ నాసరు అడుగుజాడలలో నడచుచున్నాడు. పాలస్తీనులోకి నూతనముగ కాపురమునకు వచ్చుచున్న యూదులకును, షుమారు పదిహేనువందల సంవత్సరములనుంచి ఆ దేశము నాక్రమించుకొని కాపుర మున్న అరబులకును ఆంగ్లేయులు ఎంత ప్రయత్నముచేసినను రాజీకుదరలేదు. అత్యధికసంఖ్యాకులుగనున్న అరబులను, ఆ

దేశములో స్వల్పసంఖ్యాకులుగచేయు ప్రయత్నమునకు అరబులు సహించలేకపోయిరి. కొంత మితమైన సంఖ్యగల యూదులను ఆ దేశములో తెచ్చిపెట్టినట్లయిన తమ కభ్యంతరములేదని అరబులు చెప్పిరి. తమ కొక సంపూర్ణరాజ్యాధికారముగల మాతృదేశము తమ రెంతమంది వచ్చి కాపురమున్నను అభ్యంతరములేని అధికారముతో కావలెనని యూదులు పట్టుబట్టిరి. తుదకు 1948లో ఐక్యరాజ్యసమితి వారు పాలెస్తీనులో ప్రధానభాగమును ఇజ్రాయిలు అను పేరున యూదుల మాతృగృహముగ, సంపూర్ణ హక్కులు గల స్వంతరాజ్యముగ గావించి, మిగిలిన కొద్దిభాగములను జోర్డానులో కొంత, ఈజిప్టులో కొంత చేర్చిరి. అప్పటినుంచి ఇజ్రాయిలుకు లక్షలకొలది యూదులు కాపురమువచ్చిరి. యూదులు విశేషభాగ్యవంతులైనందున అరబుల భూములను ఎంతధరకైనను కొనుక్కొని, ఇజ్రాయిలులోనున్న భూములను, గనులను పూర్తిగ స్వాధీనపరచుకున్నారు. ఎదురుతిరిగిన అరబులను హత్యగావించినారు. అరబుగ్రామములను తగులబెట్టినారు. ఆవిధముగ అరబులను ఇజ్రాయిలునుంచి వెడలగొట్టి, యూదులు అత్యధికసంఖ్యాకులుగ ఇజ్రాయిలులో కాపురమున్నారు. తొమ్మిదిలక్షలమంది అరబులు యూదులుపెట్టు బాధలను సహించలేక ఇజ్రాయిలును వదలిపెట్టి ప్రక్కనున్న లెబనాను, సిరియా, జోర్డానులలోనికి చేరి, అచట కాందిశీకులుగ నివసించుచున్నారు. ఇజ్రాయిలు వైశాల్యము 7,9[illegible]8 చదరపుమైళ్ళు; జనసంఖ్య 19,40,430 మంది. ఇందులో నిప్పుడు 17,33,168 మంది యూదులు,

1,40,000 మంది మాత్రమే ముస్లిములు. 87 వేలమంది క్రైస్తవులు కలరు. అందువల్ల ఇది పూర్తిగ యూదుల దేశమైనదని చెప్పవలసియున్నది. ఇది రాజులేని సంపూర్ణ ప్రజాస్వామ్యము. ప్రక్కనున్న అరబుదేశములకును, ఇజ్రాయిలుకును ఎట్టి సంధి కుదురుటలేదు. నిరంతరకలహములు సాగుచున్నవి. అరబుదేశములైన ఈజిప్టు, సౌదీ అరేబియా, జోర్డాను, సిరియా, లెబనాను, ఇరాకుదేశములు కలసి 1948లో ఇజ్రాయిలుమీద దండెత్తి, దానిని జయించవలెనని ప్రయత్నముచేసినారు. కాని జయప్రదముకాలేదు. యూదులకు ఆంగ్లో అమెరికనుల సహాయ మెక్కువ కలదు. వారి మద్దతువల్ల ఇజ్రాయిలు బలవంతమైన, ధనవంతమైన దేశమైనది. వ్యవసాయము, పరిశ్రమలు బాగుగ వృద్ధిచెందినవి. అంతేగాక ఇజ్రాయిలుయొక్క పారిశ్రామికసరకులు ప్రక్కనున్న అరబుదేశములలోనికి వచ్చి అమ్మకమగుచున్నవి. ఇది అరబుల ఆర్థికపతనమునకుకూడ కారణమగుచున్నది. ఇటుల ఒక ఇజ్రాయిలుదేశమను నూతనసృష్టిచేసి, ఆంగ్లో అమెరికనులు అరబులను బలహీనపరచినారు. ఇజ్రాయిలు దేశీయులకు ఆయుధములనుకూడ ఆంగ్లో అమెరికనులు కావలసినన్ని సరఫరాచేయుచున్నారు. ఇజ్రాయిలుదేశము అరబుజాతులకన్నిటికిని ప్రక్కలోబల్లెముగ నున్నది. లేచిపోయిన కాందిశీకులనుకూడ ఏ షరతులపైనను మరల ఇజ్రాయిలులోనికి వచ్చుటకు యూదులు ఒప్పుకొనుటలేదు. ఈ సమస్య పశ్చిమాసియా అరబుజాతులయొక్క కఠినమైన ప్రత్యేక సమస్యయైనది. ఇందువల్లకూడ ఆంగ్లో అమెరికనుల

యందు వ్యతిరేకభావము అరబుజాతులన్నిటిలో వ్యాపించి యున్నది.

## మాండేటరీ ప్రభుత్వ మంతమైనది

సిరియాలోని జాతీయవాదులు అనేకసారులు ఫ్రెంచి ప్రభుత్వముపై తిరుగుబాటుచేసినారు. షుక్రీ కువాట్లీ సిరియా జాతీయవాదులకు ప్రధాననాయకుడు. ఆయనను తురుష్క ప్రభుత్వము, ఆపిమ్మట ఫ్రెంచిప్రభుత్వముకూడ అనేక సంవత్సరములు దేశభ్రష్టునిగావించిరి. ఆయన ఈజిప్టుకు పోయి నివసించి, అచ్చటి జాతీయనాయకులతో కలిసి పనిచేసెను. ఫ్రెంచివారు తమ సైనికబలముతో ఆ తిరుగుబాట్లను అనేక సారులు అణచివేసినారు. తుదకు 1941లో సిరియా ప్రజా స్వామ్యముయొక్క సంపూర్ణస్వతంత్రమును ఫ్రెంచివారు అంగీకరించి లేచిపోయినారు. సిరియా ఐక్యరాజ్యసమితి సభ్యరాలుగ చేర్చుకొనబడినది. ద్వితీయ ప్రపంచ సంగ్రామము ముగిసినపిమ్మట 1945లో ఐక్యరాజ్యసమితి యేర్పడి పనిచేయుచున్నది. సిరియా వైశాల్యము 72 వేల చదరపుమైళ్ళు, జనసంఖ్య 40 లక్షల 25 వేలు.

లెబనాన్ దేశముకూడ అరబుజాతీయతత్వముతోనే నిండియుండెను. అచటనున్న క్రైస్తవులుకూడ అరబులే. ముస్లిములతో కలిసి తమదేశమునకు స్వతంత్రము కావలెనని పోరాటముసలిపిరి. ఫ్రెంచివారు దానిని కఠినముగ నణచి వేయుచువచ్చిరి. 1943లో లెబనాన్ జాతీయవాదులు ఫ్రెంచి వారికి సంబంధములేని స్వతంత్రప్రజాస్వామ్యముగ నొక

రాజ్యాంగవిధానమును తమ దేశమునకు నిర్ణయించుకొనగ, ఫ్రెంచివారు లెబనాన్ అధ్యక్షుని అరెస్టుచేసి ఆ రాజ్యాంగ విధానమును అమలుజరుగకుండ చేసిరి. కాని మిగత అరబు దేశములు, అమెరికా, ఇంగ్లండు కూడ లెబనాన్ దేశము స్వతంత్రముగనుండుటకు సహాయపడినందున, 1944 నుండి క్రమముగ ఫ్రెంచివారు లెబనాన్ స్వతంత్రపాలనమునే సాగ నిచ్చి, 1946లో పూర్తిగ తమసేనలను లెబనాన్‌నుంచి తీసి వేసిరి. 1946 నుంచి లెబనాన్ సంపూర్ణ స్వతంత్రమును పొంది, ఐక్యరాజ్యసమితిలో సభ్యత్వమును సంపాదించెను. ఈ దేశముయొక్క వైశాల్యము 4,015 చదరపుమైళ్ళు. దీని జనసంఖ్య 14 లక్షల 25 వేలు. ముసల్మానులు, క్రైస్తవులు కూడ దాదాపుగ సమానముగనే యున్నారు. అందరును అరబుభాషనే మాట్లాడెదరు. సిరియా, లెబనాన్ దేశములు రెండు రాజులేని సంపూర్ణ ప్రజాస్వామ్యములు.

ఇరాకులోకూడ ఆంగ్లేయులమీద తిరుగుబాట్లు జరిగెను. ఆ తిరుగుబాట్లను ఆంగ్లేయులు సైనికశాసనము ప్రకటించి అణచివేసిరి. దానిమీద నేర్పరచబడిన అరబురాజగు అమీర్ ఫైసలు ఏదోవిధముగ శాంతిని నెలకొల్పి 1930లో ఆంగ్లేయులతో రాజీపడి, వారికి కొన్ని విమానాశ్రయములను, సైనికహక్కులను, ఇచ్చి, 1932లో ఆంగ్లేయుల మాండేటరీపాలనను అంతమొందింపచేసుకొని, ఇరాకును నానాజాతుల సమ్మేళనములో స్వతంత్రసభ్యురాలుగ గావించుకొనెను. ఇరాకు అప్పటినుంచి స్వతంత్రదేశమైనది. దీని వైశాల్యము 1,43,250 చదరపుమైళ్ళు. జనసంఖ్య 50 లక్షలు.

జోర్డాను పైన బ్రిటిషువారికిగల మాండేటరీహక్కును 1946 మార్చినెలలో వదలుకొని, జోర్డానును అబ్దుల్లారాజు క్రింద సంపూర్ణ స్వతంత్రదేశముగ అంగీకరించినారు. ఐక్యరాజ్యసమితిలో జోర్డాను సభ్యురాలైనది. అబ్దుల్లారాజు 1951 లో జెరూసలెములో హత్యగావింపబడినాడు. ఆయన మనుమడైన హుస్సేనురాజు జోర్డానుకు రాజుగ పట్టాభిషిక్తుడైనాడు. ఆయనయే ఇప్పటికి జోర్డానుయొక్కరాజు. జోర్డాను వైశాల్యము 37,500 చదరపుమైళ్ళు. జనసంఖ్య 15 లక్షలు.

సౌదీ అరేబియా 1926 లోనే ఇబన్‌సౌదురాజుక్రింద స్వతంత్రమునుపొంది నానాజాతులసమ్మేళనములో స్వతంత్ర సభ్యురాలైనది. ఇబన్‌సౌదురాజు 1953 లో డెబ్బదియొకటవ ఏట మరణించినందున, ఆయనకుమారుడగు ఫెయిజలు అల్ ఇబన్‌సౌదు రాజైనాడు. వైశాల్యము 9 లక్షలచదరపుమైళ్లు. జనసంఖ్య 70 లక్షలు. ఈ దేశములో చాలభాగము ఇసుక ఎడారులతో నిండియున్నది. ఈ దేశములోనే మహమ్మదు ప్రవక్తజన్మించి, తనఏకేశ్వరోపాసనమతమునుబోధించి అరబు రాజ్యమును స్థాపించెను. ఈ దేశములోనున్న మక్కా, మదీనా, జెడ్డా పట్టణములు లోకములోనిముసల్మానులకందరికిని ఇప్పటికినీ యాత్రాస్థలములు.

(4)

## పెట్రోలియంగనులు

ఆసియాఖండములో నిటుల విభజించబడిన అరబుదేశ

ముల మొత్తపుజనసంఖ్య రెండుకోట్ల ముప్పదిరెండు వేలై యున్నది. ప్రక్కనున్న ప్రముఖ అరబుదేశమైన ఈజిప్టు జనసంఖ్యకూడ రెండుకోట్ల 34 లక్షలు. ఈ దేశములలో నదీనదములు, లోహపుగనులు, పెట్రోలియంబావులు, రాళ్ళ పోకలు, సముద్రపురేవులు, అడవికలప మొదలైన నైసర్గిక సంపద సాధనములు, వివిధభాగములలో పంపిణీయైయుండుట వలన ఈదేశములు తమ ఆర్థికాభివృద్ధికి పరస్పరసహాయమును, సహకారమును అపేక్షించుచున్నవి. విభజనవలన నేర్పడిన వివిధరాజ్యములపరిపాలనావ్యయముకూడ వీటిమీద గొప్ప బరువుగనున్నది. పాశ్చాత్యరాజనీతిజ్ఞులు వీటిని చిన్నచిన్న ముక్కలుగ విభజించి, వివిధప్రభుత్వములక్రింద నుంచుటవల్ల ఇవన్నియు రాజకీయముగ ఆర్థికముగ వైజ్ఞానికముగ బలహీన మైనవి. ఈ బలహీనత నవకాశముగగొని స్వతంత్రమును పొందినపిమ్మటకూడ వీటికి ఆర్థికసహాయముచేయునటుల కపట సంధులలో చిక్కించుకొని, వీటన్నిటిమీదను రాజకీయార్థిక యాజమాన్యమును పలుకుబడిని శాశ్వతముగ నిలువబెట్టు కొనుటకు ముఖ్యముగ ఇంగ్లండు, అమెరికాప్రభుత్వములు గట్టి ప్రయత్నములుచేయుచున్నవి. ఈ అరబుప్రాంతములలో పెట్రోలియంనూనెగనులు విశేషముగ లభించుచున్నవి. ఈ గనులలో దాదాపుగ అన్నిటిని ఆంగ్లేయ, అమెరికాకంపె నీలు (వ్యాపారసంఘములు) ఆయా అరబుప్రభుత్వములనుండి దీర్ఘకాళ్లనుపొంది నూనెనుతీసి, గొట్టములద్వారా ఆ నూనె ను సముద్రరేవులకు పంపి, అక్కడనుండి స్టీమరులమీద వివిధదేశములకు ఎగుమతిచేయుచున్నారు. ఈ పెట్రోలు

గనులవల్ల ఈ కంపెనీలు అపరిమితమైనలాభములను పొందు చున్నవి. గాని ఈ ప్రభుత్వములకు న్యాయమైన భాగము నిచ్చుటలేదు. 1948-49 వ సంవత్సరములో ఈ అరబు దేశ ములలో అమెరికాకంపెనీలు పెట్రోలియంనూనెను త్రవ్వి-తీసి, ఆయా ప్రభుత్వములకు ఇవ్వవలసినకౌలుసొమ్ము నిచ్చి, పారశీకసముద్రతీరములకు తీసుకొనిపోవుటకు, సగటున బారె లుకు నలుబదిఏడున్నర సెంట్లు ఖర్చుకాగా, వారు దానిని సగటున197 సెంట్లకుఅమ్ముకున్నారు. ఆ ప్రభుత్వముల కీ కంపె నీలు చెల్లించునది బారెలుకు 21సెంట్లుమాత్రమే. ఇటులబారె లుకు 150 సెంట్ల నికరలాభము ఆ కంపెనీలకు వచ్చినది. ఈ బలహీనమైన అరబుప్రభుత్వములు బలవత్తరమైన ఆంగ్లో అమెరికన్ కంపెనీలతో ఒడంబడికలుచేసుకొనుటలో తగిన బలమును, ధైర్యస్థైర్యములను చూపలేకుండెను. మంచిషర తులను సంపాదించలేకుండెను. చాలసమయములలో ఈ దేశముల రాజకీయనాయకులను ఆంగ్లోఅమెరికనుకంపెనీలు లోబరచుకొనుటకూడ జరుగుచుండెను. వీటిని జాతీయము చేసి, స్వాధీనపరచుకొని లాభమంతయు తామే అనుభవించు టకు ప్రయత్నముచేయగలిగిన బలము, శక్తి వీటిలో ఏ ప్రభు త్వమునకును లేదు. ఇవన్నియు బలహీనమైన, పేదలైన చిన్న చిన్నప్రభుత్వములైయున్నవి. అందువల్ల అప్పుడప్పుడు ఈ పెట్రోలియంకంపెనీలతో ఐక్యరాజ్యసమితిద్వారా రాజీలు పడి కొన్నికొన్ని వేళల కొంచెము ఎక్కువఆదాయమును సంపాదించుచువచ్చుటకన్న వేరుగతి వీటికి లేకున్నది. 1956 వ సంవత్సరపు అంకెలప్రకారము ఈ క్రిందివిధముగ నీ అరబు

దేశములలో పెట్రోలియము తీయబడి ఎగుమతిచేయ బడినది:—

1. కువైటులో 5 కోట్ల 41 లక్షల టన్నులు.
2. సౌదీఅరేబియాలో 4 కోట్ల 79 లక్షల టన్నులు.
3. ఇరాకులో 3 కోట్ల 10 లక్షల టన్నులు.
4. కాటారులో 58 లక్షల టన్నులు.
5. బహిరేనులో 20 లక్షల టన్నులు.

ఇంకను మిగిలినచోట్లకూడ నూనెగనులు కనిపెట్టుటకు ఈ కంపెనీలచేత అన్వేషణలు జరుగుచున్నవి. కొన్ని చోట్ల ఇటీవలనే కొన్నిటిని కనిపెట్టి త్రవ్వకం ప్రారంభించినవి. ఇంతేగాక సౌదీఅరేబియాలోని పెట్రోలునూనెను ఈ అమెరికనుకంపెనీలు తమ నూనెగొట్టముల ద్వారా లెబనాన్ దేశములోని మధ్యధరాసముద్రము మీాద నున్న సైడానురేవువరకు 1068 మైళ్ళపొడుగున, తీసుకొనిపోవుచున్నారు. అటులనే ఇరాకులోని ఆంగ్లేయపెట్రోలియం కంపెనీయొక్క పెట్రోలియంనూనె తమగొట్టములద్వారా కొంతభాగము సిరియాలోగుండాను, మరికొంతభాగము లెబనాన్ దేశముగుండాను సముద్రతీరమునకు తీసుకొనిపోబడుచున్నది. ఇటులనే ఇరానులోని ఆంగ్లోఅమెరికను పెట్రోలియంకంపెనీవారు తమనూనెను జోర్డానులోగుండా గొట్టములద్వారా సముద్రతీరమునకు తీసుకొనిపోవుచున్నారు. ఇదేవిధంగా ఈ కంపెనీలవారు గొట్టములను వేసి తమపెట్రోలును ఇజ్రాయిలు దేశముగుండా హైఫారేవులోనికి తీసుకొనిపోవుచున్నారు. పెట్రోలియమునూనెను గొట్టముల

ద్వారా రవాణాచేయనిచ్చినందులకు ఆయా దేశముల ప్రభుత్వములకు కొంతసొమ్మును ఈ కంపెనీలవారు చెల్లించుచున్నారు. ఈ విధముగ పెట్రోలియంనూనె ఉత్పత్తికిని, ఎగుమతికిని ఈ అరబు దేశములమీద ఆంగ్లేయులు, అమెరికనులు ఆధారపడుచున్నందున వీటిమీద తమకుగలపలుకుబడిని, యాజమాన్యమును ఇంక నెక్కువగ బలపరచుకొనుటకే గట్టిప్రయత్నములనుచేయుచున్నారు. ప్రక్కనున్న ఈజిప్టుప్రభుత్వము 1956 లో సూయజుకాలువను జాతీయముచేసి స్వాధీనపర్చుకొనుట, ఆంగ్లో, ఫ్రెంచిప్రభుత్వములు అభ్యంతరపెట్టినను ప్రయోజనములేకపోవుట, సూయజుకాలువ ఈజిప్టుప్రభుత్వాధికారులచేతనే జయప్రదముగ మేనేజిమెంటు చేయబడుట, లాభమంతయు ఈజిప్టుప్రభుత్వమునకే చెందుట మనము చూచియున్నాము. అటుల జాతీయముచేయుటకు ఈ అరబు దేశములలో దేనికిని రాజకీయ ఆర్థికబలము లేదు. ఈ పెట్రోలునూనెగనులసంబంధమేగాక, ఈ అరబు దేశములు ప్రక్కనున్న సోవియటు కమ్యూనిస్టురష్యాయొక్క పలుకుబడి క్రిందికి పోవునేమోననుభయముకూడ ఆంగ్లోఅమెరికనులకు గట్టిగ గలదు. అందువల్లకూడ నీ అరబు దేశములప్రభుత్వములకు ఆర్థికసహాయముచేయు యొడంబడికలచే బంధించుకొని ఈ ప్రభుత్వనాయకులను లోబర్చుకొని తమకువ్యతిరేకులైన నాయకులను కుట్రలుచేసి కూలద్రోయించి, ఏ విధముగను తమ పలుకుబడిలోనుంచి తప్పిపోకుండ తమకూటములో స్థిరముగానుంచుకొనుటకై ఆంగ్లోఅమెరికనులు ఎన్నితంటాలై

నను పడుచున్నారు. ముఖ్యముగ అమెరికా ఎంతసొమ్మైనను ఖర్చుచేయుచున్నది. ఇంగ్లాండుకూడ ఖర్చుచేయుచున్నది.

(5)

## అరబుజాతుల ఐక్యతాప్రయత్నములు

1944 సెప్టెంబరు నెలలో ఈజిప్టు ప్రధానమంత్రి నహాసు పాషా అలెగ్జాండ్రియానగరమునందు ఒక అరబుసమ్మేళనమును సమావేశపరచెను. ఈ సమావేశమునకు సిరియా, జోర్డాన్, లెబనాన్, ఇరాకు, సౌదీఅరేబియా, ఈమెన్ ప్రభుత్వముల ప్రతినిధులు, పాలస్తీను అరబులప్రతినిధి హాజరైరి. దీనిలో అరబు దేశములన్నియు కలసి ఒక అరబులీగును స్థాపించుకొనవలెనని, అరబుల ఐక్యతను దృఢపరచవలెనని తీర్మానించబడెను. అరబురాజ్యములన్నియు ఆర్థిక, సాంఘిక, వైజ్ఞానికవిషయములలో సంపూర్ణసహకారము సలుపుకొనవలెననికూడ తీర్మానించబడెను. ఈ అరబులీగుకు ముసల్మాను మతముతో నెట్టిసంబంధము లేదని, ఇది కేవలము రాజకీయార్థికసంస్థయేననియు నిశ్చయింపబడినది. పాలస్తీనులో యూదులను తీసుకొనివచ్చి కాపురమునకు ప్రవేశపెట్టు ప్రణాళికను ప్రతిఘటించవలెనని నిర్ణయించబడినది. మరల 1945 మార్చి 22 తేదీన అరబు స్వతంత్రప్రభుత్వముల సమ్మేళనముగ అరబులీగు కెయిరోనగరమునందు స్థాపితమైనది. ఈ అరబు రాజ్యముల స్వతంత్రరాజ్యాధికారములకు భంగములేకుండ అరబు దేశములనన్నిటిని బ్రిటిషుకామన్వెల్తువలె నొక అరబులీగులో చేర్చిరి. దీని కొక అంగవిధానము

నిర్ణయించబడెను. ఈజిప్టు, ఇరాకు, జోర్డాను, లెబనాన్, సిరియా, సౌదీ అరేబియా, ఈమెన్ రాజ్యములు ఈ అరబు కామన్వెల్తులో ప్రథమసభ్యులయ్యెను. 1953లో లిబియా రాజ్యము, 1956లో సూడానురాజ్యముకూడ దీనిలో సభ్యులైరి. ఈ అరబులీగుయొక్క ప్రధానకార్యదర్శియొక్క కార్యస్థానము ఈజిప్టు రాజధానియైన కెయిరోలో నుంచబడెను. 1950 నుంచి ఐక్యరాజ్యసమితివారు ఈ లీగును అంగీకరించి ఐక్యరాజ్యసమితిసమావేశములకు అరబులీగు సెక్రెటరీజనరలుకు ప్రత్యేక ఆహ్వానమును పంపుచుండిరి. 1948లో పాశ్చాత్యరాజ్యముల ప్రతిపాదనమీద ఐక్యరాజ్యసమితివారు పాలెస్తీనులోని గొప్పభాగమును స్వతంత్రఇస్రాయిలు ప్రజాస్వామికముగచేసి అందులో యూదులు లెక్కలేకుండ వచ్చి, కాపురముండవచ్చునని నిర్ణయించి దానిని యూదుల మాతృదేశముగ చేసిరి. పాలెస్తీనులోని మిగిలిన చిన్నభాగమును కొంత ఈజిప్టులోను, కొంత జోర్డానులోను చేర్చిరి. అందుమీద అరబులీగులో చేరిన ఈజిప్టు, సౌదీఅరేబియా, జోర్డాను, సిరియా, లెబనాన్, ఇరాకు దేశముల ప్రభుత్వములు కలిసి ఇస్రాయిలును ఆక్రమించవలెనని ఇస్రాయిలుమీద యుద్ధము చేసిరి. ఆ యుద్ధములో అరబులు ఓడిపోయి, ఇస్రాయిలు ప్రభుత్వమే గెలచినది. ఇస్రాయిలుప్రభుత్వమునకు వెనుక ఆంగ్లో అమెరికనులమద్దతు పూర్తిగ కలదు. అటుపిమ్మట అరబు దేశములలో ప్రభుత్వములు మారుచుండుటవలనను, రాజకీయనాయకులలో అభిప్రాయభేధములు కలుగుటవలనను పాశ్చాత్యుల ఆర్థికయాజమాన్యముయొక్క బలము ఎక్కు

వగుటవలనను ఈ అరబు దేశములలో ఐకమత్యము కొంత చెడినది. ఈజిప్టు, సిరియా, సాదీఅరేబియాలు ఒక జట్టుగను, ఇరాకు, జోర్డాను లొక జట్టుగను, లెబనాన్ తటస్థముగను నుండుచువచ్చినందున అరబులీగు సరిగ పనిచేయుటలేదు. ఈజిప్టులో సైనికవిప్లవము జరిగి, కల్నలు నాసర్ నాయకత్వముక్రింద రాజరికములేని సంపూర్ణస్వతంత్రప్రజాస్వామిక మేర్పడినపిమ్మట కల్నలు నాసరు అరబుజాతీయైక్యతకు, అరబుజాతుల స్వతంత్రమునకు, అభివృద్ధికి, ఎక్కువగ కృషి సలుపుచున్నాడు. ఈజిప్టుప్రజాస్వామ్యముయొక్క నూతన రాజ్యాంగవిధానములో ఈజిప్టు అరబుజాతిలో నొకభాగమనియు, అరబుజాతి అభివృద్ధికి, ఐక్యతకు, ఆత్మగౌరవమునకు జరుగు అన్ని ప్రయత్నములలో ఈజిప్టుదేశము తనబాధ్యతను నిర్వహించుననియు వ్రాసుకొనబడినది.

## పాశ్చాత్యప్రభుత్వముల వ్యతిరేకప్రయత్నములు

1950 లోనే ఇంగ్లాండు, అమెరికా, ఫ్రాన్సులు కలసి తమకు మధ్యప్రాచ్యదేశములలో ప్రత్యేక లాభసంబంధము లున్నందున వాటిని దురాక్రమణనుండి రక్షించుబాధ్యతను వహించుచున్నామని ప్రకటించిరి. దురాక్రమణ అనగ కమ్యూనిస్టుదురాక్రమణ అనియే అర్థము. 1951 అక్టోబరు నెలలో ఈ పాశ్చాత్యదేశములతో కలసి తురుష్క మీా మధ్యప్రాచ్యరక్షణసంధిలో చేరినది. ఈ పాశ్చాత్యజాతు లేర్పరచిన ఉత్తర అట్లాంటికు రక్షణబృందములో కూడ 1952లో తురుష్కము చేరినది. 1953లో అమెరికావిదేశాంగ

మంత్రి డల్లెసు మధ్యప్రాచ్య దేశములను దర్శించెను. ముందుగ అరబు దేశములు కానటువంటి దేశములలో తమపలుకుబడిని దృఢపర్చవలెనని నిశ్చయించి, 1954 ఏప్రిలులో తురుష్కము తోను, పాకిస్తానుతోను సైనిక ఆర్థిక యొడంబడికలు చేసు కొనెను. 1956 ఫిబ్రవరి ప్రారంభములో కల్నల్ నాసరు వెళ్ళి, యుగోస్లావియా అధ్యక్షుడైన మార్షల్ టిటోను సందర్శించివచ్చెను. ఆ సంవత్సరము ఫిబ్రవరి 15వ తేదీన ఇండియా ప్రధానమంత్రి పండిత జవహర్‌లాల్ నెహ్రూ పారిసునుండి ఇండియాకు మరలివచ్చుచు త్రోవలో కైరోలో దిగెను. కల్నల్ నాసరు ఇండియా ప్రధానికి ఘనమైన స్వాగత మిచ్చెను. ఇద్దరుకలసి ఫిబ్రవరి 16వ తేదీన యొక సమిష్టి ప్రకటనను గావించిరి. అందులో నిటులున్నది: "మరియొక ప్రపంచయుద్ధము జరుగకుండుటకై సర్వప్రయత్నములను చేయవలెనని ఉభయులము దృఢనిశ్చయులమైయున్నాము. అధికారముస్థాపించుకొనుట కేర్పడిన కూటములతో సైనిక ఒడంబడికలుచేసుకొనుటవలనను ఆ కూటములలో చిక్కు కొనుటవలనను సైన్యముల నెక్కువచేసుకొనుటకును, ఎక్కువ సంఘర్షణలకును మాత్రమే దారితీయుననియు, ఏ దేశము యొక్క శాంతిభద్రతలకుకాని తోడ్పడజాలదనియు మా నిశ్చితాభిప్రాయమైయున్నది" అని ప్రకటనముచేసినారు.

ఇది జరిగిన వారంరోజులపిమ్మట ఇరాకురాజు తన ప్రధానమంత్రి నూరీ యస్ సయ్యాదు సలహానను సరించి తురుష్కప్రభుత్వముతో ఆర్థిక సైనికయొడంబడిక చేసికొనెను. పాశ్చాత్య దేశముల ఆర్థికవలలో చిక్కుకొనుట కిది ప్రథమ

సోపానము. దీనికి ఈజిప్టు గట్టిగా ఆక్షేపించెను. అరబు లీగులోచేరిన అన్ని దేశములసమావేశమును కైరోలో జరిపెను. ఏడు అరబులీగు దేశముల ప్రతినిధులు హాజరైరి. ఇరాకు ప్రతినిధికూడ వచ్చెను. నాటోకూటమిలో చేరిన తురుష్కముతో అరబులీగులో చేరిన ఇరాకు సైనికయొడంబడిక చేసుకొనుట కూడనిపనియని ఆక్షేపణ గట్టిగా తెలుపబడెను. పదునారురోజులు సమావేశము జరిగినను ఇరాకును తురుష్కయొడంబడికనుండి విడదీయుటకు సాధ్యముకాలేదు. మిగిలిన అన్ని అరబు దేశముల కోరికను ఇరాకు తిరస్కరించినది. అంతటితో ఆసమావేశము మిగతా విషయముల నేదో చర్చించి ముగిసినది.

(6)

## బాండుంగు సమావేశము

ద్వితీయ ప్రపంచసంగ్రామము ముగిసినపిమ్మట పాశ్చాత్యరాజ్యముల కూటము, కమ్యూనిస్టురాజ్యముల కూటము అను రెండుకూటములు ఏర్పడినవని తెలుసుకొనియున్నాము. ఆశియా, ఆఫ్రికాఖండ దేశములను ఆర్థికమైన ఆశలనుపెట్టి, కమ్యూనిస్టుబూచిని చూపి, తమకూటములో నుంచుకొనవలెనని పాశ్చాత్యరాజ్యముల ప్రయత్నము. దీనికి అమెరికా నాయకత్వమువహించినది. పాశ్చాత్యరాజ్యములు సామ్రాజ్యవాదులని, ధనికవర్గమువారని వారిమీద అసూయను, ద్వేషమును కలుగజేసి తమకూటములో చేర్చుకొనవలెనని కమ్యూనిస్టురాజ్యముల ప్రయత్నము. దీనికి సోవియటురష్యా నాయ

కత్వము వహించినది. అరువదికోట్ల జనసంఖ్యగల చైనాజాతిని పాలించుచున్న కమ్యూనిస్టురాజ్యమును ఐక్యరాజ్యసమితిలో సభ్యరాలుగ చేరనివ్వక అమెరికావారు, వారి పలుకుబడిలో నున్న దేశములు ఇంతవరకును జయప్రదముగ ప్రతిఘటించినవి. చైనాలో నిలువనీడలేక ఫార్మోజాద్వీపములలో తలదాచుకొనియున్న క్యుమింటాంగ్ ప్రభుత్వమునే చైనాజాతికంతకు ప్రతినిధిగ ఐక్యరాజ్యసమితిలో నంగీకరించియున్నారు. కమ్యూనిస్టు చైనాప్రభుత్వమును ఐక్యరాజ్యసమితిలో సభ్యరాలుగ చేయవలెనని ఇండియా మొదలైన దేశములు చేయుచున్న ప్రయత్నములు ఇంతవరకును సఫలీకృతముకాలేదు. ఇండియా దేశము రెండుకూటములమధ్య తాటస్థ్యమును దృఢముగ వహించుచున్నది. ఏ కూటములోను చేరదలచలేదు. ఇండియా పంచశీలసూత్రములను ప్రతిపాదించి అమలుజరుపుచున్నది. వివిధదేశముల రాజ్యాంగవిధానము లేవిధముగ నున్నను అందరును స్నేహముగనే తగవులు లేకుండ నివసించవలెను. (Peaceful Co-existance) అనగ సామ్రాజ్యవాదము నవలంబించియున్న ధనికవర్గదేశములు, ప్రజారాజ్యములను స్థాపించుకొన్న ప్రజాసామ్యవాదులు, కమ్యూనిస్టు, ఫాసిస్టు విధానముల నవలంబించిన దేశములు అన్నికూడ తమలో తాము పోట్లాడుకోకుండ స్నేహముగ నివసించవలెను. దేశములమధ్య ఏర్పడే తగవులన్నిటిని శాంతముగ పరిష్కరించుకొనవలెను. యుద్ధములురాకుండచేయవలెను. సైన్యములను తగ్గించవలెను ఆటంబాంబును నిషేధించవలెను. ఒకదేశపు ఆంతరంగికవ్యవహారములలో మరియొకదేశప్రభుత్వము జోక్య

ముపుచ్చుకొనకూడదు. ఆయా దేశములలోని ప్రభుత్వవిధాన
ములను మార్చుకొనుటకు ఆయా దేశప్రజలకే హక్కు కలదు.
ఇది పంచశీలసిద్ధాంతము. ఈ సిద్ధాంతమును తాము అవలం
బించుచున్నామనియు, ఇదియే ప్రపంచశాంతికి తోడ్పడుననియు
ఇండియా ప్రధానమంత్రి పండిత జవహరులాలు నెహ్రూ,
కమ్యూనిస్టుచైనాప్రధానమంత్రి చౌ ఎన్ లైగార్లు 1954 లో
సంయుక్తప్రకటనమును గావించినారు ఈ రెండు దేశముల
మొత్తపుజనసంఖ్య నూరుకోట్లు కలదు. ఆ వెంటనే బర్మా,
ఇండోనేషియా, సింహళములు ఈ పంచశీలసిద్ధాంతము నంగీ
కరించినట్లు ప్రకటనముగావించినవి. ఆశియా, ఆఫ్రికాఖండ
జాతులలో స్వాతంత్ర్యమును, పరస్పరసహకారమును కలుగ
చేసి, ఆత్మవిశ్వాసమును, ఆత్మశక్తిని పెంపొందచేసి, ఈ
రెండుకూటములు వాటిమీాద తెచ్చేఒత్తిడినుండి కాపాడుటకు
గాను ఆశియాఖండములోని కొలంబోపథకములో చేరిన
ఇండియా, బర్మా, పాకిస్తాను, సింహళము, ఇండోనేషియా
దేశముల ప్రధానమంత్రులఆహ్వానముమీాద మున్పది ఆశియా,
ఆఫ్రికాఖండజాతులసమావేశము ఇండోనేషియాలోని బాం
డుంగుపట్టణములో 1955 ఏప్రిలు 18 వ తేదీనుంచి 24 వ తేదీ
వరకు జరిగినది. బాండుంగుసమావేశమునకు పోవుచు
త్రోవలో కల్నల్ నాసరు ఇండియాను దర్శించెను. పండిత
జవహరులాల్ నెహ్రూతో సంప్రదింపులుజరిపెను. అతి ఘన
మైనస్వాగతమును ఢిల్లీప్రజలచే పొందెను. మిగుల భావో
ద్రేకమైనయుపన్యాసమును గావించెను. బాండుంగుమహా
సభకు ఇండోనేషియాప్రధానమంత్రి శాస్త్రొ అమిడ్జోజో

అధ్యక్షతవహించెను ఆహ్వానింపబడినవారిలో ఒక్క మధ్య ఆఫ్రికా ఫెడరేషన్ వారుమాత్రమే ఆ తేదీలు తమకు అనుకూల ముగలేవని ప్రతినిధులను వంపలేదు. తక్కిన 29 దేశముల ప్రభుత్వప్రతినిధులు హాజరై పాల్గొన్నారు. సోవియటురష్యాను ఆహ్వానించలేదు. కమ్యూనిస్టుచైనా ఆహ్వానింపబడినది. ప్రధానమంత్రి చౌయన్‌లై హాజరయినాడు. ఇజ్రాయిలును, ఉత్తర దక్షిణ కొరియాలను, జాతీయచైనాను పిలువలేదు. ప్రపంచములోని మూడింట రెండువంతులజనసంఖ్యను పాలించుచున్న ప్రభుత్వములయొక్క ప్రతినిధులమహాసభ అది. బలవంతులమని విర్రవీగుచు చిన్నజాతులను నిర్లక్ష్యముగా అణచివేయుచున్న గొప్ప ప్రభుత్వములసభ కాదు. లోకములోని చిన్నజాతులపైన బలహీనమైనదేశములపైన యాజమాన్యమును, వలుకుబడిని వంచుకొనుటకు ఆర్థికసాధనములను వంచుకొనుటకు జరిగిన సైనికబలమువలన, మదాంధులైనజాతుల (Great Powers) సమావేశముకాదు. అట్టి గొప్ప ప్రభుత్వములమీాద తిరుగుబాటులు సలిపి వారినిలక్ష్యపెట్టక నూతనముగ స్వతంత్రమునుసంపాదించి ప్రతి చిన్నజాతికి స్వతంత్రము, స్వయంనిర్ణయాధికారముండవలెనని దృఢముగా కోరుచున్నజాతుల ప్రతినిధులసమావేశమది. ఇట్టిసమావేశము మానవచరిత్రలో అదిరవకెన్నడును జరిగియుండలేదు. ఈ ఆశియాఆఫ్రికాఖండజాతుల ప్రతినిధులందరును వరస్పర స్నేహ వాత్సల్యములను స్థాపించుకొనుటకును, రాజకీయార్థిక వైజ్ఞానిక రంగములలో పరస్పరసహాకారమును సలుపుకొనుటకును మాత్రమే సమావేశమైనారు. అందరును ప్రభుత్వహోదాలలో వచ్చినవారే.

ఇండియా, చైనా, పాకిస్తాన్, బర్మా, ఇండోనేషియా, సింహళము. ఈజిప్టు, లావోసు, లెబనాన్, సౌదీ అరేబియా, సుడాన్, యేమెన్ దేశములపక్షమున ప్రధానమంత్రులు, తక్కిన దేశములపక్షమున యితరమంత్రులు హాజరై పాల్గొన్నారు. సైప్రసు స్వతంత్రోద్యమనాయకుడైన ఆర్చిబిషపు మెకారియసు, జెరూసలేముయొక్క మాజీ ముఫ్టి, ఆఫ్రికనుజాతీయ మహాసభప్రతినిధులు, అమెరికా నీగ్రోజాతిప్రతినిధి ఏ. డి. పొవెలు ప్రేక్షకులుగ వచ్చిరి. మహమ్మదీయప్రతినిధులందరును మతతత్వమును ప్రదర్శించి యొక ప్రత్యేక కూటముగ చేరుదురనుఆశలుపెట్టుకున్న తెల్లవారిఆశలు నిరాశలైనవి. వచ్చినప్రతినిధులలో పాశ్చాత్య సామ్రాజ్యతత్వముతో పాటు కమ్యూనిస్టుసామ్రాజ్యవ్యాపకమునుకూడ తీవ్రముగ ఖండించినవారు గలరు. వారికి చౌయన్‌లై జవాబుచెప్పవలసివచ్చినది. పండిత జవహరులాల్ నెహ్రూగా రుభయులమధ్య కొంత శాంతింపుచేయవలసివచ్చినది. కల్నల్ నాసరు, మిగత అరబుజాతులప్రతినిధులు మిగుల యుత్సాహముగ పాల్గొన్నారు. అరబుజాతీయత, ఆశియా, ఆఫ్రికాఖండజాతుల స్వతంత్ర స్థిరస్థాపనములోను, ఆత్మగౌరవములోను నొక అంతర్భాగమని వారు చెప్పినారు. బాండుంగుమహాసభవారు (1) ఆర్థిక సహకారము, (2) వైజ్ఞానికసహకారము, (3) మానవహక్కులు, స్వయంనిర్ణయము, (4) ఇతరులమీద నాధారపడిన ప్రజలసమస్యలు, (5) ప్రపంచశాంతి, అంతర్జాతీయసహకారము లను అయిదుపసంఘముల నేర్పరచిరి. అవి నాలుగుదినములు సమావేశమై తమతమనివేదికలను మహాసభకు సమ

ర్పించిరి ఇందులో ప్రపంచశాంతి, అంతర్జాతీయసహకారము లను ఉపసంఘమున కధ్యక్షుడుగ కల్నల్ నాసరు ఎన్నుకొనబడెను. ఈ జాతులలో మొత్తముమీద ఏకమత్యమే కలిగినప్పటికి కమ్యూనిస్టులకు వ్యతిరేకతను, వారియందు భయమును సింహళము, గోల్డుకోస్టు, ఇరాకు, జపాను, జోర్డాన్, లెబనాన్, లైబీరియా, లిబియా, పాకీస్తాన్, పర్షియా, ఫిలిప్పైన్‌లు, సయాం, సుడాను, తురుష్కము, దక్షిణవియత్నాం ప్రతినిధులు ప్రదర్శించిరి. తటస్థభావములను, తటస్థవిధానమును ఇండియా, ఈజిప్టు, చైనా, ఆఫ్ఘనిస్తానము, బర్మా, కాంబోడియా, ఎథియోపియా, ఇండోనేషియా, లావోసు, నేపాలు, సాదీ అరేబియా, సిరియా, ఉత్తరవియత్నాం, యేమెన్ దేశములు దృఢముగా బలపర్చిరి. ఆటంబాంబులు తయారుచేసుకొని పరస్పరద్వేషముతో ఒకరిమీదనొకరు కత్తులుదూచుచున్న పాశ్చాత్యజాతుల కమ్యూనిస్టుజాతులమధ్య మధ్యవర్తిత్వమువహించి రాజీకుదిర్చి లోకశాంతిని స్థాపించుటకు ఆశియా ఆఫ్రికాఖండజాతులకే అర్హత కలదని సింహళప్రధానమంత్రి సర్ జాన్ కొటెల్వాలా తన యుపన్యాసములో చెప్పెను. "ఒకజాతియొక్క వ్యవహారములలో రెండవజాతి జోక్యముకలుగచేసుకొనకుండుట, ప్రతిజాతికి తనయిచ్చవచ్చిన రాజకీయ, ఆర్థికవిధానములను అవలంబించుటకు హక్కుకలిగియుండుట రెండు ప్రధానసూత్రము"లని కల్నల్ నాసరు చెప్పెను. "మరియు పెద్దప్రభుత్వములు తమతమ ప్రయోజనములనిమిత్తము చిన్నజాతులను పనిముట్లుగ నుపయోగించుకొనగూడదు. ఇటుల నుపయో

గించుకొనుటవలన చిన్నజాతులమీద మరల విదేశదాస్యమే కలుగుచున్నది" అనికూడ ఆయన వాక్రుచ్చెను.

ఇందువలన కమ్యూనిస్టురాజ్యాల బూటకపుస్నేహము నందుకూడ ఆశియా, ఆఫ్రికాఖండజాతులలో విశ్వాసము లేదని స్పష్టపడుచున్నది. 1959 ప్రారంభమునుండి కమ్యూనిస్టులవలన ఈజిప్టుకును, సిరియాకును, ఇరాకుకును కలుగుచున్న చిక్కులు, ఇటీవల టిబెటులామాకు, టిబెటుకాందిశీకులకు శరణ్యమిచ్చినంతమాత్రముననే చైనా కమ్యూనిస్టులు ఇండియామీద ప్రదర్శించిన బెదిరింపులతోకూడిన వ్యతిరేకత, ప్రజారాజ్యవాదులైన ఆశియా, ఆఫ్రికాఖండ దేశములు కమ్యూనిస్టులను నమ్మకూడదని ధృవపర్చుచున్నవి. వీటివలన ఒకవైపున పాశ్చాత్యదేశముల, రెండవవైపున కమ్యూనిస్టుల వలలనుండి తప్పించుకొను టెంత అవసరమో బోధపడుచున్నది. సింహళప్రధాని సర్ జాన్ కోటెల్వాలా కోమిన్ ఫారమ్‌ను రద్దుపరచుటనుగూర్చి చైనా ప్రధానమంత్రి చౌయన్‌లైని ప్రశ్నించినపుడు అది సోవియటురష్యాకు సంబంధించినదనియు, చైనాకమ్యూనిస్టులతో నెట్టిసంబంధము లేదనియు, జవాబుచెప్పెను. బాండుంగుసమావేశములోని వాతావరణమును చూచి అమెరికాసంయుక్తరాష్ట్రములతో చైనాప్రజలు యుద్ధమునకుపోదలచుకొనలేదనియు, ఫార్మోజావిషయములో కూడ తగవులులేకుండ పరిష్కరించుకొనుటకై అమెరికాతో రాయబారములు జరుపుటకు తాము సిద్ధముగయున్నామనియు చౌయన్‌లై తన యుపన్యాసమునందు చెప్పెను. అంతేగాక తాయ్‌లాండ్, సింహళము, ఫిలిప్పైన్‌లు మొద

లైన దేశములయొక్క సురక్షితమునకు తాముకూడ బాధ్యత వహించెదమనియు ఆయన చెప్పెను. ప్రతివిషయములోను ఆయన తన యుపన్యాసములలో, సంభాషణలలో స్నేహ భావమును, రాజీయుద్దేశ్యములను ప్రకటించుచువచ్చినందున బాండుంగుసమావేశము శాంతియుతమైన చల్లనివాతావరణ ములో సాగిపోయినది. పండిత జవహర్లాల్ నెహ్రూ ఆట మిక్, న్యూక్లియర్ ఆయుధములను తయారుచేయవద్దనియు, ఉపయోగించవద్దనియు, వాటినిగూర్చిన పరీక్షలు చేయ వద్దనియు గొప్పప్రభుత్వములను కోరుచు చేసిన తీర్మానము ఏకగ్రీవముగ నంగీకరించబడినది. ఈ క్రింది పదిసూత్రములు బాండుంగుమహాసభలో నేకగ్రీవముగ ఆమోదింపబడి, ఆ మహాసభ కోలాహలముతో ముగిసినది:

(1) ప్రాథమిక మానవహక్కులయందును, ఐక్యరాజ్య సమితి చార్టర్ యొక్క యుద్దేశ్యములయందును, సిద్ధాంత ములయందును గౌరవము చూపవలెను. (2) అన్ని దేశముల యొక్క జాతీయస్వతంత్రమునందు, సార్వభౌమాధికారము నందు, జాతీయఐక్యతయందు గౌరవము చూపవలెను. (3) పెద్ద, చిన్న భేదములేకుండ అన్నిజాతులయొక్క, అన్ని సంఘములయొక్క సమానత్వమును అంగీకరించవలెను. (4) ఇతర దేశముల ఆంతరంగికవ్యవహారములలో ఏవిధముగను జోక్యము పుచ్చుకొనకూడదు. (5) ఐక్యరాజ్యసమితియొక్క చార్టర్‌కు అనుగుణ్యముగ యేకముగ కాని, ఇతరులతో కలిసి కాని తనను తాను సంరక్షించుకొనుటకు ప్రతిజాతికిగల హక్కును గౌరవించవలెను. (6) పెద్దప్రభుత్వములు తమ

స్వలాభమునిమిత్తము ఏర్పాటుచేసే సంరక్షక ఒడంబడికలలో ఎవరు చేరకూడదు. ఇతరదేశములమీద ఏదేశముకాని ఎట్టి ఒత్తిడిని తీసుకొనిరాకూడదు. (7) ఏదేశముయొక్క ఐక్యతకును, స్వాంతంత్రమునకును వ్యతిరేకముగ ఎట్టిపనులు చేయకూడదు. ఎటువంటి దురాక్రమణను చేయకూడదు. ఎట్టి దౌర్జన్యమును ఉపయోగించకూడదు. (8) అంతర్జాతీయ వ్యవహారములన్నియు రాజీలు, ఒడంబడికలు, పంచాయతీలు, కోర్టులతీర్పులు మొదలైన శాంతియుతమైనపద్ధతుల ద్వారానే నిర్ణయించుకొనవలెను. ఐక్యరాజ్యసమితియొక్క చార్టరుకు అనుగుణ్యాముగ ఉభయపార్టీలు ఇతర శాంతియుతమైన పద్ధతులమీదను కూడ పరిష్కారముచేసుకొనవచ్చును. (9) పరస్పరలాభములను, పరస్పరసహకారములను వృద్ధిచేసుకొనవలెను. (10) న్యాయముయందు అంతర్జాతీయబాధ్యతలయందు గౌరవము చూపవలెను. ఈ పది సూత్రములప్రకారము జాతులు పరస్పరసహకారమును చేసుకొన్నట్లయినచో అంతర్జాతీయశాంతి, సురక్షితము అభివృద్ధియగుననియు, ఆర్థిక, సాంఘిక, వైజ్ఞానికసహకారము, దేశములయొక్క సంపదకు, క్షేమమునకు తోడ్పడుననియు ఆశియా ఆఫ్రికాఖండముల మహాసభ ప్రకటించినది. మరుసటిసభ ఎక్కడజరిగేది ముందు ముందు సంప్రతింపులతో నిర్ణయించబడును. మరల బాండుంగుసమావేశమువంటిది జరుపవలెనని నెహ్రూ, నాసర్ మొదలైనవారి ఆలోచనలోనున్నది. ఈ సమావేశఫలితముగ అరబుజాతీయతయందు ఆశియా, ఆఫ్రికాఖండముల జాతులకన్నిటికిని గొప్ప సానుభూతి యేర్పడినది.

## (7)

## బాగ్దాద్ యొడంబడిక

1955 ఫిబ్రవరినెలలోనే తురుష్కము, పాకిస్తాను, ఇరాకు, ఇంగ్లాండులమధ్య బాగ్దాద్ యొడంబడిక జరిగెను. ఆ సంవత్సరము అక్టోబరు 11వ తేదీన ఇరానుప్రభుత్వ మీ యొడంబడికలో చేరెదమని ఖాయపరచెను. ఇంతటితో బాగ్దాదుపాక్టు పూర్తిఅయ్యెను. తురుష్కము, పాకిస్తాను, ఇరాకు, ఇరాను దేశములు పూర్తిగ అన్నివిషయములలోను ఇంగ్లాండు చెప్పినటుల నడచుకొనునటులను, ఇంగ్లాండు వీటికి సైనిక, ఆర్థికసహాయము చేయునట్లును ఈ యొడంబడికలో గలదు. దీనికి అమెరికా సహాయము పూర్తిగ గలదు. ఈ బాగ్దాదుపాక్టుదేశముల సమావేశములకు అమెరికా ప్రతినిధికూడ హాజరగుచున్నాడు. ఇరాకురాజధానియైన బాగ్దాదు నగరమున నీ యొడంబడిక జరిగియుండుటవలన దీనికి బాగ్దాదు యొడంబడిక అని పేరు. అంతేగాక అమెరికా పాకిస్తానుకు సరాసరి సైనిక, ఆర్థికసహాయము చేయునట్లు అంగీకరించి, పాకిస్తానును తనక్రింద సరాసరి చేర్చుకున్నది. ఒకసారి మాత్రము ఈ బాగ్దాదుయొడంబడికలోని నాలుగు ముస్లిము దేశములు ఇంగ్లాండుకు, ఫ్రాన్సుకు వ్యతిరేకతను చూపి, తమ సానుభూతిని ఈజిప్టుతో ప్రకటించినవి. అది సూయజుకాలువను జాతీయముచేసినసందర్భములో నైయున్నది. దానిని గూర్చి పైన వివరించియున్నాము. ఈ బాగ్దాదుపాక్టులో మిగిలిన అరబుదేశములేవియూ చేరలేదు. ఆ సమయమున

న్యూయార్కు హెరాల్డు ట్రిబ్యూన్ పత్రికాప్రతినిధి ఈజిప్టు యొక్క రాజనీతి యేమియని కల్నల్ నాసరును ప్రశ్నించగా "మా రాజనీతిలో మొదటిది స్వతంత్రము, సంపూర్ణ స్వతంత్రము. రెండవది అరబుజాతీయైక్యత. అమెరికా పెద్దరాజ్యము గనుక ప్రపంచమంతటితోను సంబంధముగలిగియుండవచ్చును. గాని మాకు మా అరబుప్రాంతములతో సంబంధబాంధవ్యములు పూర్తిగ గలవు" అని ఆయన జవాబు చెప్పెను. ఆ వెంటనే అక్టోబరు 21వ తేదీన ఈజిప్టు అధ్యక్షుడైన కల్నల్ నాసరు, సిరియా అధ్యక్షుడైన షుక్రీ కువాట్లీ యొక పరస్పర రక్షణయొడంబడికను డెమాస్కసునగరమునందు గావించుకొనిరి. పిమ్మట వారంరోజులలోనే సౌదీఅరేబియా ప్రభుత్వమీ యొడంబడికలో చేరెను. లెబనాన్‌లోను, జోర్డానులోను బాగ్దాదు ఒడంబడికకు వ్యతిరేకప్రదర్శనములు జరిగినందున ఆ ప్రభుత్వము లందులో చేరలేదు. ఇరాకులో జరిగిన వ్యతిరేకప్రదర్శనలను నూరి యస్ సయ్యదు కఠిన చర్యలచే నణచివైచెను.

## బ్రియోనీ సమావేశము

1956 జులైనెలలో కల్నల్ నాసరు యుగోస్లేవియా దేశమునకు వెళ్ళి బ్రియోనీపట్టణమున మార్షల్ టిటోను దర్శించెను. అప్పుడు అక్కడికి ఇండియా ప్రధానమంత్రి జవహర్లాల్ నెహ్రూ వచ్చి వారిని కలిసెను. నెహ్రూ, టిటో, నాసరులు కలిసి యొక సంయుక్తప్రకటనమును గావించిరి. జాతులమధ్య శాంతియుతసహజీవనము, సమానత్వము,

బాండుంగు సమావేశముయొక్క పదిసూత్రములు, ప్రపంచములోని జాతులమధ్య సంఘర్షణను తీసివేయు సాధనములు, ఇవన్నియు అత్యవసరమని ఆ ప్రకటనలో నున్నది. అధికారముకొరకు పోటీపడుచున్న రెండుకూటము లేర్పడుట శాంతికి భంగకరమని ఖండించిరి. నిరాయుధీకరణము అమలు జరగనందుకు, ఆటంబాంబుల, న్యూక్లియర్ ఆయుధముల పరీక్షలు, కాల్పులు జరుగుచున్నందుకు తమ ఆక్షేపణను తెలిపిరి. వెనుకబడ్డజాతుల ఆర్థికాభివృద్ధిని తీవ్రముగ జరపవలెనని, చైనా దేశమును ఐక్యరాజ్యసమితిలో సభ్యురాలుగ చేర్పవలెనని, జర్మనీ ఐక్యతకొరకు రాజీగ పరిష్కారము చేయవలెనని, ఉత్తర ఆఫ్రికాలోని ప్రజలకు స్వతంత్రము ఇవ్వవలెననికూడ ఆ ప్రకటనలో కలదు. ఇందువల్ల ఈ ముగ్గురును తటస్థవిధానమునకు పట్టుకొమ్మలుగ నున్నారని స్పష్టపడుచున్నది. ఇందుమీద అమెరికాకు కోపమువచ్చి అస్వాను ఆనకట్టకై ఈజిప్టుకు ఆర్థికసహాయము చేయుటకు నిరాకరించెను.

అదివరకే ఆంగ్లేయసేనలను సూయజుకాలువవద్దనుండి ఈజిప్టునుండి పూర్తిగ వెళ్ళకొట్టుటవలన కల్నల్ నాసరు మీద ఆంగ్లేయులకు చాల కోపముగనున్నది. దానికి తోడు బ్రియోనిస్టేటుమెంటు బయుటపడగానే కల్నల్ నాసరుకు బుద్ధిచెప్పుటకై అస్వాన్ఆనకట్టనిర్మాణమునకు ధనసహాయము చెయ్యజాలమని అమెరికా విదేశాంగమంత్రి డల్లెసు స్పష్టముగచెప్పెను. ఆంగ్లేయులును అటులనే చెప్పిరి. అందువల్ల కల్నర్ నాసరు తమకుపాదాక్రాంతుడై బాగ్దాదుపాక్టులో

చేరునని ఆశించియుందురు. అటులగానిచో ఈజిప్టుదేశీయులకు ప్రాణతుల్యమగు ఆస్వాన్‌డామునకు ధనసహాయము రాకుండ చెడగొట్టినందుకు ఈజిప్టుదేశీయులు తిరుగుబాటుచేసి కల్నల్ నాసరుప్రభుత్వమును కూలద్రోయుదురని ఆశించియుందురు. ఇవేవియు జరుగలేదు. కల్నల్ నాసరు ధైర్యస్థైర్యములను చూపినాడు. బాగుగ నాలోచించినాడు. సూయజు కాలువను జాతీయముచేసి స్వాధీనపర్చుకొని, దానివల్ల ఆంగ్లేయులు ఫ్రెంచివారు మొదలగు విదేశస్థులుపొందుచున్న అపరిమితలాభములను ఈజిప్టుప్రభుత్వమే సంపాదించి దానినంతను ఆస్వాన్ ఆనకట్టనిర్మాణమున కుపయోగించుటకు ఆయన నిశ్చయించి, 1956 జూలై 26 తేదీన అట్టి ప్రకటనమును గావించి సూయజుకాలువను స్వాధీనపర్చుకొని దానిమీద విదేశయాజమాన్యమును రద్దుపరచెను. నాలుగుసంవత్సరములక్రింద అదేతేదీన ఆయన ఈజిప్టులో రాజరికమును రద్దుపరచెను. సూయజుకాలువ జాతీయముచేయుటలో ఎన్ని ఆటంకములు దురాక్రమణ భయోత్పాతములు సంభవించినను ఎటుల వాటినన్నిటిని ఎదుర్కొని అద్భుతజయమును సంపాదించి 1956 డిశంబరునెల 31వ తేదీనాటికి సూయజు కాలువను ఈజిప్టుప్రభుత్వస్వాధీనములో నిరాటంకముగ స్థిరపర్చుకొనెనో ఇదివరకే చూచియున్నాము. దీనితో ఆయన ప్రతిష్ఠ అత్యంతముగ హెచ్చెను. పాశ్చాత్యరాజ్యముల ప్రతిష్ఠ సన్నగిల్లినది. ఆయన అరబ్బుప్రజల రక్షకుడయ్యెను. "పాశ్చాత్యరాజ్యములు ఆస్వాన్ఆనకట్టనిర్మాణమునకు ధన

సహాయముచేతుమని చేసియుండిన వాగ్దానమును రద్దుపర్చు కొనుట, ఆ క్రిందటివారమే బ్రియోనిలో సమావేశమై తటస్థ విధానమును దృఢముగ అవలంబించినటుల ప్రకటించినందుకు నెహ్రూ టిటోలకు నాకు దెబ్బకొట్టవలెనని యుద్దేశించియే జరిగినదనుటలో నా కెట్టి సందేహము లేదు. మా ముగ్గురిలో ఈజిప్టు, నేను బలహీనులమైనందున ముందుగ నన్ను దెబ్బ కొట్టినారు. మరల వెనుకకుతన్నుటతప్ప మే మేమిచేయ వలెను? అటుల తన్నినాను, జయమును పొందినాను. మరల వారు మా తెరువుకు వస్తే మరలమరల తన్నుతాను అని వారు గ్రహించవలెను" అని కల్నల్ నాసరొక భారతీయ పత్రికాప్రతినిధితో చెప్పెను.

## ఐసెన్‌హోవరు సిద్ధాంతము

ఇది 1956తో ముగిసినది. బాగ్దాదుపాక్టులో ఒక్క ఇరాకుతప్ప మిగిలిన అరబు దేశములు చేరుటకు నిరాకరించి నవి. ఇరాకులోకూడ బాగ్దాదు ఒడంబడికకు ప్రజాభిప్రాయము దినదినమునకు మిగుల వ్యతిరేకమగుచుండెను. ఇరాకు ప్రభుత్వ నాయకుడగు నూరి యస్ సయ్యదు ఇందుకు వ్యతి రేకించిన జాతీయవాదులతో జైళ్ళనునింపినకొలది వ్యతిరేకత అతిగ హెచ్చుచుండెను. 1957 ప్రారంభమునాటికి మధ్య ప్రాచ్య దేశములలో లభించే పెట్రోలియమునూనె యావత్తు ప్రపంచములో లభించే నూనెలో మూడింట రెండువంతు లున్నది. మధ్యప్రాచ్య దేశముల నూనెఎగుమతివల్ల పాశ్చాత్య దేశస్థులకు చెప్పనలవికాని లాభము వచ్చుచున్నది. ఈ

నూరెలో నూటికి ఏబదిఅయిదువంతులు అమెరికావారికిని, ముప్పదిఅయిదువంతులు ఆంగ్లేయులకును, పదివంతులు ఫ్రెంచి డచ్చివారికిని చెందియుండెను. మధ్యప్రాచ్య దేశములన్నియు సంపూర్ణముగ స్వతంత్రములై తటస్థవిధానము నవలంబించి నచో ఈజిప్టు సూయజుకాలువను జాతీయముచేసినటులే మిగిలిన దేశములు ఈ గనులను జాతీయముచేసి స్వాధీనపర్చు కొనవచ్చును ఈజిప్టు ప్రధాన పెట్రోలియందేశము కాదు. అటుల జాతీయముచేసినచో పాశ్చాత్యుల లాభములన్నియు పోవుట తథ్యము. అదివరకే ఇరానులో నొకసారి 1932లో షా రెజాఖాన్ పెహల్వి పెట్రోలియముగనులను జాతీయము చేయగ నానాబాధలుపడి అతనితో రాజీపడవలసివచ్చినది. రెండవసారి ఇరానులోనే 1951లో జాతీయనాయకుడగు ప్రధానమంత్రి ముసాదికు వాటిని జాతీయముచేయగా పాశ్చాత్యులు ఇరానురాజుకు, ఆయన ఆశ్రితులకు లంచము లిచ్చి మరియొక పార్టీని లేవదీసి, ముసాదికును కూలద్రో యించి, జైలులో పడద్రోయించి మరియొక ప్రభుత్వమును స్థాపింపచేసి దానిచేత జాతీయమును రద్దుపర్పించుకొని మరల పెట్రోలుగనులను స్వాధీనపరచుకొనవలసివచ్చినది. మరియు సౌదీ అరేబియా రాజు జాతీయముచేసెదనని బెదిరించి కొంత ఎక్కువఆదాయమును రాబట్టుకున్నాడు. ద్వితీయ ప్రపంచ యుద్ధమునకు పూర్వము యూరోపియన్‌జాతుల రాజకీయ సామ్రాజ్యతత్వము, అనగ రాజ్యవ్యాపకతత్వము ప్రధానముగ నుండెను. ఆ యుద్ధము ముగిసినపిమ్మట సామ్రాజ్యములు చాలవరకు కూలిపోయినవి. మిగిలినవి కూలిపోవుచు

న్నవి. అప్పటినుంచి అమెరికాయొక్క (Dollar Imperialism) ధనసంపాదనాతత్వము బలహీనమైన దేశముల జాతీయస్వాతంత్రమునకు పరమశత్రువైనది. అమెరికాకు పక్కతాళం వేస్తున్నది ఇంగ్లాండు. అంతేగాక ఈ స్వతంత్ర అరబుజాతులకు ఆయుధములను అమ్ముటకు అమెరికా నిరాకరించినందున ఈజిప్టు, సిరియాప్రభుత్వములు కమ్యూనిస్టుదేశాలనుండి ఆయుధములను కొనుక్కున్నవి. రష్యాతో స్నేహముగ నున్నవి. ఇక అమెరికా ఏమిచేయవలెను? బలహీనమైన చిన్నవైన అరబుజాతులను ఐక్యముకానివ్వవలసినదేనా? అరబుజాతీయతకు బాండుంగుతత్వమునకు ఆటంకములు కలుగచేయకుండ సాగిపోనివ్వవలసినదేనా? అని అమెరికా అధ్యక్షుడు ఐసెన్‌హోవరు, విదేశాంగమంత్రి డల్లెసు లెస్సగ నాలోచించి, 1957వ సంవత్సర ప్రారంభమున ఐసెన్‌హోవరు సిద్ధాంతమును లేవదీసినారు. అరబుదేశములకు, వాటికి ప్రక్కననున్న ఇతర ముస్లిందేశములకు ఎంతసామ్మైన నిచ్చి వాటిని తమక్రిందనుంచుకోవలెనని దృఢనిశ్చయులైనారు. 1957 జనవరి 5వ తేదీన అమెరికా అధ్యక్షుడు ఐసెన్‌హోవరు తనసిద్ధాంతమును ప్రకటించెను. "పాశ్చాత్యులకు ప్రాణప్రదమైన మధ్యప్రాచ్యములో అంతర్జాతీయ కమ్యూనిజము యొక్క దురాక్రమణభయము దినదినము హెచ్చుచున్నది. మధ్యప్రాచ్యదేశములు చిన్నవి, బలహీనమైనవి. ఐక్యరాజ్యసమితిని స్వతంత్రస్థాపనవిషయములో నమ్ముకున్న ప్రయోజనములేదు. అరబుజాతులమీద ఆంగ్లేయ ఫ్రాన్సుదేశములు చలాయించిన రాజ్యాధిపత్యము సంరక్షణబాధ్యత పోయి,

ఆ స్థానము ఖాళీయైనది. అందువల్ల అరబులసంరక్షణ బాధ్యత అమెరికామీద పడినది. కావున మధ్యప్రాచ్య దేశములలో సహాయముకోరిన ప్రభుత్వములకెల్ల సైనిక, ఆర్థిక సహాయమును చేసి జాతీయస్వాతంత్ర్యమును నిలువబెట్టుటకు అమెరికా పూనుకున్నది" అని ఆ ప్రకటనలో నున్నది. అట్టి జాతీయస్వాతంత్ర్యమునకు భంగముకలుగునని తోచగనే రక్షణ నిచ్చుటకు అచ్చోటకు అమెరికా సైన్యములను పంపి, అట్టి రక్షణ నివ్వవచ్చును అనికూడ చెప్పబడినది. ఈ సైనిక, ఆర్థిక రక్షణ నిచ్చుటకు మరియెవరితోను సంప్రదించనక్కరలేదు. సైన్యములను నడుపుటకుకూడా ఐక్యరాజ్యసమితిఅనుమతిని కోరనక్కరలేదు. ఈ సిద్ధాంతమును ఆత్మగౌరవముగల దేశాభిమానులైన అరబులెవరును అంగీకరించజాలరు. ఆంగ్ల ఫ్రెంచిసామ్రాజ్యములు కూలిపోగనే అరబులను రక్షించుకునే బాధ్యత, ఆర్థికముగ అభివృద్ధిచేసుకునే బాధ్యత అరబు జాతులమీదనే పడినది. అరబు లేకమై ఇతరరాజ్యముల దురాక్రమణనుండి కాపాడుకొనెదరు. తమ ఆర్థికాభివృద్ధిని గావించుకొనెదరు. తమ స్వాతంత్ర్యమును నిలువబెట్టుకొనెదరు. అంతేగాని ఒక విదేశయజమాని పోగానే మరియొక విదేశ యజమాని, ఒక విదేశరక్షకుడు పోగానే మరియొక విదేశ సంరక్షకుడు ఏర్పడు దుష్టభావమును ప్రతిఘటించెదరు తురుష్కముయొక్క యాజమాన్యము పోగనే ఆంగ్ల, ఫ్రెంచి యాజమాన్యము, అది పోగానే అమెరికా యాజమాన్యము, లేదా రష్యా యాజమాన్యము అను సిద్ధాంతము వారికి దుస్సహమైనది.

అమెరికావారి ప్రకటనకు ప్రత్యుత్తరముగ జనవరి 8వ తేదీననే "మధ్యప్రాచ్య దేశముల భావ్యదృష్టమును, భావ్యాభివృద్ధిని అమెరికా సంయుక్తరాష్ట్రములుగాని, సోవియటు రష్యాగాని, మరి యే యితర విదేశప్రభుత్వముగాని నిర్ణయించజాలదు. తమ సంరక్షణను, అభివృద్ధిని బలపర్చుకొను బాధ్యతయేగాక ప్రపంచశాంతిని కాపాడు బాధ్యతకూడ తమకే కలదని ఆ దేశముల (మధ్యప్రాచ్య దేశముల) వారికి తెలుసును. ఐసెన్‌హోవరు సిద్ధాంతము మూడవ ప్రపంచ యుద్ధమునకు దారితీయగలదు." అని కైరో రేడియో ప్రకటించినది. సిరియాప్రభుత్వము "మధ్యప్రాచ్య దేశముల స్వతంత్రమును నిలువబెట్టుటకు అమెరికా తోడ్పాటుగావింతునని చెప్పుట సంతోషకరమే. కాని ఈ దేశముల స్వతంత్రరక్షణా బాధ్యత అరబుప్రజలదే యైయున్నది. ఎట్టి దురాక్రమణనుండియు తమ్ముతాము రక్షించుకొనుటకు వారే బాధ్యత వహించియున్నారు." అని ప్రకటించినది. "మధ్యప్రాచ్య దేశములపైన యాజమాన్యములో ఖాళీ ఏర్పడినదని చెప్పుట సాహసము దాని నెవరును భర్తీచేయుటకు మేము సమ్మతించము" అని జోర్డనురాజు హుస్సేన్ తన పార్లమెంటుకు సందేశమును పంపెను. "అధికారములో ఖాళీయేర్పడినచో దానిని అమెరికావల్లగాని, సోవియటురష్యావల్లగాని భర్తీ చేయనివ్వజాలము. దానిని భర్తీచేయవలసినది అరబుజాతీయతయే"నని ఈజిప్టులోని అల్ అక్బరు పత్రిక వ్రాసినది. జనవరి 18వ తేదీన అరబుప్రభుత్వముల సమావేశము కైరోలో జరిగెను. అపుడీ సిద్ధాంతమును తర్కించిరి. "ప్రతి ప్రభుత్వ

ప్రతినిధి తన యభిప్రాయమును చెప్పెను. అందరును ఈ యాజమాన్య ఖాళీసిద్ధాంతమును తిరస్కరించిరి. అరబుల భావికళ్యాణమును నిర్ణయించునది ఇంతటినుంచి అరబుజాతీ యతయే యని అందరును అంగీకరించిరి." అని ఆ సమావేశ పర్యవసానమును ఈజిప్టుప్రభుత్వ సమాచారశాఖవారు ప్రక టించిరి. ఇండియా ప్రధానమంత్రి ఈ సిద్ధాంతమును ఖండించి మధ్యప్రాచ్య దేశముల స్వతంత్రమును ఆ ప్రజలశక్తిని, బల మును వృద్ధిపరచుకొనుటవల్లనే తమ్ము తాము రక్షించుకో గలుగుదురు గాని, ఏ విదేశప్రభుత్వముమీాదను ఆధారపడుట ఆత్మహత్యగావించుకొనుటయే యని చెప్పెను. 1957 జనవరి 18, 19 తేదీలలో జోర్డను రాజు హుస్సేను, అరేబియా రాజు ఇబన్ సౌదు, ఈజిప్టు, సిరియాల అధ్యక్షులు కైరోలో సమా వేశమైనారు. వీరిలో తక్కినముగ్గురు కలిసి పదిసంవత్సరము లలో ఒకకోటి 28 లక్షల పవనులు జోర్డానుకు సహాయ ముగ నిచ్చుటకు అంగీకరించి జోర్డానును తమ అరబుబృంద ములో నుండునట్లు స్థిరపరచిరి. విదేశపలుకుబడులనుంచి తప్పించవలెనని యత్నించిరి. సంపూర్ణప్రజాస్వామ్యములైన ఈజిప్టు, సిరియాలును, రాజరికములైన సౌదీ అరేబియా, జోర్డనులు కలిసి యొక అరబుఫెడరేషనుగ ఏర్పడేసూచనలు కనపడెను.

ఇట్టి వ్యతిరేకవాతావరణములో భయపెట్టియో, ప్రభు త్వనాయకులకు లంచములిచ్చియో ప్రభుత్వములను మార్పిం చియో వీలయినన్ని దేశములను తమపక్షమునకు త్రిప్పుకొన వలెనని అమెరికా ప్రయత్నించసాగెను. ముందుగ పాకిస్తా

నము, ఇరాను, తురుష్కము ఈ సిద్ధాంతము నంగీకరించి అమెరికాక్రిందికి చేరెను. వీటితోపాటే అరబు దేశముల లోని ఇరాకు ఈ సిద్ధాంతము నంగీకరించి అమెరికా క్రిందికి చేరెను. ఈ నాలుగు దేశములు అమెరికాకు దాసులయ్యెను. ఒకకోటి 20 లక్షల డాలర్లు వెంటనే ఈ నాలుగు దేశములకు పంచిపెట్టబడెను. 1957 ఫిబ్రవరిలో సౌది అరేబియా రాజు అమెరికాను దర్శించగా ఆయన కచట అతి గొప్ప స్వాగతమివ్వబడెను ఆయన కేదో స్వంత ఆర్థికలాభ ములను కలుగచేసిరి. ఆయన ఈ సిద్ధాంతము నంగీకరించి అమెరికావారి సైనికసహాయమును పొందుట కొప్పుకొనెను. "సౌది అరేబియా రాజు కల్నల్ నాసరుకు స్నేహితుడేయైనను అమెరికాతోకలిసి కమ్యూనిజమును ప్రతిఘటించుటకు అమె రికాసహాయమును పొందుట కొప్పుకొన్నా"డని న్యూయార్కు టైమ్సు వ్రాసినది. గాని తన దేశమునకు రాగానే కొంత వర కీ రాజుయొక్క భావములు తారుమారైనవి. ప్రజలలో ఈయనయందు వ్యతిరేకభావమేర్పడి వ్యవహారములు క్రమ ముగా ప్రజారంజకుడైన తనతమ్మునికి వదలిపెట్టవలసివచ్చి నది. 1957 ఫిబ్రవరి నెలలో కైరోలో ఈజిప్టు, సిరియా, సౌదీ అరేబియా, జోర్డాన్ ప్రభుత్వములనాయకులు సమా వేశముజరిపినపుడు ఈ నాలుగురాజ్యములు కలసి ఈ సిద్ధాం తమును తిరస్కరించుచున్నామనియు, ఏ అధికారకూటము లోను చేరక తటస్థవిధానమునవలంబించి రక్షణకు, ఆర్థికాభివృద్ధికి అరబులఐక్యతమీదను, స్వయంసహాయముమీదనే ఆధార పడుచున్నామనియు నొక సంయుక్తప్రకటనమును గావించి

నారు. అప్పటి జోర్డాను ప్రధానమంత్రి నాబుల్సీ గొప్ప జాతీయవాది. ఈ ప్రకటనముచేయుటకు మిగుల తోడ్పడి నాడు. అదివరకే అమెరికావారు లెబనాన్ అధ్యక్షుడును, క్రైస్తవుడును నగు కమిల్లే చమౌనును లోబర్చుకొని ఐసెన్‌హోవరుసిద్ధాంతము నంగీకరింపజేసినారు. లెబనాన్ పార్లమెంటుకూడ అంగీకరించినది. రెండుకోట్ల డాలర్ల సహాయమును అమెరికావారు లెబనాన్‌కు చేసినారు.

1957 మార్చి నెలనుండి అమెరికావారు అరబుజాతులలోకెల్ల మిగుల బలహీనమైనదగు జోర్డానుమీద పడినారు. జోర్డానురాజగు హుస్సేన్ తేలికగ లోబడినాడు. అతనికి ఆర్థికలాభములు కలుగచేసినారు. కాని జోర్డాను యొక్క పదిహేనులక్షలజనసంఖ్యలో నాలుగులక్షల డెబ్బది రెండువేలమంది ఇజ్రాయిలునుంచి యూదులచే వెళ్ళగొట్టబడిన అరబుకాందిశీకులు. వీరందరికి ఇజ్రాయిలునందు ఇజ్రాయిలునుస్థాపించిన అమెరికా ఆంగ్లప్రభుత్వములందు ఎంత ద్వేషముండునో చెప్పవీలులేదు. జోర్డానుప్రజలుకూడ వీరితోనే సానుభూతిచూపుట సహజము మంత్రివర్గములు మారి మారి 1956 అక్టోబరునెలలో అరబుజాతీయవాది, ప్రజానురంజకుడునగు నాబుల్సీ ప్రధానమంత్రియై చక్కగా రాజ్యము నడుపుచున్నాడు. ఆయన దృఢమైన తటస్థవాది. కమ్యూనిజము అక్కరలేదు. పాశ్చాత్యులక్రింద దాస్యము అక్కరలేదు. కల్నల్ నాసరుకు స్నేహితుడుగనున్నాడు. ఈయనను కూలద్రోయనిది అమెరికావారిమాట సాగదు. జోర్డాను పార్లమెంటు ఈయనకు బలముగనున్నది. సైన్యములనువంపి

బలవంతముగ జోర్డానును లోబర్చుకొనుటకు అమెరికా మధ్య ప్రాచ్య దేశములఏజంటు రిచార్డు నిశ్చయించెను. పరిపరిథమ మున ఏప్రిలులో ఇజ్రాయిలు సేనలచే జోర్డానుపై దాడివెడల చేసెను. ఇరాకు వైపునుండికూడ జోర్డానుమీద సైనికదాడులు జరిగెను. వెంటనే ఐసెన్‌హోవరు సిద్ధాంతము నంగీకరించి అమెరికాయొక్క రక్షణను పొందనిచో ఇరాకు-ఇజ్రాయిలు సైన్యములు జోర్డానును లోబర్చుకొందురని అమెరికారాయ బారి జోర్డాను రాజుకు తెలియపరిచెను. జోర్డానురాజు ఇంకను జాతీయవాదులకు భయపడుచుండెను. అమెరికా వారు సౌది అరేబియా రాజు చేతకూడ జోర్డాను రాజుకు ధైర్యమును చెప్పించిరి. ఇంతలో అమెరికానావికాసైన్యములు లెబనాన్‌వద్ద ఆగెను. లెబనాన్ పార్లమెంటు ఈ సిద్ధాంతము నంగీకరించి అమెరికావద్ద ధనసహాయమును పొందెను. జోర్డాను రాజు హుస్సేన్ తనప్రధానమంత్రియగు నాబుల్సీని పిలచి ఐసెన్‌హోవరు సిద్ధాంతము నంగీకరించి ఆ ప్రకారము బహి రంగప్రకటనచేసి అమెరికావారి ఆర్థిక సైనికసహాయము నంగీ కరించవలెనని చెప్పెను. ప్రధానమంత్రి అందుకు అంగీక రించలేదు. అందుమీద ఏప్రిలు 10 తేదీన ప్రధానమంత్రి నాబుల్సీని రాజు బర్తరఫుచేసెను. ఆయనమంత్రివర్గము రాజీనామానిచ్చెను. పార్లమెంటును రద్దువరచెను. ఇతర మంత్రివర్గముల నేర్పరచుపరియత్నములలో రాజు జయప్రద ముకాలేదు. అల్లరులు జరిగెను. సైనికశాసనము పరికటించ బడెను. చాలమందిని జైలులోపడవైచిరి. అమెరికావారు ఒక కోటి డాలర్లను ఏప్రిలు 19వ తేదీన హుస్సేనురాజు

కిచ్చిరి. దేశమందంతట నిర్బంధవిధానము లమలుజరుపబడెను. అమెరికాసేనలు దేశమునకు సరిహద్దున నుంచబడెను. రాజు తన సొంతఅనుచరులను మంత్రులుగనియమించి పాలనము సాగించెను. ఏప్రిలు 25వ తేదీకి దేశములో శాంతి స్థాపితమయ్యెను. జోర్డాను ఐసెన్‌హోవరుసిద్ధాంతము నంగీకరించి అమెరికాయాజమాన్యముక్రిందకు వచ్చెను.

1957 జూన్ నెలనుంచి సిరియాను లోబర్చుకొనుటకు అమెరికావారు కుట్రలనుప్రారంభించిరి. అరబుదేశములన్నిటిలో భూఖామందులగు షేకులే పెత్తనదార్లుగనుండిరి. వారిక్రింద సేద్యముచేసేరైతుల కెట్టి జిరాయతీహక్కులు లేవు. వారికి రాజకీయపలుకుబడి తక్కువ. షేకులలో కొందరికి లంచమిచ్చి లోబర్చుకొని మిగతావారిపైన పోరాటము సాగించుట తేలికైనపని. కాని సిరియాలో రాజకీయచైతన్యము, జాతీయతత్వము అన్నివర్గములలో నెక్కువగనున్నది. విద్య బాగుగ వ్యాపించినది. 1955 నుండి నేటివరకును స్వతంత్ర నాయకుడు త్యాగధనుడునగు షుక్రి కువాట్లీ సిరియాప్రజాస్వామ్యమునకు అధ్యక్షుడుగనున్నాడు. ఈయనవెనుక దేశమంతయునున్నది. ఈయన అతి గొప్ప అరబుజాతీయనాయకుడు. దృఢమైనతటస్థవిధానవాది. 1957జూన్ నెలలో కైరోలోని అల్ షాబుపత్రిక అరబుజాతీయతనవలంబించిన సిరియా రాజకీయ నాయకులను హత్యలుగావించి అమెరికాకనుకూలురైనవారిని ప్రభుత్వమునకెక్కించవలెనని కుట్రయొకటి కలదని ప్రకటించినది. ఆగస్టు 13వ తేదీన అమెరికాఏజంటు హావర్డు స్టోను ప్రస్తుత సిరియాప్రభుత్వమును పడగొట్టి ఆమెరికాకు జోహు

కులగువారిని ప్రభుత్వమునకు తెచ్చుట కొరకు గొప్పకుట్రను తయారుచేసినాడనియు, ఆయనను ఇంక నిద్దరు అమెరికా రాజతంత్రజ్ఞులను సిరియానుండి తమదేశమునకు పిలిపించు కొమ్మనియు సిరియాప్రభుత్వము అమెరికాప్రభుత్వమునకు వ్రాసినది. అట్టికుట్రలో చేరినట్లు తలచబడే కొందరిని అరెస్టుచేసినది. పదిమంది సైనికోద్యోగులను బర్తరఫుచేసినది. అందుమీద ఆగస్టు 21 తేదీన సిరియాప్రభుత్వము కమ్యూనిస్టులపలుకుబడిలోనున్నదని అమెరికాఅధ్యక్షుడు ప్రకటించెను. ఇది శుద్ధ అబద్ధమని, కల్పనయని సిరియాఅధ్యక్షుడు జవాబిచ్చెను. సిరియా విదేశాంగమంత్రి విసెస్‌హోవరు సిద్ధాంతమును తీవ్రముగా ఖండించెను. అమెరికా విదేశాంగ మంత్రి డల్లెను ప్రక్కనున్న జోర్డానును అమెరికాకు వ్యతిరేకముగ త్రిప్పుటకు ప్రయత్నించుచున్నటుల సిరియాప్రభుత్వముపై నిందలు మోపెను. అమెరికారాయబారియగు లాయి హెండర్సన్ మధ్యప్రాచ్యపరిస్థితులు విషమించినవని ప్రకటించి, సెప్టెంబరు 5వ తేదీనాటికి జోర్డానుకు, లెబనాన్‌కు ఆయుధములు సప్లయిచేసెను. అమెరికాపక్షముననున్న తురుష్కము తనసేనలను సిరియాసరిహద్దున చేర్చెను. అమెరికా నౌకాసైన్యమును తూర్పుమధ్యధరాసముద్రములోకి తెచ్చెను. ఇజ్రాయిలుకూడ సేనలతో సిరియాపైదండెత్తుటకు సిద్ధపడెను. ఆ సమయమున ఈజిప్టు తన యావత్తు రాజకీయ ఆర్థిక సైనిక బలమును సిరియారక్షణకై వినియోగించుననియు, సిరియాతో యుద్ధము ఈజిప్టుతో యుద్ధమేననియు అరబుప్రజలందరితో యుద్ధమేననియు ఈజిప్టుఅధ్యక్షుడగు కల్నల్ నాసరు ప్రకటిం

చెను. సోవియటురష్యా కూడ అమెరికాను, వారి అరబు మిత్రులను ఖండించెను. 1957 ఆగస్టునెలలో ఇండియా ప్రధానమంత్రి పండిత జవహరులాల్ నెహ్రూ సిరియా రాజధానియైన డెమాస్కసును దర్శించెను. ఆయనకు షుక్రీ కువాట్లీప్రభుత్వము, సిరియాదేశము అతి ఘనమైన, అపూర్వమైన స్వాగతము నిచ్చినది. ఇది కువాట్లీప్రభుత్వమునకు చాల బలమును, ధైర్యమును కలుగచేసినది. సెప్టెంబరులో సౌది అరేబియా రాజుకూడ డెమాస్కసుకు వచ్చి సిరియాను బలపర్చివెళ్లెను. సిరియామీద గాని మరి ఏ అరబుదేశము మీదగాని దురాక్రమణచేసెడువారితో నేనుకూడ యుద్ధము చేసెదను, అరబుజాతిని కాపాడెదను" అని ఆయన ప్రకటించెను. వీటి అన్నిటిమీద అమెరికా భయపడి యూరుకున్నది. సిరియాను లోబర్చుకొనలేక విడిచిపెట్టినది. దురాక్రమణకు సిద్ధపడినవా రెక్కడవారక్కడ సర్దుకున్నారు. సిరియాయొక్క స్వతంత్రము స్థిరపడినది.

## సంయుక్త అరబు రిపబ్లికు

1957వ సంవత్సరము ఆఖరుకు ఇరాకు బాగ్దాదు ఒడంబడికలోను ఐసెన్‌హోవరు సిద్ధాంతముక్రిందను నిలిచియుండడం, లెబనాన్, జోర్డానులుకూడ ఐసెన్‌హోవరు సిద్ధాంతము క్రింద అమెరికాకు లోబడియుండడం, సౌదీ అరేబియా స్థితి మిగుల సందేహాస్పదముగనుండడం జరిగియున్నది. అందుమీద పాశ్చాత్యుల దాడులనుండి తప్పించుకొన్న సిరియా అధ్యక్షుడు షుక్రి కువాట్లీ, ఈజిప్టు అధ్యక్షుడైన కల్నల్

నాసరు సంప్రతింపులుజరిపి 1958 ఫిబ్రవరి 1వ తేదీన ఈజిప్టు, సిరియా దేశములను కలిపి సంయుక్త అరబు రిపబ్లికుగ (United Arab Republic) గావించిరి. సంయుక్త అరబు రిపబ్లికు స్వతంత్రమైన రాజ్యముగల, సార్వభౌమాధికారము గల రిపబ్లికు అని, దానికి అధ్యక్షుడు కల్నల్ నాసరు అని, ఉపాధ్యక్షుడు షుక్రి కువాట్లీ అని నిర్ణయించిరి. ఒక ప్రత్యేక రాజ్యాంగవిధానమును ఈ సంయుక్త అరబు రిపబ్లికుకు తయారుచేసి అమలులో పెట్టిరి. దీనిని సిరియా ప్రజలఎదుటను ఈజిప్టు ప్రజలఎదుటను పెట్టగా రెండు దేశములలోను నూటికి 99 వంతులమంది అంగీకరించిరి. షుక్రి కువాట్లీయొక్క అరబు జాతీయాభిమానమువలనను, స్వార్థరాహిత్యమువలనను, తన చిన్న దేశమును అటు అమెరికాకుగాని, ఇటు తన దేశములో ప్రబలుచున్న కమ్యూనిస్టులకుగాని ఆహుతికాకుండ స్వతంత్రముగ నిలువబెట్టుకొనవలెనను దృఢవాంఛవలనను, ఈ సంయుక్త అరబురిపబ్లికుయొక్క ఏర్పాటు సాధ్యమైనది. త్వరితముగనే ఏమెను, ఇమాముకూడ ఇందులో చేరెను. ఆయన యొక్క రాజరికమునకు భంగములేదని హామీఇచ్చి ఆయననుకూడ ఈ ఫెడరలు రిపబ్లికులో సభ్యుడుగ చేసుకొనిరి. ఆయన గొప్ప అరబు జాతీయవాది, స్వతంత్రధీరుడు. ఈ సంయుక్త ఫెడరలు రిపబ్లికు అరబుజాతీయతయొక్క జయము గొప్ప చిహ్నము. ఈజిప్టు, సిరియా, ఏమెనులు కలిసిన సంయుక్త అరబు రిపబ్లికుయొక్క మొత్తపుజనసంఖ్య 3కోట్ల 24 లక్షల 25 వేలు అయియున్నది. ఆంధ్రప్రదేశ్ జనసంఖ్య దాదాపుగ సంతే. సంయుక్త అరబు రిపబ్లికు పార్లమెంటు

యొక్క ఎన్నికలు కొలదిరోజులలోనే జరుపుటకు కల్నల్ నాసరు నిర్ణయించినాడు. ఇటుల సంయుక్త అరబు రిపబ్లికు ఏర్పడగనే ఆంగ్లేయులకును, అమెరికనులకును అరబు దేశములలో ఇంక తమఆటలు సాగవని భయముకలిగి ఇరాకురాజైన ఫయిజలును, జోర్డానురాజగు హుస్సేనును చేర్చి ఆ నెల 14వ తేదీననే ఆ రెండు దేశములను తమతమ స్వతంత్రములను నిలుపుకొనునట్లును, కాని విదేశవ్యవహారములు, సైన్యము, విద్య మొదలైన కొన్నిశాఖలు సముష్టిగ ఫెడరేషన్ ప్రభుత్వము క్రింద నుండునట్లును, దీనికి ఇరాకురాజు ప్రధానాధికారిగా నుండునట్లును, జోర్డాను రాజు ఉపఅధికారిగ నుండునట్లును, ఇరాకురాజు లేనిసమయములో, మరణించినసమయములో జోర్డానురాజు ప్రధానాధిపతిగ నుండునట్లు నిర్ణయముచేయుచు నొక రాజ్యాంగవిధానమును తయారుచేయించి అమలులో పెట్టించిరి.

## ఇరాకులో సైనికవిప్లవము

తరువాత ఐదు నెలలకు, అనగా 1958 జూలై నెలలో ఇరాకులో నొక సైనికవిప్లవము జరిగినది. ఇరాకురాజగు ఫయిజలును, ఆయనయొక్క ముఖ్యసలహాదారుడైన నూరీ యస్ సయ్యదును ఎవిజలు హత్యగావించి, రాజరికమును రద్దుపరచి ఇరాకు దేశమును సంపూర్ణమైన రిపబ్లికుగా చేసుకున్నారు. బ్రిగేడియరు అబ్దుల్ కరీం కాశిం ఇరాకురిపబ్లికుకు ప్రధానమంత్రియైనాడు. ఇంతటితో అరబు ఫెడరేషను ఎగిరిపోయినది. బాగ్దాదుఒడంబడిక, ఐసెన్‌హోవరుసిద్ధాం

తముకూడ కొలదికాలములో రద్దుపరచబడినవి. ఈ సైనిక విప్లవము ఇరాకులో జరగగానే అమెరికావారు తమసైన్య ములను తెచ్చి లెబనాన్‌లో నుంచిరి. అటులనే ఆంగ్లేయులు జోర్డానురాజగు హుస్సేనునురక్షించుటకు తమసైన్యములను జోర్డానులోనుంచిరి. ఆంగ్లో అమెరికనుసైన్యములు ఇరా కులో జొరబడి క్రొత్త రిపబ్లికుప్రభుత్వమును కూలద్రోసి తమకు అనుకూలమైన రాజరికమును స్థాపించవలెనని యుద్దే శించినట్లు కనబడెను. కాని అటులచేయుటకు ధైర్యములేక పోయెను. ఇరాకుప్రజలలో అత్యధికసంఖ్యాకులు నూతన ప్రజాసామ్యప్రభుత్వపక్షముననే యున్నందున ఆంగ్లో అమెరి కనులు ఇరాకులో ప్రవేశించలేకపోయిరి. ఇరాకుప్రభుత్వము జాగ్రత్తగ సంచరించినది. పాశ్చాత్యదేశములతోను, పాశ్చా త్యనూనెకంపెనీలతోను చేసుకొన్నషరతులకు ఎట్టి భంగము కావించనని ప్రకటించినది. అందువల్ల క్రమముగ కొన్ని నెలలలోనే ఆంగ్లో, అమెరికను సేనలుఇరాకుతో నెట్టిజోక్యము పుచ్చుకొనకుండ లెబనాన్, జోర్డాన్‌లనుంచి లేచిపోయినవి.

## లెబనాన్‌లో విప్లవము

1958 సెప్టెంబరు నెలలో లెబనాన్‌లో పాశ్చాత్యరాజ్య ములకు దాసుడైన కమిల్లే చమూనుప్రభుత్వము పడిపోయి నది. జనరల్ ఫాదు చెహాబు అధ్యక్షుడయ్యెను. రషీదు కరామి ప్రధానమంత్రి అయ్యెను. ఈ నూతనప్రభుత్వము కల్నల్ నాసరుకు అనుకూలముగనున్నది. ఆయనవలెనే అటు అమెరికాతోను ఇటు రష్యాతోను చేరక తటస్థముగనున్నది.

డిశంబరు 8వ తేదీన ఐసెన్‌హోవరుసిద్ధాంతమును త్రోసి వేసినది. బాగ్దాదుపాక్టులో చేరనేలేదు. ఇస్రాయిలునుండి వెడలగొట్టబడి పరిక్కాన్నుటున్న అరబుదేశములలో కాందిశీకు లుగనున్న లక్షలాది అరబుల హక్కులనుగూర్చి తాము మిగత అరబుదేశములతో కలసి పోరాడబోవుచున్నామని ప్రధానమంత్రి రషీదు కరామి చెప్పినాడు. కల్నల్ నాసర్ యొక్క బలము అరబుదేశములలో బాగుగ వృద్ధిచెందినది. 1958 మార్చినుండి అరేబియారాజైన ఇబను సౌదుకూడ ఐసెన్‌హోవరుసిద్ధాంతమును త్రోసివేసి తటస్థవిధానము నవలం బించినాడు. ఒక్క జోర్డాను మాత్రము పాశ్చాత్యరాజ్యముల వలలో మిగిలినది. ఈమధ్య 1959 సంవత్సరములో జోర్డాను రాజగు హుస్సేన్ ఇంగ్లాండును దర్శించివచ్చినాడు. ఇంగ్లాండు వైపుకే మొగ్గినాడు. మంత్రివర్గమును మార్చి ఇంగ్లాండుకు అనుకూలమైన మంత్రివర్గమును పెట్టుకున్నాడు. ఏరోజు కారోజు హుస్సేనును వెళ్ళగొట్టి రాజరికమును రద్దుపర్చి సంపూర్ణప్రజాస్వామ్యమును స్థాపింతురను వదంతులు ప్రబ లుచునేయున్నవి.

## పాకిస్తానము

బాగ్దాదుపాక్టు అరబుదేశములనుండి శూన్యమైనది. మిగిలిన మూడుముస్లిము దేశముల—పాకిస్తానము, తురు ష్కము, ఇరాను—ఆంగ్ల అమెరికాల ప్రతినిధులు కరా చీలో సమావేశమైనారు. దానికి అమెరికా విదేశాంగ మంత్రి డల్లెసుకూడ హాజరైనాడు. 1958 చివరభాగమున

ఈ మూడు దేశములతో క్రొత్తయొడంబడికలు అమెరికా ఇంగ్లాండులు చేసుకున్నవి. అంకారా, టెహరాన్, కరాచీ లకు వి. హెచ్. ఎఫ్. టెలికమ్యూనికేషన్‌లను, అనగ తక్షణ సమాచారప్రసారయంత్రములను విశేషఖర్చులతో నిర్మాణముగావించబోవుచున్నారనియు ఆ ఖర్చులో విశేషభాగము అమెరికా భరించుననియు 1959 మే నెల 18వ తేదీన నూతన బాగ్దాదుయొడంబడికల ప్రధానకార్యస్థానమైనఅంకారానుండి ప్రకటింపబడినది. గత నాలుగుసంవత్సరములలో పాకీస్తానమునకు అమెరికానుండి 23 కోట్లన్నరడాలర్ల సైనికసహాయము లభించినదనియు ఈక్రొత్తయొడంబడికవల్లపదకొండుకోట్లన్నర డాలర్ల సైనికసహాయము ముప్పదిఅయిదుకోట్ల డాలర్ల అనగ 175 కోట్లరూప్యముల కిమ్మతు గల జెట్‌ఫైటర్లు, టాంకులు, విమానములు, ఇతర ఆయుధములు ఉచితముగ అమెరికావలన పాకిస్తానమునకు ప్రసాదించబడినట్లు తెలియుచున్నది. ఇది ఇండియాకు చాల అపాయకరముగనున్నది. పాకిస్తానులో ప్రజారాజ్యము మృగ్యమై, కేవలము సైనికనియంతృత్వ మేర్పడినప్పటికి ప్రజారాజ్యమైనఅమెరికా సైనికసహాయముచేయుట మానలేదు. అమెరికాయొక్క సైనికసహాయమువలన పాకిస్తానుప్రభుత్వము కాశ్మీరును సంపాదించవలెనని యుద్దేశించినది. దినదినమునకెక్కువగ పాకిస్తానుసైనికులు ఇండియాసరిహద్దులలో జొరబడి దురాక్రమణలుచేయుచు హింసాకృత్యములను చేయుచున్నారు. అమెరికా ప్రసాదించిన ఆయుధములనే వారుపయోగించుచున్నట్లు స్పష్టపడినది. పాకిస్తానుసరిహద్దులలో

ఇండియా తనసైనికులను రక్షణకొరకు పెట్టవలసివచ్చినది. పాకిస్తానుకు ఇండియాకు వ్యతిరేకత హెచ్చుచున్నది. పాకిస్తానుకు అమెరికా సైనికసహాయముచేయుట అక్రమమని ఇండియా ప్రభుత్వము గట్టిగ వ్రాసినను ప్రయోజనము కలుగలేదు. పాకిస్తానము అమెరికాఅధ్యక్షుడైన ఐసెనుహోవరుకు, డల్లెసుకు ముద్దుల పెంపుడుబిడ్డఅయినది. 1959సంవత్సరము జూన్ నెలలో పాకిస్తానుయొక్క విద్యుచ్ఛక్తినిర్మాణమునకు అమెరికాపార్లమెంటువారు పదకొండుకోట్ల ఏబదిలక్షలరూప్యములను ఋణముగ మంజూరుచేసినారు. ఇటీవల టిబెటువ్యవహారములో ఇండియా అవలంబించినచర్యలవల్ల అమెరికాలో చాలమంది ఇండియాతో నెక్కుడుగ స్నేహముగనుండుటయే మంచిదని అభిప్రాయపడుచున్నారు. బాగ్దాదుయొడంబడికకుసంబంధించన సైనికసహాయము కేవలము కమ్యూనిస్టులనుండి కాపాడుకొనుటకే యుద్దేశించినది గాని, తన సొంత యితరపనులకు ఉద్దేశించబడినది కాదని పాకిస్తానుకివ్వబడుచున్న సైనికసహాయము తగ్గించవలసినదని కొందరు అమెరికను పార్లమెంటు సభ్యులు గట్టిగ వాదించిరి. ఈవిషయమై అతి తీవ్రమైన చర్చ జరిగెను గాని, పాకిస్తాను మొదలైనదేశములకు సైనిక సహాయము చేయుటకై ప్రభుత్వపక్షమున ప్రతిపాదించబడిన 144 కోట్లడాలర్ల మొత్తమును తగ్గించవలెనని పెట్టబడినసవరణలు రెండుఓట్లతో అమెరికా (House of Representatives) ప్రజాప్రతినిధిసభలో 1959 జూన్ 19 వ తేదీన నోడిపోయినవి. సైనికసహాయమును తగ్గించవలెనని 101 మంది ఓటుచేయగా

తగ్గించకూడదని 103 గురు ఓటుచేసిరి. ప్రభుత్వముకోరిన మొత్తమంతయు మంజూరుచేయబడెను.

అమెరికా ప్రతినిధిసభలో చర్చ జరిగి చట్టము మంజూరైనపిమ్మట, పాకిస్తానమునకు సైనికసహాయము చేయుటవలన ఆ దేశమునకును, దాని ప్రక్కనున్న కమ్యూనిస్టులు కాని దేశములకునుగల అధికారతూకములో వినియోగించబడుచున్నటుల ఫిర్యాదులు వచ్చుచున్నవని ప్రజాప్రతినిధిసభవారు గుర్తించి, ఈ సంగతులనన్నిటిని దృష్టియందుంచుకొని అమెరికా ప్రెసిడెంటే (అధ్యక్షులే) కమ్యూనిస్టులనుండి అపాయమును అణచివేయుటకు అవసరమని తోచిన ఆయుధములను మాత్రమే ఇవ్వవలసినదనిన్ని, అంతకుమించి యివ్వవలసివచ్చినచో ప్రజాప్రతినిధిసభయొక్క స్వీకరుకును, సెనేటు సభయొక్క విదేశవ్యవహారముల కమిటీకిని ఆ సంగతి రిపోర్టు చేయవలెననిన్ని ఆదేశించియున్నారు. కాని 1959 జూన్ 25వ తేదీన తమ "సీటో, బాగ్దాదుయొడంబడికలలో పరమమిత్రులైన" పాకిస్తానముయొక్క నావికాసైన్యమునకొరకు "అయిదవ మైను స్వీవరును" ఇచ్చియున్నారు. అమెరికాలో పాకిస్తాన్ రాయబారిగానున్న అజీజ్ అహమ్మదు దానిని వందనములతో స్వీకరించియున్నాడు. పాకిస్తానమునకెక్కువ సైనికసహాయము చేయగూడదనువారికాయన జవాబు చెప్పుచు, "మేమెవ్వడును అమెరికాకు అతి నమ్మకమైన మిత్రులము. మాయొక్క యథార్థస్థితులను గుర్తించి మాకు అమెరికా సహాయముచేయక తప్పదు. న్యాయముగాను, ధర్మముగాను తగాదాలను పరిష్కరించుకొనుటకు ఇండియా

సిద్ధపడినచో మేమెల్లప్పుడును ఇండియాతో సంధిచేసుకొనుటకు సిద్ధముగానున్నాము. ఇండియా, పాకిస్తానములు కలిసి సమిష్టిరక్షణను ఏర్పాటుచేతామని పాకిస్తానము ఇండియాను కోరియున్నది. అందుకు ఇండియా సమ్మతించలేదు. అమెరికా వారు ఇండియాను హేతువాదమును, న్యాయమును అంగీకరించునటుల వత్తిడిచేయవలసియున్నది" అని పాకిస్తాను అధ్యక్షుడగు జనరలు అయూబుఖాను చెప్పిన మాటలనే పునరుద్ఘాటించుచున్నానని చెప్పెను.

## అమెరికావైఖరి

అమెరికా సైనికోద్యోగులకూటములో చర్చ జరిగినపుడు అమెరికావలన పాకిస్తానమునకు అనవసరముగ నెక్కుడుగ సైనికసహాయముచేయబడుచున్నదనియు, దానిని పాకిస్తానీయులు తమ సొంతతగువులకొరకు ఇండియామీద నువయోగించుచున్నారనియు సెనేటరు గోరు చెప్పగ, అమెరికా ప్రభుత్వ రక్షణశాఖాకార్యదర్శి నీల మెకలురాయి "మనము పాకిస్తానమునకు నిచ్చు సైనికరక్షణము ఇండియాకు వ్యతిరేకముగ కాదు, రష్యా చైనాలనుండి కాపాడుకొనుటకే నివ్వబడుచున్నది" అని చెప్పెను. అందుమీాద సెనేటరు గోరు "మీారుచెప్పినది నిజమేమైయుండవచ్చును. మా పక్షమున విచారించివచ్చిన ప్రతినిధి ఆ సైనికసహాయమును ఇండియాకు వ్యతిరేకముగ నువయోగించుటకై పొందుచున్నారని తెలిపినాడు" అని బదులుచెప్పెను.

అమెరికా విమానదళసర్వసేనాని జనరలు థామసు

పైటు "మధ్యప్రాచ్యములో అమెరికాయొక్క రాజనీతిని అమలుపర్చుటకుగాను మన సర్వసేనానాయకులు పాకిస్తాన ములో నెంత సైనికదళముండుట అవసరమని సిఫారసుచేయు చున్నారో అంతమాత్రమే ఇచ్చుచున్నాము. ఇంతకుపైగా కూడ పాకిస్తానీయులు కొంత తమ సొంతసేనలను పెట్టుకొని యున్నారు. అవి అనవసరమని మా అభిప్రాయము. కాని వారిది సార్వభౌమహక్కులుగల రాజ్యము. ఆ సేనలను తగ్గించవలెనని మేము వారిని తరుచుగ కోరుచున్నాము. మేము వారికి సప్లయిచేయు సైనికబలముమాత్రము అమెరికాయొక్క రాజకీయలాభములదృష్ట్యామాత్రమే ఇవ్వబడుచున్నది." అని ప్రత్యుత్తరమిచ్చెను. మరల సెనేటరు గోరు "మన మొక పనికి ఇచ్చిన సైనికబలమును మరియొకపనికి వా రుపయోగిం చుట అక్రమము" అని బదులుచెప్పెను. "మన మావిధముగ భావించుట సరికాదు. పాకిస్తానీయులకు ఇండియాను చూస్తే భయము. రష్యాను చూస్తేకూడా భయము. వారు బాగ్దాదు ఒడంబడికలో ప్రముఖసభ్యులు. వారు మనకు అవసరము వచ్చినపుడు అక్కరకువచ్చే పరమమిత్రులు. భూమిమీద గాని, ఆకాశములోగాని పాకిస్తానీయులకన్న బాగుగ పోరు సల్పగలవారు లేరు. వారు సమర్థులైనసైనికులు; వారికి ఇండియామీద, ఇండియాకు వారిమీద వ్యతిరేకతయున్న సంగతి వాస్తవమే. అది వారి స్వంత జాతీయసమస్య. అంత మాత్రముచేత ఆ భూభాగములో మన సైనికబలము తగ్గించ కూడదు...ప్రతి యితరదేశ మెటుల వ్యవహరించుచున్నదో

అటులనే పాకిస్తానముకూడ వ్యవహరించుచున్నది. ప్రక్క నున్న అఫ్ఘనిస్తానములో రష్యా ఏజంట్లు జొరబడుచున్నారు." అని విమానదళ సర్వసేనాని జవాబు చెప్పెను. "సింధుజల ములను గూర్చిన తగాదా పరిష్కారమైనచో పాకిస్తానము ఇండియాలమధ్య కాశ్మీరుసమస్య పరిష్కారమునకు సౌలభ్యము కలుగచేయునేమో"నని ఆక్టింగు అమెరికాప్రభుత్వ కార్య దర్శి డిల్లను చెప్పెను. అది అంత తేలికైనదికాదని సెనేటరు గ్రీను చెప్పెను. "మన కొలది మిత్రులగు పాకిస్తానమునకు సైనికసహాయముచేసి, మరియొక మిత్రులగు ఇండియామీద దానినియుపయోగించనివ్వడం సరియైనదేనాయని నేను గట్టిగా ప్రశ్నించుచున్నాను. ఇండియాకు మనము ఇపుడు సైనిక సహాయము చేయుటలేదుకదా?" అని సెనేటరు చర్చి ప్రశ్నించెను. "ఇండియాకు మనము ఇపుడు సైనికసహాయము చేయుటలేదు. ఇండియానుండి తన కపాయము కలుగుచున్న దని పాకిస్తానము చెప్పుచున్నది. పాకిస్తానమునకు ఇండియా మీదగల వ్యతిరేకతతో మనకు సంబంధములేదు. కాని పాకి స్తానము బాగ్దాదు ఒడంబడికలో చేరినందునను, మధ్యప్రాచ్య దేశములు కమ్యూనిస్టు రష్యా దురాక్రమణనుండి కాపాడుట కా యొడంబడిక అవసరమని మనసైన్యాధిపతులు అభిప్రాయ మిచ్చియున్నందునను మనము పాకిస్తానమునకు ఆ యొడం బడికప్రకారము నిర్ణయించబడిన సైనికసహాయమును చేయు చున్నాము." అని ప్రభుత్వ కార్యదర్శి డిల్లను జవాబిచ్చెను. "మనముచేయు సహాయమువల్ల నేర్పడు సైనికబలము నేగాక

పాకిస్థానము తనసొంతసైన్యములను పెట్టుకొనితీరెదనని గట్టిగా చెప్పియున్నది." అని కూడ డిల్లను చెప్పెను.

(22-6-1959 తేదీగల మద్రాసు మెయిల్)

## అరబుజాతులలో కమ్యూనిస్టుల కుట్రలు

ఇపుడు అరబుఫెడరేషన్ లేదు. సంయుక్త అరబు రిపబ్లికుమాత్రమే నిలచియున్నది. నూతన ఇరాకురిపబ్లికు సంయుక్త అరబురిపబ్లికులో చేరుటకు నిరాకరించినది. అటుల చేరకుండగ ముఖ్యముగ ఇరాకులోనికమ్యూనిస్టులు తీవ్రముగ ప్రతిఘటించినారు. తమవైపుకు ఇరాకుప్రధానమంత్రి అబ్దుల్ కరీం కాశిమును పూర్తిగ త్రిప్పుకొనవలెనని సర్వప్రయత్నములు చేయుచున్నారు. సిరియాలోని కమ్యూనిస్టులకుకూడ సంయుక్త అరబురిపబ్లికు దృఢపడుట ఇష్టములేదు. చిన్నవైన అరబుజాతులు అమెరికాతోను, ఇంగ్లాండుతోను పోరాడుచున్నచో తాము జాతీయపక్షముననున్నటుల నటించి మధ్యలో ఆప్రజలలో తాము జొరబడి ప్రజలలో అసంతృప్తిని, అశాంతిని కలుగచేసి తమపార్టీని బలముగ స్థాపించుకొని జాతీయప్రభుత్వములను తిరుగబాటులచే, క్రూరహింసావిధానముచే కూలద్రోసి, కమ్యూనిస్టుప్రభుత్వములను స్థాపించుకొనవలెనని కమ్యూనిస్టులు సదా యత్నించుచున్నారు. ఇది తెలిసికొని సంయుక్తఅరబురిపబ్లికు ఏర్పడగనే అధ్యక్షుడైన కల్నల్ నాసర్ సిరియాప్రభుత్వోద్యోగములలోనుండి, సైన్యములలోనుండి కమ్యూనిస్టులను తీసివేసినాడు. అందువల్ల సిరియాలోనికమ్యూనిస్టులు సంయుక్తఅరబురిపబ్లికును విచ్ఛి

న్నముచేయించి సిరియా, ఈజిప్టులను విడతీయవలెనని సిరియా ప్రజలలో కుట్రలుపన్నుచున్నారు. ఈజిప్టువిదేశాంగమంత్రి ఇందువిషయమై సిరియాలోని, ఇరాకులోని కమ్యూనిస్టుల పైన రష్యాప్రభుత్వమునకు ఫిర్యాదుచేసినట్లుకూడ పత్రికలు ప్రచురించినవి. ఇటీవలనే సుడానులోకూడ కమ్యూనిస్టులు విప్లవములేవదీయ ప్రయత్నించినారని కొందరు సైనికోద్యోగులను, ఇతరులను ప్రభుత్వము అరెస్టుచేసి జైళ్ళలో త్రోసినది. ఇరాకు ప్రధానమంత్రి బ్రిగేడియర్ అబ్దుల్ కరీం కాసిము కమ్యూనిస్టులవలుకుబడిలోకి పోవుచున్నాడని అయిదుగురు ఇరాకుమంత్రులు 1958 డిశంబరులో రాజీనామా నిచ్చినారు. ఆ నెలలోనే ప్రధానమంత్రి కాశిమును హత్యగావించి ప్రభుత్వమును పడగొట్టవలెనని యొక ప్రయత్నము జరిగెనని యెంచి కొంతమంది ప్రముఖులను అరెస్టుచేసి విచారణలోపెట్టినారు. ఒక విదేశీప్రభుత్వముయొక్క కుట్రచేత నీ ప్రయత్నము జరిగినదని ప్రధాని ప్రకటించినాడు. ఆ విదేశీప్రభుత్వముఏదో చెప్పలేదు. ఈజిప్టువార్తాసంఘమువారుఇరాకుయొక్క ప్రస్తుతప్రభుత్వమును పడగొట్టుటకు కుట్రచేసిన విదేశీప్రభుత్వము అమెరికాయేనని ప్రచురణముగావించినారు. తమ కెట్టి సంబంధము లేదని అమెరికాప్రభుత్వపక్షమున ప్రకటించబడినది. గాని ఇరాకు దేశమందంతటను అమెరికాకు వ్యతిరేకమైనవాతావరణ మేర్పడినది. ఇరాకుప్రభుత్వమువారు బాగ్దాదుబడంబడికలో నుండజాలమని ప్రకటించినారు. ఐసెన్‌హోవరుసిద్ధాంతమును త్రోసిరాజన్నారు. 1959 సంవత్సరములో కల్నల్ నాసరు కనుకూలుడగు కల్నల్ అరెఫును

ఇరాకుప్రధానమంత్రిని చంపుటకు మీాదికివచ్చినాడని అరెస్టు చేసి విచారించి మరణశిక్ష విధించినారు. జాతీయవాదమంత్రులను తీసివైచి కమ్యూనిస్టుసానుభూతివరులను మంత్రివర్గములో వేసినారు. ఇంతలో మోసలులోని షవాఫుసేనాని ఇరాకుప్రధానమంత్రి కాశింపైన తిరుగబాటుగావించగా దానిని అణచివైచినారు. షవాఫుసేనాని హత్యగావించబడినాడు. ఆయనఅనుచరులను విచారణచేసి మరణశిక్షవిధించి యురిదీసినారు. ఇరాకుప్రభుత్వము రష్యాతోను, రష్యాకూటమునకుచెందిన కమ్యూనిస్టుదేశములతోను, ఆర్థిక, వైజ్ఞానిక యొడంబడికలు చేసుకున్నది. ఇరాకులో బ్రిటిషుకంపెనీక్రింద నున్న పెట్రోలియంనూనెగనులను కాశింప్రభుత్వము జాతీయముచేసి స్వాధీనపర్చుకొనునేమోననుభయము ఎప్పటికప్పుడు కలుగుచున్నది. అటుల జాతీయముచేయుదలచుకోలేదని వారుచెప్పుచున్నారు. బాగ్దాదునగరము కమ్యూనిజముతో నిండియున్నది. కమ్యూనిస్టులు కల్నలు అరెఫు మొదలగువారిని తక్షణం ఉరితీయవలెనని కోరుచున్నారు. కమ్యూనిస్టుమంత్రులను నియమించవలెనని కోరుచున్నారు. షవాఫు సేనానియొక్క తిరుగుబాటును కల్నలు నాసరే చేయించినాడని, ఇంకను తిరుగుబాట్లకు కుట్రలుసల్పుచున్నాడని ఇరాకు ప్రధానమంత్రి అబ్దుల్ కరీం కాశిం కల్నలునాసరును నిందించినాడు. కల్నల్ నాసరా తిరుగుబాటుతో తనకెట్టిసంబంధము లేదని చెప్పినాడు, గాని ప్రధానమంత్రి కాశిం కేవలము కమ్యూనిస్టులకు దాసుడుగనున్నాడని, అరేబియాజాతుల నన్నిటిని కమ్యూనిస్టులనుండి స్వతంత్రులుగనుండునట్లుచేయు

టకు తాను బద్ధకంకణుడనైయున్నానని కల్నల్ నాసర్ చెప్పి నాడు. 1959 జనవరిలో కల్నల్ నాసర్ సిరియాలోను, ఈజిప్టులోను వందలకొలది కమ్యూనిస్టులను అరెస్టుచేసి జైళ్ళలో పడద్రోసినాడు. సోవియటురష్యా నాయకుడగు క్రుశ్చేవ్ ఈజిప్టునాయకుడగు కల్నల్ నాసరు చెప్పినదానికి ఆక్షేపణను గట్టిగా తెలిపినాడు. తాము తమదేశములను పాశ్చాత్య సామ్రాజ్యవాదులదాస్యమునుండి స్వతంత్రముగ గావించుకున్నది, వాటిని కమ్యూనిస్టులకు దాసులుగ గావించుకొనుటకు కాదని కల్నల్ నాసరు జవాబుచెప్పినాడు. ముస్లిములందరును కమ్యూనిజమును గట్టిగా ప్రతిఘటించవలెనని ఈజిప్టులోనిముస్లింమతగురువులుప్రకటించినారు. సంయుక్త అరబురిపబ్లికుకును, ఇరాకుకునుపూర్తిగవ్యతిరేకతఏర్పడినది. ఈరెండుఅరబుదేశములకు రాజీకుదర్చవలెననిసౌదీఅరేబియా, లిబియా మొదలైన దేశప్రభుత్వములు ప్రయత్నములుచేసినారు. కాని అవి ఫలించలేదు. ఇరాకులోని అధికసంఖ్యాకులు కమ్యూనిజమునకు అనుకూలురు కారు, గాని ఆ ప్రభుత్వము ఇంకను కమ్యూనిస్టుల పలుకుబడిలోకి పూర్తిగ పోయి, కమ్యూనిస్టులసహాయముతో నిర్బంధవిధానములతో హంగరీ, టిబెటులలో జరిపినట్లు జాతీయతత్వము తలయెత్తకుండ పూర్తిగ నణచివేయునేమోనని సందేహమేర్పడినది. ఇట్టి పరిస్థితిలో ఇరాకుప్రభుత్వము తమకు ఆయుధములను ఇవ్వవలెనని ఇంగ్లాండును కోరినది. తామివ్వకపోయినచో సోవియటురష్యా ఇచ్చి పూర్తిగ సోవియటురాజ్యముగ గావించునేమోననుభయముతో ఇంగ్లాండు ఆయుధములను ఇచ్చి

సైనికశిక్షణయొక్క అవసరమును నిర్ణయించినది. 1959 ఏప్రిలు నెలనుండి ఇరాకు ప్రధానమంత్రివైఖరి కొంతవరకు మారి నటుల కనవడుచున్నది. కమ్యూనిస్టులు తనను కూడ మ్రింగి వేతురను భయ మాయనను ఆవరించినటుల కనవడుచున్నది. కమ్యూనిస్టులుకూడ తాము చెప్పినటుల ప్రధానమంత్రి కాశిం ప్రవర్తించుటలేదని విసుగుచెందిరనియు, వారిబలము తగ్గిపోవు చున్నదనియు వారు రహస్యమార్గములతో విప్లవములేవదీయ నాలోచించుచున్నారనియు 1959 మేనెల 17వ తేదీన కైరో లోని అల్ అహారాం పత్రిక ప్రకటించినది. ఈజిప్టు అధ్యక్షుడు కల్నల్ నాసరు రాజీపడుటకై తన చారులను ఇరాకు ప్రధాన మంత్రివద్దకు పంపినట్లు తెలియుచున్నది. ఈజిప్టుకు, ఇరాకుకు వ్యతిరేకమైన రేడియోలోని, పత్రికలలోని వాగ్వివాదములు సమసిపోయినవి. ఇరాకు ప్రధానమంత్రి కాశిం ఇండియా ప్రధానమంత్రి పండిత జవహరులాలును ప్రశంసించుచున్నాడు. ఇండియాతో స్నేహమును కోరుచున్నాడు. అమెరికాతోను, ఇంగ్లాండుతోను అదివరకు ఇరాకు చేసుకున్న యొడంబడిక లన్నిటిని రద్దుపర్చుచున్నప్పటికిని, తాను రష్యాతోను, కమ్యూనిస్టులతోను స్నేహముగనే యుండదలచినానని ప్రక టించినప్పటికిని, అమెరికాయెడలను, ఇంగ్లాండుయెడలను మర్యాదకరమైన ప్రవర్తనను చూపుచున్నాడు. 1959 మేనెల 14వ తేదీన తాము ఏ రాజ్యాధికారకూటము లోను అటు అమెరికాకూటములోను, ఇటు రష్యాకూటము లోను చేరక తటస్థవిధానమునే దృఢముగా అవలంబించెద మని ఇరాకు ప్రధానమంత్రి అబ్దుల్ కరీం కాశిం స్పష్టమైన

ప్రకటనము గావించినాడు. ఇరాకు సైన్యములో ప్రముఖ కమ్యూనిస్టుగానున్న కల్నల్ టాహాఎల్‌షేకు అహమదు సేనానిని ఇరాకు ప్రధానమంత్రి అరెస్టుచేయించినాడని 1959 జూన్ 22వ తేదీన పత్రికలలో ప్రచురించబడినది.

1959 జూన్ నెల 22వ తేదీన ఇరాకులో ప్రధానమంత్రి అబ్దుల్ కరీం కాశింను హత్యగావించి కాశిం ప్రభుత్వమును కూలద్రోసి, కమ్యూనిస్టుప్రభుత్వమును స్థాపించుట కొరకు కమ్యూనిస్టులకుట్ర కనుగొనబడినదనియు, దానికి నాయకుడైన కల్నల్ టాహాఎల్‌షేకు అహమదును, ఇంకను పదిమంది సైనికోద్యోగులను అరెస్టుచేసినారనియు, బీరటునుండి వార్తవచ్చినటుల మధ్యప్రాచ్య వార్తాసంఘమువారు లండను నుండి తెలిపినారు. అరబులీగులో చేరిన సయుంక్త అరబు రిపబ్లికు, లెబనాన్, యేమెన్, జోర్డాను, సౌది అరేబియా, సుడాను దేశముల విదేశాంగమంత్రులు కొలదిరోజులలో జరుగనున్న అత్యావసర అరబుజాతుల సమావేశమునకు హాజరగుటకు అంగీకరించినారనియు మిగిలిన అరబుదేశములగు ఇరాకు, లిబియా, మొరాకో, ట్యునిషియా దేశప్రభుత్వముల నుండి ఇంకను జవాబులు రాలేదనియు, ఆ ప్రత్యేక సమావేశములో అరబుల నౌకలకు, ఆకాశవిమానములకు, సూయజు కాలువకు, ఇజ్రాయిలువల్ల కలుగుచున్న ఉపద్రవములు, ఇజ్రాయిలుకు కాపురమునకువచ్చుచున్న యూదుల సంఖ్య మొదలగు విషయములు చర్చించబడుననియు సమావేశముయొక్క స్థలము, తేదీ త్వరలోనే ప్రకటింపబడుననియు

అరబులీగు ప్రతినిధి చెప్పినాడని 1959 జూన్ 23వ తేదీ కైరో వార్త తెలుపుచున్నది.

ఈ కమ్యూనిస్టు కుట్ర సేనానుల అరెస్టు అనువార్తలలో నిజములేదని బాగ్దాదునుంచి ఇరాకుప్రభుత్వపక్షము వారు ప్రకటించినారు, గాని ఇదివరకు భయమువలన కమ్యూనిస్టులకు వక్కాలాళము వేయుచుండిన నేషనల్ డెమోక్రాటిక్ పార్టీ వారు కమ్యూనిస్టుల కెదురుతిరిగి జిల్లాలలో పోటీరైతు సంఘములను పెట్టుటవలన ఉభయపార్టీలకును తీవ్రమైన ఘర్షణలు సాగుచున్నవనియు, ఉభయులు తమతమపత్రికలలో పరస్పర ఖండనలు చేసుకొనుచున్నారనియు, కమ్యూనిస్టులు బలహీనులైనారనియు, ప్రధానమంత్రి కాశిము కమ్యూనిస్టుల కోరికలను మన్నించక నేషనల్ డెమోక్రాటిక్ పార్టీ మీద ఆధారపడుచున్నాడనియు, కమ్యూనిస్టులకును, ప్రధానమంత్రి కాశిముకును భేదాభిప్రాయములు పొడసూపి కొందరు కమ్యూనిస్టులను అరెస్టుచేయించినమాట వాస్తవమేననియు బాగ్దాదువార్తలప్రకారమే రూఢిగ తెలియుచున్నది. ఇదివరకు ప్రజాకోర్టుచే మరణశిక్ష విధించబడిన ద్రోహులను తక్షణమే ఉరితీయవలెనని కమ్యూనిస్టులు కోరుచుండగ అందుకు వ్యతిరేకముగ ప్రధానమంత్రి కాశిము వారిలో చాలమందిని విడుదలచేసినాడు. కమ్యూనిస్టులు ప్రధానమంత్రి కాశిముకు లోబడియుండవలెనా లేక కమ్యూనిస్టు విప్లవమును లేవతీయవలెనా అనువిషయములో కమ్యూనిస్టులలోనే భేదాభిప్రాయము లేర్పడెనని స్పష్టముగ తెలియుచున్నది. అంతేకాక ఇదివరకు ప్రధానమంత్రి కాశిముకు వ్యతిరేకముగ తిరుగుబాటుచేసిన

వేలకువేలమంది కుర్దులను, మోసలుప్రాంత నివాసులను ప్రధానమంత్రి కాశిము జైళ్ళలోనుంచి విడుదలచేసి క్షమా పణనిచ్చియున్నాడు. వారు వారిగ్రామములలో శాంతముగ నివసించి కాశిముప్రభుత్వమునేబలపర్చవలెననికోరియున్నాడు. ఇది కమ్యూనిస్టులకు ఇష్టములేదు. ఈ ద్రోహులను విడచి పెట్టకూడదని, ఇంకను కొందరిని అరెస్టుచేయవలెనని కమ్యూ నిస్టుపత్రికలు వ్రాసి ప్రధానమంత్రి కాశిముయొక్క చర్యలను తీవ్రముగ ఖండించినవి. వాటిని ప్రధానమంత్రి లక్ష్యపెట్టుట లేదు. అందువల్ల ప్రధానమంత్రి కాశిము తాను ఇటీవల ప్రక టించినట్లు అటు అమెరికా కూటమునకును, ఇటు సోవియటు కూటమునకును చేరకుండ తటస్థవిధానమునే అవలంబించు టకు కృతనిశ్చయుడైయున్నాడని నమ్మదగియున్నది. కల్నలు నాసరుయొక్క మిత్రుడైన కల్నల్ అరెఫునుకూడ విడుదల చేయునని వదంతులుకలవు.

ఇస్రాయిలు సమస్యమీద జరుగనున్న అరబుదేశ ముల సమావేశమునకు ఇరాకుప్రభుత్వప్రతినిధులు పాల్గొను టకు ఇరాకుప్రధానమంత్రి అబ్దుల్ కరీం కాశిం జులై 1 తేదీన అంగీకరించినాడు. ఐక్యరాజ్యసమితి కార్యదర్శి హామరు షెల్డు మధ్యప్రాచ్యదేశముల కసమస్యమీద సంప్రదింపులు జరుపుటకు వచ్చుచున్నాడు. ఇస్రాయిలునుంచి వెళ్ళగొట్ట బడిన లక్షలకొలది అరబు కాందిశీకులకు అరబుదేశముల లోనే స్థిరనివాసమేర్పరచుకొను వసతులు కలుగచేయుట మంచిదనియు, వారిని తిరిగి వారి మాతృదేశమైన ఇస్రాయి లుకు తీసుకొనిపోవుట యుక్తము కాదనియు ఆయనచేసిన

సూచనలు అరబుజాతులలో తీవ్రమైన ఆగ్రహమును కలుగ చేసినవి. ఇరాకుప్రధానమంత్రి కాశింకూడ ఆగ్రహావేశ పరుడై ఈ సమావేశమునకు వచ్చుటకు అంగీకరించినాడు. రెండవది ఇరాకుప్రధానమంత్రి కాశిం కమ్యూనిస్టుల పలుకు బడిలోనుంచి తప్పించుకొని బయటపడుచున్నాడు. పదిమంది సైనికోద్యోగులను కమ్యూనిస్టు సానుభూతిపరులైనందున ఉద్యోగములనుండి బర్తరఫుచేసినాడు. అరబుజాతీయతా ప్రవాహములో ప్రధానమంత్రి కాశిం మిగిలిన అరబుజాతుల తోపాటు ఈదుటకు వచ్చుచున్నాడు. గాని కైరోలో జరగ కుండ ఈ సమావేశము "స్వతంత్ర అరబుజాతీయతకు ప్రధాన కేంద్రమైన" బాగ్దాదులోనే జరుపుట యుక్తమని ఇరాకు విదేశాంగమంత్రి చెప్పినాడు. ఈ సమావేశమువలన కల్నల్ నాసరుకును అబ్దుల్ కరీం కాశింకును మరల స్నేహభావ ములు బలపడగలవని నమ్మదగియున్నది.

మొత్తముమీద ఇరాకుయొక్క రాజకీయపరిస్థితులు అనిశ్చితముగనున్నవి. 1959 జూలై 14వ తేదీన ఇరాకు రిపబ్లికుయొక్క ప్రథమవార్షికోత్సవము జరుగనున్నది.



# తాజా పరిస్థితులు

1939 సంవత్సరము జులై 14వ తేదీనుంచి ఇరాకు విప్లవ ప్రథమ వార్షికోత్సవములు గొప్ప యుత్సాహముతో దేశమందంతటను జరుగుచున్నవి. సైనికవిన్యాసములు మిగుల ఆకర్షవంతముగ నున్నవి. లక్షలకొలది జనులు ఉత్సవములలో పాల్గొనుచున్నారు. ప్రధానమంత్రి అబ్దుల్ కరీం కాశిం ఏకైక నాయకుడుగ నెంచబడుచున్నాడు. "కాశింకు జయమగు గాక, ఇరాక్ రిపబ్లికు వర్ధిల్లును గాక" అను నినాదములతో దిక్కులెల్లను పిక్కటిల్లుచున్నవి. కాని అబ్దుల్ కరీం కాశిం యొక్క రాజకీయ వైఖరి నిలకడగ లేదు. జులైనెల 13వ తేదీననే తన మంత్రివర్గమును విస్తరింపజేసి నలుగురు నూతన మంత్రులను నియమించినాడు. అందులో యిద్దరు అనగా డాక్టరు నజీహడౌలేమి అను నామెయును, డాక్టరు ఫైసల్ ఆమేర్ అను నాయనయు కమ్యూనిస్టు భావములు కలవారని ప్రసిద్ధికెక్కినవారు. వీరిలో మొదటి ఆమెయగు డౌలేమి కమ్యూనిస్టుల యాజమాన్యమున నడచుచున్న జాతీయఫ్రింటు యొక్క స్త్రీల హక్కుల రక్షణశాఖకు అధ్యక్షురాలుగా నున్నది. రెండవ ఆయనయగు ఆమేర్ యిదివరకు విద్యాశాఖామంత్రిగా నున్నపుడు కారల్ మార్క్సు సిద్ధాంతముల బోధను పాఠశాలలలో ప్రవేశపెట్టినవాడు. కారల్ మార్క్సు సిద్ధాంతముల నవలంబించిన డాక్టరు కుబ్బా అను ఆయనను కూడ ప్రధానమంత్రి కాశిం ఎక్కువ

బాధ్యతగల మంత్రిగా చేసినాడు. పెట్రోలియం నూనె గనుల వ్యవహారములకు ఆయనను మంత్రిగా గావించినాడు. ఇందువలన నీ వార్షికోత్సవములను సంయుక్త అరబు రిపబ్లికు వారు బహిష్కరించినారు. అనేక దేశములనుండి ప్రతినిధులు వచ్చినారు. కాని కల్నల్ నాసరు తన ప్రతినిధులను పంపలేదు. కల్నల్ నాసరుకును, అబ్దుల్ కరీం కాశింకును సంబంధములు యింకను ఎక్కుడుగ దూరమైనవేగాని స్నేహము కుదరలేదు. ఇరాకు ప్రధానమంత్రి కాశిం జులై 16వ తేదీన పెట్రోలియం గనుల విషయములో తమ దేశ ప్రభుత్వము యిదివరకు విదేశ కంపెనీలతో చేసుకొనిన ఒడంబడికలను తాను అమలుజరిపెదననియే ప్రకటించినాడు. కొలదికాలము క్రిందటనే ఇరాకులో రాజకీయపార్టీలేమియు పనిచేయగూడదని చెప్పిన భావమును ఆకస్మికముగ మార్చుకొని ఆరు నెలలలోపల శాశ్వతమైన, స్వేచ్ఛాయుతమైన రాజ్యాంగ విధానమును తయారుచేసి జనవాక్యనిర్ధారణ గావించి అమలు జరిపెదననియు, రాజకీయపార్టీలను గూడ పనిచేయనిచ్చెదననియు బహిరంగప్రకటన చేసినాడు. ముందుముందు ఆయన ఎటు మొగ్గునో దేశములో రాజకీయపరిస్థితు లెటులనుండునో చూడవలసియున్నది.

అమెరికా సెనేటులో పాకిస్తానము మొదలగు ఆసియా ఖండ దేశములకు అమెరికా చేయదలచిన సైనికసహాయములో ఇరవైకోట్ల డాలర్లను, అనగా నూరుకోట్ల రూప్యములను తగ్గించవలెనని తీర్మానముచేయుటవలన, తమకు వచ్చెడు సైనికసహాయములో అయిదవవంతు తగ్గిపోవునని పాకిస్తాన్

సైనిక నియంతయగు జనరల్ అయూబ్ ఖాన్ మిగుల ఆత్ర తను కనబరచుచున్నాడు. తన మంత్రివర్గమును సమావేశ పరచి మంతనముచేయుచున్నాడు. అంతేగాక పాకిస్తానము ఆర్థికముగ మిగుల క్లిష్టపరిస్థితులలో నున్నది. పాకిస్తానము యొక్క రూపాయి విలువ పడిపోయినది. ఇదివరకు నాలుగు ముప్పావు (4¾) పాకిస్తానము రూప్యముల కొరకు అమెరికన్ డాలరు వచ్చెడిది. ఇప్పుడు 6¼ రూప్యములు పెట్టినగాని డాలరు లభించదు. పాకిస్తానముయొక్క రూప్యము విలువ అంతగ పడిపోయినది. అందువలన తన స్వంత ఖర్చుమీద ఆయుధములను కొంతవరకైనను కొనగల స్థితిలో పాకిస్తాన మిప్పుడు లేదు. కేవలము అమెరికావా రిచ్చెడు ఆయుధముల మీదనే ఆధారపడవలసియున్నది.

అనుకున్నప్రకారమే జులైనెలలో సంయుక్త అరబు రిపబ్లికులో వేలకువేల జాతీయసంఘములకు ఎన్నికలు మిగుల ప్రశాంతముగ జరిగినవి. ఈజిప్టులోను, సిరియాలోను కల్నల్ నాసరుకు మిత్రులుగనున్న ప్రముఖులెల్లరు ఎన్నిక లలో గెల్పొందినారు. ఈ జాతీయసంఘములలోనుండియే రాష్ట్ర శాసనసభలకును, జాతీయ పార్లమెంటుకును ఎన్నికలు జరిగి నూతన రాజ్యాంగవిధానము చేయబడును. నూతన మంత్రివర్గ మేర్పడును.

# తప్పొప్పుల పట్టిక

| పేజి | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 53 | 20 | Sphynso | Sphynes |
| 67 | 18 | మంత్రిత్వముయొక్క | త్రిత్వముయొక్క |
| 69 | 12 | యూక్డు | యూక్లిడు |
| 74 | 5 | మోహవాగురిలో | మోహజాలరిలో |
| 75 | 7 | కియపాత్రాల | క్లియపాత్రాల |
| 90 | 23 | 'హుస్సన్' | 'హస్సన్' |
| 95 | 2 | కాపులు | కాప్టులు |
| 107 | 6 | అమీరు | అమీరులు |
| 125 | 14 | గ్రంథసంస్కర్తగను | సంఘసంస్కర్తగను |
| 147 | 14 | పావ్ మావ్ | పాల్ మాల్ |
| 155 | 5 | జాన్ బ్రెటు | జాన్ బ్రైటు |
| 156 | 21 | ఖెడీవువద్దనున్నప్పటికిని | ఖెడీవువద్దన్నప్పటికిని |
| 175 | 6 | 1938 | 1913 |
| 185 | 3 | స్వతంత్రపోరాటము | స్వతంత్రప్రకటనము |
| 201 | 2 | మిల్లరుకమీషను | మిల్నరుకమీషను |
| 216 | 16 | ఫరూరాకిజుయొక్క | ఫరూకిరాజుయొక్క |
| 277 | 11 | ఇరాకు బాగ్దాద్ | ఇరాకులోని బాగ్దాదు |
| 321 | 20 | జయము | జయమునకు |
| 325 | 11 | ముప్పదిఅయిదుకోట్ల | మొత్తము ముప్పది అయిదుకోట్ల |